# రాజు – మహిషి

(మొదటి భాగము)

రాచకొండ విశ్వనాథశాస్త్రి

ప్రచురణ :
స్టూడెంట్సు బుక్ సెంటర్
ఏలూరు రోడ్డు విజయవాడ–2.

# అంకితం

ఈ "రాజు—మహిషి...."ని నేను,
ప్రజాసేవకులూ, పీడిత ప్రజానాయకులూ,
వీరులూ, అరివీర భయంకరులూ, విమల హృదయులూ,
త్యాగమూర్తులూ అయిన
వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం,
సుబ్బారావు పాణిగ్రాహి, పంచాది కృష్ణమూర్తి, పంచాది
నిర్మల, తామాడ 'గణపతిగార్లకీ, "నరుడో భాస్కరుడికీ",
వారితో సముడూ సమాన హృదయుడూ సచ్ఛీలుడూఅయిన
**శ్రీ డబ్బీరు నాగభూషణ పట్నాయక్ గారికీ**

భక్తితో అంకితం.

తప్పులైతే అందరూ చేస్తారు.
త్యాగాలుమాత్రం కొందరే చెయ్యగలరు.

రాచకొండ విశ్వనాథశాస్త్రి,

28—6—71

విశాఖపట్నం—2

# 'రాజు—మహిషి.......' గురించి

జయశ్రీ మాసపత్రికలో కొన్ని సంవత్సరాలు ధారావాహికంగా వెలువడి తెలుగు పాఠకుల విశేషాభిమానాన్ని చూరగొన్న ఉత్తమశ్రేణి నవల 'రాజు—మహిషి....'. ఈ నవల రచయితలు పాఠకులలో విశేషాభిమానాన్ని చూరగొన్న మహాకావ్యమని తెలిసి, పలువురు మిత్రులు సాహిత్యాభిమానులైన పెద్దల ప్రోత్సాహంవలన యిప్పటివరకు అచ్చయిన 'రాజు - మహిషి' నవల మొదటి భాగాన్ని యదాతథంగా పాఠకులకు సమర్పిస్తున్నాము.

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు ఈ నవల ఉత్తరభాగం పూర్తిచేయగానే, రెండవ భాగం కూడా పుస్తక రూపంలో వెలువడుతుంది అని ఆశిస్తున్నాము.

ప్రకాశకులు.

# అపరిచయం

ఇది రా. వి. శాస్త్రిని పరిచయం చెయ్యడానికి కాదు. నిజానికి రా. వి. శాస్త్రిని ఇవాళ ఎవ్వరూ కొత్తగా పరిచయం చెయ్యనక్కరలేదు. "రాజు – మహిషి"ని పరిచయం చెయ్యడానికికూడా ఇది నేను రాయడంలేదు. పరిచయం అక్కరలేకుండానే ఈ గ్రంథాన్ని విడుదలచెయ్యండని ప్రకాశకులకు చెప్పాంకూడా ఇద్దా మనుకున్నాను. అయితే ఇది మరి నే నెందుకు రాస్తున్నట్లు ?

తెలుగులో సంతృప్తికరమైన కవిత్వం వచ్చినట్లు, కథలు వచ్చినట్లు నవల లింకా రాలేదని నాదో చిరకాలపు ఫిర్యాదు ఉంది. కనీసం ఈ "రాజు – మహిషి" అయినా ఒక సమగ్రమైన మంచి నవలగా రూపొందుతుందన్నవిశ్వాసం నాకు కలిగింది. ఇది ఎప్పటికి పూర్తి అవుతుందోకూడా నాకు తెలియదు. పూర్తి కాకపోయినా ఇది గొప్ప నవలల కోవలోకి చేరిపోయింది. పూరీ జగన్నాథంలో విశ్వకర్మ తయారుచేసిన అసంపూర్తి విగ్రహాలలాగ ! అయితే రా. వి. శాస్త్రి దీన్ని పూర్తి చెయ్యగలడనే నా నమ్మకం.

"రాజు–మహిషి" ఇక ఇరవయ్యో శతాబ్దపు క్లాసిక్‌గా నిలుస్తుంది. "ఎప్పుడో భవిష్యత్తు ఇవ్వవలసిన

తీర్పును ఇప్పుడే ఇవ్వడానికి నువ్వెవరివి? అని కొందరు నన్ను అడగ వచ్చును. ఏభయ్యేళ్ళ తర్వాత ఇది నిలుస్తుందని యేమిటి గ్యారంటీ అని అడగవచ్చును. రా. వి. శాస్త్రిమీద ఉన్న అభిమానమే నన్నిలా రాయిస్తుందనీ, సాహిత్యంనుంచి విడిపోయి, వ్యక్తిగత సదభిమానంతో ఇలా రాస్తున్నాననీ అనవచ్చును. కాని ఇవేవీ సరికాదు. సాహిత్య సూత్రాలకు కట్టుపడి నేను భవిష్యత్తులోకి తొంగిచూడ సాహసిస్తున్నాను.

నూరేళ్ళకిందటి పరిస్థితులు నేడు లేకపోయినా గురజాడవారి కన్యాశుల్కం గొప్ప గ్రంథమే. యేభయ్యేళ్ళ తర్వాత సమాజంలో వచ్చే ఏ మార్పుకూడా "రాజు - మహిషి" గొప్పతనాన్ని తగ్గించలేదు.

కొన్ని కుహనా క్లాసిక్సుంటాయి. అనగా అసలు క్లాసిక్కులకు కార్బన్ కాపీలు. ఇందుకో మంచి ఉదాహరణ విశ్వనాథ రామాయణం. యేభయ్యేళ్ళతర్వాత మొల్ల రామాయణం నిలుస్తుందిగాని విశ్వనాథవారిది నిలవదు. ఇవాళ చూడండి. కవిత్రయంవారి మహాభారతం నిలిచేవుంది. దాని కార్బన్ కాపీలన్నీ కాలగర్భంలో కొట్టుకు పోయేయి (కృష్ణభారతంతోసహా !).

ఉన్నవవారి మాలపల్లి, గోపీచంద్ కుటుంబరావుల రచనలు కొన్ని, రా. వి. శాస్త్రి రాజు - మహిషి ఈ నాటి క్లాసిక్స్! ఇవి యెందుకు నిలబడతాయో, కొవ్వలి జంపనలవీ,

విశ్వనాథ పురాణ గ్రంథాలూ ఎందుకు బూజుపడతాయో సాహిత్యాధారాలతో వివరిస్తూ ఎన్ని పేజీలయినా రాయగలను. కాని రాయనక్కరలేదు.

కొన్ని గ్రంథాలకు బహుమతు లివ్వడంవల్ల అవి గొప్ప వయిపోవు, మరి కొన్నిటిని నిషేధించడంవల్ల అవి మరుగు పడిపోవు. గవర్నమెంట్లు వస్తాయి పోతాయి. కాని, కాలం మా తరఫున ఉందని విప్లవ రచయితలమైన మాకు తెలుసు.

మద్రాసు,
2—1—1972.

శ్రీ శ్రీ




శ్రీ రాజావారు, వారి మహిషి - వారి గేదెలు, వారి దైవభక్తి మహిమలు - అమ్మతల్లి శక్తి. రాములవారి దయ-సందర్భోచితముగా, దైవప్రార్థనకున్నూ, న్యాయా న్యాయాలకున్నూ ఉండుకొనే సంబంధముయొక్క వివరణ - "ఎవరు రాజు? ఆసు ఎవరు?" అను ప్రశ్నలకు సమాధానములు—

రాజు రాజుకాడు. అతనికి రాణీ లేదు. రాజ్యం లేదు; గేదెలుమాత్రం చాలా ఉన్నాయి.

ఆవులు అందంగా వుంటాయి. కళాకారులు ఆర్టు క్రిటిక్కులూ చెప్పే బ్యూటీ వాటికుంది. అందుచేతనే గోపాలకృష్ణుడు గోవులతో బొమ్మలు గీయించుకున్నాడు కాని గేదెలతో ఒక్క బొమ్మయినా గీయించుకోలేదు.

ఆవుల్లో గేదెలు, మనుష్యుల్లో నీగ్రోలవంటివి. అంతమాత్రంచేత వేటికంటే ఏవీ ఎక్కువకావు. తక్కువా కావు. (ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని నమ్మేవారంతా ఈవిషయంలోని సత్యాన్ని తప్పక గుర్తించగలరు.) పెద్దలు చెప్పరుకాని, ఆవుల్ని కాసిన శ్రీకృష్ణుడు గేదెల్ని కూడా కాసే ఉంటాడు. ఎంత ఎక్కువ్వాడైనప్పటికీ, గీతలో ఎంత మంచి పెద్ద గీతవాడైనప్పటికీ, ఆయన మాత్రం ఛాయలోమాత్రం ఏ గేదెకంటె మహ ఎక్కువ్వాడు? (భగవత్సృష్టిలో సమస్త జీవజాలమున్ను సమానమేనని ఇందుమూలంగా, ఎటులనోగాని, తెలియనగును.)

పోతే—

ఆవులు పాలిస్తాయి. గేదెలు ఎక్కువ పాలిస్తాయి. ఆ తేడాలో ఓ వ్యాపార రహస్యం ఉంది. ఆ తేడా రాజుకి తెలుసు. కాని, ఆ వ్యాపార రహస్యం మాత్రం అతని మరదలు తెలుసుకొంది.

రాజుకి రాణీలేదు. మరదలికి మొగుళ్లేడు.

రాజుకి రాణీ ఒకామె లోగడ ఉండేది కాని, ఆ రాణీని అమ్మవారు తీసుకుపోయింది.

రాణీని అమ్మవారు తీసుకుపోయినప్పుడు రాజు చాలా ఏడ్చేడు. రాణీలేని ఇల్లు మేడల మేడైనా, కమ్మల గుడిసే అయినా అది రాజులేని

రాజ్యంవంటిదేనని అతను అప్పుడు గ్రహించేడు. భార్యని పరాయివాడు ఎత్తుకుపోయినప్పుడు రాములవారు ఎంతగా విలపించేరో రాజొకసారి ఒక హరిదాసు చెప్పగా విన్నాడు. దేవుడు అలా ఏడవడం ఏమిటని అతనికి ఆరోజున అది చాలా విడ్డూరంగా తోచింది. రాణీని అమ్మవారెత్తుకుపోయేసరికి అలనాటి ఆ దేవుడి బాధ అతనికి అప్పుడు అర్థమయింది.

శవాలు సాధారణంగా ఇళ్ళల్లో ఉండిపోవు. వాటిమీద రాతి లేక పాలరాతి మేడలు కట్టిఉంచితే తప్ప అవి తరుచుగా శ్మశానాలికి పోతాయి. కాని, శవంపోయిన ఇల్లు (సాధారణంగా) శ్మశానంలా ఉంటుంది. రాణీ పోయాక ఆ ఇల్లు చూసుకొని, ఆ రాణీని తల్చుకొని రాజు వెక్కి వెక్కి ఏడ్చేడు. ఆ ఏడుపులో రాములవారి దుఃఖం జ్ఞప్తికివచ్చింది.

భగవంతుడికి వచ్చిన కష్టంలాంటిదే తనకీ వచ్చింది.

భగవంతుడికీ తనకీ సామ్యం కనిపించగానే రాజుకి బాధ కొంత తగ్గింది. అతను కొంచెం గర్వించేడుకూడాను. కనీసం, కష్టంలోఅయినా తను రామసమానుడయేడు!

అసలు ప్రతి మనిషిలోనూ దేవుడు ఉంటాట్ట కదా!

అంతేకాక, కష్టం తెలిసినవాడు కాబట్టే ఆ భగవంతుడు తన కష్టంచూసి తనని కరుణించి ఈ మరదల్ని తనవద్దకి పంపించేడు!

మరదలి జీవితం చాలా కష్టమయ జీవితం, రాణీకి ఆవిడ సవితి చెల్లెలు, ఆమెకి పన్నెండేళ్ళ ప్రాయంలో ఓ బుగత ఆమెని చేరదీసేడు. బుగతగారి ప్రాపకంలో మరదలుపిల్ల పువ్వు విడినట్టు విడింది. పాలు పొంగినట్టు పొంగింది.

ఆ పిల్ల ఆ విధంగా వికసించడమూ పొంగడమూ చూసి బుగతగారి భార్య సహించలేక ఆ పిల్లని ఏం చేదామన్నా వీలు చిక్కక, సంసారం సర్వనాశనం అయిపోకుండా సంరక్షించుకొందికి మరోమార్గం

లేక, ఆ స్తంతా కాపాడుకొందికి మరోదారి కనిపించక, భగవంతుడి ముందు భక్తితో మోకరిల్లి, తను చేసేపని తన పిల్లల బాగుకోసంతప్ప మరో దురుద్దేశంతో చేసేపని కాదని ఆ సర్వసాక్షికి విన్నవించుకొని, తను చేసే పాపం క్షమించమని ఏడ్చేడ్చి ఆ కరుణాసముద్రుణ్ణి ప్రార్థించి, పంచాంగం వెతికి ఓ మంచిరోజుచూసి, బుగతికి విషంపెట్టి అతణ్ని చంపివేసింది.

మరదలుపిల్ల చాలా మంచి పాతబంగారపు పళ్లెంలా ఉన్నప్పటికి ఏ గోడ చేర్పూ లేకపోవడంతో, దిక్కుమాలిపోయినట్లుండి పోయింది.

కాని, బుగత చావుతో మరదలుపిల్ల మానవ జీవితపు నిజస్వభావం ఏమిటో తెలుసుకొంది. "కపటము, ద్రోహము, దౌర్జన్యము—మానవ జీవితమంతయు ఈ మూడింటితోను కూడుకొని యున్నది" అని ఆ విధంగా ఆ భాషలో జీవితపు సత్యాలు తెల్సుకోలేదామె. "బావుపడీ జనం ఏటిజేస్తారంటే. తల్లియాదీ తండ్రియాదీ పిల్లయాదీ పెనిమిటయాదీ, అడ్డొచ్చినోణ్ణెవుణ్ణయినాసరే అణచి పారేస్తారు" అని తెలుసుకొంది.

అంతటితో, మరదలుపిల్ల మహాజ్ఞాని అయింది. ఓ పోలీసు జవాను ఆమెని చేరదీయగానే మరదలికి, ఆమె సంపాదించుకున్న జ్ఞానం విస్తృతం అయింది.

కాని, మరదలొక చిన్న పొరపాటు చేసింది. జవాన్ని ఊతగా ఉంచుకొని ఓ హెడ్డుగారితో ఆమె నాటకం ఆడదా మనుకొంది. అదే ఆమె చేసిన పొరపాటు. ఆ పొరపాటువల్ల ఆమె పెద్ద దెబ్బతింది. అంతవరకూ చెడని ఆమె శీలం అంతటితో చెడింది.

మరదలి శీలం చెడిపోయినప్పటికీ మరదలి జ్ఞానం మాత్రం చెడిపోలేదు. ఆ దీపానికి వెలుగు ఎక్కువయిందే కాని తగ్గలేదు. ఆదే నాటకం అభాసయేసరికి ఆమె మానవ జీవితం గురించి మరికొన్ని నిజాలు తెలుసుకొంది. దెబ్బతింటే తిందికాని అందునుంచి ఆమె ఓ

చక్కటి గుణపాఠం నేర్చుకొంది. చీకటి తప్పులు వెలుగులోగాని దీపాల వెలుగులోగాని చెయ్యకూడదని ఆమె వెంటనే తీర్మానించుకొంది.

మరదలుపిల్ల జవాన్తో ఉంటోండగా సరసంచేసిన హెడ్డుగారు, ఆమెని జవాన్ తన్ని తగిలేయగానే ఆమెవైపు కన్నెత్తిచూడ్డం మానేసేడు.

"జీవితమొక కీకారణ్యము" అనే పరమసత్యం మరదలుపిల్ల బుగత చచ్చిననాడే గ్రహించింది. అందుచేత ధైర్యం చిక్కబట్టుకొని అడవిలో జాగా చేసుకొందికి అవస్థ పడసాగింది మరదలుపిల్ల.

పోలీసుజవాను విడిచిపెట్టినప్పటికీ అతని వాసన మాత్రం మరదలిని వెంటనే విడిచిపెట్టలేదు. ఆ వాసన కారణంగా, ఆమె నలుగురు ఆడం గుల్ని చేరదీసి వారిచేత భామకలాపం కట్టిద్దామనుకొంది. కాని ఆ కలాపంకూడా తొలి నాటకంలాగే దెబ్బతింది. సవ్యంగా సాగలేదు. ఆ వ్యాపారంలో ఆమె రాణించక పోవడానికి ఒక కారణం: ఆమె స్వత హాగా సిటీ మనిషి కాకపోవడం; రెండో కారణం; ఆ వ్యాపారపు రాటు పోటులకి ఆమెకి సరైన మగదక్షత లేకపోవడం.

అందుచేత. అసహాయంగా మరొకసారి ఎండని పడిపోయింది మరదలుపిల్ల.

చిట్ట చివరికి ఆమె రాణింటికి చుట్టపు చూపు కొచ్చింది.

బుగతగారి టైంలో మరదల్ని అంతా బాగా చూసేరు; రాజు కూడా చూసేడు. బుగతానంతరం ఆమె పరిస్థితి చూసి అంతా విచా రించేరు; రాజుకూడా విచారించేడు. పోలీసుజవాను ఆమెని తీసిన తరువాత ఆ సంగతివిని రాజు "భేష్ భేష్" అన్నాడు. మరదలి ప్రజ్ఞని అతను ఎక్కువగా మెచ్చుకున్నాడు. బుగత చావుతో దిక్కుమాలిపోయిన మర దలికి సంఘంలో తిరిగి మర్యాదా మన్ననా లభించినందుకు అతను చాలా సంతోషించేడు. అతని రాణికూడా తన (సవితి) చెల్లెలి ప్రతిభ గురించీ, అదృష్టం గురించీ తల్చుకొని, అందు గురించి భర్తతో ఊసులాడుకొని చాలా గర్వించింది.

ఆ తరువాత డుగారితో మరదలు ఆడిన నాటకం గురించి భోగట్టా విన్నాక రాజు రాణీకూడా "ఛీ ముండ ! ఏ ఇలాటి పన్జే సింది ముండ ! !" అంటూ చాలా నొచ్చుకున్నారు. నమ్మినవాణ్ని దగా చేసి శీలం చెరుపుకొని వంశానికి ఆమె ఒక మాయని మచ్చ తెచ్చిపెట్టి నందుకు వా రిరువురూ ఆమెని చాలా తిట్టి తూలనాడేరు. మరదలి మక్కలు రక్షకభటుడు విరగదన్నినప్పుడు రాజుగాని, రాణీగాని కోపించ లేదు. విచారించలేదు. ఆ "జెష్టముండ అవుపిస్తే", తాముకూడా అంతా చేస్తామన్నారు. ఇంటికివస్తే, పో పొమ్మన్నారు.

మరదలు మళ్ళీ వారికి కనిపించలేదు. అప్పకి అమ్మవారొచ్చిందని తెలిసేవరకూ ఆమె ఆ ఇంటికి రాలేదు.

రాణీకి అమ్మవారు చూపెట్టేసరికి రాజు హతాశుడై పోయేడు. ఎంత పెద్దపులైనా గుండుదెబ్బకి భయపడుతుంది. రాజుకి అమ్మవారి జబ్బంటే భయం. అమ్మవారు జల్లిన భార్యని కంటితో చూడ్డానికే భయ పడ్డా డతను. అతనికి కాళ్ళూ చేతులూ ఆడ్లేదు. అతని సహాయానికి ఏ ఒక్కరూకూడా రాలేదు.

ఈ సంగతంతా మరదలికి తెలిసింది. ఇంతకంటే మంచి అవ కాశం తనకి జీవితంలో రాదనుకొందామె. అప్పుడామె అనకాపల్లి నూకాల్తల్లిని తల్చుకొంది.

అప్ప చచ్చిపోతే ?

"మా అప్పేకాని చచ్చిపోతే, అమ్మా తల్లీ, నూకాల్తల్లీ నీకు మేకపోతు నిస్తాను. నాలుక్కోళ్ళిస్తాను. సీరా రవికలగుడ్డా ఎడతాను. కొత్తామాస కొత్తామాసకీ ఒస్తాను. దండం పెడతాన్తల్లీ నీకు దండ పెడతాన్తల్లీ నీకు దండా లెడతాను."

అని మొక్కుకుంది మరదలు. ఆ రోజు తలంటి స్నానంచేసి, శివాలయానికి వెళ్ళి, ఉపవాసం వుండి సాయంకాలం కనక మహాలక్ష్మిని

కూడా సేవించి, రోజల్లా అతి నిశ్చలంగా అతి నిర్మలంగా నూకాలమ్మని అతి ఘోరమైన పట్టుదలతో ప్రార్థించింది మరదలు.

అలా ప్రార్థించేక, ఆమెకి అనేకవిధమైన ధైర్యం వచ్చేసింది. ఇదివరకు చుట్టపుచూపుకి వెళ్తే. పోపొమ్మన్న బావ ఇప్పుడు తనని తప్పక రా రమ్మనేట్టు అమ్మ చేయించగలదని ఆమెకి నమ్మకం కుదిరిపోయింది. ఎవరూ పిలవక పోయినప్పటికీ ఆమె తిన్నగా ఝూంమ్మని రాజింటికి వెళ్ళింది. వెళ్ళీ వెళ్ళగానే—ఆమెని కళ్ళకద్దుకున్నాడు రాజు! దాన్తో "ఇది అమ్మ పనే!" అని దాఖలా కనిపించిపోయింది మరదలికి. దాన్తో ఆమెకి ఎక్కడలేని ధైర్యమూ వచ్చేసింది.

అమ్మవారి జబ్బుతో భగభగలాడే రాణీని చూడ్డానికే అందరూ భయపడుతున్నారు. ఆ గాలి సోకితే ఆ అమ్మవారు ఎక్కడ ముట్టిం చేస్తుందో అని గడగడ లాడుతున్నారు. కాని, మరదలుపిల్ల భయప ళ్లేదు. నూకాలమ్మ తనయందుండగా ఏ అమ్మవారూ తననేం చెయ్య జాలదు. తనని అంటనైనా అంటజాలదు. అందుచేత, ఆమె తన అప్పకి సేవ చేయడానికి ఇసుమంతైనా భయపడలేదు. వెనక తియ్యలేదు. ఎంత సేవ చెయ్యాలో అంత సేవా చేస్తుంది తను. కాని, ఎంత సేవ చేసినప్ప టికీ అప్ప ఎలాగా చావక తప్పదు. అది నూకాలమ్మ ఆజ్ఞ. ఆ ఆజ్ఞ జవదాటడానికి అప్పకి కాని మరెవరికాని వీలెక్కడుంది?

అప్ప ఎలాగా చస్తుంది. తను రాజుని చేపడుతుంది, అప్పుడు తన దశ తిరుగుతుంది. నూకాలమ్మే అదంతా చేయిస్తుంది. ఎందుకు చేయించదో తనూ చూస్తుంది!!

అమ్మవారు పూనిన మనిషిలా చకచక పని చెయ్యడం ప్రారం భించింది మరదలుపిల్ల. నూకాలమ్మ యెడల తనకి వుండే భక్తియందూ, తనయెడల నూకాలమ్మకి వుండే అనుగ్రహం యందూ ఆమెకు ఎంత గానో విశ్వాసం ఉంది.

ఆమె అనుకున్నట్టుగానే రాణీ చనిపోయింది. ఆ దినం రాజు ఎంతగా ఏడ్చేడో అతని మరదలుకూడా అంతగాను ఏడ్చింది; అదేమీ

అబద్ధం ఏడుపు కాదు. అయ్యో! నూకాలమ్మ అప్పని చంపేసింది. నూకాలమ్మకి అప్పఎడల ఎందుకంత కోపమో? అప్ప ఏం అపరాధం చేసిందో?

"అయ్యో! అప్పా! ఎల్లిపోనావా? బావ న్నాకప్పజెప్పేసి ఎల్లిపోనావా? ఇంక నన్ను చూడకంట ఎల్లిపోనావా? అయ్యో లపోల్లప్ప! అడిగిన జేపనోడికల్ల అరదసేరు నూకలేసేవు! అడగని ముస్టోడికల్లా పిలిసి మాదోకబిళ వేఁసేవు! అన్నాఁ వెల్లేవు. అప్పన్న కొండ కెల్లేవు! తిరపతెల్లేవు. మూడుసుల్లెల్లేవు! సావిత్రి వనిపించుకున్నావే అప్పా! సీతమ్మతల్లి వనిపించుకున్నావో లప్ప! అయ్యో తల్లి నూకాలమ్మ! అంత మంచి మాయప్పంటే నీ కెందుకింత కోపవుఁ తల్లి నూకాలో!"

అంటూ పగలల్లా ఏడ్చిన మరదలుపిల్ల.

"ఎంతేడ్చినా అప్ప మరింకరాదు. ఒస్తదా. మన వెర్రిగాని?! మరింకేడకేడక!" అంటూ బావకి కాళ్ళురాస్తూ ఆరాత్రి అతణ్ని సముదాయించింది.

శవాన్ని కాటికి మోయించడం. అందుగురించి భజన ఏర్పాటు, శవాన్ని సక్రమంగా పూడ్చిపెట్టే ఏర్పాటు, అన్ని ఏర్పాట్లూ దగ్గరుండి అతి జాగ్రత్తగా ఖచ్చితంగా చేసి, చేయింపించింది మరదలుపిల్ల, చచ్చిన శవంలా ఉండిపోయేదేతప్ప రాజు కదల్నే లేకపోయేడు.

అప్పనిమట్టిలో కలిపేసిన తరవాత మరదలుపిల్ల నూకాలమ్మయందు పరిపూర్ణమైన భక్తి విశ్వాసాలతో ఇంటికి వచ్చింది. బావ మరింక తన వాడే! అతను మరొక చోటుకి వెళ్ళలేడు. నూకాలమ్మ అతణ్ని ఇంకోచోటుకి వెళ్ళనివ్వదు!

ప్రహ్లాదుడికి విష్ణువుయందు, ఆంజనేయుడికి శ్రీరాములవారియందు, మార్కండేయునికి మహాశివునియందు, ఎవరికి ఎవరియందైనా నమ్మకం

పోవచ్చునేమోగాని మరదలుపిల్లకి నూకా_త్తల్లియందు మాత్రం ఎన్నటికి ఇంత పిసరైనా నమ్మకం సడలదు.

ఏడకేడకంటూ మరదలుపిల్ల మూడు రాత్రుళ్ళు బావకి రాసింది. నాలుగోరోజునుండి బావకి భార్యగా స్థిరత్వం సంపాదించుకొంది, రాణి దినవారా లయేక, బావకీ మరదలకీ అన్నారం దేవుడి సమక్షంలో పెళ్ళయింది.

తొలిరాణీని చేపట్టకముందు రాజు కష్టైతే అమ్మేవాడో, అమ్మేవాడో, ఎవ్వరికీ తెలియదు. రాణీని తెచ్చుకున్నాక మాత్రం ఓ బొగ్గుల దుకాణం పెట్టేడు. ఆ తర్వాత బొగ్గులకి కర్రలు చేర్చాడు. ఆవిడ పోయేసరికి అతను కర్రలూ బొగ్గులూ మధ్య వుండిపోయున్నాడు.

మరదలు రాణీగామారి కాపరానికి వచ్చేక కర్రలకీ బొగ్గులకీ అందకుండా తారాజువ్వలా పైకి లేచేడు రాజు.

మరదలు సిటీ మనిషి కాదు. పల్లెటూరి మనిషి. ఆమెపల్లె కంటికి గేదెలు నచ్చేయి. సిటీలో అందరికీ పాలు కావాలని ఆమె తెలుసుకొంది. పాలు భూమిలోంచి పొంగవు. ఆకాశంనుంచి రాలవు. మహామహుల కూ్కడా తాజా పాలు కావాలంటే ఆవులు, గేదెలే ఆధారం.

జీవితంలో విజయం సాధించాలంటే అనేక మార్గాలున్నాయి. వాటిలో గేదెలొక మార్గం అని మరదలుపిల్ల తెలుసుకుంది. మరదలు దయ వల్ల రాజు కిప్పుడు ఇరవై గేదెలు, అయిదావులు, రెండు మేడలు, ఓ పిండిమిల్లు, వందతులాల పైన బంగారం, మూడు ఇళ్ళ స్థలాలు, రెండు బాంక్ అకౌంట్లు ఓ కొడుకు, ఓ కూతురు. పేరు ప్రఖ్యాతులు, పలుకుబడి, హోదా ఇంకెన్నెన్నో ఉన్నాయి.

తన అప్ప చచ్చిపోవాలని ఎంత తీవ్రంగా ఎంతటి పట్టుదలతో, అమ్మని ప్రార్థించిందో తనకు కావలసిన ఏ ముఖ్యమైన విషయానికైనా సరే అంత పట్టుదలతోనూ అమ్మని ప్రార్థిస్తుంది మరదలుపిల్ల. అంత

పట్టుదలతో అంతతీవ్రంగా ప్రార్థించిన పక్షంలో ఆ నూకా లమ్మ తనప్రార్థన వినకపోదనీ, తన కోరిక నెరవేర్చకపోదనీ, ఆమె నమ్మకం. ఆమె ప్రార్థనకి న్యాయా న్యాయాలతో, మంచిచెడ్డలతో, పాప పుణ్యాలతో సంబంధంలేదు. తన క్కావలసినదానికోసం ఆ అమ్మని ఆతల్లిని ఆదేవిని తను ప్రార్థిస్తుంది. అమ్మ వింటుంది. కోరిక చెల్లిస్తుంది. అమ్మ చెల్లించిన తరవాత ఆకోరిక న్యాయమైనది కాదని ఎవరనగలరు? అప్ప పోవాలని తను కోరింది. తన కోరిక తప్పుకాదు కాబట్టే, అప్ప చావడం న్యాయం కాబట్టే, తను కోరిన ప్రకారం ఆ నూకా లమ్మ అప్పని తీసుకుపోయింది. నూకా లమ్మే ఆ ప్రకారం చేసినప్పుడు' "అది న్యాయం కాదు" అని చెప్పడానికీ, "నువ్వెవుడివిరా దురమార్గపు యెదవోరె యెదవ! నీకొంప కూలిపోను! నీ కోడుకులు కూతుళ్ళు రాలిపోను! నీ గుడ్లు పేలిపోను! నీ నాలిక పురుగులడిపోను! నిన్ను అమ్మోరు తినెయ్య. నిన్ను గోతల కప్పెట్ట!...."

మరదలు తిట్టనూగలదు, కొట్టనూ గలదు.

ఆస్పత్రి పాల కంట్రాక్టుకోసం ఆమె ఎంతగా అమ్మని ప్రార్థించిందో, ఎంతమంది ఉద్యోగస్తుల్ని బట్టుకొని ఎంత నాటకం ఆడిందో ఆడించిందో, ప్రతికక్షుల్ని ఎలా హతమార్చిందో కొంతగా రాజుకితెలుసు; పూర్తిగా ఆ అమ్మకే తెలుసు. కాని ఇంకెవరికి తెలుసు?

అవును.

మరదల్ని అమ్మ కాపాడుకొంటూ వస్తోంది. ఆమె కోరిన కోరికలన్నీ న్యాయమైనవి కాబట్టే, అవి అడగడానికీ పుచ్చుకొందికీ ఆమెకి అర్హతఉంది కాబట్టే, ఆ కోరికలన్నీ అమ్మ చెల్లిస్తోంది.

నూకా లమ్మ యెడల మరదలకి భక్తెక్కువంటే, ఎక్కువే మరి!

అదే విధంగా, రాజుకి రామ భక్తెక్కువ.

తనభార్యా వియోగదుఃఖాన్ని మరదలి కౌగిట్లో కరిగించుకు తగ్గించుకొని, కొన్నాళ్ళకి ఆ దుఃఖం పూర్తిగా దిగదీర్చుకొని, అదంతా

శ్రీరాముడి దయే అనుకున్నాడు రాజు. మరదల్ని ఆ శ్రీరాముడే తన దగ్గరకి పంపించేడు. పంపించి, తన ఇంట్లో తిరిగి దీపం పెట్టమన్నాడు. లేకపోతే, తనేమైపోను ? గంగలో కలిసిపోనే ! ఏం ? అమ్మోరు జల్లిన మనిషిని ముట్టుకొని పట్టుకొని మరదలుపిల్ల అంత చాకిరీ చేసిందే ! తన పెళ్ళాన్ని ఎత్తుకుపోయినట్టే మరదల్నికూడా ఎందు కెత్తికెళ్ళిపోలేదు అమ్మోరు ? అమ్మోరికి ఏటడ్డు ?

ఆ రాములోరి దయే అడ్డు !

తన మరదలు తనకి భార్య అవాలనే యోగం ఉంది. ఆ రాముల వారే అలా సంకల్పించేరు. అందుచేతనే ఇదంతా ఇలా జరిగింది. లేకపోతే తొలిభార్యకట్టె ఇంకా పూర్తిగా మట్టిలో కలియకుండానే, తన పక్కమీదికి మరదలు రావడం ఏమిటి ? అంత దుఃఖంలోను తనకి వాంఛ కలగటం ఏమిటి ? ఇలా ఇదంతా జరగడం ఏమిటి ? !

"ఆ రాములోరే ఇలా ఇదంతా చేయించేడు. కాదన్టానికి ఒద్దన్టానికి ఆ దేవడు, నువ్వొవుడివి, నానెవణ్ని ? తప్పు తప్పు ! దేవుణ్ని తప్పట్ట కంౘ్రా తుంటరి యెదవల్లార ! లెంపలేసుకోండి. లెంపలేసుకోండి !"

రాజుగారు తన మరదలియందు అంతటి అనురాగంతో ఉంటోన్నప్పుడు - హెడ్డుగారితో తన సరసోదంతంలో తన తప్పేమీ లేదని రాజుగార్ని నమ్మించడంలో మరదలికి కష్టమేమీ లేకపోయింది. అబద్ధపు రంకు కట్టి జవాను తనని అక్రమంగా తగిలేసేడే తప్ప తన శీలం చెడిందన్నమాట పచ్చి అబద్ధం అని మరదలు చెప్పింది. "అవున్నీ శీలం చెడలేదు. నాకు తెల్సు !" అన్నాడు రాజు.

రాజూ మరదళ్ళు చిలకా గోరింకల్లా ఉంటారంటే అది నిజమే అవుతుంది కాని, వాళ్ళిద్దరూ సింహమూ సివంగిలాగా, పులీ ఆడపులిలాగా ఉంటారంటే అది నిజానికి దగ్గరమాటవుతుంది.

రాజు పోతులా ఉంటాడు. తన ఇరవై గేదెల మధ్యా నిలబడ్డప్పుడు ఇంకా మరీ మంచి పోతులా ఉంటాడు. ఆ ఎగిరే రింగురింగుల

జుట్టు, ఆ కొమ్ములు తిరిగిన తెలతెల్లని నలనల్లని మీసం, ఆ గర్జన ఆ ఛాతీ, ఆ జబ్బలు, ఆ పిక్కలు, ఆ హైటు, ఆ రంగుల చొక్కా, అన్నింటితోను అతను మనిషిగా మారిన కారు దున్నలా ఉంటాడు. ఆ వూరే యమలోకం అయితే ఇతనే ధర్మరాజనిపిస్తాడు. అతను చెక్కిన రాతి బొమ్మలా ఉంటాడు. చాలా అందంగా ఉంటాడు.

అతని తొలిరాణి అతనికి సరిపడా ఆరడుగుల పొడవుతో, మూడు వీశెల కొప్పుతో, చారెడేసి కళ్ళతో, నల్లగా కంచువిగ్రహంలా, ఎంతో భయంకరంగా, కాని ఎంతో అందంగా ఎంతో మంచిగా ఉండేది. పిల్లలు లేకుండానే చనిపోయిందామె.

అప్పకి అడుగు పొడవు తగ్గించి, అడుగు వెడల్పు ఎక్కువచేసి, కంచుకి బదులు ఇత్తడితో చేసిన అదేమాదిరి విగ్రహంలా ఉంటుంది మరదలు పిల్ల. ఈమె కొప్పుకూడా మూడువీశెల బరువుంటుంది. ఈవిడ కళ్ళుకూడా చారెడేసి ఉంటాయి. ఈమె పెదవులు అతి మెత్తగాను ఉండ గలవు. ఎంతో గట్టిగాను ఉండగలవు. ఈమె ముక్కు ముప్పయ్యొద్దాలు చేసినట్టు గంట్లు గంట్లుగా ఉంటుంది. చెవలకి ఎత్తు గొలుసులు, ముక్కుకి మంచిముత్యం, మెళ్ళో నాను పట్టెళ్ళు కంటెకాసుల పేర్లు, చంద్ర హారాలు, మావిడిపింజలు, చేతులకి గాజులు, జెబ్బలకి వంకీలు, కాళ్ళకి అందెలు కడియాలు, టక్కు టక్కు మట్టెలు-అన్నింటితోను మరదలుపిల్ల చాలా భీకరంగాను, ఎంతో మనోహరంగాను ఉంటుంది. సంతోషంగా నవ్వితే, శరత్కాలపు ఎండలో వెండిమబ్బులా ఉంటుంది. కోపంవస్తే వానాకాలపు కారుమబ్బులా భయంకరంగామారి ప్రభంజనంలా విరుచుకు పడుతుంది.

ఆమె కోపం ప్రళయమైతే, ఆమె తెలివితేటలు కత్తివంటివి. కోపానికి ఫోర్సెక్కువైతే తెలివికి పదునెక్కువ. ఆవిడ వెయ్యిళ్ళకి దీపాలు పెట్టగలదు. పదివేల కొంపలకి నిప్పంటించగలదు. దుర్దినాల్లో ఆమె కిలుంపట్టిన బిందెలా ఉండేది. ఇప్పుడామె బాగా తోమి ఎండలో బోర్లించిన ఇత్తడి బిందెలా తళతళ్ళాడుతూంటుంది.

తొలిరాణీ ఉన్నరోజుల్లో రాజుగారు ఊళ్లో ఉన్నట్టు కొట్టుమీద ఆ స్టేషన్ కాతాదార్లకీ, పోలీసువారికి మాత్రం తెలుసు. లక్ష జంతువుల్లో ఓ జంతువులా పడుండే వాడతను.

రాజు గర్జిస్తే సింహంలా గర్జించగలడు! దెబ్బలాడితే పులిలా దెబ్బలాడగలడు; పడితే భల్లూకంలా పట్టు పట్టగలడు; ఢీకొంటే మదపు టేనుగులా ఢీకొనగలడు. అన్ని మంచి రాజలక్షణాలూ అతన్లో ఉన్నాయి. కాని మరదలు రాకముందు వాటికి వేటికీ రాణింపు ఉండేది కాదు. గనుల్లో మణుల్లా, చీకటి గదిలో అందాల బొమ్మలా, అడుగున మరుగున ఉండిపోయే యవి. ఆ మణుల్ని బైటికి తీసి ఆ బొమ్మకి వెలుగిచ్చింది మరదలుపిల్ల.

రాజు పేరు గంగరాజు. అతనికి ఆవులుకూడా ఉన్నప్పటికీ అతణ్ని ఎందుచేతనోగాని అందరూకూడా గేదిల గంగరాజనే అంటారు.

మరదలిపేరు రాజమ్మ, ఆమె "హిందూ ధర్మశాస్త్ర ప్రకారమున్ను కులాచార ప్రకారమున్ను" గంగరాజు పెళ్ళిభార్యే! కాని కిట్టని వెధవలంతా ఆమెని "గంగరాజుగాడి మరదలు ముండ" అంటారు; పిలవడం "రాజమ్మొదినా!" అని పిలుస్తారు.

రాజు రాజే, తురుఫ్ రాజే!

కాని.

తురుఫ్ ఆసు ఎవరూ అంటె, మరదలు రాజమ్మే ఆటకి తురుఫాసు!

కె. కె. మందిర్లో కౌంటర్ ఫీట్ లవ్ - మిస్ ప్రేమ ప్రవేశము, ప్రకాశము - మానవుల దారుణాలు బాధలు - వాటికి కొలమానములేమి - బాధోపన్యాసము - అనంతరం గిరిజ ప్రవేశము- ఆమె వింత భయములు-కొండ గుహాలో దొంగల నాయకుని ఆకస్మికపు టావిష్కరణ :

# 2

"కమ్లా కళామందిర్"
తెలుగున టూకీగా క. క. మందిర్.
ఇంగ్లీషులో సింపుల్‌గా కె. కె. మందిర్.
అదొక సినిమాహాలు పేరు.
"కౌంటర్ ఫీట్ లవ్"
అనే ఇంగ్లిష మాటకి,
"నకిలీ ప్రేమ"
అనునది తెలుగుసేత. అందు,
నకిలీ ఉర్దూ, ప్రేమ, సంస్కృతం.

ఆ హాల్లో ఆ చిత్రం రెండు రోజులనుంచి ఆడుతోంది. మూడో రోజు, ఆఖరి రోజు.

సాయంకాలం ఆరున్నరయింది. హాలంతా ముఖ్యంగా బాల్కనీ అంతా నిండిపోయింది.

బాల్కనీలో మిస్సుశ్రీ ఉంది. మిస్సుజాత ఉంది. మిసెస్సుసుందరీ సెంద్రశేకరన్ ఉంది. మిసెస్సరళ బాలాసిరాజుద్దీన్ఉంది. మిస్ మోహినీ రామారావే కాకుండా మిస్ మనోరమా పద్మేష్కూడా ఉంది; మిసెస్ పమేలా కుంజకుట్టి నాయర్తో కలిసి మిసెస్ పరిమిళా బెనర్జీ కూడా ఉంది.

మరైతే మిస్ ప్రేమ బి.సెన్ ఉన్నారా?

మిస్ ప్రేమాగారా? బాగా జ్ఞాపకం చేశారండీ! ఆవిడ ఇంకా రాలేదండీ. వస్తే నాకు తప్పక కనిపించేవారే. కనిపించలేదు.

లేదు. మిస్ ప్రేమా బిసెన్గారు ఇంకా ఆ సినిమాకి రాలేదు. ఆవిడ మండిపోతూ ఇంటి దగ్గరున్నారు.

ఊరవతల బంగళాలుంటాయి. రోడ్డుమీంచి చూస్తే మీకవి కనిపించవు. విశాలమైన ఆవరణ చుట్టూ ప్రహరీ గోడలుంటాయి. ఆ గోడల వారంట ఎత్తుగా భారీగా; నలుపా అన్నంతటి ఆకుపచ్చగా రకరకాల చెట్లుంటాయి. మేన్ గేటుదాటి, చక్కటి చెట్లుదాటుతూ చక్కని ఎర్రమట్టి రోడ్డు దాటి కొంతదూరం వెళ్తే మీకు పచ్చని పచ్చిక మధ్య చక్కని పూలతోట కనిపిస్తుంది. పూలతోట మధ్య చల్లని నీటికుండీ మధ్య అందమైన ఆడమనిషి అక్కడొక సిమెంటు బొమ్మగా నిలబడుతుంది. వీటన్నింటికీ కొంచెం వెనగ్గా మైదానంలో బోర ఎత్తికూర్చున్న మృగరాజులా మీ కొక గంభీరమైన బంగళా కనిపిస్తుంది.

ఆ బంగాళాకి విశాలమైన పోర్టికో ఉంటుంది. ఆ బంగళా గుమ్మాలూ కిటికీలూ చాలా ఎత్తుగా భారీగా ఉంటాయి. కిటికీలకి చక్కని పీలిలేక ఆకుపచ్చరంగు గుమ్మీలుంటాయి. ఆ బంగళా చాలా చల్లగా

ఉంటుంది. అది పంథొమ్మిదో శతాబ్దపు ఫాషన్లో కట్టినప్పటికీ, ఇరవయ్యో శతాబ్దపు రెండో భాగంలో లభ్యమయే సదుపాయాలన్నీ అందులో లభిస్తాయి.

సాయింకాలం ఆరున్నరయింది. అటువంటి ఓ బంగాళాలో కూడా ఆ రోజు సాయంకాలం ఆరున్నరయింది. అందులో,

హాల్లో ఓ సోఫాలో మిస్ ప్రేమ కూర్చొనుంది. ఆ హాలుగోడలు నీలంగా ఉన్నాయి. గోడల్ని రెండు ట్యూబులైట్సు సాగదీసి వెలిగించిన గాజుపాముల్లా, నీలి నీలిగా వెలుగుతున్నాయి. తినితిని బాగా బలిసిన వింత జంతువుల్లా, నాలుగు సోఫాలు నీలంగా నిల్చున్నాయి. వాటిమధ్య, లతలు చెక్కిన మేజా ఒకటి వినయంగా వంగి నిల్చొంది. ఆ మేజామీద, అద్దాలు పొదిగిన చక్కని చిన్నని నీలిరంగు జాడీ ఒకటి - ముస్తాబై పెద్దల మధ్య భయపడుతూ నిల్చున్న అలనాటి భోగపు కన్నెలా - అసహాయంగా నిల్చొంది. ఆ కన్నె పిల్ల తలలో పువ్వుల్లా, జెయిల్లో పసిపిల్లల్లా-ఆ జాడీ లోంచి జాలిగా జారిన పూతీగెని పూసిన పూలు-నీలి రంగుపూలు బిక్కు బిక్కు చూస్తున్నాయి.

ఆ నీలిరంగు హాల్లో, సముద్రం మధ్య శ్రీ దేవిలా మిస్. ప్రేమా బి. సెన్. ప్రకాశిస్తోంది. సముద్రంమీద వెన్నెల మెరిసినట్టు ఆమె కట్టుకున్న నీలిరంగు డెకరాన్ చీరె మిలమిల మెరుస్తోంది. ఆమె తొడుక్కున్న పల్చని నీలిరంగు జాకెట్టు ప్లాస్టిక్ పూలగుత్తుల్లా పొంగింది. పూగుత్తుల మీద పాకే అల్లరి తాచుపాము పిల్లల్లా ఆమె జుట్టు రెండు పాయలుగా విడిపోయి గుండెలమీదకి జారింది. ఆ జుట్టు మాటి మాటికీ వెనక్కి తోసుకొంటూ మళ్ళీ మళ్ళీ ముందుకి తెచ్చుకొంటూ చాలా విసుగ్గా ఎంతో కోపంతో కుతకుతలాడుతూ కూర్చొనుంది మిస్ ప్రేమ.

మానవులకి అనేక ఆపదలొస్తాయి. వరదలు, వానలు, ప్రేమలు, యుద్ధాలు, దారిద్ర్యాలు, కరువులు, కాటకాలు, చలిగాలులు, చీకటి మబ్బులు, అవిలేని పిడుగులు, సమ్మెలు, సత్యాగ్రహాలు, ఎండలు, కాల్పులు, కేసులు, గాడ్పులు, కోర్టులు, పిడుగులు, ప్లీడర్లు, దీర్ఘవ్యాధులు, దొంగడాక్టర్లు,

చచ్చే చావులు - ఈ విధంగా మానవులకి ఎన్నెన్నో ఆపద లొస్తాయి; వారెన్నన్నో బాధపడతాం.

కాని—

మహిలో మనిషి బాధకి మీటర్లులేవు. ఎంత గొప్ప శాస్త్రజ్ఞుడైనా సరే బాధని కొలవలేడు. బాధామీటర్లు లేకపోవడంతో వేదాంతుల పని చాలా సులభం అయిపోయింది.

"బాధల తీవ్రత మనిషి సంస్కారమును బట్టి ఉండును. ఆ దరిద్రునకు పాము కాటువల్ల ఎంత బాధ కలిగినదో ఈ పూబోడికి అతిచిన్ననల్లి దెబ్బవలన అంత తీవ్రమైన బాధయూ కలుగవచ్చును. భర్త చావుకు ఆ కూలి భార్య ఎంత విలపించిందో, భర్త కావలెనను కోర్కెతో ఈ సుకుమారి అంతగనూ తపించవచ్చును. నీ జేబులోని పావలా డబ్బులు రాలిపోయిన యెడల నీ వెంతగ కటకటలాడెదవో, పావులక్ష లాభము చేజారిపోయిన యెడల ఆ షాహుకారు అంతగనూ కటకటలాడునన్న నీ వెందుకు నమ్మవు? తిండిలేక, తేనీరులేక, చివరకు తమలపాకు పిప్పి కూడా లేక ఆకలి నొప్పిచే నీవు బాధపడుచున్నావు. నిజమే! కాని ఆ పెద్ద తలదిండు వంటి తగుమనిషి పరుపు మీద కూర్చొని తనకి గుండె జబ్బు ఉన్నదేమోననే అనుమానముతో అంతగానూ బాధపడుచున్నాడు. అది అబద్ధము కాదే! నీవు పడ్డ అరవై మైళ్ల బాధ నాతడు అర ఫర్లాంగులో పడగలడు. లేక పరుపుల బాధ కూర్చొనే పడగలడు. కాబట్టి ఎంతచెట్టుకు అంతగాలి! ఎవరి బాధలు వారివి. నీ వొక్కడవే బాధలతో కుమిలిపోవుట లేదు. రాజులు, రారాజులు, రారారాజులుకూడ బాధలు పడుచున్నారు. బాధలు అందరకును సమానమే. బాధలకు రాజా పేదా భేదమే లేనప్పుడు ఆ రాజుకూడ నీవలెనే పేద వెధవగా మారి దిగజారిపోవలెనని, స్వార్థపరుడా! స్వామిద్రోహీ! నీవు కోరుట మహాపాపము కాదా?!"

అని ఈ విధంగా పెద్ద వేదాంతులు బాధా రహస్యం బోధించి అందరికీ ముఖం వాచేలా చీవాట్లు పెడతారు. శాస్త్రజ్ఞులు అది విని వెర్రి మొహాలు వేసుకూర్చుంటారు.

మిస్ ప్రేమ కూర్చున్నతీరూ ఆమె ముఖకవళికలూ పరిశీలించి చూస్తే, ఆమె ఏదో తీవ్రాతితీవ్రమైన యాతనలో ఉన్నదని తెలుస్తుంది.

మిస్ ప్రేమ చాలా బావుంటుంది. ఆమె ముక్కు నోరు నుదురు చెవులు అన్నీ బావుంటాయి. ఆమె చాయ బావుంటుంది. ఆమె ఎంతో బావుంటుంది.

కాని —

ఆమె కళ్ళు బావుండవు. చింతాకుల్లా చిన్నవిగా ఉంటాయి. నవ్వినప్పుడు మూసుకుపోతాయి. అది ఆమెకొక మాయనిబాధ: ఆమె దేముణ్ని ఎంత ప్రార్థించినా ఆమె చిన్నకళ్ళు పెద్దవికావు. ఆమె బాధ మరింకతీరదు. (అందుచేత, విధి బలీయమను యదార్థమను పేద వెధవలంతా ఇందు మూలంగా తెలిసికొని చచ్చినట్టు పడుండవలెను. విధిని మార్చాలని వారు వ్యర్థంగా ప్రయత్నిస్తే డామేజీలూ, ఖర్చులూ, చావులూ అన్నీ వారే భరించవలెను!)

మిస్ ప్రేమ చాలా బాధపడుతూ కూర్చొంది. అది కంటి బాధకాదు. ఆమె పళ్ళుకొరుకుతోంది కాని పంటిబాధకాదు. వాచీవైపు ఆమె మాటిమాటికీ చూచుకొంటోంది. పూర్తిగా కాకపోయినా, కొంతగా ఆమె బాధ వాచీ బాధే అని చెప్పాలి.

రిస్టువాచీ సరిగానే పనిచేస్తోంది కాని, అందులో సెకెన్ల ముల్లు యుగానికొక మిల్లీమీటరైనా తిరుగుతూంటే, మిగతా ముళ్ళు మాత్రం అంతనెమ్మదిగా తిరుగుతూ, కాలానికి కళ్లెం వెయ్యడం చూసి ఆమె బాధతో మూలిగింది. ఒక్కొక్కప్పుడు అంతటి చిన్న విషయాలే మనుష్యుల్ని ఎంతగానో బాధ పెట్టగలవు. ఎంత ఎక్కువగా సంస్కారం ఉంటే, అంత చిన్న విషయాలు అంత ఎక్కువగా బాధ పెడతాయి. టిస్యూచీరెకి బదులు పట్టుచీరె కట్టుకోమంటే, అందుకే పెద్దింటి పిల్లలు అంతగా బాధపడతారు. అందువల్లనే కూలివాడి ఎండబాధకంటె, పెద్దింటి కవీశ్వరుడి నీడబాధ ఎక్కువగా ఉంటుంది.

అందువల్లనే మిస్ ప్రేమ ఎక్కువగా బాధపడుతోంది.

ఆరున్నరదాటి అర నిమిషం అయింది.

ముప్పయి సెకన్లు గడవడానికి అన్ని యుగాలవుతుందని మిస్ ప్రేమ ఎన్నడూ అనుకోలేదు. ఆమెకి కళ్ళంట నీళ్ళు-తిరగడానికి అట్టే జాగాలేక పోయినా - గిర్రున తిరిగేయి. ఆ కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. ఆమె పళ్ళు పటపట కొరుక్కుంది, మరింక కాసేపట్లో జుట్టే పీక్కొనేదో; చీరే చింపుకోనేదో, బుగ్గలే రక్కేసుకొనేదో, లేక ఆ గాజు జాడీని బద్దలే చేసేదో చెప్పడం కష్టం.

కాని అటువంటి ప్రమాదం ఏమీ జరక్కుండా అంతలో అమె చెవిలో,

"హలో పద్మా!" అనే పిలుపు పడింది.

టక్కున తలెత్తి చూసింది మిస్ ప్రేమ.

ఎదురుగా ఓ తెల్లని చీరా, ఓ తెల్లని జాకెటూ, నవ్వే పలువరసా, రెండు విశాల నేత్రాలూ నిల్చున్నాయి.

అవతల వ్యక్తి వేసుకున్న బట్టలు అంత తెల్లగా మెరుస్తూవుండడం వల్లనో, లేక తనకళ్లే అంత చిన్నవిగా వుండడంవల్లనో ఆ వచ్చిన వ్యక్తెవరో క్షణంపాటు పోల్తి పట్టలేక ఉండిపోయింది మిస్ ప్రేమ.

పోల్తి పట్టగానే ఆమె మనసు చివుక్కుమంది.

తెల్లని పాలరాత్తో అందంగా చెక్కిచెక్కి ఆ రాయిని మెత్తగా దూదిలా మార్చి మార్చి, నిండా ముత్యాల పౌడరు అద్దినట్టుగా గిరిజ ఎంత బావుంది!! అద్దాల తలుపుల్లోంచి కనిపించే బంగారు చేపల్లా ఆకాశంలో మెరిసే అందాల చుక్కల వెలుగుల్లా.

"అబ్బ! నీ కళ్ళెంత బావున్నాయి. గిరిజా ! అవి నాకు ఇచ్చి కూడదూ? నా భాగ్యం నా జీవితం నా సర్వసం అంతా ఇచ్చేస్తాను నీకు:- అవి ఇస్తే చాలు!" అంది మిస్ ప్రేమ ఆ వచ్చిన గిరిజతో.

"మంచి మనసులుండాలి కాని కంటి మెరుపులెందుకు పద్మా?" అంటూ సోఫాలో ప్రేమ ప్రక్క కూర్చొంది గిరిజ.

గిరిజ రాగానే ఆమెనిచూచి నవ్విన నవ్వు ఆమె సోఫాలో కూర్చో గానే మాయమయింది మిస్ ప్రేమకి. అవతలి ఆడమనిషి అంత అందంగా ఉండడంవల్లనో మరెందువల్లనోగాని అడిషనల్ భారాలతో అష్టకష్టాలు పడుతూన్నట్టుగా కూర్చుంది మిస్ ప్రేమ.

"ఏం పద్మా? అలా ఉన్నావేం? ఇవాళ నీ పుట్టిన రోజుకదా అని చెప్పి "శుభాకాంక్షలు" తెలియజేద్దామని నేనొస్తే నువ్వేఁవిఁటలా ఉన్నావు?" అని ప్రశ్నించింది గిరిజ.

"ఏం? ఎలా ఉన్నాను?" అనేటటువంటి ఆత్మజిజ్ఞాస ప్రకటించింది. చాలా నీరసంగా ప్రకటించింది, మిస్ ప్రేమ.

"హీరో కనిపించని హీరోయిన్లా ఉన్నావు!" అంది గిరిజ నవ్వుతూ.

నవ్వనప్పుడు సినిమా స్టార్లా ఉంటే, నవ్వినప్పుడు దేవకన్యలా ఉంటుంది గిరిజ.

గిరిజ నవ్వుకి జవాబుగా ఒక అష్టకష్టాల నవ్వు నవ్వింది మిస్ ప్రేమ.

అసలు, నిజం చెప్పాలంటే, ఆ సమయంలో గిరిజ వచ్చినందుకు సంతోషించాలో చికాకు పడాలో తెలియలేదు మిస్ ప్రేమకి. అసలు ఇంకా మరీ నిజం చెప్పాలంటే గిరిజ తన ప్రాణ స్నేహితురాలే అయి నప్పటికి గిరిజయెడల తనకి ఇష్టమో అయిష్టమో ఇంతవరకూ తేల్చుకో లేదు మిస్ ప్రేమ.

"ఇంత ముస్తాబు చేసుకొని" అంటూ చేత్తో మిస్ ప్రేమ వళ్ళంతా ఒక్క ఊపుతోచూపించి "అంత విచారం ఎందుకు?" అంటూ ఆ చేత్తో ఆమె ముఖం చూపించి అడిగింది గిరిజ.

మిస్ ప్రేమ, "కృష్ణుడురాని రాధముఖం" పెట్టుకూర్చుంది.

"పీటలమీద పెళ్ళి తప్పిపోతే పెళ్ళికూతుర్లు ఇలానే ఉంటారు" అంది గిరిజ.

శోకంపోజులో ఉన్న మిస్ ప్రేమ ఆ మాటలకి ఇంకా "శోక పోజు" రాలయింది.

"రిజ్జీ అలా మాటాడకు రిజ్జీ ప్లీజ్! అంది మిస్ ప్రేమ "హస్కీ"గా.

"ఏవిఁటి పద్మా! ఎందుకలా ఏడుస్తున్నావు?" అంటూ గాభరా పడింది గిరిజ.

మిస్ ప్రేమ ఏడవలేదు. "హాంకీ"తో కళ్ళొత్తుకొంది. అందుచేత ఏడ్చినట్టే లెక్క.

"ఇవాళ నా పుట్టిన్రోజు రిజ్జీ!" అంది మిస్ ప్రేమ చాలా భారంగా పుట్టిన్రోజులు అనేవి ఘోరమైన ఆపదల్లాగ, నరకయాతనల్లాగ.

"అవును. అందుకే ఒచ్చేన్నేను."

"కాని! చూడు!"

"ఏవిఁటి?"

మిస్ ప్రేమ వెంటనే సమాధాన మివ్వలేదు. గోడనొక చచ్చిన పులిబుర్ర ఉంది. అది బతికున్నట్టుగా కోరలు తెరుచుకునుంది. ఆ పులి బుర్రవైపు అలా కొంతసేపు చూస్తూ ఉండిపోయి, చూపు ఆ తరువాత కిందకి తివాసీవైపు దించి.

"కాని చూడు! అతనొస్తానని రాలేదు!" అంది మిస్ ప్రేమ. అటువంటి సమయాల్లో చాలా సిగ్గుపడాలి కాబట్టి, చాలా సిగ్గుపడింది.

గిరిజ సహజంగా చాలా కుతూహలంతో నిండిపోయింది. మిస్ ప్రేమని ఆమె చాలా వింతగా చూసింది.

"ఎవరతను పద్మా? నాతో ఎప్పుడూ చెప్పేవు కావు!"

"అవును. నీతో ఎప్పుడూ చెప్పలేదు రిజ్జీ!"

"అవును నాతో చెప్పలేదెప్పుడూను."

"అవును చెప్పలేదు"

"చెప్పలేదవును"

"అవును"

"అవును"

అవునవును సంభాషణ అంతటితో ఆగింది. సబ్ మెరీను నీట్లో మునిగి కొంత సేపుండి పైకి తేలినట్టు, మిస్ ప్రేమ కొంతసేపు శోకంలో మునిగి, ఆ తరువాత పైకి తేలింది. తేలేక నిట్టూర్చి.

"పోనీ, మనం అయినా అలా ఎక్కడికైనా వెళ్దాం రా! అతను మరింక రాడు. వచ్చే టైం దాటిపోయింది" అంది ప్రేమ.

"అతను అతను అనడమేకాని ఆతనెతనో చెప్పకూడదా!" అంది గిరిజ.

గిరిజ చాలా ఉత్సాహంగానూ కుతూహలంగానూ కూడా ఉంది. ఆ ఉత్సాహంలో కొంత జెలసీకూడా ఉందేమోనని అనుమానించి కొంత సంతోషించింది మిస్ ప్రేమ. ఆమెనిచూసి అసూయ పడినవారు (ఎంత అందగత్తెలే అయినా) ఆ అసూయ పడినవారు మేరకి ఆమెకంటె తక్కువ వారేకదా మరి!

గిరిజ కుతూహలానికి ఆమె చిరునవ్వు నవ్వి•ఉండు అలా ఎక్కడికైనా వెళ్దాం. వెళ్తూ అంతా చెప్తాను. అలా వెళ్తున్నాం అని ఆంటీతో చెప్పి వస్తాను. ఒక్కయిదునిమిషాలుండు." అంది మిస్‌ప్రేమ తన స్నేహితురాలి చేయి పట్టుకు గట్టిగా నొక్కి విడిచిపెట్టి.

"వేగిరం చెప్పిరా! ప్రేమ చెప్పే పరమరహస్యం ఎంత మధురంగా ఉంటుందో వినాలనుంది నాకు!" అంది గిరిజ.

మిస్ ప్రేమ సోఫాలోంచిలేచి గిరిజ బుగ్గమీద వేళ్ళతో మెత్తగా తట్టి-

"మై స్వీట్ రిజ్జీ! వస్తానుండు!" అంటూ వయ్యారంగా లోనికి వెళ్ళింది.

మిస్ ప్రేమ లోనికి వెళ్ళేక ఓ చిన్న విచిత్రం జరిగింది. అది పెద్ద విచిత్రం ఏంకాదు. కాని గిరిజ కెంయకోకాని చిన్న భయం ఆవహించింది.

అంత పెద్ద తోటమధ్య అంత పెద్ద భవనం చాలా నిశ్శబ్దంగా అడవి మధ్య మేడలా ఉన్న దనిపించింది గిరిజకి. బంగళా ఆమెకి ఎందుచేతనో గాని ఓ యిల్లులా అనిపించలేదు. ఊరవతల ఊరంత చీకటి మర్రిచెట్టు మీద వంటరి పిచిక కూర్చున్నట్టుగా ఆమె ఆ సమయంలో తనెంతో వంటరిగానూ అసహాయంగానూ ఉన్నట్లనిపించింది. ఆమె నీలిరంగు వెలుగులో ఆ నీలిరంగు హాలు ఆమెకి మడుగు అడుగున కాళీయుడి భవనంలా కనిపించి ఆమె రవ్వంత భయపడింది. అందులోను ఆ గోడ మీది పులి బుర్ర చూడగానే ఆమెకి భయం కొంచెం ఎక్కువయింది.

అబ్బ! ఇదేంటి బాబూ! పెద్ద కొండ గుహలా ఉంది ఈ గది! గుహలో మేకని చంపి నవ్వినట్టు గోడని పెద్దపులొకటి!

ఆ చప్పుడులేని పులి నవ్వు చూసి గిరిజకి భయం హెచ్చయింది. ఎప్పుడో ఎక్కడో ఏదో సినిమాలో చూసిన దొంగల గుహలా కనిపించింది. ఆ విశాలమైన హాలు. ఆమె కా సమయంలో. కాసేపట్లో ఏ దొంగలో దొంగల నాయకుడో అందులోకి ఏ క్షణంలోనైనా వస్తారేమో ననే భ్రాంతి కలిగింది.

గదంతా నిశ్శబ్దంగా ఉంది. పద్మ ఇంకా రాలేదు. గదంతా నిశ్శబ్దంగా ఉంది. నిజంగా నిశ్శబ్దంగా ఉందా? సన్నగా చప్పుడు వినపడుతుంటే

అదేదో దొంగపక్షిచేసే రెక్కల చప్పుళ్లా తోచి, తలెత్తిచూసి జడుసుకొంది గిరిజ.

పైన, సరికొత్త పంకా ఒకటి మిలమిల మెరుస్తూ మూడు రెక్కల పెనుపురుగులా తిరుగుతూ నెమ్మదిగా గుర్రుపెడుతోంది.

"అబ్బ!" అనుకొంది గిరిజ.

ఆమె అలా అనుకొంటూ ఉండగానే పైన ఆ మాయపురుగుచేసే గుర్రు పెద్దదయిందనిపించింది గిరిజకి. ఆ శబ్దం అలా పెద్దదయి పెద్ద దయి టక్కున ఆగ్గానే అది మోటారుసైకిలు చేసిన చప్పుడని గిరిజ గ్రహించింది.

అంతలో అడుగుల చప్పుడు!

గిరిజ అదిరిపడ్డది.

"గుడ్ ఈవెనింగ్! ప్రేమ్ లేదా?"

గుహలోకి వచ్చిన దొంగల నాయకుడా? లేక, గదిలోకి వచ్చిన క్రూర హంతకుడా?

అతను గదిలోకి వచ్చి తివాసీమీద నిలబడి విలాసంగా చూస్తూ.

"మా ప్రేమ్ ఉందా?" అని మళ్ళీ అడిగేడు.

దొంగలనాయకుడెవరు? అతడు చెప్పిన వృత్తాంత మేమి? మిస్ ప్రేమ తన దారుణబాధ నెటుల మరువ గలిగెను? గిరిజ మనోవికారమునకు కతంబేమి?

# 3

హాల్లోకి వచ్చినవాడు ఎర్రగా, లావుగా, పొడవుగా వున్నాడు. తెల్లటి పంట్లాంలో ఎర్రటి టెర్లిన్‌షర్టు "టక్" చేసుకున్నాడు. "నేను డాబుగా ఉంటాను" అనే ఆత్మజ్ఞానం కలిగిన డాబుగాళ్ళా ఉన్నాడతను.

"ప్రేమ్ లేదేంటండీ ?" అని మూడోసారి అడిగేడతను.

ఆ వచ్చిన వ్యక్తెవరో గిరిజకి తెలియదు. కాని, అతణ్ణి అంతకు ముందు చాలాసార్లు చూసింది. ఓసారి ఏదో సినీమాహాల్లో అతను తనని చాలా అమర్యాదగా చూడ్డంకూడా ఆమె లోగడ కనిపెట్టి, "వీడొక దొంగ !", అని మనసులో మారుమూల నెక్కడో నోట్ చేసుకొంది.

ఇప్పుడు హాల్లో నిల్చున్నప్పుడు, దొంగ చాలా వినయంగా మర్యాదగా వున్నాడు. ఈ హాలు దొంగల గుహలాంటిదే అయితే ఇందు లోకి సరైనవాడే వచ్చేడనిపించి, గిరిజకి చిన్నగా నవ్వొచ్చింది.

"లోపలికి వెళ్ళింది పద్మ, ఇప్పుడే వస్తుంది" అని ఆ వచ్చిన ఆసామీతో చెప్పింది గిరిజ.

గిరిజ నవ్విన నవ్వుకి అతను వయ్యారంగా జవాబు నవ్వు నవ్వేడు. ఫ్రిజిడేర్‌లోంచి దాచి తీసిన నవ్వులా అది అతి చల్లగానూ ఎంతో కృత్రి

మంగాను ఉన్నదనిపించింది గిరిజకి. అతని పళ్ళు చాలా తెల్లగా ఉన్న ప్పటికి మాంసాహారి జంతువు కోరల్లా క్రూరంగా ఉన్నట్టనిపించిం దామెకి.

రాత్రి శత్రు విమానం కనిపించేసరికి దీపాలు వెంటనే ఆర్పేసి నట్టు, వెంటనే తన నవ్వుని ఆర్పేసుకుంది గిరిజ. "కొంపతీసి, వీడే నేఁవిఁటి పద్మా ప్రియుడు ? !" అనుకొని, లోపలి గుమ్మంవైపు చూడ సాగింది ఆమె.

అతను ఆమె కెదురుగా సోఫాలో కూర్చున్నాడు.

అతను తొడుక్కున్న తెల్లపంట్లాం మెరుస్తోంది. ఎర్రటి టెర్లిన్ షర్టు మెరుస్తోంది. మెళ్ళో ఉండే తెల్ల మఫ్లరు మెరుస్తోంది. అతని జుట్టు- ఏదో క్రీమ్ వ్రాసుకున్నందువల్ల కాబోలు నల్ల గాజుతో చేసినట్లు, అందులో ప్రతి తలవెంట్రుకా ఒక సన్నని గాజుపాము అయినట్లు నిగ నిగ మెరుస్తోంది. అతి నున్నగా గీసుకున్న గడ్డంమీద పూసుకున్న లాక్టో కాలమీన్‌మీద అద్దుకున్న పౌడరుమీద తీర్చిదిద్దిన అతని మీసం - పల్చగా నూనె రాసినందువల్ల కాబోలు నల్లటి పురుగులా మెరుస్తోంది. అతను ఎక్కువ మేకప్ చేసుకున్న తక్కువ యాక్టర్లా కొట్టొచ్చినట్టు కనుపి స్తున్నాడు.

"మీరు మిస్ గిరిజ కదండీ !" అని రెండు మూడుసార్లు గొంతుక సర్దుకున్నాక అడిగే డతను.

అవునన్నట్టు తల ఊపింది గిరిజ. నా పేరు మీకెలా తెలుసు ?- అని ఆమె అడగలేదు. చిరునవ్వు నవ్వలేదు.

"మీరోసారి యూనివర్శిటీ గర్ల్సుతో హాపీ వాలీకి పిక్‌నిక్‌కివచ్చేరు, ఆవేళచూసేను. ఆ రోజుకూడా ఈ"సారీ"వే కట్టుకున్నారు" అన్నాడతను.

అందుకు జవాబు చెప్పవలసిన అవసరం ఏమీ కనిపించలేదు గిరిజకి.

"మీకు మేరీ సుశీలనీ సంతోష్ బాలా చక్రవర్తినీ తెలుసుకదూ ?"

తెలుసునన్నట్లుగా తల ఊపింది గిరిజ.

"అయితే మీకు మా సిస్టర్‌నికూడా బాగా తెలిసే ఉండాలే! వాళ్ళు మా సిస్టర్‌కి క్లోజ్‌ఫ్రెండ్స్" అన్నాడతను.

"మీ సిస్టర్ ఎవరు?" అని అడగలేదు గిరిజ.

"హెడియా అంటారు, హెచ్. దమయంతి మా సిస్టరు" అన్నాడతను.

సంఘంలో నిచ్చెన లెక్కేవాళ్ళూ, వలలు పన్నేవాళ్ళూ ఆ విధంగా స్నేహాలూ చుట్టరికాలూ "రిఫర్" చేసుకుంటారని ఎవరో చెప్పగా ఎక్కడో వింది గిరిజ.

మానవ ప్రపంచంలో మసిలే హెడియాని తనకి తెలుసో లేదో అతనికి తెలియచెప్పలేదు గిరిజ.

"అదీకాక మీ ప్రేమ్ మాకు చాలా దగ్గిర బంధువు" అని తురుపు జాకీ రాణీ రాజూ అన్నీ కొట్టి ఆఖర్న తురుఫాసు కొట్టినవాళ్ళా చెప్పేడతను.

"అదిగో మీ దగ్గిరబంధువు" అంది గిరిజ.

"ఎవరు?" అని ఆశ్చర్యపడ్డాడతను.

"మీ దగ్గిర బంధువు."

"మా ప్రేమా?" అంటూ అతను వెనక్కి తిరిగి పద్మని చూసి టక్కుమని సోఫాలోంచి అమ్మగార్ని చూసి లేచిన ఆల్సేషన్లా లేచేడు. లేచి ఆమెకి పుట్టినరోజు శుభాకాంక్షలు ఇంగ్లీషులో తెలియజేస్తూ అత నొక నూరువాట్ల బల్బు నవ్వు నవ్వేడు.

గిరిజ వచ్చేవరకూ చిరాకుపడుతూ కూర్చొని, గిరిజ రాగానే రాణీ కొవ్వొత్తిలా కొంచెం మినుకూ మినుకూ వెలిగిన ప్రేమ, అతణ్ణి చూడ గానే విద్యుద్దీపంలా వెలిగింది.

"థాంక్స్, రామ్! థాంక్స్! ఎంతసేపయి ఒచ్చేవు? ప్లీజ్ బి సీటెడ్!" అంది ప్రేమ.

ఆ సమయంలో వారి సంభాషణ రెండు నిఁ
షణలా ఉన్నదనిపించింది గిరిజకి.

"భక్తుళ్లా ఇప్పుడే వచ్చేను. దేవతలా వెంటనే దగవు."

అతని పొగడ్తకి పురివిప్పిన నెమలిలా పొంగింది మిస్ ప్రేమ.

"ప్రేమికులు పబ్లిక్‌లో మాట్లాడుకోకూడదని రూలుంటే బావుణ్ను" అనుకొంది గిరిజ.

అతనింకా చెప్పుకు పోతున్నాడు.

"నన్ను తిడితే తిట్టు, కొడితే కొట్టు - కాని నువ్వు ఆ డ్రెస్‌లో సింప్లీ మార్వెలెస్‌గా ఉన్నావని నే ననక తప్పదు!"

చెవులు మూసుకోవాలనిపించింది గిరిజకి.

"మార్వెలెస్‌గా కాదు - డివైన్‌గా ఉన్నావు!" అని తన పొగడ్తకి మెరుగుపెట్టే డతను.

తనకి చెముడొస్తే బావుండు ననిపించింది గిరిజకి.

"థాంక్స్ థాంక్స్ రామ్! కాని, నువ్వు చాలా డేంజరస్ మనిషి విస్మా" అని ఎంతో మోహనంగా అంది మిస్ ప్రేమ.

ఆ మాట చాలా నిజమనిపించింది గిరిజకి.

తను "డేంజరస్ మనిషి" అయినందుకు అతను మాత్రం చాలా విరగబడి నవ్వేడు, ఆడపులి పొగడ్తకి మగపులి నవ్వినట్టు.

అలా అతను నవ్వినందుకో మరెందుకోగాని, మిస్ ప్రేమ అతనికి మళ్ళీ థాంక్స్ చెప్పింది, చెప్పి రిస్టువాచీ చూసుకొని, గిరిజవైపు చూసింది.

గిరిజ ఆమె కళ్ళల్లోకి చూసి నవ్వింది.

"నీ ప్రియుడెవరో తెలుసుకున్నానులే!" అని ఆ నవ్వు సారాంశం.

ప్రేమ, ఎందుకోగాని గిరిజనవ్వుకి గాభరాపడి-

"ఇతన్ని తెలుసుకదూ గిరిజా? మా రిలేషను; రంగారావు. ప్యారీ సోనా కంపెనీలో పని చేస్తున్నాడు" అని గిరిజతో చెప్పి, "మా క్లాస్‌మేట్, గిరిజ." అని రంగారావుతో చెప్పింది.

"అవును. ఇప్పుడే తెలుసుకున్నాం" అన్నాడు రంగారావు.

మర్యాదా నవ్వు నవ్వింది గిరిజ.

"రైట్! మరైతే మనం ఇప్పుడు ఏం చేదాం?" అంది మిస్ ప్రేమ.

ఆ ప్రశ్న గిరిజతో అతనికో తెలియకుండా అడిగింది ప్రేమ. అడిగి మళ్ళీ టైం చూసుకొంది. రంగారావుకూడా టైం చూసుకున్నాడు. గిరిజ, గోడని ఉన్న గడియారం వైపు చూసింది.

"గుడ్ హెవిన్స్ ! !" అని హెవెన్స్ జారిపడేలా అన్నాడు రంగారావు.

ప్రేమ గిరిజా అతనివైపు చూసేరు.

"పావు తక్కువ ఏడయింది ప్రేమ్ ! !"

పావు తక్కువ ఏడుకే ప్రళయం వస్తుందా? ప్రపంచం తలక్రిందు లవుతుందా? ఆకాశం బద్దలవుతుందా? పావు తక్కువ ఏడుకి ఏం జరుగు తుంది? ఏ మహా ప్రళయం ముంచుకొస్తుంది? ఏ మానవలోకం మునిగి చస్తుంది? ఏం జరుగుతుంది?

"పావుతక్కువ ఏడయి పోయింది ప్రేమ్! కౌంటర్ షీట్‌లవ్ బిగిన్ చేసేసి ఉంటారు. ప్రేమ్! ఇవాళ నీ పుట్టినరోజని నాకు గుర్తుంది. ప్రేమ్! నువ్వు నాతో రావచ్చు. మానొచ్చు. కాని వస్తావేమోననే ఆశతో "కేకే"లో రెండు బాల్కనీ సీట్సు రిజర్వుచేసి ఉంచేను. రెండుసార్లు నీకు ఫోన్ చేసేను. రెండుసార్లూ ఎన్‌గేజ్‌డే! స్వయంగా అ వెంటనే వద్దాం అనుకున్నాను! అబ్బ! బ్యూటిఫుల్ పిక్చర్ ప్రేమ్!! నిన్నా మొన్నాకూడా చూసేను. ఇవాళ మూడోసారి! నీకు తప్పక చూపించాలనిపించింది ప్రేమ్! నిన్నా మొన్నా హాలుకి రాలేదు; నేను నోట్ చేసేను. ఇవాళ ఎలాగైనా

రావాలి. యు షుంట్ మిస్ ది పిక్చర్!" అని తొందరగా యుద్ధ భూమికి వెళ్ళేవాళ్ళా చెప్పుకుపోయేడు రంగారావు.

"అవును, చాలా లవ్లీ పిక్చర్ట!" అంది ప్రేమ. కళ్ళల్లో లవ్ నింపుకొని, ఏదో ఆలోచిస్తూ, ఎటో చూస్తూ.

"అందుకనే, నువ్వు చూడలనే ఇలా వొచ్చాను. గంటకిందట బయల్దేరుదాం అనుకున్నాను, కాని ఓ సిల్లీఫెలో నా టైమంతా తగ లెట్టాడు" అన్నాడు రంగారావు.

"ఓ డర్టీఫెలో" అందామని అనుకున్నాడు కాని ఎందుకైనా మంచిదని, "సిల్లీఫెలో"తో చాలించేడతను. ఆ డర్టీఫెలో గురించి తల్చు కొంటే అతని మనసు కుతకుత లాడుతుంది.

ఆ సిల్లీఫెలో ఎవరో ఏమిటో అడగాలని తోచలేదు మిస్ ప్రేమకి.

"ప్రేమ్! వాణ్ని నీకు తెలిసే ఉండవచ్చునేమో? రెండుమూడు సార్లు నీతో మాట్లాడ్డం చూసేను. మా కంపెనీలో పనిచేస్తున్నాడు. బ్రౌన్ టెర్లిన్ పాంటొకటి, మట్టిరంగు టెర్లిన్ షర్టొకటి - రెండే వున్నాయి వాడికి. ఆవే దంచుతూ ఉంటాడెప్పుడూను. అయినా, టైమవుతోంది ప్రేమ్!" అంటూ వాచీ చూసుకున్నాడు రంగారావు.

"సరేలే, కాని, అతని కేఁవఁయింది?" అని కొంచెం విసుగ్గా అడిగింది మిస్ ప్రేమ.

అలా ఆమె అడిగినందుకు రంగారావు ముఖం వివర్ణం అయింది.

"టైమ్ అయింది ప్రేమ్!" అన్నాడతను కొంచెం జాలిగా.

"అబ్బ అతని కేవరికో ఏఁవిఁటయింది?" అని ఈసారి కొంచెం చురుగ్గా అడిగింది మిస్ ప్రేమ.

"ఏఁవీఁ అవలేదు. అదంతా అసలు ఓ సిల్లీ ఎఫేరు! నీలాంటివాళ్లు వినకూడదు."

"ఏఁవిఁటయిందో చెప్తావా చెప్పవా రాయ్!"

"రాజమ్మ అని ఒకర్తుంది. అది మా వీధికి ఓ పెద్ద ఆడ హిట్లరు. మా వార్డులో మా ఫాదరికి అది మంచి సపోర్టరు. ఈ బ్రౌన్ పాంటు గాడి ఇంటిదగ్గిర దాని గేదెల్ని కడుతుందది. "అలా కట్టకూడదు; రోడు మీద అది పబ్లిక్ న్యూసెన్స్" అంటాడు వీడు. అది వింటుందా? వినదు. జర్మనీవాడు జెకోస్లొవేకియాని తినేసినట్లు తినేస్తుంది. వీడు అర్జీలు పెట్టేడు సంతలో లచ్చికి గాజులు! ఎవడు వింటాడు? తగువు ముదురుతోంది. ఇందాట్లా నేను బయల్దేరి వస్తూంటే మనవాడు గేదెతో యుద్ధం చేస్తు న్నాడు."

"గేత్తో దెబ్బలాటా?" అని ఆశ్చర్యపోయింది ప్రేమ్.

"గేత్తో దెబ్బలాట పెట్టుకున్నాడు. అపును."

"గేత్తో దెబ్బలాటెందుకు పెట్టుకున్నాడు?" అని అమాయకంగా అడి గింది ప్రేమ్.

"వాడో దున్నపోతు అయివుండాలి! లేకపోతే ఎందుకు పెట్టు కుంటాడు?" అని నవ్వేడు రంగారావు.

చిన్న చిరునవ్వు నవ్వకుండా ఉండలేక పోయింది మిస్ ప్రేమ్.

రంగారావు ఆక్కుండా చెప్పుకుపోయాడు:

"మా బ్రౌన్‌పాంటుగాడు ఓ చిన్న కమ్మల కుటీరంలో ఉన్నాడు. దానిముందు కబ్బన్ పార్కో—లాల్‌బాగో అనుకుంటాడు వాడు - అటువంటి ఉద్యానవనం వేసేడు. అందులోకి రాజమ్మ ఇందాట్లా తనగేదెని పంపించింది. కోరే పంపించింది. కాశ్మీర్‌లోకి పాకిస్తాన్‌వాడు సాయుధ దుండగీళ్ళని పమ్మించినట్టు ఓ పెద్ద కాశీగేదెని కొమ్ముల్తోసహా పమ్మించింది రాజమ్మ. దాన్ని తరమబోయి, పరిగెట్టి వెళ్ళి పేడలో కాలువేసి దుబ్బున పడ్డాడు మన బ్రౌనుపాంటు హీరో. ఆ తరువాత లేచి దగ్గిరిగావె త్తే అ గేదె వాడి మీదికి కొమ్ము విసిరింది. అప్పుడు వాడి పనిపిల్ల పరిగెట్టుకొచ్చి గేదెని "షో" అంది. గేదె పోయింది. అదీ సంగతి!"

"అంతా చెప్పి, "మరింక మనకి టైమయింది ప్రేమ్!" అన్నాడు రంగారావు.

"ఇంతకీ అతనికి దెబ్బలేం తగల్లేదుకద?!" అంటూ లేచి నిల్చుంది గిరిజ.

గిరిజ అక్కడే ఉన్నదన్న సంగతి మిగతా ఇద్దరూ మర్చిపోయి నట్టున్నారు, ఆమె మాట వినిపించగానే ఇద్దరూ ఆమె వైపుచూసి, తరవాత ముఖముఖాలు చూసుకున్నారు.

గాయాల గురించి తనకంటే గిరిజే ముందుగా ప్రశ్నించినందువల్లనో ఎందువల్లనోగాని మిస్ ప్రేమ్ కొంచెం చిరాకుపడి:

"అవునన్నట్టు, అతనికి పెద్దదెబ్బ లేవైనా తగిలేయా?" అని తనుకూడా అడిగింది.

"అబ్బే! పెద్ద దెబ్బలేం తగిల్నట్టులేదు" అన్నాడు రంగారావు.

పెద్ద దెబ్బలు తగలనందుకు అతను విచారిస్తున్నాడనిపించింది గిరిజకి.

"పెద్దదెబ్బలు తగల్లేదు, నేనే రిక్షా పిల్చి వాణ్ని రిక్షా ఎక్కించి ఇలా ఒచ్చేను. వాణ్ని లేవ నెత్తడంతో నా బట్టలుకూడా ఖరాబ్ అయేయి. ఇంటికి వెనక్కి వెళ్ళి మళ్ళీ స్నానంచేసి బట్టలు మార్చుకొని వచ్చేసరికి లేట్ అయింది. గేదె కథ ఇంతటితో సమాప్తం!" అని చెప్పి మందస్మితు డయేడు రంగారాయుడు.

"అతను మీ ఫ్రెండా?", అని ఎటో ముఖంపెట్టి అడిగి, మరోసారి టైం చూసుకొంది ప్రేమ్.

"అబ్బే! మా కంపెనీలో పనిచేస్తున్నాడంతే, వాడు నాకు ఫ్రెండేమిటి?!" అని ఆశ్చర్యపోయేడు రంగారావు, గేదెలతో పోట్లాడేవాళ్ళు తనకి స్నేహితులు కారు కారన్నట్లు.

"మీ ఫ్రెండ్ అయినా కాకపోయినా పెద్దదెబ్బలేం తగల్లేదుకద! ఐ యామ్ గ్లాడ్‌దెన్! అబ్బా చాలా టైం అయింది. రాయ్! న్యూస్ రీల్స్ అవుతా యీ పాటికి" అంది మిస్ ప్రేమ్, ఓ సారి గిరిజవైపుచూసి.

"నాకు పనుంది పద్మా, నే నొస్తాను. సినీమాకి మీరు వెళ్ళండి" అంది గిరిజ.

"నకిలీ ప్రేమ బావుంటుంది రిజ్జీ!" అంది ప్రేమ, తనకి గిరిజకూడా సినిమాకి రావాలని ఎంతగానో ఉన్నట్టు.

"నన్ను ఎక్స్‌క్యూజ్ చెయ్యి పద్మా" అనేసింది గిరిజ.

"ప్రేమ్! నే నైతే స్కూటర్‌మీద వెళ్ళి ఉండనా?" అన్నాడు రంగారావు.

"ఎందుకూ? మాకార్లో పోదాం. దార్లో గిరిజని డ్రాప్ చేసేవచ్చు కూడాను, సినీమానించి రిటర్న్‌లో నీ స్కూటర్ తీసుకుపోదువుగాని" అంది గిరిజ.

ఆమెతో తను కార్లో వెళ్ళడం కంటె, ఆమె తనతో స్కూటర్ మీద వస్తే బావుండునని రంగారావుకి అనిపించినా కార్లో వెళ్ళడం -

"ఓ యస్! ఇట్ విల్ సూట్‌మి!" అన్నాడతను.

అతన్తో సినీమాకి వెళ్దాం అని నిశ్చయించు కున్నాక, అక్కడికి వెళ్ళే తొందర ఎక్కువయి పోయింది మిస్ ప్రేమకి. పిక్చర్లో, జినాలోలో కంటె ఆమెకి రాక్‌హడ్సన్‌ని చూడాలనే కాంక్ష ఎక్కువయింది. ఆమెకి ఎందుచేతనోగాని హాలీవుడ్ ఆడతారలకంటె మగతారలంటే ఎక్కువ ఇష్టం.

కార్లో ముగ్గురూ కూర్చొనేసరికి ఏడుగంటలయింది. సిటీ లైబ్రరీ దగ్గర గిరిజని డ్రాప్ చేసేసింది ప్రేమ్.

గిరిజ బైటకి దిగి, రంగారావుతో -
"ఏఁవండీ! ఆయన పేరు ప్రసాద్ కదండీ?" అని అడిగింది.

"ఎవరి పేరు?" అని ప్రేమా, రావూ ఇద్దరూ ఓకేసారి అడిగేరు.

"కొంచెం దెబ్బలు తగిలేయని ఇందాట్లా చెప్పేరుకదా - అతని పేరు" అంది గిరిజ.

"ఓ దట్ ఫెలో ? ఎస్ ! ప్రసాదే ! భవానీ శంకరప్రసాద్ వాడి పేరు. లంబాచౌడా ప్రసాద్ అంటాం మేఁవంతా" అని చిరునవ్వు నవ్వేడు రంగారావు.

"థాంక్సండీ ! వస్తాను; పద్మా, గుడ్‌నైట్ !" అని గబగబ నడిచి వెళ్ళింది గిరిజ.

"లంబా చౌడా పేరు" వినగానే గిరిజ ముఖం ఎందుకు వివర్ణం అయిందో రావ్‌కీకాని, ప్రేమకీకాని తెలియలేదు. ఆమె ముఖం వివర్ణం అయిందని వారు గమనించనేలేదసలు.

గిరిజని డ్రాప్‌చేసి, చిటారు కొమ్మని (మామిడిపండుకాదు) మిఠాయి పొట్లం చూసి అటు రెక్కలు మళ్ళించిన చిలకలా, "నకిలీ ప్రేమ" వైపు కారు మళ్ళించింది మిస్ ప్రేమ. ఆ ఉత్సాహంలో ఆమె అన్ని బాధలూ మర్చిపోయింది.

శాంతమ్మ జీవితంలో ఒక ఇరవైనాల్గు గంటలు-
అందులో మండుటెండా కారుచీకటి-అందులోనే
ఈదురుగాలీ హోరునవర్షం-అందున రోగం ఎంతో
ఘోరం-అందులో కొవ్వెక్కిన కమలాలు, మత్తె
క్కిన మధుపాలు-ఆ కళాతపస్వినీ రసపిపాసులమధ్య
"అగ్గిగా" కేకలేసిన శవం - అందుల మరణం
(కొన్నాళ్ళకి) పునరపి (అశా) జననం - అందుల
దైవం, ఉంటేనేం? లేకుంటేనేం?

# 4

శాంతమ్మకి, చిన్నప్పుడు, కణతమీద వాతపెట్టేరు. అది చెరగని ముద్రగా అలా నిలబడే ఉంది. ఆ రోజు గుర్తుకూడా అలాగే ఆమె మనసులో నిల్చిపోయింది. ఆ రోజునాటికి రెండేళ్ళక్రితంగా శాంతమ్మకి పెళ్ళయింది. ఆ రోజుకి సరిగ్గా ఏడాదిక్రితం ఆమె కాపురానికి అత్త వారింటికి వచ్చింది. ఆ రోజుకి ఆమెకి సరిగ్గా పధ్నాలుగేళ్ళు నిండేయి. ఆ రోజు ఆమెకి ఇప్పటికీ జ్ఞాపకం ఉంది. ఆ రోజుని ఆమె ఎన్నటికీ మర్చిపోజాలదు. ఆమె మెదడొక చిత్రాలయమైతే అందులో ఆ చలన చిత్రం ఎప్పటికీ ఉండిపోతుంది.

ఆవేళ పొద్దున్నే లేచేసరికి ఆమె కెదురుగా ఓ ఎలకని కరుచుకొని ఓ బూడిదరంగు (చారల చారల) పిల్లి గదిలోంచి బైటకి పరిగెట్టింది. చూసి అసహ్యించుకొని నిలబడిపోయింది శాంతమ్మ. ఆ పిల్లికూడా సగం బెదురుతో వంకరగా ఆగి, ఆమెపైపు క్రూరంగాచూచి, ఆమెని అసహ్యించుకున్నట్టుగా ముఖంపెట్టి బైటకి వెళ్ళిపోయింది.

ఆ రోజు పొద్దున్నే వీధి అరుగుమీద కూర్చొని పళ్లు తోముకొంటోన్న మామగార్ని పాలమనిషి, "పాలు పుచ్చుకోగలవుగాని డబ్బిచ్చుకోలేవా? పాలు కక్కు, లేకపోతే డబ్బు కక్కు!" అంటూ ఓ దులుపు దులిపేసింది. మామగారు పళ్ళు తోముకొని, స్నానం చేసి వీధిలోకివెళ్ళి, మళ్ళీ మధ్యాహ్నంవరకూ ఇంటికి రాలేదు.

ఆవేళ పొద్దున్న నీరెండలో పెరట్లో శాంతమ్మ నీళ్ళుతోడుతూంటే, నూతిపక్క కొబ్బరిచెట్టునుంచి నవనవలాడే కొబ్బరికాయొకటి రాలిపడింది. శాంతమ్మ ఆశగా వెళ్ళి చూస్తే, ఎరుపుడాలుతో మురుస్తూ ఆకుపచ్చగా మెరుస్తూందేకాని, అది దెయ్యం కొట్టిన కొబ్బరికాయ! దాన్ని చూసి శాంతమ్మ ఎందుకోగానీ జాలిపడింది. భయపడింది. దాన్ని నెమ్మదిగా ప్రాణంపోయిన పసిపిల్లని జారవిడిచినట్లు జారవిడిచింది. పెరటి వెనుక గోడ కూలిపోయింది. కూలినగోడ వెనకసందులో ఓ జబ్బు కుక్కని నాలుగు మురికి కుక్కలు కరుస్తూ వెంట తరుముతున్నాయి. నూతి పక్క మురుగులోంచి ఏనుగులాంటి ఓ పంది లేవగా కదిలి చెదిరిన మురుగుకంపు నూతిచుట్టూ గుప్పున కమ్ముకొంది. అంతలో హఠాత్తుగా ఓ గెద్దంతసైజు కారునల్లని కాకి వచ్చి దెయ్యపు కొబ్బరిమీద వాలింది. కొబ్బర్ని ముక్కుతో పొడిచింది. శాంతమ్మ వింతగా చూసింది.

ఆ దినం ఉదయం ఆ పెరట్లోకి చొచ్చుకువచ్చిన ఆ ఎండ నీరెండే కాని, అది భగ్గున మండుతోంది. "వానాకాలంలో ఈ ఎండలేవిటి? కలికాలం కాకపోతే!" అంది పక్కింటి పెరట్లోంచి ఓ ముసలమ్మ.

ఆ రోజున శాంతమ్మ బిందెత్తుకొని ఇంట్లోకి వచ్చేసరికి ఆమె పదేళ్ళ మరిది వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. ఇంగ్లీషు పుస్తకం తేక

పోతే క్లాసుకి రావద్దన్నాట్ట మాస్టరు. "ఉన్నట్టుండి ఎక్కణ్ణించి తేవడం చెప్పు? ఒక్క నాల్రోజులు ఆగరా అంటే చూడమ్మా ఎలా ఏడుస్తాడో! నేనేం చెయ్యన్చెప్పు!!" అంది అత్తగారు శాంతమ్మతో.

ఆ కుర్రవాడు గోడకి చేర్లబడి కూర్చున్నాడు. అంతవరకూ వెక్కి వెక్కి ఏడ్చినవాడు. వదినె చూసిందని సిగ్గుపడి, నిశ్శబ్దంగా ఏడవడం ప్రారంభించేడు. తెల్లగా పాలిపోయిన ఆ కుర్రవాడి ముఖం దుఃఖ తీవ్రతని అణుచుకోవడంలో, ఎర్రగా అతి ఎర్రగా కందిపోయింది. వికృతంగా మారిపోయింది. కడుపులోపలి ఏడుపు వేడికి ముఖమంతా మండుతోందా అనిపించింది శాంతమ్మకి. ఈ అనంత విశ్వంలో శతకోటి లోకాల్లో ఒక చిన్న భూగోళంమీద ఓ మారుమూల కుగ్రామంలో కూలిపోయే ఓ అతి చిన్న మిద్దెయింట్లో ఓ చిన్న చుక్కలాంటి పిల్లడికి ఓ చిన్ని పుస్తకం లేకపోయేసరికి చుక్కలోని చుక్కలాంటి అతని అతి చిన్న లేత మనసు ఎంతటి బాధతో కుమిలి ఎంతగా మండిపోయిందో ఆ పిల్లడి తల్లికి తెలుసు; శాంతమ్మకి తెలుసు; తెలిస్తే, భగవంతుడికి తెలుసు. ఆ రోజున శాంతమ్మ, బిందె దించుకొని, కుర్రవాణ్ణి, చెయ్యి పట్టుకొని, నడవలోకి తీసుకుపోయింది. వాణ్ణి అవతలకి తీసుకుపోవడంలో తన ఉద్దేశం వాడి కష్టం తీర్చడానికి కాదు. వాడితల్లి యాతన తగ్గించడానికన్చెప్పి శాంతమ్మకి ఇప్పటికీ గుర్తుంది.

నడవ గుమ్మానికి ఎదురుగా గదిలో నిల్చొని తలదువ్వుకొంటోన్న తన భర్త ఆ కుర్రవాణ్ణి ఉద్దేశించి, "మీ మాస్టార్తో నేను చెప్తాన్రా! భయపడకు! మీ మాష్టరు నిన్ను ఏఁవైఁనా అంటే వాణ్ణి కొట్టేస్తాను. ఎలా కొడతానో తెల్సా? ఇలా కొడతాను! అప్పుడు వాడు ఎలా ఏడుస్తాడో తెల్సా!", అంటూ ఆ మాస్టర్‌గారి ఏడుపు నటించి చూపించి తమ్ముణ్ణి నవ్వించడంకూడా శాంతమ్మకి గుర్తుంది. తను సంతోషంతో నవ్వటంకూడా ఆమెకి గుర్తుంది. ఆ సమయంలోనే - అలనాడు తన పెళ్ళినాడు తన పొరుగింటి సుబ్బలక్ష్మి "అబ్బ! నీ మొగు

చెంత బావున్నాడే" అని ముచ్చట పడినప్పుడు తను గర్వించడం, "ఛీ ! పోవే !" అంటూ స్నేహితురాల్ని కావిలించుకొని ఆనందాశ్రువులు రాల్చడం—అదంతా జ్ఞాపకంవచ్చి తన కళ్ళంట ఆనందాశ్రువులు రాలడం కూడా ఆమెకి గుర్తుంది. తన భర్త చాతుర్యంచూసి తను పొంగిపోడం కూడా ఆమెకి గుర్తుంది.

కాని, ఆ తరువాత వీధిలోకి వెళ్తూ "కాఫీ ఏది శాంతా ?" అని అడిగిన భర్త ఆరోజున పాలు లేకపోవడం గుర్తుకి తెచ్చుకొని బాధపడ్డం సిగ్గుపడ్డం శాంతమ్మకి ఎంతో బాగా గుర్తుంది. శాంతమ్మకి ఏదీ గుర్తు లేకపోయినా బావుణ్ను. కాని ఆమెకి అన్నివిషయాలూ జ్ఞాపకం ఉన్నాయి. భగవత్సృష్టిలో విచిత్రం ఏమిటి అంటే, "సంపదలున్నవారికి ఆపద మరపు లెక్కువ. దరిద్రులకి బాధల జ్ఞాపకా లెక్కువ" అని అనుకొంటూ ఉంటుంది శాంతమ్మ.

ఆ రోజు మధ్యాహ్నం ఒంటిగంటకి ఎండవేడి వజ్రపురాళ్ళని కరిగించేటంత వేడిగా కాలి మండుతోంది. పెరట్లో కాకులు కావు కావు మంటున్నాయి. ఆ శబ్దం వినో వినకో గాని శాంతమ్మ అత్తగారు "కాసేవాడు కనిపించడర్రా ! కనిపించడు !" అని లోలోపల నెమ్మదిగా గొణుక్కుంది. ఉదయం ఎలకనితిన్న పిల్లి, మధ్యాహ్నం, ఏపాపం ఎరగనట్టు నడవలో ఓ వార ముణుచుకు పడుకుంది. ఏమరుపాటున అటువైపు చూసిన శాంతమ్మ ఆ బూడిదరంగు చారను చూసి ముణుచుకు పడుకున్న పామేమోనని గతుక్కుమని భయపడి, కాసేపటికి తెప్ప రిల్లింది.

మగవాళ్ళింకా భోజనానికి రాలేదు. అత్తా కోడలూ అకల్తో గదిలో అలా కూర్చున్నారు. పెరట్లో ఎర్రచీరొకటి ఆరవేసి ఉంది. ఆ ఎర్ర చీరమీద పడే మండుటెండ ఆ చీకటి గదిని ఎరుపురంగుతో నింపు తోంది. గదంతా రక్తంతో తడిసిందా అనిపించి, ఒక్కరవ్వ భయం వేసింది శాంతమ్మకి.

అంతలోనే శాంతమ్మకి నీరసంగా నిద్ర వచ్చినట్టయింది. ఆ నిద్రలో ఆమెకి ఆ ఎండంతా వెన్నెలయినట్టుగా కనిపించింది. అందులో ఆ ఎర్రచీర ఆమె అలా చూస్తుండగా జరీ అంచు తెల్లచీరగా మారిపోయింది. గాలికి కదిలే ఆ జరీగీతలు వెన్నెల జాలులో ముత్యాల గీతల్లా మెరుస్తున్నాయి. ఆ చీర వెనక తను మెత్తగా దాగుంది. అది తొలగించి ఓ వెచ్చని నవ్వుముఖం ఆమె కళ్ళల్లోకి చూసింది. ఆ ముఖం చంద్రుడికంటే బావుంది. నవ్వు వెచ్చగా ఉన్నా చూపు ఎంతో చల్లగా వుంది. "నా నాథుడు ఎంత బావున్నాడు ! !" అనుకొంది తను. ఆమె భర్త ఆమెని దగ్గరగా తీసుకొని, "శాంతా ! శాంతా ! నేను కాశీరాజుకి మంత్రి నయేను. నాకు ఉద్యోగం వచ్చింది శాంతా ! అలా వెళ్దాం రా శాంతా !" అన్నాడు. అంతలో ఆ జరీ చీరె ముత్యాల పల్లకీగా మారిపోయింది. అందులో అతనూ తనూ కూర్చున్నారు. తను అతని వళ్ళో వెచ్చగా వాలిపోయి కరిగిపోయింది. పల్లకీ పరిగెడుతోంది. పరిగెడుతోంది. పరిగెట్టి పరిగెట్టి దబ్బున పడిపోయింది.

తుళ్ళిపడి లేచింది శాంత. ఆమె గుండెలు దడదడ దడదడమంటూ పాతకాలపు పిండిమిల్లు చప్పుడుతో కొట్టుకున్నాయి.

"చారుగిన్నె పిల్లి తోసేసింది శాంతా !" అంది పక్క కొట్లోంచి వచ్చిన అత్తగారు,

"అయ్యో" అంది శాంతమ్మ.

"ఇప్పుడే అలా వెళ్ళేను. అప్పుడే పిల్లి తోసేసింది. ఏంచేస్తాం" అంది అత్తగారు.

ఆమెకి పిల్లి యెడల కోపమూలేదు, చారు పోయిందన్న చింతా లేదు. జీవితాలు బద్దలైపోగా లేనిది చారుగిన్నె పడిపోతే శోకమెందుకు? అన్నట్టుగా ఉంది ఆమె తీరు.

శాంతమ్మ లేచి నిలబడింది.

"వాళ్ళింత వేగిరం ఎలానూరారు, నువ్వు భోంచెయ్యి శాంతా" అంది అత్తగారు.

"ఫరవాలేదత్తయ్యా, నేనుంటాను" అంది శాంత, తిరిగి కూర్చొంటూ.

"వేళ ఎంత అయిందో ఏఁవిటో?" అంది అత్తగారు.

గోడని కాలెండర్ తప్ప, గదిలో గడియారం లేదు. ఇంగ్లీషు తేదీలూ తెలుగు తిథులూ చూపించే ఆ కాలెండరు గోడని వంకరగా వేళ్లాడుతూ, వక్రించిన కాలంలా కనిపిస్తోంది. చిరిగిన గావంచా ఒకటి దండేన్ని వేళాడుతోంది. గోడకి చార్లబడి కూర్చొని ఆ గావంచా చిరుగులన్నీ లెక్కపెట్టింది శాంతమ్మ. అవి ఇరవైతొమ్మిదున్నాయి. చిరుగులు లెక్కపెట్టేక ఏం చెయ్యడానికీ తోచక ఎండలోకి చూస్తూ కూర్చొంది శాంతమ్మ. ఎదురుగా ఎండలో మండే ఎఱ్ఱచీర ఆమెకంటికి అదొక రాక్షసి నాలికలా కనిపించింది.

శాంతమ్మ కళ్ళు మూసుకుంది.

అంతలో వీధి నడవలో అడుగుల చప్పు డయింది.

"శాంతా మీ మావగారికి కాళ్ళు కడుక్కొండికి నీళ్ళియ్యమ్మా!" అంది అత్త.

పెరట్లో ఎండలో గట్టుమీద ఓ పాత బాల్చీ చతికిలబడికూర్చుంది. అందులోని నీరు సిల్వరు చెంబుతోతీసి పట్టుకువెళ్ళింది శాంతమ్మ. ఎండకి నీరు సలసల కాగుతోంది. సిల్వరు చెంబుకి రెండువైపులా అతి చిన్న రంధ్రా లున్నాయి. రెండు చెవుల్లోంచి రక్తం చిమ్మినట్టు ఆ చెంబులోంచి దారి కడాకూ నీరు చిమ్మింది.

మామగారు యాభయ్యేళ్ళవాడు. సన్నగా పొడవుగా ఉండేవాడతను. ఆ సన్నటి శరీరాన్ని దాని పొడవు, నడుందగ్గిర వంచింది. కాళ్ళు కడుక్కున్నప్పుడుకాని భోజనం చేసినప్పుడుకాని జిడ్డుపట్టిన మడత మంచంమీద నడుం వాల్చినప్పుడుకాని అతను భార్యనికాని కోడల్నికాని

చూడలేదు. ఎవరితోనూ మాట్లాడలేదు. ఆ జిడ్డుకీ ఆ మకిలికీ ఆ చింకి గావంచాకీ, ఆ తిండికాని తిండికీ, ఆ వక్రించిన కాలానికీ అన్నింటికీ - భగవంతుడుకాదు, మరెవరూ కాదు-తనే కారణం అయినట్లు, తన భార్య తన పిల్లలు తన సంసారం తన వారందరి యెడలా తనేదో తీరని అపచారమూ ఘోరమైన పాపమూ చేసినట్టు, అతను ముఖం దించుకొనే ఉన్నాడు.

మధ్యాహ్నం రెండయింది.

శాంతమ్మ భర్త ఇంకా ఇంటికి రాలేదు. శాంతమ్మకి ఎందుకోగాని గాభరా వేసింది. వేళ ఎంతయుంటుందో భర్త ఇంకా ఎందుకు రాలేదో అని ఆమె గాభరా పడుతూండగా—

గప్పున గదంతా చీకటిమయమై పోయింది. ఆకలికి కళ్ళు చీకట్లే కమ్మేయో ! లేక తను చచ్చేపోతుందో తెలియక శాంతమ్మ గజగజవణికి పోయింది. గంటల తరబడి కాలిన కంచుకాగడా ఒక్కసారిగా ఆరిపోయి నట్టు అంతా ఎందుకలా అంధకారమయమై పోయింది ?

"చినుకులు శాంతా ! చినుకులు ! ఆరేసిన బట్టలు తియ్యమ్మా !" అంటూ అత్త కేకలు వేసింది.

శాంతమ్మ గబగబ పెరట్లోకి పరిగెట్టి తన పెనిమిటి చొక్కా, షెరాయి, తన చీరా, అత్తగారి చీరా, మామగారి పంచా అన్నీ పట్టుకుని తిరిగి గబగబ లోపలికి వచ్చేలోపున బట్టతడుపు చినుకులు పడ్డాయి. నడవలోకి వచ్చి అక్కడ నిలబడి ఆకాశంవైపు చూసి శాంతమ్మ భయ పడింది.

స్వచ్ఛమైన పుణ్య హిమాలయాలన్నీ అంతలేసి నల్లని పాపపు విష సర్పాలుగా మారిపోయి, అంత బరువుతోనూ ఆకాశంలో సుళ్లతిరుగుతూ, అంత బరువుతోనూ కిందకి దబ్బునపడి, అంత భూమినీ బద్దలు చేస్తాయా అన్నట్టుగా ఉన్నాయి మేఘాలు. ఈ బంగారు రాజునీ ఆ చినుగుల పేదని ఈ ఒక్క పసివాణ్ని ఆ ఒక్క పండు ముసల్ని మాత్రం లాక్కుపోడానికి

కాకుండా, లోకం అంతటినీ ఒక్కసారే లాక్కుపోవడానికి వచ్చిన యమ పాశాల సమూహంలా ఉన్నాయి ఆ మబ్బులు. చచ్చిన కోటానుకోట్ల నిర్భాగ్యుల పగలాగ, మండిపోయిన వాళ్ళ దేహాల పొగలాగ, సమస్త భగవత్సృష్టికీ ఆఖరిదశలాగ ఆ మేఘాలు మిక్కిలి భయంకరంగా ఉన్నాయి.

ఆ మేఘాలవైపు చూస్తూ శాంతమ్మ వజవజ వణికింది.

"చలిగాలి శాంతా! చలిగాలి! అలా నిల్చుంటే నలత చేస్తుం దమ్మా లోపలికిరా!" అంది అత్త. బట్టలన్నీ గదిలో ట్రంకు పెట్టెమీద పెట్టి భర్తకోసం ఎదురుచూస్తూ వీధి గుమ్మంలో కూర్చుంది శాంతమ్మ.

హోరుమని ఈదురుగాలి ప్రళయనాదంతో పరిగెడుతోంది. గుడ్డి దీపాన్ని పైరుగాలి ఆర్పేసినట్టు ఆ గాలే ఆ సూర్యుణ్ని ఆర్పేసిందా అన్నంత జోరుగా, హోరుగా గాలి వీస్తోంది. భోరున కురిసే వర్షధారలు ఆ గాలి ధాటికి ఒక వైపునుంచి రెండో వైపుకి భయపడి ప్రవహిస్తు న్నాయి. ప్రవహించే మహాసముద్రంలో ప్రపంచం అంతా మునిగి పోయిందా అనిపిస్తోంది అలా చూస్తూంటే.

వీధిలోకి ఆ మహా వర్షప్రవాహంలోకి చూస్తూ కూర్చున్న శాంతమ్మ ఒక్కసారిగా అదిరిపడి నిల్చుంది. ఆ ప్రళయంలో వంటరిగా కొట్టుకొంటూవచ్చే తన భర్తని చూడగానే ఆమెకి గుండె ఆగిపోయినంత పనయింది. ఉప్పెనలాంటి ఆ వర్ష ప్రవాహంలో తడిసి ముద్దయిపోయి పెనుగాలికి వెనక్కి తూల్తూ ముందుకి వంగుతూ, ఈదుకొంటూ, ఈదు కొంటూ తూల్తూ తూల్తూ వీధి నడవలోకి వచ్చి పడ్డాడు శాంతమ్మ భర్త.

నడవలోకి రాగానే లాల్చీ పైజామా పిండుకొని, తొడల మధ్య రెండు చేతులూ జోడించి దాచుకొని వంగొని వణుకుతూ ఉండిపోయే డతను. అతనికి ఇరవయ్యేళ్ళున్నప్పటికీ ఎంతో సన్నంగా నీరసంగా ఇంకా చిన్నవాళ్ళా కనిపించేడు ఆ సమయంలో.

పరిగెట్టికెళ్లి గావంచా పట్టుకువచ్చి అతని కిచ్చింది శాంతమ్మ. ఆమె అత్తా మామా కూడా గుమ్మంలోకి వచ్చి,

"ఎందుకలా తడిసిపోయేవురా? ఎక్కడైనా కాసేపు నిల్చోలేక పోయావా!" అన్నారు.

అతను తల తుడుచుకొంటూ

"ఎండకి నీడపట్టు దొరకనట్టే. మనకి వానకి పొడిజాగాకూడా దొరకదు" అన్నాడు.

తల తుడుచుకోడంలో ఒక్క తుడుపుకే ఆ పల్చని గావంచా తడి ముద్దయిపోయింది.

"వాడికి వేగిరం పొడిబట్టలియ్యి శాంతా," అంది అత్తగారు.

ట్రంకుమీద పెట్టిన అరిన బట్టల దగ్గరికి పరిగెట్టింది శాంతమ్మ. తీయబోయేసరికి ఆ బట్టలు ఆమె చేతికి చల్లగా తగిలేయి. తీయడానికి ఆమె మెడమీద నీటిధార మంచుధారలా పడింది. చూర్లోంచి నీరుదిగి ఆ బట్టలన్నీ తడిసేయి. అది పట్టుకొని బిక్కు బిక్కు చూస్తూ నిలబడి పోయిందామె.

"ఫరవాలేదు శాంతా, ఇలా ఇయ్యి", అని ఆ బట్టలే తీసుకొని, "అబ్బే, అతి కొంచెం తడిసేయంతే!" అని అవే కట్టుకున్నాడు శాంతమ్మ భర్త. అతను విప్పిన బట్టలు పిడిచి దండేన్ని ఆరవేసింది శాంతమ్మ.

గదంతా చిట్టచీకటిగా ఉంది. ఈదురుగాలికి వర్షపుతుంపర వీధిలోంచి గదిలోకి పొగలాగ వస్తోంది. వీధంతా నిర్మానుష్యంగా ఉంది. చలిగాలి జవజవ వణికించేస్తోంది. ఆ వర్షానికి, ఆ గాలికీ, ఆ చలికీ, ఆ తన కొడుకు తడిసి ముద్దయి పోడానికీ అన్నింటికికూడా తనే కారణం అయి నట్టు తండ్రి తల దించుకొని మంచంమీద కూర్చున్నాడు. ఈ లోకంలో ఇన్ని బాధ లనుభవించేను. మరింక యమలోకంలో ఎన్ని అనుభ వించాలో?" అని చితిమీద కూర్చొని చింతించుకొనే శవంలా ఉన్నా డతను.

"అబ్బాయి తలార బెట్టుకుంటాడు. కొంచెం నిప్పు చెయ్యగలవా శాంతా!" అంది అత్తగారు.

"ఏం అక్కర్లేదు"-అంటూ ఓ మూలనుంచి చాపతీసి అది పరు చుకు పడుకున్నాడు, శాంతమ్మ భర్త.

"అదేవిఁట్రా? భోజనం చెయ్యావా ఏఁవిఁటి?" అని అడిగింది తల్లి.

అతను మానసికంగా ఎంత బాధ పడుతున్నాడని శాంతమ్మకి తెలుసు. దగ్గరగా వెళ్ళి అతణ్ని బుజ్జగించా లనిపించిందామెకి. అన్ని అపాయలనుండీ కాపాడుతూ అతణ్ని కౌగలించు కోవాలనిపించిదామెకి. అతని అసహాయతని గుర్తించిన ఆమెకి కళ్ళంట నీళ్ళు తిరిగేయి. పురాణ కథల్లో చెప్పినట్టు భగవంతుడు ఆ చీకట్ని చీల్చుకొని ప్రత్యక్షమవుతే: "అయ్యో! ఎంత పాపుండును!" అనిపించిందామెకి. ఆ ఇంట్లోని ఆ దుఃఖం ఆ బాధా అంతా పోడానికి ఏదో ఒక మహాద్భుతం జరగాలి జరగాలని ఆమె ఎంతగానో దేముణ్ని ప్రార్థించింది.

"భోంచెయ్యను, నాకు ఆకల్లేదు. చలేస్తోంది!", అన్నాడు తల్లి ప్రశ్నకి జవాబుగా కొడుకు.

"ఆకల్లేకపోవడం ఏఁవిఁట్రా?"

"నాకు ఒంట్లో బాగులేదు"

శాంతమ్మ వెళ్ళి అతని వళ్ళు ముట్టుకొని చూసింది సలసల కాగు తోంది.

చలిగాలి ఎక్కువయింది. వర్షం ఎక్కువయింది. పిడుగులుపడ్డం ఎక్కువయింది. అంతటా చీకటి ఎక్కువయింది. గుండెలకి బాధల బరువు ఎక్కువయింది. మనసులో విపరీతమైన ఆందోళన ఎక్కువయింది.

—మడత మంచం మీంచి మామగారు లేచిపోయారు.

"మంచంమీద పడుకోరా నాయనా?" అని తల్లీ తండ్రీ బతిమి లాడేరు.

"ఫరవాలేదు. ఇక్కడే పడుకుంటాను" అన్నాడు శాంతమ్మ భర్త.

అంతా బలవంతం చేయగా చివరకతను మంచంమీద పడుకున్నాడు. అతని వళ్ళు కాలిపోతోంది. మంచంమీద హడావిడిగా పక్కవేసి అతనికి దుప్పటికప్పి కాళ్ళదగ్గిర కూర్చొంది శాంత.

"నువ్వు భోంచేసేవా?", అని అడిగేడతను.

లేదండి, అతని తల్లి.

శాంతా ఆవిడాకూడా భోజనం చేస్తేనేగాని అతను పడుకోనన్నాడు.

అత్తాకోడలూ ఆకుల్లో వడ్డించుకొని నాలుగు మెతుకులు కతికేరు. శాంతమ్మ మజ్జిగ అన్నం తింది. అది ఆమెకి హితవుకాలేదు. అన్నంపిండి పారేసి మజ్జిగ మాత్రం కొంత తాగింది. ఆ మజ్జిక్కి పులుపు తక్కువ: అది తాగుతూంటే, ఉప్పగా తన కన్నీళ్ళే తను తాగుతూన్నట్టుగా అనిపించింది శాంతమ్మకి.

తరువాత ఆమె మంచంమీద కూర్చొని భర్తకాళ్ళు వళ్ళోపెట్టుకొని పట్టనారంభించింది. అతనికాళ్ళు ఎర్రగా వేడిగా కుంపట్లో కాల్చి తీసినట్టుగా ఉన్నాయి. శాంతమ్మకి ఎంతో దుఃఖం వచ్చింది. నిర్జనమైన వీధిలో, ముంచెత్తే వర్షంలో ఇళ్ళని లేపుకుపోయే ఈదుఋగాలిలో ఏకాకిగా అసహాయంగా ఈత్తూ ఈత్తూ వచ్చిన భర్తరూపు ఆమె కళ్ళకి కట్టి ఆమెకి ఏడుపొచ్చింది. ఆ ఏడుపులో ఆమె భగవంతుణ్ని తల్చుకొంది. కారాగారంలో రామదాసుకి రాములవారు కనిపించినట్టుగా ఆ చీకటి గదిలో తమ యెదుట భగవంతుడు ప్రత్యక్షమయి తననీ తన భర్తనీ అక్కడ ఉన్నవారందర్నీ చూసి చిరునవ్వు నవ్వి, "భయపడకండి, మీకు మేలవుతుంది." అని దీవిస్తున్నట్టుగా ఆమె కొంతగా ఊరటచెందింది. భయంలేదు. భగవంతుడున్నాడు. నా భర్తని, నన్ను, మా అందర్నీ కాపాడతాడు" అని ఆమె తన మనసుని శాంత వరచుకొందికి ఎంతో ప్రయత్నంచేసి కొంతగా సఫలీకృతురాలయింది.

శాంతమ్మ ఉలిక్కిపడింది.

"వర్షం తగ్గకపోతే తమ్ముడు బళ్ళించి ఎలా వస్తాడు?"

భగవద్ధ్యానంలో ఉన్న శాంతమ్మ తుళ్ళిపడింది.

సాయంకాలం మూడుగంటలయింది. గదిలో హరికేన్ లాంతరు వెలుగుతోంది. వర్షం తగ్గలేదు. సముద్రంలా ఘోషిస్తోంది.

తమ్ముణ్ణీ, డాక్టర్నీకూడా నేను వెళ్ళి తీసుకొస్తాను. నువ్విలా పడుకో", అన్నాడు తండ్రి.

"డాక్టరక్కర్లేదు. రేపటికి తగ్గిపోతుంది" అన్నాడు కొడుకు.

శాంతమ్మకి చాలా భయంవేసింది. అకస్మాత్తుగా అక్కడికి ఏ వైద్యుడైనా వస్తే బావుండుననిపించింది. ఆమెకి, ఎందుకోగాని, ఆ సమయంలో తన అమ్మ నాన్నా అక్కడికి రావాలనిపించింది. అలా ఆలోచిస్తూ వుండగా ఆమెకి తన అక్కరూపు గుర్తుకువచ్చి కళ్ళంట నీళ్ళు గిర్రున తిరిగేయి. ఆ రోజున జరిగిన హడావిడి, గాభరా, కేకలు నిశ్శబ్దం ఏడుపు-నల్లని మంత్రసాని, అక్కవేసిన పెనుకేకలు, ఆ కేకలు నిల్చిపోయిన ఘోరమైన నిశ్శబ్దం, ఆ వెంటనే ఇంట్లోని ఏడుపులు, పక్కకి శాంతంగా వాలిపోయిన అక్కముఖం, గుడ్డలోచుట్టిన శిశువుశవం-అన్నీ తల్చుకొని ఆమెకి ఏడుపొచ్చింది.

తల దించుకొని, ముక్కుతుడుచుకొని, కాగిపోయే భర్త కాళ్ళు తొందర తొందరగా పడుతూ, "డాక్టర్రావాలి" తండ్రీ, దేవుడా, డాక్టర్రావాలి డాక్టర్రావాలి" అంటూ ఆమె భగవంతుణ్ణి తీవ్రాతితీవ్రంగా ప్రార్థించింది.

కొద్ది నిమిషాలయేక, తను ఎంతగా సంతోషంతో ఉప్పొంగిపోయింది!!!

అంతటి మహాద్భుతం భగవంతుడే జరిపించేడనుకొంది. తమ కష్టాలన్నీ ఆనాటితో మరింక తీరిపోయాయే అనుకొంది. దీనులయెడల అంత దయచూపించిన ఆ భగవంతుడి కాళ్ళు పట్టుకొని అతను "బతకమంటేనే బతుకుతాను. అతను చచ్చిపొమ్మంటే చచ్చేపోతాను" అనుకొంది. భక్తితో ఆనందంతో ఆమె పరవశురాలయింది. భక్తి పారవశ్యంలో భగవంతుణ్ణి తల్చుకొని ఆమె అమిత వినమ్రురాలయింది.

ఆమె మొరవిని ఆ భగవంతుడే పంపించేడా అన్నట్టుగా ఆ వర్షంలో ఆ ఇంటిముందు ఓ జట్కాబండి ఆగింది. రెండు తడిసిన నల్లజోళ్ళు,

"నువ్వు భోంచేసేవా?", అని అడిగేడతను.

లేదంది, అతని తల్లి.

శాంతా ఆవిడాకూడా భోజనం చేస్తేనేగాని అతను పడుకోనన్నాడు.

అత్తాకోడలూ ఆకుల్లో వడ్డించుకొని నాలుగు మెతుకులు కతికేరు. శాంతమ్మ మజ్జిగ అన్నం తింది. అది ఆమెకి హితవుకాలేదు. అన్నంపిండి పారేసి మజ్జిగ మాత్రం కొంత తాగింది. ఆ మజ్జిక్కి పులుపు తప్పవ! అది తాగుతూంటే, ఉప్పగా తన కన్నీళ్ళే తను తాగుతూన్నట్టుగా అనిపించింది శాంతమ్మకి.

తరువాత ఆమె మంచంమీద కూర్చోని భర్తకాళ్ళు వళ్లోపెట్టుకొని పట్టనారంభించింది. అతనికాళ్ళు ఎర్రగా వేడిగా కుంపట్లో కాల్చి తీసినట్టుగా ఉన్నాయి. శాంతమ్మకి ఎంతో దుఃఖం వచ్చింది. నిర్జనమైన వీధిలో, ముంచెత్తే వర్షంలో ఇళ్ళని లేపుకుపోయే ఈదుఱుగాలిలో ఏకాకిగా అసహాయంగా ఈత్తూ ఈత్తూ వచ్చిన భర్తరూపు ఆమె కళ్ళకి కట్టి ఆమెకి ఏడుపొచ్చింది. ఆ ఏడుపులో ఆమె భగవంతుణ్ని తల్చుకొంది. కారాగారంలో రామదాసుకి రాములవారు కనిపించినట్టుగా ఆ చీకటి గదిలో తమ యెదుట భగవంతుడు ప్రత్యక్షమయి తననీ తన భర్తనీ అక్కడ ఉన్నవారందర్నీ చూసి చిరునవ్వు నవ్వి, "భయపడకండి, మీకు మేలవుతుంది." అని దీవిస్తున్నట్టుగా ఆమె కొంతగా ఊరటచెందింది. భయంలేదు. భగవంతుడున్నాడు. నా భర్తని, నన్ను, మా అందర్నీ కాపాడతాడు" అని ఆమె తన మనసుని శాంత వరచుకొందికి ఎంతో ప్రయత్నంచేసి కొంతగా సఫలీకృతురాలయింది.

శాంతమ్మ ఉలిక్కిపడింది.

"వర్షం తగ్గకపోతే తమ్ముడు బణ్ణించి ఎలా వస్తాడు?"

భగవద్ధ్యానంలో ఉన్న శాంతమ్మ తుళ్ళిపడింది.

సాయంకాలం మూడుగంటలయింది. గదిలో హరికేన్ లాంతరు వెలుగుతోంది. వర్షం తగ్గలేదు. సముద్రంలా ఘోషిస్తోంది.

తమ్ముణ్ణీ, డాక్టర్నీకూడా నేను వెళ్ళి తీసుకొస్తాను. నువ్వలా పడుకో", అన్నాడు తండ్రి.

"డాక్టరక్కరలేదు, రేపటికి తగ్గిపోతుంది", అన్నాడు కొడుకు.

శాంతమ్మకి చాలా భయంవేసింది. అకస్మాత్తుగా అక్కడికి ఏ వైద్యుడైనా వస్తే బావుండుననిపించిందామెకి. ఆమెకి, ఎందుకోగాని, ఆ సమయంలో తన అమ్మా నాన్నా అక్కడికి రావాలనిపించింది. అలా ఆలోచిస్తూ వుండగా ఆమెకి తన అక్కరూపు గుర్తుకువచ్చి కళ్ళంట నీళ్ళు గిర్రున తిరిగేయి. ఆ రోజున జరిగిన హడావిడి, గాభరా, కేకలు నిశ్శబ్దం ఏడుపు-నల్లని మంత్రసాని, అక్కవేసిన పెనుకేకలు, ఆ కేకలు నిల్చిపోయిన ఘోరమైన నిశ్శబ్దం, ఆ వెంటనే ఇంట్లోని ఏడుపులు, పక్కకి శాంతంగా వాలిపోయిన అక్కముఖం, గుడ్డలోచుట్టిన శిశువుశవం-అన్నీ తల్చుకొని ఆమెకి ఏడుపొచ్చింది.

తల దించుకొని, ముక్కుతుడుచుకొని, కాగిపోయే భర్త కాళ్ళు తొందర తొందరగా పడుతూ, "డాక్టర్రావాలి" తండ్రీ, దేవుడా, డాక్టర్రావాలి డాక్టర్రావాలి" అంటూ ఆమె భగవంతుణ్ణి తీవ్రాతితీవ్రంగా ప్రార్థించింది.

కొద్ది నిమిషాలయేక, తను ఎంతగా సంతోషంతో ఉప్పొంగిపోయింది!!!

అంతటి మహాద్భుతం భగవంతుడే జరిపించేడనుకొంది. తమ కష్టాలన్నీ ఆనాటితో మరింక తీరిపోయాయే అనుకొంది. దీనులయెడల అంత దయచూపించిన ఆ భగవంతుడి కాళ్ళు పట్టుకొని అతను "బతకమంటేనే బతుకుతాను. అతను చచ్చిపొమ్మంటే చచ్చేపోతాను" అనుకొంది. భక్తితో ఆనందంతో ఆమె పరవశురాలయింది. భక్తి పారవశ్యంలో భగవంతుణ్ణి తల్చుకొని ఆమె అమిత వినమ్రురాలయింది.

ఆమె మొరవిని ఆ భగవంతుడే పంపించేడా అన్నట్టుగా ఆ వర్షంలో ఆ ఇంటిముందు ఓ జట్కాబండి ఆగింది. రెండు తడిసిన నల్లజోళ్ళు,

ఓ తడిసిన తెల్లపంట్లాం, తడిసిన ఓ రంగుకోటు-వాటితో శాంతమ్మ ఆడ బడుచు పెనిమిటి జట్కాలోంచి దిగేడు. అతను వైద్యుడు.

భగవంతుడికి వెయ్యివేల నమస్కారాలుపెట్టి నిట్టూర్చింది శాంతమ్మ.

ఓ తోలు పెట్టెతో ఓ మందుల సంచితో అతను లోనికి వచ్చేడు. అతను వచ్చేసరికి ఇంట్లో అందరికి చలికాలంలో సూర్యుడుదయించినట్టని పించింది.

"రా, రా! ఏం! ఉత్తరం వైనా రాయలేదేం వచ్చేముందు?"

అతను పనిమీద సిటీకి బస్సులో వెళ్తాంటే దార్లో ఇంజిను చెడి బస్సు ఆగిపోయిందట.

"అదృష్టం బావుండి సరిగ్గా ఈ వూరి దగ్గిర ఆగింది. మరెక్కడో అయితే చచ్చి ఉందును."

అతను కూర్చుందికి కుర్చీ ఇచ్చేరు. తుడుచుకొందికి తువ్వాలిచ్చేరు. పెట్టె తెరిచి అతను చాకింటి బట్టలు తీసివేసుకొనేలోపున ఎన్నెన్నో కుశల ప్రశ్న లడిగేరు. అన్నం రెడీగా వుంది భోంచెయ్యమన్నారు.

శాంతమ్మ భర్తకూడా నవ్వుతూ లేచి నవ్వుతూ కూర్చున్నాడు.

"జ్వరమా? అహా?! ఆ ఎప్పుడొచ్చింది?" అంటూ చెయ్యిచూసి, దుస్తులు మార్చుకున్నాక అతణ్ని జాగ్రత్తగా పరీక్ష చేసేడు అతని బావ, దర్మామీటరు 103. 5 చూపించింది.

"ఫరవాలేదు. మనవాళ్ళు బడివేట జ్వరం అంటారు చూడు, అటు వంటి దయుండవచ్చు. రెండు ఎ. పి. సి మాత్రలు అందాకా వేసుకో. రేపొద్దున్నే చూదాం. యువిల్ బి ఆల్‌రైట్, కాని, నువ్వుచాలా నీరసంగా ఉన్నావోయ్, బాగా తినాలి నువ్వు, ఏవైనా టానిక్స్ కూడా తీసుకోవాలి." అన్నారు బావగారు.

శాంతమ్మ భర్త నీరసంగా నవ్వేసేడు. బావ ఇచ్చిన రెండు మాత్రలూ అతను వేసుకున్నాక శాంతమ్మ మనసు ఇంకొంచెం తేలికయినట్టయింది. ఆమె దేవుడికీ ఎన్నో దండాలు పెట్టేసుకొంది. బావ రాకతో ఆ ఇంటికి వెచ్చదనం వచ్చినట్లయింది. అతను వక్కు కాచుకొందికని

గదికి గా వెచ్చదనం

వచ్చిందికూడాను. దైట [illegible] కూడా కొంతగా తగ్గింది. మామగారు తువ్వాల్లో తల [illegible] కొని చెంబులో పోయించుకొని నాలుగు కప్పుల కాఫీ పట్టుకువచ్చేడు. బావా మరిదీ కుంపటిదగ్గర కూర్చొని కబుర్లు చెప్పుకొంటున్నారు. మరో కుంపటిమీద అత్తగారు అన్నం పడేసింది అల్లుడికి వేడివేడి అన్నంకోసం.

"ఆగిపోయిన రెయిలుబండి మళ్ళీ స్టార్టయినట్టుంది బావా! నువ్వొస్తే మా యిల్లు!" అన్నాడు శాంతమ్మ భర్త.

భర్త అలా అన్నందుకు శాంతమ్మ ఎంతో మురిసిపోయింది. కుంపట్లో బొగ్గుల ఎరుపులో అతనిఛాయ మెరుస్తోంది. అతని ముఖం బంగారమూ రాగీ కలిపి అందంగా అచ్చుపోసినట్టు కనిపిస్తోంది. జ్వరంతో ఉన్నప్పటికీ కూడా అతనెంతో ఉత్సాహంగా ఉదయకాంతిలో చల్లగాలిలా ఎగిరే బంగారపు జెండాలా తళ తళ మంటున్నాడు. ఆ సమయంలో భర్తని ఎంత చూసినా శాంతమ్మకి తనివితీరలేదు. అతణ్ని కౌగిలించుకోవాలనీ, అతని గుండెల్లో తల దాచుకోవాలనీ అనిపించిందామెకి. అతని మెత్తని చెంపలు నిమరాలని ఆమె ఉవ్విళ్ళూరింది. ఆమెకి ఆ సమయంలో సన్నజాజులూ, మల్లెతీగెలూ, కొబ్బరితోటలూ, మావిడిపూతలూ, వెండివెన్నెల్లూ బంగారు ఎండలూ, చల్లని మంచినీటి కాలవలూ మెత్తని చక్కని పచ్చికబయళ్ళూ, రంగుల ఉదయాలూ, సాయంకాలపు చల్లని రంగులూ, చక్కని వెన్నెన్నో జ్ఞప్తికి వచ్చేయి. తనకి చక్కని కొడుకు పుట్టినట్లూ ఆ పిల్లడు తండ్రిలాగే ఎంతో అందంగా అతి ముద్దుగా ఉన్నట్టూ, కిలకిల ముత్యాలనవ్వు నవ్వినట్టూ ఊహించుకోవడంతో ఆమె మేను వింతగా పులకరించింది.

కాని, అంతలోనే - ఓ వనదేవతలారా, ఓ నదీనదములారా! తరులారా! ఓ గిరులారా! ఓ సూర్యచంద్రులారా! ఓ అష్టదిక్పాలకులారా! ఓ బ్రహ్మ విష్ణు మహేశ్వరులారా! దీనజనబాంధవులారా! అంతలోనే ఎందుకంత మెత్తని చిన్నని బ్రతుకులో అంత నిప్పులపంట? అంత చిన్న సుందర స్వప్నంలో ఎందుకంత భీభత్సం? అంత లేతగూటిలో ఏమిటా విషనాగు? అంతటి దీన హృదయాల్లో ఎందుకా భీకరనరకం?

శాంతమ్మభర్త కుంపటిదగ్గర కూర్చొని కబుర్లు చెప్తూ చెప్తూ-

"అన్నట్టు, బావా! అడుగుదాం అనుకొంటూ మర్చిపోయేను. ఈ కుడికాలిదగ్గిర ఇక్కడ చూద్దూ! ఆ మధ్య చిన్నదెబ్బ తగిలింది రక్తం కారేకకాని దెబ్బ తగిలిందని తెలియలేదు. ఏదేదో అనుకున్నాను. దెబ్బ మానిందనుకో, కాని, చూద్దూ! ఇక్కడ గట్టిగా గిల్లితే మెల్లిగా నొప్పెడుతుంది! గమ్మత్తుగా ఉంది బావా!" అన్నాడు.

అప్పుడు శాంతమ్మ భర్త నవ్వుతూనే ఉన్నాడు. అదే అతను ఆఖరిసారి నవ్వడం.

"గమ్మత్తుగా ఉండడం అంటే ఎలా ఉంది?" అని అడిగేడు అతని బావ.

"ఎలా ఉందంటావా?" అని ఆలోచించి "తిమ్మిరెక్కినప్పుడు ఉంటుంది చూసేవా? అలా ఉంటోంది బావా!" అన్నాడు శాంతమ్మభర్త.

తన నొప్పిగురించి ఆలోచించి అదినొప్పికాదు తిమ్మిరని తెలుసుకున్నప్పుడుమాత్రం అతని బంగారుముఖం పాదరసం పూసుకున్నట్టయిపోయింది. బావ ముఖం కూడా వివర్ణం అయిపోయింది. ఇంట్లో అంతా ఎక్కడివారక్కడ అలా ఉండిపోయేరు.

నడవలోకి తీసుకెళ్ళి జాగ్రత్తగా పరీక్ష చేసేడు వైద్యుడు.

తిమ్మిరితో బయల్దేరే రోగం ఏ పెద్దరోగమో ఇంట్లో ఎవరికి తెలియదు! గదిబైట పరీక్ష జరుగుతూన్నప్పుడు గదిలో ముగ్గురూ ప్రతిమల్లా- నిర్జీవ ప్రతిమల్లా నిలబడిపోయేరు. మిన్నువిరిగి మీద పడుతుం

పనుకున్నారు. పడదు పడదనుకున్నారు. అమ్మో పడుతుందేమో అను కున్నారు. అయ్యో పడిపోకూడదు పడిపోకూడ దనుకున్నారు.

కాని, గదిలోకి తిరిగివచ్చిన వైద్యుడి ముఖం చూస్తే ఏం జరిగిందో ఏం జరగబోతోందో అందరికీ అర్థమయింది.

"అద్బే ! అదేంకాదు. ఫరవాలేదు మరేం గాభరాపడకు. అయినా పరవాలేదు కొత్తగుండు లున్నాయి. అయినా అది పరవాలేదు. నేనుండగా నువ్వు భయపడకు ! నాతో రా."

అంటూ అతను నడవలో శాంతమ్మ భర్తతో నెమ్మదిగా చెప్పడం గదిలో అందరికీ వినిపించింది.

బైట, వర్షం ఆగింది. ోసారి పిడుగులవర్షం కురిపించేముందు సేనలన్నీ కూడగట్టుకున్నట్టు, మబ్బులన్నీ దట్టంగా కూడగట్టుకొంటూ నరనాగళ్ళు కొంతసేపు ఆపేయి. సాయంకాలం అయిదు అవొసోంది. చీకటిమాత్రం అప్పుడే ముంచుకొచ్చింది.

నడవలోని అంధకారంలోంచి గదిలోకి వచ్చిన వైద్యుడి ముఖం విచారంతో వికృతంగా మారిపోయింది, నూతిలో నీళ్ళూరినట్టు అతని కళ్ళల్లో నీళ్ళూరుతున్నాయి.

అంతవరకూ వక్రించిన కాలం ఆ క్షణంలో శాంతమ్మకి పూర్తిగా కొంతసేపు స్తంభించిపోయింది. ఆ తరువాత నెమ్మదిగా కదిలి ఆ వెంటనే ప్రళయవేగంతో సుడితిరిగింది. పొంగిన ఏటినీరు, ముందుగా అరిపాదాలకి చల్లగా తగిలి అలా చూస్తూండగా పెరిగి పెరిగి ఒక్కసారిగా ఇల్లంతా ఊరంతా ముంచేసినట్టు ఆమెలో ప్రవేశించిన దుఃఖం నిలువెత్తు పెరిగి ఆమెని ముంచేసింది. ఆమెలోంచి పొంగి ప్రవహించింది. ఆమె కడుపులోని శిశువు కడుపులోనే కాలిపోతూన్నట్టు, ఆమెని పుట్టించిన భగ వంతుడు ఆమె మెడకొరికి రక్తం పీల్చుకొంటూన్నట్టు, ఆమెని నిలువునా నరికి నరనరాన్నీ విడివిడిగా నేలని రాసినట్టు, లోకంలోని అన్ని మబ్బులూ అన్ని మంటలూ ఒక్కసారే తనలో ప్రవేశించినట్టు. పీడ కలలన్నీ నిజ

మయి తన యెదుట నిల్చొని వికవిక నవ్వినట్టు, తన పాలన్నీ ఎవరో మురుగునీటిలోపోసి తనని పరిహసించినట్టు. తను వేసుకున్న ఆశాలలని సుందరసుమాలకి బదులు ఔత్రులు పూసినట్టు, పాములు కాసినట్టు ఆమె విలవిల్లాడిపోయింది. ఆమె మనసంతా పొగలు చిమ్మి చివరికి భగ్గున మండింది. ఆమె నిలువునా కూలిపోయింది.

కాని ఆమె అంతలోనే లేచి పరిగెట్టి నడవలోకివెళ్ళి అక్కడ వెక్కివెక్కి అతిచిన్నపిల్లాళ్ళా ఏడ్చే భర్తని కుంపటి నిప్పుల్లో పడిపోయిన కొడుకుని కౌగలించుకున్నట్టు-జాలిగా ఎంతోజాలిగా కౌగలించుకొంది; కొరికేసే మంచుగాలికి గజగజవణికే కొడుకుని అత్తుకున్నట్టు అతణ్ని గట్టిగా కౌగలించుకొంది.

ఆమె అతనికోసం ఏడ్చింది. ఇంత చిన్న ప్రాణాన్ని ఇంత అమాయకుణ్ని, మెత్తగా ముట్టుకొంటేనే అదిరిపడే ఈ లేత నరాల పోగుని ఎందుకింత బాధపెట్టేవు? ఎందుకిలా నిప్పుల్లో తోసేవు?

ఉడుకుతూన్న నూనె వంటినిండా వలికిపోయిన పిల్లళ్ళా ఏడుస్తున్నాడు ఆమెభర్త.

"అయ్యయ్యో ఏడవకండి! ! నేను నేను శాంతని! ("నిప్పుల సాక్షిగా వచ్చినదాన్ని. మీ అర్ధాంగిని మీ చరణదాసిని!") ఈ బాధ మీది కాదు నాది! నాది!" (మిమ్మల్ని ఇంతగా బాధించి ఇంత యాతనలో తోసేయడానికి దేవుడికైనా సరే హక్కులేదు! ఇది న్యాయంకాదు! ఇది ధర్మంకాదు!! "అయ్యయ్యో! ఏడవకండి! ! దేవుణ్నయినా సరే దిక్కరించి మిమ్మల్ని కాపాడు కొంటాను?" (భగవంతుడు మిమ్మల్ని ఏ చీకటి అడవిలో ఏ చిక్కులు పెట్టినా ఏ బండరాళ్ళకింద ఉక్కిరి బిక్కిరిగా ఎంతగా అణిచిపెట్టినా మిమ్మల్ని నిర్ధయగా ఏ పాముల చెరువుల్లోకి ఏ నిప్పుల, నూతుల్లోకి. ఏ మహా విషప్రవాహంలోకి తోసేసినా) "మిమ్మల్ని నేను తెచ్చుకుంటాను! ! భగవంతుణ్ని ధిక్కరించి మిమ్మల్ని

నేను బాగుచేసుకుంటాను! : మీ ప్రాణాలకి ప్రాణాలరిస్తాను! ! అయ్యయ్యో ఏడవకండేడవకండి! !”

అంటూ వలవల ఏడ్చింది శాంతమ్మ.

అంతవరకూ గోడవారకూర్చొని ఏడ్చిన శాంతమ్మభర్త ఆమెఏడుపు విని లేచినిల్చున్నాడు! అతన్ని ఏదో ఆవాంఛ [illegible] వేశం వచ్చింది. ఒక్క ఊపున, తనని తను నరికేసుకున్నట్టు! అతను భార్యనుండి వేరయేడు.

“ఒద్దు శాంతా! నన్ను ముట్టుకోవద్దు!! నాన్నా నన్నుతాకకు అమ్మా నన్నుచూడకు! రాకండి! నా దగ్గరకెవరూ రాకండి!! నా బట్టలు, నా పుస్తకాలు, నా చాప తలగడ, నా దుప్పటి, నా దేహం, నా జీవితం, నా సమస్తం పట్టుకువెళ్ళి కాల్చేయండి. నన్నెవరూ తాక్కండి! : ఒచ్చేవా తమ్ముడూ!! అయ్యో తడిసిపోయేవురా! వెళ్ళి తుడుచుకో! నన్నుచూసి ఏడవకు! బావొచ్చేడు! నవ్వు! ఎగురు! గెంతు! నువ్వు మాత్రం నాలా ఏడవకెన్నటికీ, ఏడవకు! వెళ్ళి తుడుచుకో! నా తువ్వాలు ముట్టుకోకు! దాన్ని పురుగులుంటాయి! అయ్యో తమ్ముడూ నన్నలా చూడకు! ఈ ఇంట్లో ఉండకు! నువ్వు అమ్మా నాన్న శాంత అంతా ఈ యిల్లు వదిలే యండి. నేను మసిలిన ఈ యింటికి నిప్పెట్టి తగలెట్టండి. భస్మం చేసే యండి! మీరంతా ఎక్కడికైనా పారిపోండి! శాంతా, నువ్వు మీ యింటికి వెళ్ళిపో! శాంతా! ఈ క్షణంనుంచి నేను నీ భర్తనికాను. నాకు ఏ బరువు ఏ బాధ్యత ఏ ప్రేమా ఏ అభిమానం ఏ సంసారం ఏ జీవితం ఏదీలేదు. అయ్యో శాంతా! భగవంతుడు నిన్ను అమ్మని నాన్నని తమ్ముణ్ని-భగవం తుడు-నాక్కాదు-మీ కెంత అన్యాయం చేసేడు! : అయ్యో శాంతా ! మన నీతి నిజాయితీలు మనల్ని కాపాడవు! పాతివ్రత్య మహిమలు, మన ఏక పత్నీవ్రతాలు ఏవీ మనల్ని కాపాడవు! మన ఉపవాస దీక్షలూ మన నిత్య సత్య వ్రతాలూ మనల్ని కాపాడవు! మన పూజ, మన భక్తి, మన సత్యం, మన న్యాయం, మన ధర్మం, ఏదీ మనల్ని కాపాడదు! మన భగవంతుడే

మనల్ని కాపాడడు! ! అయ్యో శాంతా! నన్ను ముట్టుకోకు! ! నా దగ్గరకి రాకు! రావద్దు నా దగ్గరకెవరూ రావద్దు!

అంటూ అతను ఏదో శక్తి ఆవహించిన వాళ్ళా కేకలువేసి ఇంట్లోంచి వీధిలోకి చీకట్లోకి పరిగెట్టి వెళ్ళిపోయేడు. అతని చుట్టూ కుంభ వృష్టిగా వర్షం కురవసాగింది. ఆ రాత్రల్లా అలానే కురిసింది వర్షం.

ఆ మర్నాడు మబ్బులు విడ్డాయి. చీకట్లు తొలగేయి. సూర్యుడు రాజుగార్లా గంభీరంగానూ నవాబ్‌గార్లా బద్ధకంగానూ ఉదయించేడు. ఊరవతల చెరువు గట్టున చెట్లమీద పక్షులు, పిక్‌నిక్‌లో పెద్దింటి ఆడపిల్లల్లా కిలకిల మన్నాయి. కొవ్వెక్కిన కమలాలు అ చెరువులో పట్టిగ్గా సిగ్గు విప్పుకు వికసించేయి. మత్తెక్కిన మధుపాలు పిచ్చి పిచ్చి పాటలు పాడుతూ వాటిచుట్టూ తిరిగి తిరిగి వాటిమీద వాలేయి. చెరువులో తామరాకులమీది నీటి బిందువులు మాయ వజ్రాలు మెరిసినట్టు పాలరాతి మందిరాల్లో దొంగ సన్యాసులు మురిసినట్టు మెరిసి మురిసేయి. ఎవరో గొప్ప చక్రవర్తి తనప్రియురాలితో రహస్యంగా చూసుకొండికీ ఆనందించుకొండికీ వీలుగా ఎవరో గొప్ప కళాకారుడు చిత్రించిన శృంగారచిత్రంలా అక్కడ అదంతా మోహనంగా మనోహరంగా ఉంది. వాటన్నింటిమధ్యా అక్కడ ఆ చెరువులో తెప్పగా తేలిన శాంతమ్మ భర్త శవంమాత్రం ఆ ప్రకృతి సౌందర్యాన్నంతటినీ అసహ్యంగా పాడుచేసింది.

అరే అల్లా! ఒరే అబ్రహాం! రేరే భగవాన్! మీరంతా శుష్క దండగ—

అన్నట్టుగాఉంది ఆ చచ్చిన ఆసామీముఖం.

అలా చచ్చినవాళ్ళ ముఖాలు అలా ఉండక ఇంకెలా ఉంటాయి? !

ఆ దెబ్బకి ఆ తరవాత ఆ పిచ్చికలగూడు దాదాపు ధ్వంసం అయిపోయింది. శాంతమ్మ పుట్టింటికిపోయి కొన్ని నెలలు మతిచెడి పక్షవాతం వచ్చినట్టు పడిపోయింది. మరో మూణెల్లకి ఆమె మామగారు కన్ను

మూసేడు. ఆమె అత్తగారు చిన్నకొడుకుని తీసుకొని కూతురింటికిపోయి ఆర్నెల్లు తిరక్కుండానే అక్కణ్నించి కాటికిపోయింది. ఆమె చిన్న కొడుకు అక్కయింట్లో ఓ ఏడాదిపాటు వుండి అక్కడ అక్క కొడుకుతో ఓ నాడు దెబ్బలాడి, అక్క చీవాట్లు పెడితే ఏడ్చి దానిమీద తిరగబడి ఇల్లువదిలి పారిపోయి ఎక్కడున్నాడో ఎవరికీ తెలియకుండా పోయేడు.

భర్త పోయేప్పటికి కాంతమ్మకి పధ్నాలుగేళ్ళు అప్పుడే నిండేయి. మరో ఆర్నెల్లకి ఆమెకి మగశిశువు జన్మించేడు. ఆ కుర్రవాడి పేరు భవానీశంకర ప్రసాద్.

రాధా మాధవ ప్రణయము - ప్రేమ పద్మజ, పద్మజే ప్రేమ అను పరమ సత్య నిరూపణ - సెస రట్టు లేనిదే కాఫీ కొట్టే కానట్టు "ప్రేమలేనిదే ప్రపంచమే లేద''ను కవిగారి మధురవాక్కు - పొడియాంతో హాపీవాలీ పిక్‌నిక్ - అక్కడి ప్రళయ దృశ్యమే ప్రణయమునకు నాంది యగుట - నకిలీ ప్రేమలో మిస్ ప్రేమ కలత చెందుట.

# 5

"నకిలీప్రేమ" చూస్తూ కూర్చొని మిస్ ప్రేమ తీవ్రంగా ఆలోచించ నారంభించింది.

రికమెండేషన్‌మీద ఉద్యోగం సంపాదించి మిగతా అర్జీదార్లకి పెట్టుతీసిన ఉన్నతాధికారులు కుర్చీల్లో గొప్ప దర్జాగా కూర్చోగలరు. ఆ విధంగా రంగారావు మిస్ ప్రేమ పక్కన చాలా దర్జాగా కూర్చున్నాడు. తెరమీద అప్పర్‌క్లాస్ జీనాలోలోని చూసి రాక్ హడ్సన్ అప్పర్‌క్లాస్ నవ్వులు నవ్వుతున్నాడు.

మిస్ ప్రేమా బి. సెన్ అని అంతా అంటారు - అంతేకాని ఆమె పేరు ప్రేమకాదు; పద్మజ. ఆమె తనకి పందొమ్మిదే యేళ్ళంటుంది. కాని ఆమె తల్లి చనిపోయే ఇరవైమూడేళ్ళయింది. చైర్మన్ భీమసేనరావు గార్ని ఊళ్ళో తెలియనివారెవరూ ఉండరు. అలాగే, పద్మజకి "ప్రేమ"

అంటే ఎంతో ఇష్టం అనే సంగతి కూడా ఊరందరికీ తెలుసు. అలాగే మిస్ పద్మజ ఫైర్మన్‌గా రమ్మాయనే సంగతి కూడా అందరికీ తెలుసు.

రుక్మిణీదేవి ప్రేమించింది, సత్యభామాదేవీ ప్రేమించింది; అదే విధంగా శ్రీకృష్ణుణ్ని అనేకమంది ప్రేమించేరు. కాని కొద్దో గొప్పో "కల్చర్" ఉన్నవారెవరైనా సరే రాధామాధవుల ప్రేమనే ఎక్కువగా ఆమోదిస్తారు. అందులో ఆత్మ పరమాత్మల సమైక్యతా, ఐక్యతకోసం వాటి ఉన్మాదం - అవేకాకుండా ఇంకా అనేకమైన సొగసులు చూడగలరు వాళ్ళు.

భీమసేనరావుగారికి మగపిల్లలేరు. ఆ ఇంటికి పద్మజే ఆడపిల్ల, పద్మజే మగపిల్లడు. ఆ మధ్యవరకూ ఆమె రూపం కూడా అలానే ఉండేది. ఆడపిల్లలా ఉండాలో, మగపిల్లడిగా ఉండాలో తెలియక పోడంతో ఆమె శరీరం కర్రలా చాలాకాలం వికారంగా ఉండిపోయింది. ఆమె ముద్దుగానే పెరిగింది కాని అద్దంముందు పెరగలేదు. అందంగా ఉన్నా లేకపోయినా సంఘంలో ఆమెకి ప్రాముఖ్యంగా ఆదరణకూడా సర్వత్రా లభించేది. ఆమెకి అందం అవసరం లేకపోయింది.

రెండేళ్ళక్రితం వాళ్ళ కాలేజీకి ఓ అందమైన కవి వచ్చేడు. అతని కావ్యాలు కొన్ని ఇంగ్లీషులోకి తర్జుమా అయేయిట. అతను స్టేజెక్కి గంభీరంగా ఉపన్యసించడమే కాకుండా శ్రావ్యంగా పాటలుకూడా పాడేడు. అతనికి నలభై ఏళ్ళ వయసు, నాలుగుమూరల జుట్టు, నాజూకైన ముఖం, అతను రాధగురించి ఆ రోజున ఇచ్చినటువంటి ఉపన్యాసం ఎంత చక్కగా వుందో చెప్పలేం. రాధామాధవుల ప్రేమగురించి అతను ఆవేశంతో మాట్లాడాడు. వేణునాదం యమునాతరంగం, మలయమారుతం, ఇందు కిరణం, రాధాకృష్ణ ప్రణయం - ఇటువంటి వాటిగురించి అతను లాడూ, పకోడీ, బూందీ, జిలేబీ, కోవాబిళ్ళ గురించి చెప్పినట్టు చెప్పేడు. అంతా చెప్పి చెప్పి ఆఖర్న అతను "ప్రేమే ప్రపంచం, ప్రపంచమే ప్రేమ!" అని ఖండితంగా చెప్పి, పెసరట్టు లేకపోతే కాఫీకొట్టే కానట్టు, "ప్రేమ లేక

పోతే ప్రపంచమే లేదు!" అని ఖచ్చితంగా చెప్పి కూర్చున్నాడు. విద్యార్థినీ విద్యార్థులంతా పడపడమని చప్పట్లు కొట్టారు.

రాధా మాధవుల గురించి ఆ ఉపన్యాసం విన్నాక పద్మజపూర్తిగా మారిపోయింది. జీవితపు రహస్యాలూ పరమార్థాలూఅన్నీ ఆమెకి ఆరోజున ఒక్క నిమిషంలో తెలిసినట్టయిపోయింది. తన జీవితపు అనుభవాలన్నీ నెమరువేసుకుంటే ఆమెకి కవిగారు చెప్పినదంతా "అవును, నిజం" అనిపించేసింది. ప్రేమకంటే ముఖ్యమైన పదార్థం మరొకటి ప్రపంచంలో లేనేలేదనే నిశ్చయానికి ఆమె వచ్చేసింది.

ఆయేడు కాలేజీ వక్తృత్వపు పోటీల్లో ఆమె ప్రేమ గురించి చాలా ఆవేశంగా మాట్లాడింది. ఎన్నో విషయాలు చెప్పి చివరకి ఆమె ప్రేమే లేకపోతే భగవత్సృష్టిలేదు మానవత్సృష్టి లేదు అని ఆఖరి పాయింటుగా చెప్పి కూర్చుంది. ఆమెకి ఆ పోటీలో ఫస్టుప్రయిజురావడం ఆమె "ప్రేమ"గా ప్రఖ్యాతి పొందడం ఆ రోజే జరిగేయి.

ఆ తరువాత చాలా రోజులకి ఆమె ఒకసారి "సావిరహే తవ దీనా రాధా" అనే పేరుతో ఒక అందమైన తైలవర్ణచిత్రం చూడ్డం తటస్థించింది. అందులో యమునానదీ తీరాన్న పూపొదరింట్లో విరహావస్థలో ఉన్న రాధ అతిచక్కగా రంగులు రంగులుగా చిత్రించబడింది. పరమాత్మ కోసం, జీవాత్మపడే వేదనకంటే అందునా ఒక ప్రౌఢ ఒక పురుషుడి కోసం పడే వేదన ఎక్కువగా కనిపిస్తోంది. అందులోనూ ఆవేదన తన పురుషుడికోసం కాకుండా పరపురుషుడికోసం అని గుర్తుకి వచ్చిన మిస్ ప్రేమ చాలా ఉత్సాహంతో ఉప్పొంగింది. భర్తగల రాధ ఒక "డాషింగ్ యంగ్‌మాన్ లైక్ క్రిష్ణ" గురించి అన్నింటికీతెగించడం ఆమెకి ఆశ్చర్యకరంగాను, "ఎక్సైటింగ్"గానూ తోచింది.

ఆ రాత్రి ఇంటికి వచ్చి గదిలో అద్దం ముందు నిల్చుంది పద్మజ.

అద్దంలో తన నీడ ఆమె కంటికి ఆ చిత్రంలోని రాధ బొమ్మలా కనిపించింది. కళ్ళల్లోనూ, అలంకరణలోనూ తేడా ఉంది తప్ప "నాకూ రాధకీ తేడానే లేదు!" అనిపించింది పద్మజకి.

తనకీ రాధకి తేడా లేదని గుర్తించేసరికి మిస్ ప్రేమకి వళ్ళంతా విద్యుల్లతలు పాకినట్లయింది. ఆ రాత్రి ఆమెకి నిద్ర పట్టలేదు. పట్టేక తెల్లవారేవరకూ కళ్ళనిండా అలా కలలు కదుల్తూనే ఉన్నాయి. ఆరోజున, మిస్ ప్రేమ-

పెరవరింట్లో పచ్చికమీద పరచిన తామరాకులమీద వెచ్చని కలలు కంటూ చల్లగా నిద్రపోతుంటే. ఆమెని వేణుగోపాలుడు చెయ్యిపట్టుకు లాగాడు.

ఆమె కళ్ళుతెరిచిచూస్తే ఎదురుగా హెడీయా, తన చెయ్యి పట్టుకొని మంచంమీద తన పక్కన నవ్వుతూ కూర్చుంది.

హెడీయా మిస్ ప్రేమకి బంధువు. ఆ మధ్యవరకూ దూరపు బంధువు. ఈ మధ్యనించీ చాలా దగ్గర బంధువు. హెడీయాకి పెద్ద చదువు లేదు. కాని ఏదో కంపెనీలో ఉద్యోగం ఉంది. ఊరినిండా ఆమెకి ఎక్కువ సరదాలు వున్నాయి. ఆమె అందంగా ఉంటుందనడం కంటే షోగ్గా ఉంటుందనడం సబబుగా ఉంటుంది. ఆమెకి ముప్పయ్యేళ్ళుండవచ్చు. లావుగా చామనచాయగా సెక్సీగా ఉంటుందామె.

"మాణింగ్ ప్రేమ్!" అంది హెడీయా.

"మాణింగ్ హెడ్డీ!" అంటూ బద్దకంగా లేచింది ప్రేమ.

"ఏంటి ప్రేమ్? ఇంకా పడకలోనే ఉన్నావేంటి? పిక్‌నిక్కి వెళ్దామనుకున్నాం మర్చిపోయేవేంటి! ఏంటి ప్రేమ్?" అంది హెడీయా.

హెడీయాకి ముద్దుగా మాట్లాడ్డం అంటె ఇష్టం. హాస్య చిత్రాలంటే ఇష్టం. తెల్లని మగవాళ్ళంటే ఇష్టం, నల్లద్దాలంటే ఇష్టం. నెత్తికి "స్కార్ఫ్స్" అంటే ఇష్టం. టాటా చీరియోలంటే ఇష్టం. జీవితంలో ఆమెకి పర్సులూ, నోట్లు, పాంట్లూ, కార్లూ, స్కూటర్లూ, మేడలూ, సోఫాలూ, సినిమాలు, ఐస్‌క్రీమ్‌లూ వగైరా వగైరాలంటే ఎంతో ఇష్టం. అవి కానివన్నీ ఆమెకి అయిష్టం.

హెడీయాకి మంచి చీరెలూ, పిక్‌నిక్‌పార్టీలూ అంటేకూడా ఎంతో ఇష్టం. ఆమె ఆ ఉదయం మంచి బిజీలో ఉంది పిక్‌నిక్ వెళ్దామని వచ్చింది.

ఆ రోజునుంచే మిస్ ప్రేమ మారిపోయింది. పిక్నిక్నుంచి వచ్చేక ఆమె అద్దం ముందు చాలాసేపు నిల్చుంది. తను ఆడపిల్లే అయినా తన శరీరం మాత్రం "మగ శరీరం"లా ఉండడం ఆమెకి నచ్చలేదు. ఆ రోజు నుంచి మూణ్నెల్లలోపున ఆమె బుగ్గలు నింపుకొంది. వక్షం పెంచుకొంది; నడుం తగ్గించుకొంది; సుఖంగా కూర్చొనేందుకు వీలుగా ఆసనం మెత్తన చేసుకొంది; చర్మాన్ని తెలుపూ నునుపూ చేసుకొంది. కళ్ళు? అవి మాత్రం మినహాయిస్తే ఆమె చాలా అందంగా మారిందనే చెప్పాలి.

ఆ రోజున చాలా విచిత్రమైన విషయం జరిగింది.

హెడియా పార్టీతో వెళ్ళడానికి మిస్ ప్రేమకి పెద్ద సరదా ఏమీ లేదు. హెడియా క్లబ్బు చాలా చిన్నక్లబ్బు, అందులో పెద్దింటి ఆడవాళ్ళెవరూ మెంబర్లుగాలేరు. మిస్ ప్రేమ వారితోపాటు ఎక్స్కర్షన్కి వెళ్ళిందంటే అది వాళ్ళకి గౌరవం కాని మిస్ ప్రేమకి మాత్రం అది గౌరవం కాదు. కాని, హెడియామాట తీసేయలేక వారితో ఆమె వెళ్ళింది.

వెళ్ళేముందు కొంచెం అయిష్టంగా వెళ్ళినప్పటికీ ఆ తరువాత అక్కడ వాతావరణం మిస్ ప్రేమకి బాగానే ఉన్నదనిపించింది. అక్కడ వారంతా ఆమెని చాలా ఎక్కువగా చూసుకున్నారు. హైస్కూల్ టీచర్ల మధ్య యూనివర్శిటీ ప్రొఫెసర్లా. గుమాస్తాల టీపార్టీలో డిప్యూటీ కలెక్టర్లా, ప్లీడరు గుమాస్తాల విందులో పెద్ద జడ్జిగార్లా, మిస్ ప్రేమకి ఆ రోజున చాలా ఎక్కువ మన్నన లభించింది. అడుగులకి మడుగులొత్తే నల్లవాళ్ళంటే తెల్లదొరలకి ఒక విధమైన అభిమానం ఏర్పడినట్లు ఆ నర్సులూ, టీచర్లూ, చిన్న సంసార్లూ అంటే ఆమెకి ఒక విధమైన అభిమానం ఏర్పడింది. తన సహృదయంతో వారందరి అభిమానమూ తను సంపాదించుకొన్నందుకు ఆమె చాలా గర్వించింది. " మనిషీ మనిషీ ప్రేమించుకొంటేనే మానవలోకం బాగుపడుతుంది; అప్పుడే ఈ లోకం స్వర్లోక

మవుతుంది!" అని కవిగారు మధురంగా పాటలుపాడి తమ ఉపన్యాసంలో చెప్పిన మాటలు "హబ్బ! ఎంత నిజం!"" అనిపించేయి మిస్ ప్రేమకి.

మిస్ ప్రేమ ఆ పిక్‌నిక్ రోజున "అ విధంగా ఎందుకు చేసింది?" అంటే జవాబు చెప్పడం కష్టం, యవ్వనంలో ఉండే శక్తి మనిషి నొక రకమైన దారిని మళ్ళిస్తుంది. కలలు కనేస్తారు, కోటలు కట్టేస్తారు, బొమ్మలు గీస్తారు, కథలు రాస్తారు, పాటలు పాడతారు, పాలయాపారం లోకి దిగుతారు, కిల్లీకొట్లు పెడతారు, సోల్జర్లవుతారు, సర్వసంగ పరిత్యాగు లవుతారు, ద్వైతమో అద్వైతమో తేల్చుకొందికి పోతారు- యవ్వనంలో అనేక రకాల పనుల్లోకి వ్యాపారాల్లోకి, రంగాల్లోకి, యుద్ధాల్లోకి ఉన్మాదాల్లోకి, అన్వేషణల్లోకి త్యాగాల్లోకి తెగింపుల్లోకి వీరపూజల్లోకి మహామృత్యువులోకి - ఎందులోకో ఒకందులోకి దిగితీరుతాడు మానవుడు. ఎందులోకిదిగినా దిక్కుపోయినా కాస్త తీరుబాటు ఉంటేచాలు కనీసం ప్రేమలోకైనా దిగుతాడు.

ఊరికి అయిదు మైళ్ళ దూరంలో ఉంది హాపీవాలీ. అక్కడికి హెడియా ప్రేమా కలిసి వెళ్ళేసరికి తొమ్మిదిగంట లయింది. మిగతా నర్సులూ, టీచర్లూ, చిల్లర సంసారులూ అంతాకూడా వారికోసం కాసుకూర్చున్నారు. వాళ్ళంతా చూస్తూండగా మిస్ ప్రేమతో తను కార్లో దిగినందుకు హెడియా చాలా గొప్ప పెట్టుకొంది. ఎడంచెయ్యి బారుగా పైకెత్తి వారందర్నీ దూరంనుంచే విష్ చేసింది. అమెరికన్ ప్రెసిడెంటుని దగ్గిరుండి తన దేశానికి తీసుకొని వచ్చిన చిన్న రాజ్యపు చవక ప్రెసిడెంటులా హెడియా గర్వంతో సంతోషంతో ఉప్పొంగింది.

శశి, సుందరి, కమల, శాంతి, లక్ష్మి, మేరీ, సరసీరుహం, విశాల, వసంత, లక్ష్మి, వరలక్ష్మి, సుబ్బలక్ష్మి, వెంకటలక్ష్మి, రాజ్యలక్ష్మి, జయలక్ష్మి —

"అబ్బ! ఇంతమంది లక్ష్ములుంటే ఇంక మనకి ఎక్కడికి వెళ్ళినా నక్సేసే!!" అంది మిస్ ప్రేమ.

అందుకు శశీ సుందరీ కమలా మేరీశాంతి వగైరాలు అంతమంది లక్ష్మలూ కలసి కిలకిల నవ్వేశారు.

ఆ తరువాత మిస్ ప్రేమ వారందరితోనూ కాఫీ తాగింది. వారిలో వసంత అనే అమ్మాయి ఓ ట్రాన్సిష్టరు పట్టుకు వచ్చింది. అందుచేత ఆమె తన స్టాటసు మిస్ ప్రేమకి కొంచెం దగ్గరయినట్టు భావించింది కాబోలు, ప్రేమని పట్టుకు వదలకుండా తిరిగింది. ఆ ట్రాన్సిస్టరు వసంతది కాదనీ ఆ వసంత ఆడబడుచుదనీ ప్రేమకి కమల రహస్యంగా తెలియ జేసింది. అలాగ్గే ఆ కమల ఆ విశాల కట్టుకున్న సిల్కు చీర తనదేనని ప్రేమకి తెలియజేసింది. ఇంకా అటువంటివి అనేక విషయాలు ప్రేమకి ఆ కమల తెలియచేసి ఉండును. కాని హెడియా ఆమెకి అవకాశం ఇవ్వకుండా ప్రేమని దూరంగా తీసుకుపోయింది.

ప్రేమని దూరంగా తీసుకుపోవడంలో హెడియా ఉద్దేశం ఆమెని తనకు ఇంకా దగ్గరగా చేసుకుందామనే కాని మరొకటి కాదు, ఆ కొండ లోయలో ఆ చల్లని తోటలో ప్రేమని అలా తీసుకుపోతూ ఆమె అలా తన తమ్ముణ్ని పొగుడుతూనే ఉంది. ప్రేమ ఊఁకొడుతూనే ఉందికాని ఆమె మనసులో ప్రేమా రాధా భావనలు తప్ప వేరేమీ మెదలడంలేదు. అమె అంతసేపూ పాత్రలోని ప్రేమ గురించే అలోచిస్తోంది తప్ప ఆ ప్రేమపాత్ర ఎవరికివ్వడం అనే విషయం గురించి ఆలోచించడంలేదు. తన ప్రేమ ఎవరికిస్తే వారు తన ప్రేమవల్లే పవిత్రం అవుతారని ఆమె ఉద్దేశం. ఎవరికి ఇవ్వాలి తన ప్రేమ అని ఆమె ఎన్నడూ నిర్ణయించుకో లేదు. హెడియో తమ్ముడికా? హైదర్ ఆల్లీకా? హిరణ్మయి అన్నకా? కాలేజీ టెన్నిస్ ఛాంపియన్ హిమ్మత్‌సింగ్‌కా? ఎవరికి?

ఎవర్ని ప్రేమించాలో ఆనాటివరకూ ఆమె నిశ్చయించుకోలేదు.

ఆ కొండలు ఒకదాన్నొకటి ఎంతగా ప్రేమించు కొంటున్నాయో, ఆ కొండల అంచుల్ని తాకే తెలిమబ్బులు ఆ కొండల్ని ఎంతగా ప్రేమిస్తు

న్నాయో, ఆ మూల తెలిమబ్బు ఏ ప్రేమ వేదనలో ఎప్పుడు హరించుకు పోతుందో, లోయలోని చెట్లని లోయలోని చల్లగాలి ఎంతగా ప్రేమి
ఆ మాధవీలత మావిడిచెట్టుని కాకుండా
ఆ నల్లమద్ది చెట్టుని ఎంతగా ప్రేమిస్తూంవో!" ఆ పువ్వుల్ని ఆ తేనెటీగలు ఎంతగా ప్రేమిస్తున్నాయో—

అవన్నీ పరీక్షించుకొంటూ, హెడియా చెప్పే తమ్మిడి వర్ణన వింటూ నెమ్మదిగా నడుస్తూవెళ్ళే మిస్ ప్రేమ-

ఆ రోజు పగలు పదిగంటలకి ప్రేమించుకొనే ఆ కొండలమధ్య ఆ ప్రేమించే మబ్బులకింద, ఆ ప్రేమింపబడే చెట్ల నీడలో, గుండె లద రగా కళ్ళు చెదరగా నిలబడి పోయింది.

ఆమెకి ఆ సమయంలో శిలలు కరిగించే ఏ వేణుగానమైనా విని పించిందా? ఆమెకి ఎదురుగా పొదరింటిలా పెరిగిన ఆ గుబురుచెట్ల నీడలో ఏ ప్రణయ దృశ్యమైనా కనిపించిందా?

ప్రతిమలా నిలబడిపోయింది మిస్ ప్రేమ. ప్రతిమని బిగియబట్టు కున్న ప్రతిమలా నిలబడి పోయింది మిస్ హెడియా.

యాభై గజాలదూరంలో వారికొక భయంకరమైన దృశ్యం కని పించింది.

పడగలెత్తి రెండు పాములు నిల్చున్నాయి. వాటి పడగలే మూడు అడుగుల ఎత్తుండవచ్చు వాటి కళ్ళనిండా విషమూ ఉంది. రౌద్రమూఉంది, వాటిచూపుల్లో పగా, పట్టుదల కనిపించడమే కాకుండా ఆ చూపుల్లో దొంగ తనమూ, టక్కరి తనమూ కూడా కనిపిస్తున్నాయి. అవి నిగనిగ మెరు స్తున్నాయి. పాలిష్‌చేసిన ఇనుముకి ప్రాణంవచ్చినట్టుగా అవి క్రూరం గానూ భయంకరంగానూ అందంగానూ అసహ్యంగానూ ఉన్నాయి. రెండు ఘోరమైన పాపాలకి రూపులు తీర్చిదిద్దినట్టు మంచుమీద రెండు మంటల నాలికలు లేచినట్టు ఆ నీడలో అవిలేచి నిల్చున్నాయి. వికృతి చెందిన ప్రకృతిలా, పీకలుచుట్టే దొంగలతల్లా, కరిచేనల్లనినీడల్లా, చంపడానికే బతికే మహా మృత్యురూపాల్లా అవి భయంకరంగానూ జుగుప్సాకరం గానూ నిలబడ్డాయి.

అవి రెండూ ఒకదానికొకటి పది పదిహేను అడుగుల దూరంలో ఉన్నాయి. వాటికి కుడిప్రక్కగా ఖాళీజాగా ఉంది కాని, మిగతా మూడు ప్రక్కలా-ఇరవై అడుగుల దూరంలో - మనిషి వెళ్ళడానికి వీలులేనంత దట్టంగా చెట్లచుట్టూ లతలు అల్లుకున్నాయి.

ఆ రెండు సర్పాలకీ పదిపదిహేను అడుగుల దూరంలో ఆ రెండింటికీ ఒకే దూరంలో పరుగు పందెంలోకి ఉరకడానికి సిద్ధంగా ఉన్నవాళ్ళా కొంచెం వంగొని నిశ్చలంగా ఉన్నాడొక యువకుడు. ఆ సర్పాల నతడు పరీక్షగా తీక్షణంగా చూస్తున్నాడు. బాంబు పేల్తుందా, పేలదా పిడుగు పడుతుందా పడదా, పులి దుముకుతుందా దుమకదా అన్నట్టుగా అ పాముల లోని నిశ్చలత్వమూ ఆ యువకునిలోని నిశ్చలత్వమూకూడా భయంకరంగా ఉన్నాయి. పకృతిలోని మానవత్వము రాక్షసత్వమూ ఎదురెదురుగా నిల్చున్నట్టుగా ఉంది ఆ దృశ్యం.

తెల్లగా ఉన్నాడు. అందంగా ఉన్నాడు తెల్లబట్టలు వేసుకున్నాడు. చేతిలో ఏ ఆయుధమూ లేకుండా ఉన్నాడు ప్రళయసర్పాల కెదురుగా వంటరిగా ఉన్నాడు.

అంతే గమనించింది పద్మజ.

ఒక నిమిషం అవలేదు కాని కొన్ని వేలయుగాలయినట్టుంది. అంతలో పద్మజ నిల్చున్న చోటున, పైనించి, ఒక ఎండుపుల్ల రాలింది.

ఆ ఎండుపుల్ల రాలేసరికి పిడుగు పడినట్టయింది. పద్మజ తుళ్ళి పడింది. కాని హెడియామాత్రం ఆ శబ్దానికి "అమ్మో" అని కేకవేసి పద్మజని విడిచిపెట్టి పడుతూ లేస్తూ పడుతూ లేస్తూ వెనక్కి పారిపోయింది.

పారిపోయే హెడియా వైపు చూసి మళ్ళీ ఆ పాములవైపు పద్మజ చూసేసరికి నల్లమబ్బుల్లో మెరుపు మెరిసినట్లనిపించింది ఆమె కంటికి.

ఒక్క క్షణం, ఒక్క లిప్త, ఒక్క సెకను అంతకో సగంలో సగం వ్యవధితో ఒక పాము తన పడగని ముందుకు విసరేలోపున ఆ యువకుడు ఎడమపక్కకి ఎగిరి ఉరికి మెరుపులా పరిగెట్టాడు.

ఏం జరిగిందో ఆగి ఆలోచించి తెలుసుకొనేసరికి పద్మజకి చాలా సేపు పట్టింది. ఆ యువకుడు పరుగెట్టుకొంటూ వచ్చి ఆకుని గాలి ఎత్తుకుపోయినట్టు పద్మజని చేత్తో పట్టుకులాగి తనతోపాటు పరిగెట్టించేడు. రాళ్ళు తీగెలు. గోతులు ఎం: తుపుకులు అన్నీ ఏకమయినట్టనిపించింది పద్మజకి.

ఎంతదూరం పరిగెత్తేరో పద్మజకి గుర్తులేదు. మరింక పరిగెట్టలేక ఆమె కాళ్ళు నిచ్చెన కాళ్ళలా అయిపోయాయి. ఆమె వగర్చుకొంటూ ఆగింది. ఆగి అక్కడొక పడిపోయిన చెట్టు మానుమీద కూర్చొంది. అతను ఆ మానుమీద కుడికాలుపెట్టి కొంచెం వంగి నిల్చొని ఊపిరి పీల్చి విడిచి,

"పాంవుంలు!" అన్నాడు.

"అవును; పాములే!" అన్నట్టుగా తల ఊపుతూ ముందుకి వంగిపోయి "పహాంవులు" అంటూ నిట్టూర్చింది పద్మజ.

ఆ తరవాత ఆమె తలెత్తి అతని కళ్ళల్లోకి చూసింది. అతను తలవంచి ఆమె కళ్ళల్లోకి చూసేడు.

ఆ విధంగా ఆ క్షణంనించే ఆరంభమయింది పద్మజ ప్రణయం.

తను ప్రేమలో పడ్డం ఆమెకి మొదట్లో చాలా ఆశ్చర్యం కలిగించింది. కాని, ఆ రోజున ఆ విధంగా ఆ యువకుణ్ని తను కలియడం— అదంతా భగవంతుడే జరిపించేడనిపించిందామెకి, లేకపోతే— ఆ యువకుణ్ని మళ్ళీ మళ్ళీ చూడాలనే కోరిక తన కెందుక్కలగాలి!

అతడు అందంగాకూడా ఉన్నాడు. శ్రీకృష్ణుడు నల్లగా ఉంటాడని ఎంత బాగా తెలిసినప్పటికీ ఆమెకి ఊహాచిత్రంలో మాత్రం ఆమెకి ఆ కృష్ణుడెపుడూ తెల్లగానే కనిపించేవాడు. నెహ్రూ కెనడీలు నల్లగా

ఉంటారంటే ఊహించడం కష్టం అయినట్లు ఆమెకి ఆ కృష్ణుణ్ని నల్లగా ఊహించడం కష్టం అయ్యేది.

ఆమె కంటికి ఆ యువకుడు తెల్లటి కృష్ణుళ్లా కనిపించేడు. అతణ్ని చూస్తూంటే ఆమెకి అతణ్ని మళ్ళీ మళ్ళీ అలా చూడాలనే అని పించింది. అతను పొదరింటివంటి ప్రదేశం దగ్గర తనకి తారసిల్లడం ఆమెని చకితురాల్ని చేసింది. సంతోషంలో ముంచింది (రాధని కృష్ణుడు పొదిరింటదగ్గర కలియడమే న్యాయం కాదా!) అక్కడ "నాస్టీ"గా పాములు ఉన్నాయనుకోండి. అవి భయంకరంగా ఉన్నాయనుకొండి. కాని, చాలా "ఫాసినేటింగ్"గా ఉన్నాయి. అదీకాక శ్రీకృష్ణుడూ, వజ్ అసోసియేటెడ్ విత్ అట్‌లీస్టు వన్ స్నేక్!

భగవంతుడైన లార్డ్‌కృష్ణాయే అదంతా అలా ఏర్పాటుచేయించేడని చాలా సులభంగా నమ్మగలిగింది పద్మజ. అందుగురించి ఆమె చాలా గర్వించిందికూడాను, కోటానుకోట్ల జీవుల్లో ప్రత్యేకంగా తన కేమాత్రం అటువంటి "అక్సైటింగ్ అడ్వన్చర్" భగవంతుడు కలిగించినందువల్ల తనకి భగవంతుడు చాలా దగ్గర వాడయినట్టనిపించిం దామెకి! దేముడికి తను ముద్దుల కూతురయినందుకు ఆమె చాలా మురిసిపోయింది.

ఆ రోజున ఆమె అడిగింది :

పాముల మధ్యకి ఎందుకు వెళ్ళేరు మీరు? — పాముల్ని వెతు క్కొంటూ నే నక్కడికి వెళ్ళలేదు!

మరి?

—నేనూ అక్కడకి వెళ్ళేను, పాములూ అక్కడ ఉన్నాయి.

అవక్కడ ఎందుకున్నాయి?

—ఆడవాళ్లే అటువంటి ప్రశ్నలు వెయ్యగలరు....కాని, అను కుంటాను - అవక్కడ ప్రేమించుకుంటున్నాయి కాబోలు!

చూశారా? ప్రేమని డిస్టర్బ్ చేస్తే ఎంత డేంజరో!

అలా తను అన్నందుకు అతను నవ్వేడు.

అతను ప్రశాంతంగా నవ్వినప్పటికీ కొంటె కృష్ణుళ్లా నవ్వేడనే అనిపించింది పద్మజకి

అప్పణ్నించే ఆమె తనని పూర్తిగా రాధకిందే జమ కట్టేసుకొంది. అప్పటినుంచే ఆమె ప్రతి ఆదివారం అతణ్ని కలుసుకొందికి హాఫీవాలీకి రెగ్యులర్‌గా వెళ్ళ నారంభించింది. అప్పటినుండి ఇప్పటివరకూ ఆమె స్వర్గసౌఖ్యం పూర్తిగా ఏ ఒక్కసారి అనుభవించక పోయినా, ప్రతి ఆదివారం మాత్రం స్వర్గ సౌఖ్యపు పొలి

మిస్ ప్రేమకి తను ప్రేమలో పడ్డం ఒక్కొక్కప్పుడు చాలా అసందర్భం, అసహజం అనిపిస్తూంటుంది. ఒక్కొక్కప్పుడు చాలా సిగ్గుగాకూడా ఉంటుంది. అదంతా అప్పుడప్పుడు, ఆమెకొక కలలా అనిపిస్తూంటుంది. ఒక్కొక్కప్పుడు ఆమె కంటికి ఆ యువకుడు రాచకృష్ణుళ్లా కాకుండా నిజంగా గొల్లకృష్ణుళ్లా కనిపిస్తూంటాడు. ఇంకోప్పుడు సన్యాసి కృష్ణుళ్ళా కనిపిస్తాడు. అటువంటప్పుడు ఆమెకి భయం వేస్తూంటుంది. అటువంటి భయం అప్పుడప్పుడు కలుగుతూండడం వల్లనే ఆమె తన ప్రణయ రహస్యం ఎవరికీ చెప్పలేక పోతోంది. రహస్యంగా గొల్లవాళ్ళా తిరిగే రాజుగా రబ్బాయిని ప్రేమించడం వింతగానూ పులకరింపుగానూ ఉంటుంది; కాని వట్టి గొల్లపిల్లణ్ని ప్రేమించడం అంత పులకరింతగా ఉండదనిపించింది మిస్ ప్రేమకి.

ఆ యువకుడు రాజుగారబ్బాయికాడు.

మిస్ ప్రేమ, రహస్యంగా ఎంత సంతోషంగా ఉంటోన్నప్పటికీ. ఆ రహస్యం తన ఇంట్లో తెలిస్తే ఎవ్వరూ హర్షించరని ఆమెకి తెలియడం వల్ల ఆ సంతోషం రోజురోజుకీ తగ్గ నారంభించింది. ఒకవేళ నిజంగా ఆ సంతోషం తగ్గక పోయినప్పటికీ, ఆ సంతోషం ఎంత ఎక్కువగా ఉందో ఆమె మనసులో అంత ఎక్కువగా భయంకూడా అలుముకో నారంభించింది.

ఆ రోజు తన పుట్టిన రోజునాడు డాడీకి అతణ్ని ఇంట్రడ్యూస్ చేదామనుకొంది మిస్ ప్రేమ. తానొకటి తలిస్తే తండ్రేమి తలుస్తాడో

ఆవేళ తేల్చుకొందామని ఆమె చాలా ఆశించింది. ఆరోజు ఆ యువకుడితో కలిసి సినిమాలో కూర్చొని తన రహస్య ప్రణయాన్ని ఆమె పబ్లిక్ చేదా మనుకొంది.

తీరా చూస్తే—

తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్టనిపించింది మిస్ ప్రేమకి.

డాడీ ఇవాళ రోజుకంటె వేగిరం క్లబ్బుకి వెళ్ళిపోయేడు తన రహస్య కృష్ణుడు తన వద్దకి రాకుండానే ఎక్కడో ఉండిపోయేడు.

కనీసం కబురైనా పెట్టేడుకాడు.

ఛీ!

అనిపించింది మిస్ ప్రేమకి.

తన పుట్టిన రోజునాడు తన ఆశించినట్టుగా ఏదీ జరక్కపోవడంతో మిస్ ప్రేమకి కోపం వచ్చింది. అందుచేతనే ఆమె రంగా రావుతో కసిగా సినీమాలో కూర్చొంది.

తన పుట్టినరోజు పండగ ఏదో విధంగా పండగలా జరిగితీరాలి!

కాని—

"నకిలీప్రేమ" చూస్తూ కూర్చొన్న మిస్ ప్రేమకి నిజంగా తన పక్క ఆ రంగా "రాయ్"కి బదులు తనవాడే కూర్చుంటే "ఎంత బావుణ్నోకదా!" అనిపించి మనసు చివుక్కుమంది, ఆమెకి భగవంతుడు చాలా నిర్దయుడనిపించింది. ఆమెకు భయంకూడా వేసింది.

ఏమో?!

ఎవడు చెప్పగలడు?

అపశకునంగా తండ్రిని వేగిరం క్లబ్బుకి పంపించేసి, అపశకునంగా తనవాణ్ని తన దగ్గరికి రాకుండాచేసి, అపశకునంగా ఇదంతా లార్డ్ క్రిష్ణావే ఈ విధంగా చేయించేదేమో?!

ఆ ఊహా మనసులో మెదలగానే పద్మజ తుళ్ళిపడింది. ఆమె మనసంతా ఆందోళనతో నిండిపోయింది. తెరమీద పకపకనవ్వే హీరో రాక్ హడ్సన్ వైపు వెర్రిగా చూస్తూ ఉండిపోయిందామె.

అంతలో ఆమె ఎడమచేతిమీద గట్టిగా ఓ చెయ్యిపడి మృదువుగా నిమిరింది.

"ఎవరది ? ?"

"నేను ప్రేమ్ !" అన్నాడు రంగారావు.

"నువ్వా ? !"

"అవును; ఏం ? ఏంటలా ఉన్నావ్ ?"

"నాకు భయంవేస్తుంది రాయ్ !"

రంగారావు చాలా ఆందోళన ప్రకటించేడు. ఆమె చేతిని మరీ మరీ నిమిరేడు. పైకివెళ్ళి ఐస్‌క్రీమ్ సోడా పట్టుకు వచ్చేడు. ఆమెచేత అది తాగించేడు. పైకివెళ్ళి ఆ సీసా ఇచ్చేసి గాభరాగా వచ్చేడు. కుర్చీలో కూర్చొని ఆమె ముఖం పరీక్షగా చూచేడు. ఆమె పెదవులు తన రుమాల్తో తుడిచేడు. ఆమె చేతిని నిమురుతూ "హౌ అర్ యు నౌ? బెటర్?" అని అడిగేడు.

"థాంక్స్ రాయ్! బెటర్" అంది పద్మజ.

"ఒంట్లో బాగులేకపోతే ఇంటికి దిగబెట్టేస్తాను ప్రేమ్!" అన్నాడు రాయ్.

"ఫరవాలేదు రాయ్" అంది పద్మజ.

కష్టంలోవున్నప్పుడు కావలసిన వాళ్ళు వచ్చి ఆదుకున్న ఫక్కీలో రంగారావు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని చల్లగా మృదువుగా వెచ్చగా నిమురుతూ కూర్చున్నాడు. పద్మజ అతని అభిమానానికి కృతజ్ఞతతో కూర్చొంది.

తనకి తెలియకుండా తన ప్రసక్తి ఏమీ లేనేలేకుండా భగవంతుడైన లార్డ్‌కృష్ణావే తనని ఎక్కడెక్కడకో తీసుకుపోతాడనీ, తీసుకుపోతున్నాడనీ అనిపించిందామెకి. నిట్టూర్చి ఆమె కళ్ళు మూసుకొంది. ఆ తరువాత కళ్ళు నెమ్మదిగా తెరిచి ఆ సినిమాబొమ్మల్ని కలలో బొమ్మల్లా చూస్తూ కూర్చొంది.

ఆ విధంగా కూర్చొని ఆ సినిమా చూస్తోంటే మిస్ ప్రేమకి తన జీవితంలో ఏవేవో వింత సంగతులు జరగబోతున్నాయని పించింది.

సినిమా చూసి, ఆమె కార్లో కూర్చుంది కాని డ్రైవ్ చెయ్యలేక పోయింది. రంగారావే స్టీరింగ్ తీసుకున్నాడు. ఇంటికి వెళ్ళి అక్కడ పోర్టి కోలో కారు ఆపుదాం అనుకునేసరికి పోర్టికోలో మరో కారు ఉంది. ఆ చుట్టూ చాలా కార్లున్నాయి. ఇల్లాంత్తా హడావిడిగా ఉంది. పోర్టికో ఇవతల కారు ఆపి, కారు దిగి, గబ గబ కారు చుట్టూతిరిగి పద్మజ కూర్చున్నపక్క తలుపు తెరిచేడు రంగారావు.

ఇంటివైపు, రెప్పవాల్చకుండా భయంగా చూస్తూ కారు దిగింది పద్మజ.

నిద్రావస్థలో ఛేర్మన్ భీమసేనరావుగారి ప్రవేశము - ఒకే తీరుగల రెండు చిరునవ్వుల అర్థాల వివరణతో ప్రారంభింపబడిన ఛే భీ. సే. రా. గారి (టూకీ) జీవిత చరిత్ర - ఉత్తమ వంశమనగానేమి? అందుకు ఉదాహరణలు - శపథంపట్టిన శ్యామల - ఇంటికి వచ్చిన వెండి బంగారాల బొమ్మ - అధ్యాయం ఆఖర్న నల్లని నర్సు - అధ్యాయం ముందులో ఎర్రని "అంకులు".

# 6

సినీమానుంచి మిస్ ప్రేమ ఇంటికి వెళ్ళేసరికి రాత్రి తొమ్మిదిన్నర దాటింది. ఆమె చూసేసరికి ఇల్లాంతా హడావిడిగా ఉంది.

హాల్లో మునిసిపల్ కమీషనర్ కూర్చున్నాడు. ఆయనచుట్టూ నలుగురైదుగురు కౌన్సిలర్లు చేరి మాట్లాడుతున్నారు. పంచదార కంపెనీ డైరెక్టర్లిద్దరున్నారు. క్లబ్బు మెంబర్సు నానాగోత్రాలవాళ్ళు ఓ వార నిల్చొని ఏవేవో మాట్లాడుకొంటున్నారు. పొగాక్కంపెనీ ప్రొప్రయిటర్ గారి ప్రాపకంవల్లా ఎందరెందరిదో దయవల్లా ఉద్యోగం సంపాదించిన జడ్జీగారొకాయన దేవుడి విగ్రహంలా నవ్వుతూ మిగతా గ్రూపులకి కొంచెం దూరంలో కూర్చున్నారు. భక్తిపారవశ్యంలో మైమరచిన పూజా

ప్లీడర్లు కొంతమంది చుట్టూ నిలబడి ఆయన చిరునవ్వుల అమృతంలో తేలియాడుతున్నారు. అంతాకూడా ఏవేవో విషయాలగురించి ముచ్చటించు కొంటున్నారు. వారి హావభావా విలాసాలు చూస్తే ఆ ఇంట్లో ఎవరికైనా ప్రమాదంగా ఉన్నదనిగాని. ప్రమాదం జరిగిందనిగాని ఎవరికైనాసరే బోధపడదు.

మిస్ ప్రేమ అనబడే పద్మజ ఆ హాల్లో అడుగుపెట్టేసరికిమాత్రం వారంతా- హస్కు కొడుతూన్న గుమాస్తాలు ఆఫీసర్ని చూడగానే సీరి యస్ అయిపోయినట్టు-ఒక్కసారిగా చాలా సీరియస్ అయిపోయేరు.

అన్ని సీరియస్ కళ్ళు తన వైపుకి తిరిగేసరికి పద్మజకి గుండె ఆగి పోయినంత పనయింది.

ఏదో ప్రమాదం జరిగింది: ఏం ప్రమాదం? డాడీ ఫ్రెండ్సంతా వచ్చేరు! డాడీకి ఏమైనా ప్రమాదం జరిగిందా? జబ్బు చేసిందా? కొంపతీసి డాడీ ఛ....

తొట్రుపాటు పడుతూ నాలుగడుగులు వేసిన పద్మజ వారి చూపులకి ఆగిపోయి ప్రశ్నార్థకంగా చూస్తూ భయపడుతూ నిలబడి పోయింది. ఆమె వెనక రంగారావుకూడా నిలబడిపోయేడు.

అప్పుడు కమీషనర్‌తో మాట్లాడుతూ కూర్చున్న కౌన్సిలర్లలో ఒకాయన గిరుక్కున పద్మజ వైపు తిరిగి, వెంటనే సోఫాలోంచి లేచి గబగబ ఆమె దగ్గరకి వచ్చేడు.

"పద్మా, ఒచ్చేరా?! రంగా ఒచ్చేవా?! మరేం బయంలేదు, ఎక్కడి కెళ్ళేర్రా రంగా? సినీమాకా? బావుంది? మరేం బయంలేదు, డాడీకి మరేం బయంలేదు. పద్మా. నువ్వేం గాబరా పడక! డాడీకేం బయంలేదు. రంగారే! మాఁవఁయ్యకి మరేం బయంలేదు!" అని తొందరగానూ గట్టి గానూ అన్నాడతను.

అతనికి యాభయ్యేళ్ళుండవచ్చు. బందోబస్తుగా చాలా భారీగా ఉన్నాడతను. పోలీసులు, బస్సు డ్రైవర్లూ, కడుపులు తగ్గించుకొనేందుకు

కాయశక్తులా పాటుపడే కొత్తతరం షావుకార్లూ, ఎమ్మెల్యేలూ, సమితి ప్రెసిడెంట్లూ, కంట్రాక్టర్లూ, అయిదేళ్ళ సర్వీసు దాటిన జడీలూ తరచు అంతే బందోబస్తుగా అంతే భారీగా ఉంటారు. అతని జుట్టు కొంత కాలం పరకూ ఎత్తుగా ఉంది. ఇటీవల ఫాషన్ కొప్పుకి తగ్గించినట్టుగా తలసైజుకి చాలకుండా చిన్నదిగా ఉంది. కాని, నల్లగా ఉంది పోతే, వారలంట చిన్న పిసరు ఎరుపురంగు అంటుకున్నట్టుగా ఉంది. అతను సీమపండిలా ఎర్రగానూ, పనసకాయలా గరుగ్గానూ ఉన్నాడు. మిల్లు బట్టతో కుట్టిన గరుకు పంట్లాంలో గరుకు ఖద్దరు షర్టు టక్ చేసుకొని, పోలీసు బెల్టువంటి వెడల్పు బెల్టు నడుంకి చుట్టుకొని. రబ్బరు చెప్పులు తొడుక్కొని ఉన్నాడతను. బాగా సర్వీసు చేసినప్పటికీ చెడిపోకుండా నిలబడ్డ "బెంజి" లారీలా అతను దిట్టంగా ఉన్నాడు. కదలికలోనూ మాటల్లోనూ అతను చాలా హడావిడిగా ఉన్నాడు.

"ఏంటయింది. అంకుల్?" అని నీరసంగా అడిగింది పద్మజ. ఆమె ముఖం రంగు మారింది. హాల్లోని నీలిరంగు వెలుగులో ఆమె రంగు సుద్దతో చేసిన బొమ్మలా, తెస్సు బొమ్మలా కనిపిస్తోంది.

"మరేం భయంలేదు. పెద్దకారుకి చిన్న పిసరేక్సిడెంటు: మైనేరు ఏక్సిడెండు, డాడీకి దెబ్బలేం తగల్లేదు. కారు చెడిపోయింది. కాని మాఁమయ్యకేం దెబ్బ తగల్లేదురా రంగా! తెలివొచ్చింది. నాతో సుబ్బరంగా మాట్లాడే డప్పుడే! మన పెద్ద డాక్టరూ చిన్న డాక్టరూ కారేసుకొని ఒచ్చి అప్పుడే వాల్నారు? చెకింగ్‌చేసి మరేం భయం లేదన్నారు. మేడ మీంచి ఇప్పుడే మీ రొచ్చేముందే కబురొచ్చింది. మరేం భయంలేదు. బేగెళ్ళి చూయిస్సి రండి" అని హడావిడిగా చెప్పే డతను.

కనిపించడానికి కొంచెం అందంగా భీముడులా కనిపించినప్పటికీ వినిపించడానికి మాత్రం అతను కొంచెం చదువురాని భీముళ్ళా వినిపిస్తున్నాడు.

అతను చెప్పిన బోగట్టా వినగానే పద్మజ కళ్ళు ఎరుపెక్కి కన్నీటితో తడిసిపోయేయి. తన జీవితంలో ఏవేవో వింత సంగతులు జరు

గుతా యనుకొంది కాని, ఇటువంటి సంగతి తను ఆ రోజున వింటా నని అనుకోలేదామె.

"డాడీ మేడమీదున్నాడా అయితే ?" అని అడిగి, ఆమె మెట్లవైపు నడవబోయింది. కాని, తివాసీమీద జోడు మెలికపడి ఆమె పడిపో బోయింది. ఆమె "అంకులు" ఆమెని లేవనెత్తుతూ రంగారావుకి కూడా సంజ్ఞ చేసేడు. ఓ లాయరు పరిగెట్టుకొంటూ సాయానికి వచ్చే కాని రంగారావు అతణ్ని ఓ చేత్తో అటకాయించి రెండో చేత్తో, పద్మజాని లేవ నెత్తడంలో, "అంకుల్"కి సాయంచేసి: ఆ తరవాత పూర్తిగా ఛార్జి తీసుకున్నాడు. హతాశుడైన లాయరు జడ్జీగారి పావ సన్నిధికి వెళ్ళిపోయేడు.

"జాగ్రత్తగా మేడమీదికి తీసికెళ్ళా రంగా !" అని అంకులు ఆరరు జారీ చేసేడు రంగారావుకి.

పద్మజని జాగ్రత్తగా మెమ్మదిగా నడిపిస్తూ మేడమీదికి నడిచేడు రంగారావు.

వారిద్దరూ అలా కలిసి వెళ్తూంటే అంకులు ముఖం బాగా వికసిం చింది.

"ఎవరా కుర్రాడు ?" అని ఎవరో అడిగారు.

"కుర్రాడు మావాడు, మావాడు ! !" అని హడావిడిగా గట్టిగా చెప్పాడు అంకులు. ఆకుర్రాడు "నీ కొడుకు కాడు నా కొడుకు" అన్చెప్పి ఇంకెవరైనావచ్చి తప్పుడు హక్కులు చూపించి తీసుకుపోయే ప్రమాదం లేకుండా ముందుగా జాగ్రత్తపడేవాళ్లా గట్టిగా ఖచ్చితంగా చెప్పాడు అంకులు. రాజుగా రమ్మాయిని సరసానికి లాగిన కుర్రరౌతు "నా కొడుకే" అని రౌతుతండ్రి గర్జించినట్టుగా అతను కొంచెం గర్వంగా అందరివైపూ చూసేడు. అంతలో అతనికి ఆ ఇంట్లో ఛైర్మన్‌గారి ప్రమా దావస్థ గుర్తుకి వచ్చినట్టుంది. వెంటనే ముఖంనిండా విచారమేఘాలు పులిమివేసుకొని, కష్టంలో ఉన్నవాళ్లా "లూజు"గా, నీరసంగా నడుస్తూ మిగతా కౌన్సిలర్ల దగ్గరకి వెళ్ళి అక్కడ కమీషనర్‌గారితో —

"చూసేరా సాయిబుగారూ! పిల్ల చూస్తే చిన్నది. కష్టం చూస్తే పెద్దది; తల్లి లేని పిల్ల! పుట్టగానే తల్లి చచ్చేసింది" అన్నాడు.

"అరె!" అన్నారు సాయిబుగారు.

"అవున్సార్, తల్లితోడు! ఇది పుట్టగానే తల్లి చచ్చేసింది!" అని ఒట్టువేసి వక్కాణించేరు అంకులు.

అరె! వెరీ సారీ!" అన్నారు సాయిబు.

"సారీ శీరీ తీసేయండి సాయిబుగారూ! నసీబ్‌ముందు సారీ గీరీ పనికొస్తా?" అని ఛాలెంజ్ చేసేడు అంకులు

"ఛ ఛ! ఎలా పనికొస్తుంది?!" అన్నట్లుగా సీరియస్‌గా తలాడించేరు కమీషనర్‌గారు!

"ఖుదా అయినా తప్పించలేడు నసీబు!" అని వేదవాక్యంలా చెప్పేడు అంకులు.

ఖుదాకి ఆ శక్తి ఉన్నదా లేదా? అందుకు కురాన్ ఏం చెప్పేనో జ్ఞాపకంలేక కమీషనర్‌గారు ఊరుకున్నారు.

"ఖుదా నసీబు తప్పించినా మాన్నా, నువ్వు రాజమ్మ గేదెల్ని మాత్రం రోడ్డుమీంచి తప్పించలేకపోయేవు!" అని ఓ కుర్ర కౌన్సిలర్ నవ్వుతూ అన్నాడు.

"అది రోడ్డుమీద గేదెల్ని కడద్దని ఎవడన్నాడసలు??" అని ఎవర్నో గద్దిస్తున్నట్టుగా హాస్యంగా అన్నాడు అంకులు.

అందుకు కౌన్సిలర్లంతా నవ్వేరు.

"స్వర్గానికెళ్ళినా సింతపండు పులుసేనా అన్నట్లు, ఛేర్మెన్‌గారింట్లో కూడా రాజమ్మ గేదె లూసెందుకు మనకి? ఆ వూసు ఎత్తకండి మరి! మా మేనగోడలుపిల్ల పద్మా గురించి నే చెప్తున్న దేంటంటే! పిల్ల పుట్టగానే తల్లి చచ్చేసింది. మరింక మా వాడికి కూతురయినా ఇదే, కొడుకయినా ఇదే! కూతురంటే మా వాడికి ప్రేణం! తండ్రంటే దీనికి ప్రేణం! అంటూ - చేర్మెన్‌గారింట్లోని ప్రత్యేకమైన పరమ రహస్యాలన్నీ తనొక్కడికే తెలిసినట్లు - చాలా గర్వంగా చెప్పేడు అంకులు.

అంతేకాక, తండ్రికి కూతురియందూ, కూతురికి తండ్రియందూ ఎంతో అభిమానం ఉండటం అది ఎంతో గొప్ప విచిత్రం సంగతిగానూ అంత గొప్ప విచిత్రం ఛైర్మన్‌గా రింట్లోనే జరుగుతూన్నట్లుగానూ భావం స్ఫురించేలా చెప్పాడు ఆ సంగతి అంకులు.

మేడమీద ఛేర్మన్‌గారి గది మూసేసి ఉంది. గది బయట గుమ్మం దగ్గర ఓ ముసలి నౌఖరు చింతగా కూర్చున్నాడు. అతనికి సుమారు డెబ్బై ఏళ్లుండవచ్చు. పొడవు ముక్కు-తో, పొడావు (వంక) పాగాతో— కూర్చున్నప్పటికికూడా - పొడవుగా కన్పిస్తూఉన్నాడతను.

పద్మజా రంగారావుల్ని చూసి లేచి నిల్చున్నాడతను - అతని ముఖం చాల సౌమ్యంగానూ చాల విచారంగానూ ఉంది. అతను జాతైన ముసలివేటకుక్క-లా అందంగానూజాలిగానూ కనిపిస్తున్నాడు. ప్రభుభక్తితో ఉండడం తప్ప ప్రభువిమర్శ చేయని (పెద్దలు మెచ్చుకొనే) ఉత్తమ సేవకుళ్ళా ఉన్నాడతను. అటువంటి మంచి వేటకుక్క-లు రాములవారి దగ్గరా ఉండొచ్చు. రావణాసురుడిదగ్గరా ఉండొచ్చు. ఆ రాముల వారికి అదెంత విశ్వాసంగా ఉందో యీ రావణాసురుడికి యిదీ అంత విశ్వాసంగా ఉంటుంది.

"అమ్మా ! ఒచ్చినావా ?" అంటూ అతను పద్మజని ఎంతో గారా బంగ పలకరించేడు.

ఆ పలకరింపులోని ప్రేమాభిమానాలకి కృతజ్ఞతతోనా అన్నట్టు "వెంకన్నా !" అంటూ వెక్కి- వెక్కి- ఏడ్చేసింది పద్మజ.

"ఏడకండమ్మా ! ఏడకండి !" అంటూ వెంకన్నకూడా కళ్లొత్తు కున్నాడు.

సమయానుకూలంగా రంగారావుకూడా నాలుగైదుసార్లు గట్టిగా నిట్టూర్చేడు- అంతే - ఛాతీ బాగా పొంగించి తగ్గించేడు. అలా నాలుగైదు సార్లు చేసేక-

"కమాన్! ఏడుస్తూ కూర్చోక, చెప్పరా వెంకన్నా! అయ్యగారికెలా ఉంది?" అని చాలా బిజినెస్‌లైక్‌గా గంభీరంగా అడిగేడు రంగారావు -

పద్మజకి ఆ ముసలి నౌకరుయెడల అంత అభిమానం ఉండడం గమనించి అతను కొంచెం చిరాకు పడ్డట్టుగా కూడా కనిపించేడు.

"ఎలా ఉందో ఏదో ఎళ్లిచూసి చెప్పండమ్మా! అమ్మగారు నన్నిక్కడే ఉండమన్నారు" అన్నాడు వెంకన్న.

రంగారావు తలుపుతోసి లోనికి వెళ్ళి, పద్మజని లోనికి రానిచ్చి, తలుపు జాగ్రత్తగా నెమ్మదిగా వేసి, పద్మజ వెనక, నెమ్మదిగా జోడు ఏ మాత్రం చప్పుడు కానివ్వకుండా నడిచేడు. పెద్దలంతా ఉన్నప్పుడు ఇంట్లో పిల్లలు అలానే నడుస్తారు. పెద్దలయెడల భక్తిశ్రద్ధలూ, వినయ విధేయతలూ చూపెట్టడంలో ఉండే లాభాలు గ్రహించిన పిన్నలు ఆ విధంగానే నడుస్తారు.

పద్మజా రంగారావూ ప్రవేశించిన గది అడుగున హాలంత పెద్దది కాకపోయినా, విశాలంగానే ఉంది. రెండుపక్కల ఉండే నాలుగు కిటికీల్లోంచి చల్లగాలి పూలగాలిగా మారి గదిలోకి మెత్తగా వస్తోంది. పైన పంకా భక్తిశ్రద్ధలతో తిరుగుతోంది. ఓ గోడని ఉండే గాంధీ నెహ్రూల బొమ్మల కెదురుగా, ఇంకో గోడని కుచ్చుపాగా కోరమీసాల పెద్దమనిషి ఫొటో ఒకటీ, దానిపక్క పాతకాలపు అలంకారాలతో ఒక యవ్వనవతి ఫొటో ఒక్కటీ అందంగా దర్జాగా అమిర్చి ఉన్నాయి. ఆ గదిగోడలు ఎత్తుగా బారీగా ఉన్నాయి. ఆ గది చాలా చల్లగా ఉంది. అందులో ఓ మూల (గదిలోకి వెళ్ళగానే కుడిపక్క) అందమైన రాత బల్లొకటి ముద్దుగా నిల్చొంది. దానిమీద ఓ ఆకుపచ్చ డోముగల టేబులులైటు నల్లగా వెలుగుతోంది. గదిలో మిగతా దీపాలేవీ లేకపోవడం చేత, ఆ గదిలో ఉన్నవారంతా ఆ మూలనించి వచ్చే వెలుగులో, స్టేజీమీద నాటకం మనుష్యుల్లా కనిపిస్తున్నారు.

గదికి దాదాపు మధ్యగా పంకా కింద ఓ పెద్ద మోడర్న్ మంచం మీద, మెత్తటి పరుపుమీద, మల్లెపూవులాంటి దుప్పటిమీద, ఆడదానికంటె మెత్తగా ఉండే తలగడమీద చేర్లబడి వెల్లకిలా పడుకున్నారు ఛైర్మన్ భీమసేనరావుగారు. పద్మజకి ఆయన ముఖం కనబడకుండా అడ్డుగా ఇద్దరు

డాక్టర్లు- ఒకరు ముసలి ఒకరు పడుచు-నిల్చొని ఏదో మాట్లాడు కొంటున్నారు.

ఆ ఇద్దరు డాక్టర్లూ మంచానికి ఇవతలగా ఉంటే, మంచానికి అవతలగా దీపం వెలుక్కి ఎదురుగా సన్నంగా పొడవుగా ఉండే ఆడమనిషి ఒకామె ఛైర్మన్‌గారివైపు కొంచెం జాలిగా చూస్తూ నిల్చొంది.

బాగా దూరంనుంచి చూస్తే జవ్వనిలా కనిపించవచ్చు. దగ్గిర్నుంచి చూస్తే ఆమెకి నలభయ్యేళ్ళుండవచ్చని ఎవరైనా అనుకోగలరు. కాని యాభయ్యేళ్ళు దాటేయని మాత్రం అనుకోలేరు. ఆమె జుట్టు పూర్తిగా పండిపోకుండా, ఒకటి రెండు తెల్లచారలతో అదోక విధమైన అందంతో దర్జాగా ఉంది. ఆమె జాలిగా నిల్చున్నప్పటికీ దీనాతిదీనంగా ఉండకుండా అదోక విధమైన హుందాతనంతో నిల్చొంది. ఆమె కళ్ళు విశాలంగానూ, కనుబొమలు ఆ కళ్ళని కాపాడే కత్తుల్లాగా ఉన్నాయి. ఆ ముక్కుకూడా సూటిగా సన్నగా ఉంది. పెదవులు పల్చగా ఉన్నప్పటికీ వంకీలు తిరిగి అందంగా ఉన్నాయి. ఆమె సన్నగా తీగెలా ఉంది. చెవలకి వజ్రాల దుద్దులూ, మెడలో ఓ సన్నని బంగారుహారం, చేతులకి జత బంగారు గాజులూ తప్ప ఆమె వంటిన ఇంక ఏ అభరణాలూ లేవు. ఆమె వేసుకున్న జాకెట్టు నల్లది. ఆమె కట్టుకున్న చీరె తెల్లది. ఆమె చాయ ఫచ్చగా ఉన్నప్పటికీ మెరుస్తూలేదు. ఆమె దుద్దులు కూడా మెరియడం మర్చిపోయినట్టున్నాయి. ఆమె జుట్టు నెరిసినప్పటికీ మెరియడం లేదు. అలనాడేనాడో వెండి బంగారాలతో అందంగా చేసిన బొమ్మకి ముసలికాలం వచ్చి తళుకు తగ్గినప్పటికీ ఆ వెండి బంగారాలకి వన్నె తగ్గనట్టుగా ఆమె అదోక విధమైన చల్లని అందంతో దర్జాగా కనిపిస్తోంది. అలనాడేనాడో ఎవరో గొప్పగా రచించిన అందమైన తైలవర్ణ చిత్రంలా మెరుపు తగ్గినప్పటికీ ఆమె అందంగానే ఉంది. దెబ్బతిని పడిపోయిన బాల్యస్నేహితుణ్ని చూసినట్టుగా ఆమె ఆ ఛైర్మన్‌గార్ని జాలిగానూ దుఃఖంతోనూ చూస్తోంది.

పద్మజ గదిలోకి రాగానే డాక్టర్లిద్దరూ ఆమెవైపు చూసేరు, చూసి, ఛైర్మన్‌వైపు చూసి, తిరిగి పద్మజ వైపు చూసి, "హలో! హౌ అర్ యు?"

అని ఆమెని పలకరించి, "నిద్రపోతున్నాడు మై ఫాదరు. హి ఈజ్ పర్ఫెక్ట్లీ ఆల్‌రైట్! మరేం ఫరవాలేదు" అన్నాడు వారిద్దర్లో ముసలాయన. అతనికి దుబ్బుగా పెరిగిన పండుజుట్టూ ముందికి సాగిన ఎర్రని మూతీ ఉన్నాయి. అతని ముఖం పొంగినట్టుగా కనిపిస్తోంది. అతనికి తాగుడు అలవాటుందని చాలామందికి తెలుసు.

రుమాల్తో కళ్ళొత్తుకొంటూ పద్మజ వెళ్ళి మంచానికి అవతల నిల్చున్నామెని కౌగలించుకొని తండ్రివైపు భయంగా చూసింది. ఆమె పద్మజ తలమీద చెయ్యివేసి ఏవో ఆలోచిస్తూ ఉండిపోయింది.

రంగారావు పెద్ద డాక్టర్‌గారిక్కి వినయంగా నమస్కారంచేసి, చిన్న డాక్టర్ని చిరునవ్వుతో పలకరించేడు. మిరపకాయకీ చిన్న డాక్టర్‌కీ చాలా పోలికలున్నాయి- అతను రంగారావువైపూ పద్మజవైపూ చూసి, తరవాత రంగారావుకి — మిగతా ఎవరో కనిపెట్టలేనంత చిన్నగా - కన్నుగీటేడు. గదినిండా దీపాలుపెట్టి తలుపులన్నీ మూసేసినట్టు, కడుపులో ఎంతో సంతోషంగా ఉన్నప్పటికీ, పెదిమలు బిగించి రేఖామాత్రపు చిరునవ్వుతో చిన్నడాక్టర్‌గారి కనుగీటుకి జవాబు చెప్పేడు రంగారావు.

పెద్ద డాక్టరు రిస్టువాచీ చూసుకొని, "చూడండమ్మా, మీ రొకసారి ఇలా వస్తారా?" అని పాత బంగారు బొమ్మని కొంచెం ఎడంగా పిల్చేడు. పద్మజ నించి నెమ్మదిగా విడి, ఆమె అటువైపు వెళ్ళింది. రంగారావు గబగబా వెళ్ళి పద్మజ నడుంచుట్టూ చెయ్యివేసి, ఆమె పడిపోకుండా పట్టుకున్నాడు.

ఛేర్మన్ భీమసేనరావుగారికి యాభై అయిదేళ్ళుదాటేయి. ఆ రాత్రి పదిగంటలవైంకి అతను ఆ మంచంమీద నిద్రపోతూన్నట్టుగా కనిపిస్తున్నాడు. క్లబ్బుకి వెళ్ళడానికి అతను తెల్లటి మెరిసే పంట్లాం తొడుక్కొని అందులో చిక్కటి నీలిరంగుగల పల్చని ఫ్లానల్‌షర్టు టక్ చేసుకున్నాడు. జోళ్ళూ మేజోళ్ళూ మాత్రం తీసేసి ఆ దుస్తులతోనే అతణ్ణి ఆ మంచం మీద పడుకోబెట్టేరు. షర్ట్ బటన్సు విప్పేయడంచేత అతని బలమైన ఛాతీ ఆ బనియన్ మెడలోంచి భయంకరంగా కన్పిస్తోంది. నిద్రలో అతని

ముఖం నిశ్చలంగా ఉన్నప్పటికీ శాంతంగా మాత్రం లేదు. శాంతంగా లేక పోయినా గంభీరంగా మాత్రం ఉంది. గంభీరంగా ఉండడమే కాకుండా అందంగాకూడా ఉంది. అక్కడక్కడ ముసలిగీతలు ఉన్నప్పటికి ఆ ముఖంలోని అందం ఏ మాత్రం చెడలేదు. చిన్నతనంలో ఆ ముఖం రంగులు పూసి లతలు చెక్కిన పెద్దసైజు ప్లమ్‌కేకులా మనోహరంగా ఉంటే, ఇప్పుడది ఎర్రెర్రగా కాల్చిన మినప రొట్టెలా ముచ్చటగా ఉంది. అతనిజుట్టు తెల్లగానూ లేదు, నల్లగానూలేదు; ఎర్రగా నొక్కులునొక్కులుగా ఉంది. పద్మాజ కళ్ళల్లో కాకుండా అతనికళ్ళు విశాలంగా ఉన్నాయి. మూసుకొని ఉండటంచేత అవి పెద్దసైజు గులాబి మొగ్గల్లా కనిపిస్తు న్నాయి. మీసం తీసివేసిన అతని పై పెదవి వెడల్పుగా ఉంది. పెగవులు దళసరిగా ముడుచుకున్నాయి. గడ్డం బరువుగా కనిపిస్తోంది. మొత్తంమీద అతని ముఖం అందమైనదనే చెప్పాలి. కాని, దట్టంగా రోమాలతో నిండిన ఆ ఛాతీ చూసి ఆ ముఖంచూస్తే ఏదో భయంకరమైన గొరిల్లాలాంటి మృగానికి తల తీసేసి, అందమైన మనిషి తల తగిలించినట్టుగా అతను చాలా విచిత్రంగా కనిపిస్తున్నాడు.

మెలకువగా ఉన్నప్పుడు ఛేర్మన్ భీమసేనరావుగారు ఓ చిన్న వెటకారపు చిరునవ్వు ముఖానికి తగిలించుకొని కనిపిస్తారు. ఆ చిరునవ్వు ఆయనకి చాలా సహజంగా బాగా అమిరి పోయింది. అటువంటి చిరునవ్వు తరచుగా జీవితంలో దెబ్బలు తిని తిని అన్నిటికీ ఓర్చుకొని నిలబడగలిగిన పుణ్యాత్ముల్లో కనబడుతుంది. అటువంటి చిరునవ్వు తరచుగా పాపాలు చేసిచేసి పైకి రాగలిగిన పాపుల్లోకూడా కనపడుతుంది. రెండు చిరునవ్వులుకూడా రూపాల్లో ఒక్కలాగే కనిపించినప్పటికి వాటి అర్థాలు మాత్రం చాలా వేరుగా ఉంటాయి. "దైవం, న్యాయం, ధర్మం, సత్యం - అన్నీకూడా మనిషి నిలబడితేనే నిలబడతాయి: వాటికోసం మనిషి నిలబడితేనే అవి నిలబడతాయి!", అంటుంది మొదటి నవ్వు. "దైవం న్యాయం ధర్మం సత్యం-అన్నింటినీ ధిక్కరించి కూడా నిలబడ్డాను! మమ్మల్ని మీరేం చెయ్యలేరు!" అంటుంది ఆ రెండో నవ్వు.

ఫైర్మన్ భీ. సే. రావుగారి చిరునవ్వుకి అర్థం ఏమైనప్పటికీ అది అలా విడిచిపెట్టి, "పుణ్యులా ? పాపులా ఆయన ఏ కోవకి చెంది తారు ?" అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పడం కష్టం. పుణ్యాత్ములతణ్ణి పుణ్యాత్ముడని నమ్ముతారు. పాపాత్ములు అతని గురించి "వాడు మహా పాపి సార్ ! మాకు తెలుసు !" అని తెలిసినట్టుగా చెప్తారు. ఏ కోవకి చెందినప్పటికీ జీవితంలో అతను నెగ్గేకోవలోనే ఉంటూ వస్తున్నాడు.

"ఉత్తమ వంశం" అంటే నిర్వచనం ఇవ్వడం ఈ రచయితకి కష్టం. "ఉత్తమ వంశాలు సూర్య చంద్రులదాకా వెళ్తాయిట" అందులో ఓ చోటుకి వెళ్తే మండి తగలడతారు. రెండో చోటుకి వెళ్తే కొరడుబారి చస్తారు. అయితే ఆ మాటకి అర్థం సింపుల్ ఎగ్జాంపుల్స్‌బట్టి తెలుసుకోవాలంటే :

చర్చిల్‌గారిది ఉన్నత వంశం; చార్లీ చాప్లిన్‌ది ఉన్నతవంశంకాదు, కెనెడీగారిది ఉన్నతవంశం; కాస్ట్రోది ఉన్నత వంశం కాదు. అర్జునుడిది ఉన్నత వంశం; ఏకలవ్యుడిది ఉన్నత వంశంకాదు. రాజుది ఉన్నత వంశం, రౌతుది ఉన్నతవంశంకాదు. ఆ రౌతు ఆ రాజుని చంపి రాజవుతే వాని తరవాత వారందరిదీ ఉన్నత వంశమే : ఉన్నత వంశాలవారు చస్తే వారి శవాలు భౌతిక దేహాలవుతాయి : వారు అవతారాలు చాలించిన వారవుతారు; వారి ఆత్మలు శాంతిస్తాయి. బ్రహ్మసాయుజ్యం పొందుతాయి; మామూలువారు బ్రతికున్నా సరే వెధవ పీనుగులుగా తెలియబడతారు, జనాభా లెక్కల్లో ఉండరు. ఓట్లు వెయ్యడానికీ జే కొట్టడానికీ పనికొస్తారు. చచ్చినప్పుడు దిక్కుమాలిన చావు చస్తారు.

ఫైర్మన్ భీమసేనరావుగారిది ఎంతో మంచి ఉన్నతవంశం. ఆయన పూర్వీకులు కురుపాండవుల్లో ఎవరికి దాసులో తెలియదుకాని, అటు తరువాతమాత్రం అనేకమంది రారాజులకి వారుసామంతులుగా ఉండేవారు. ఆ తరువాత అనేకమంది నవాబులకి మేలు గులాములుగా ఉండేవారు. అటుపిమ్మట తెల్లని బ్రిటిషు దొరలకి నమ్మిన బంట్లుగా ఉంటూ సమస్త

మైన సంపదలతోనూ తులతూగుతూ ఉండేవారు. ఈ మధ్య ప్రజలందరికీ-కొమ్ములు తిరిగిన మేలు నాయకులుగా ఉంటున్నారు.

ఉన్నత వంశాలవారు మధ్య మధ్యలో చెడిపోతూంటారు. చెడిపోయిన తరవాత కొన్నాళ్ళకి "ఆత్మ విమర్శ" చేసుకొని నిలదొక్కుకొని మళ్ళీ విజృంభిస్తూంటారు.

చెడిపోయినవారు భీమసేన్రావుగారి తండ్రిగారు. ఆత్మ విమర్శ చేసుకొని నిలదొక్కుకొని విజృంభించినవారు భీమసేనరావుగారు.

తండ్రిగారి కాలంలో నాలుగు మొఖాసాలూ మూడు బంగళాలూ ఉండేవి.

దొరలకి విందుకిందా, గుర్రపు పందేలుకిందా, మంచి వైను బాటిల్సుకిందా, మేలు మేజువాణీలకిందా తండ్రిగారు రెండు మొఖాసాలూ, రెండు బంగళాలూ ఖర్చుచేసేశారు. ఇంటి ఖర్చులకింద ఓ మొఖాసా దానంతట అదే ఖర్చయిపోయింది. నాలుగో మొఖాసా బంధువులంతా కలిసి భక్షించేసేరు. చివరికి ఓ బంగళా దానిచుట్టూ కొంత జాగామాత్రం మిగిలేయి. అదికూడా అయిపోనుకాని ఇంతతో తండ్రిగారే అయిపోయేరు.

అప్పటికి భీమసేనరావుగారికి ఇరవయ్యేళ్ళ వయసు. అతనికి బాగా ముస్తాబవడం వచ్చేది. టెన్నిస్ ఆడ్డం వచ్చేది. క్రికెట్ టీమ్‌లో ఉండగలగడం వచ్చేది. గుర్రపుస్వారీ సరిగా రాకపోయినా వేటకి వెళ్ళడం వచ్చేది. చిలకలపేటలో ఫరకులు వచ్చేవి. అతనికి అప్పటికి బియ్యే డిగ్రీ రాకపోయినా పర్ఫెక్ట్‌గా ఇంగ్లీషు మాట్లాడ్డం వచ్చేది. అతనికి జీవితంలో అప్పటికి ఎన్ని తెలిసినప్పటికీ బతుకు తెరువేమిటో తెలుసుకోడం మాత్రం రాలేదు. చిన్నప్పటినుంచీ రాజుగారింట్లో పెంపుడు పిల్లగా పెరిగిన పులిపిల్ల అకస్మాత్తుగా అడివిని పడిపోయినట్టు అతను జీవితంలో భయపడుతూ నిల్చున్నాడు; జీవితంలో నిలబడ్డం తెలియక భయపడ్డాడు.

అప్పుడు మిగతా పెద్దమంతుప్పు రొకటీ ఒకటే వచ్చి అతని పరిపక్ష చూసి జాలిచెంది, అతనికి సాయంచేసి అసరాగా నిలబడి అతణ్ని నిలబెట్టి అతణ్ని బసుకుబాటలో పెట్టేయి.

భీమ సేనరావుగారు, చిన్నప్పుడు, మంచి రాజకుమారుల్లా ఉండే వారు. "ఫలానావారి అబ్బాయి" అనే గౌరవం అటుంచగా ఆ చక్కటి పర్సనాలిటీనే అతనికి (రెయిల్వే) ఫస్ట్‌క్లాస్ ప్రీపాస్‌లా పనిచేసేది. పిలవ (బడ) కుండా గవర్నర్‌గారి విందుకు వెళ్ళినా అతణ్ని చూసీచూడగానే అక్కడ వారంతా అతనికి, పిల్చి, కుర్చీ వేయాలన్నమాట- అంతబావుండే వాడతను. వీదంట అతను తాజాగా నడుచుకు వెళ్ళిపోతూంటే, ఆ "ప్రిన్స్‌లీ పర్సనాలిటీ"చూసి కిల్లీ కొట్లవాళ్ళు లేచి నిలబడిపోయేవారు. తల గుడ్డలు చుట్టుకోవడం మర్చిపోయిన బళ్ళవాళ్ళు గాభరాగా తలగుడ్డలు చుట్టేసుకోనేవారు. రైతులు నోట్లోంచి చుట్టలు తీసేసి దాచేసుకొని తప్పు చేసిన వాళ్ళల్లా వంగొని వినయంగా నిలబడిపోయేవారు. బంట్రోతులు సలాములు కొట్టేసేవారు. బ్రాహ్మణులు పుణ్యవచనాలు చదివేసేవారు. మరింక ఆడవాళ్ళమాట చెప్పేదేముంది?! ఆయన రోడ్డంట వెళ్తొంటే ఆడవాళ్ళంతా కిటికీల దగ్గిరకీ, గుమ్మాల దగ్గిరకీ ఎగబడిపోయి కళ్ళప్ప గించేసేవారు. లేకపోతే వార చూపులూ, దొంగచూపులూ చూసేస్తూ తలుపు సందులకి అతుక్కుపోయేవారు.

అనాదినించీ "మంచి పర్సనాలిటీ"కి మానవ సంఘంలో ఎంతో మంచి పలుకుబడి ఉన్నదనే విషయం అందరికీ తెలిసిందే. కాని ఆ పలుకుబడిని లాభానికి ఉపయోగించుకొనే కిటుకు అందరికీ అబ్బదు. కాని భీమ సేన్రావుగారి దూరబ్బంధు వొకాయనకి అటువంటి కిటుకులు చాలా తెలుసు.

ఆ దూరబ్బంధువుకి మంచి దూరదృష్టి ఉండేది. అతను మోడరేట్ జాతీయవాది. అంటే, అతను అవతల గాంధీగారికి దగ్గరవాడూ కాదు. ఇవతల లిబరల్‌పార్టీవారికి మరీ దగ్గరవాడూ కాదు. బ్రిటిష్ హయాం పోతుందని అతనికి తెలుసుకాని అది ఉన్నంతకాలం ఆ హయాంకి వ్యతి

రేకంగా ఉండడం మంచిది కాదని అతను తెలుసుకున్నాడు. అందుచేత అతని జాతీయతత్వం మనసులో ఎక్కువగానూ, ఆదరణలో తక్కువ గానూ ఉండేది. అతనికి మోతాదుగా డబ్బూ, మోతాదును మించి తెలివి తేటలూ ఉండేవి. అతని పూర్వీకులు ఓడలు నడిపి వాటిమీద సరుకులు వేసుకొని మారదేశాల్తో వ్యాపారాలు చేసేవారుట. అది బంద్ అయిపోయాక తూర్పు ఇండియా కంపెనీలో గుమాస్తాలుగాను, దుబాసీలుగాను వ్యవహరించేవారుట. కంపెనీ రాజ్యాన్ని రాణీగారు తీసుకున్నాక వారంతా ప్రభుత్వంలో ఉన్నతోద్యోగాలు చేస్తూ వచ్చేరు. ఈ దూరబ్బంధువులకి కూడా, ప్రయత్నంచేస్తే, అపాటి ఉద్యోగం తప్పక దొరికేదే, కాని, అతనికి ఉద్యోగం చెయ్యడంకంటె వ్యాపారం చెయ్యడం మంచిదని పించి, ఓ పాతికి మందిని పోగుచేసి, తెలివిగా ఓ కంపెనీ కూడగట్టి అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ ఒకటి స్థాపించేడు.

భీమసేనరావుగారి ఆ దూరబ్బంధువు భీమసేనరావుగారి పర్సనాలిటీలోని పవరెటువంటిదో గ్రహించి, బంధువు కాబట్టి అభిమానించి, భీమసేనరావుగార్ని తన కంపెనీకి మానేజరుగా వేసుకున్నాడు.

అప్పణ్నుంచి భీమసేనరావుగారి దశ తిరిగిందనే చెప్పాలి.

పచ్చగా పైకి మెరిసిపోయే పర్సనాలిటీ ఉన్నప్పటికీ బతుకంటే బయపడుతూ గడగడలాడే భీమసేనరావుగారు, జీవితంలో తనకొక స్థానం దొరగ్గానే గుండె నిబ్బరం చేసుకున్నారు. యుద్ధంలో ఓ స్థావరాన్ని చేజిక్కించుకొని ఆ తరవాత రంగాన్నంతా అక్కడినుంచి సావధానంగా పరీక్షించే సైనికాధికారిలా అతను జీవితాన్ని పరీక్షగా చూసి ముఖ్యమైన పాఠం ఒకటి నేర్చుకున్నాడు.

జీవితంలో అన్నింటికంటే, భగవంతుడికంటే కూడా, ముఖ్యమైన పదార్థం ఒకటే ఉంది. అదేదనగా

తను !

తనే ముఖ్యం ! తను లేకపోతే లోకమూ లేదు, భగవంతుడూ లేడు, ఏమీ లేదు ! తను లేకపోతే సర్వం శూన్యం అన్నమాట !

తను, తనవారు, పైవారు-

జీవితంలో ముఖ్యమైన పదార్థాలు ఆ క్రమంలో ఉంటాయని భీమ సేనరావుగారు చాలాకాలం కిందటే స్పష్టం చేసుకున్నారు.

అది స్పష్టం చేసుకున్నాక భీమసేనరావుగారికి జీవితం అంతా చాలా "ఈజీ" అయిపోయింది. తన్ను మాలిన ధర్మం లేనేలేదనీ ఉండనే కూడ దని అతను నిశ్చయం చేసుకున్నాడు. దైవమైనా సరే ఏ ధర్మమైనా సరే సంఘంలో ప్రతి వ్యక్తినీ పెంచేదిగా ఉండాలని అతను తెలుసుకోలేదు. అన్ని దైవాలూ అన్ని ధర్మలూ తనని మాత్రం పెంచాలని, అలా పెంచ నప్పుడు, వాటి ఉపయోగమే తనకి లేనప్పుడు, వాటితో తనకి సంబంధమే ఉండనక్కరలేదని అతను అనుకున్నాడు, కాని.

తన లాభానికి దైవాన్ని ఎంతగానో ఉపయోగించుకోవచ్చని భీమ సేనరావుగారు ఏ నాడో గ్రహించేరు. అవతలవాణ్ని అణిచిపారేసి అదే దైవ నిర్ణయమని, దైవ న్యాయమని సమర్థించడానికి దైవం దొరికినంత వీలుగా ప్రపంచంలో మరేదీ లేదనే విషయం భీమసేనరావుగారు ఏ నాడో గ్రహించేరు.

పెద్దల దగ్గర వినయవిధేయతలతో ఉండండం లాభిస్తుందంటే భీమసేనరావుగారు అలానే ఉంటారు. వారికి ఎదురు తిరిగితేనే లాభం అంటే వారికి అతను మూడు నిమిషాల్లో ఎదురు తిరుగుతారు. తన అవస రానికి తప్ప ఆయన డబ్బు ఖర్చుచెయ్యరు. తన లాభానికి ముందుగా అవ తల వాడికి డబ్బు ఖర్చుచెయ్యడం అవసరం అయితే ఆయన అలానే చేస్తారు. పాపం చెయ్యటం లాభసాటి కాకపోతేనే అతను పాపం చెయ్యకుండా ఉంటాడు. పుణ్యం చెయ్యడంవల్ల తనకి దమ్మిడీ ఎత్తు లాభంలేకపోతే అతను పుణ్యం చెయ్యనే చెయ్యడు. ఇంట్లో నౌకర్లని దయగా చూస్తే ఎంతో ఎక్కువపని వారిచేత చేయించుకోవచ్చు కాబట్టి అతను వారియెడల చాలా దయగా ఉంటాడు. దయా ధర్మప్రభువు అని పేరు తెచ్చుకొంటే కంపెనీ నౌకర్లు ధిక్కరిస్తారని అతను గ్రహించి వారియెడల "ఖడేరహో!"గా ఉంటాడు. దైవభక్తిగల అధికార్ని దైవాన్ని

నమ్మే జనం ఎక్కువగా నమ్ముతారని అతను తెలుసుకున్నాడు. అందు చేత ఆయన అందరికీ తెలిసేలా పూజలెన్నో చేస్తూంటారు.

చిన్న వయస్సులోనే జీవితం గురించి ఎన్నో అభిప్రాయాలు ఏర్పరుచుకొని ఎన్నో నిశ్చయాలు చేసుకోవడంతో చిన్నప్పుడే ఆయన మనసు ఎక్కువగా ముదిరిపోయింది. తను తప్ప సర్వం శూన్యం అనే గట్టి నమ్మకం అతన్లో కుదిరి పోవడంతో "ఈ లోకంలో నువ్వేకాదు, ఎందరో మనుషులున్నారు, ఎన్నో జీవాలున్నాయి, దైవం ఉన్నాడు, అందరికి సమ్మతమైన వేవో ధర్మాలుండాలి!" అని ఎవరైనా అంటే అతనికి నవ్వొస్తుంది. పోలీసువాడు వేదాంతం గురించి మాట్లాడితే అది విని, చీటింగ్ కేసుల్లో పదిసార్లు జెయిలుకి వెళ్ళివచ్చిన వాడెలా నవ్వుతాడో, అలా నవ్వుతారు భీమసేనరావుగారు, తన యెదుట ఎవరైన దైవం గురించీ, ధర్మం గురించీ మాట్లాడితే.

తను తప్ప సర్వం మిథ్య అనుకున్న భీమసేనరావుగారు తన ముప్పయ్యోయేట పెళ్ళిచేసుకున్నారు. తన బాగుకోసమే ఆయన పెళ్ళి చేసుకున్నారు. కాని అందులోనే ఆయన దెబ్బతిన్నారు.

ఓ సారి ఓ మిత్రుడు క్లబ్బులో కూర్చొని, "పవిత్ర వివాహబంధం" గురించి చాలా ఉత్సాహంగా మాట్లాడుతుంటే భీమసేనరావుగారు ఆ మిత్రుణ్ని ఆపేరు.

"ఆడదానికి పుస్తెలు పవిత్రం! అవునా?"

"యస్! అవును!"

"కాని ఏ ఆడదైనా సరే-వీలుంటే చాలు-వాటికి నూలు దారం తీసేసి బంగారు తాడు కట్టించు కొంటుంది! అవునా?"

"యస్ యస్! అవును!"

"పసుపు కొమ్ము నూలుపోగుల కంటె బంగారం ఎక్కువ పవిత్రం అని తెలుసుకో మిస్టర్! భగవంతుడైనా అంతే! దేవాలయాల్లో బంగారు దేవాలయాలూ మశీదుల్లో మార్బుల్ మశీదులూ అంటే మానవులకి ఎక్కువ గౌరవం అని తెలుసుకో మిసర్!"

అని అధారిటేటివ్‌గానూ చిరునవ్వు నవ్వుతూనూ అన్నారు భీమ సేనరావుగారు.

డబ్బుగల సంబంధాలకోసం వెతికి వెతికి నిరీక్షించి చివరికి తన ముప్ఫయ్యోయేట పెళ్లి చేసుకున్నారు భీమసేనరావుగారు.

పురుషోత్తంగారని ఒకాయన ఉండేవారు. ఆయన ఉత్తములు, అమాయకులు, పుత్రహీనులు, వృద్ధులు అన్నింటికంటే ముఖ్యమైన విషయం; ఆయన జమీన్దార్లు.

మోహనమ్మ పేరు విశ్వమోహిని, ఆవిడ పురుషోత్తంగారి పెద్ద కూతురు. శ్యామల ఆయన చిన్నకూతురు. శ్యామలకంటె పెద్దావిడ పదేళ్ళు పెద్ద.

శ్యామల వికారంగా ఉండేదికాదు. కాని మోహనమ్మ ఎంతో ఎక్కువ అందంగా ఉండడంచేత అక్కముందు శ్యామల అందవికారంగా కనిపించేది. మోహనమ్మ మెట్రిక్యులేషన్ పరీక్ష పాసయింది. శ్యామల పాసవలేకపోయింది. మోహనమ్మకి వివాహం జరగడం, ఆమె భర్త ఆమెయెడల ఏ అభిమానమూ లేకుండా మసలడం, అన్నీ శ్యామలకి తెలుసు. అక్క పెనిమిటి తప్పతాగి చనిపోయేసరికి శ్యామలకి పద హారోయేడు నడుస్తోంది. ప్రేమలేని వివాహం ఎంత ఘోరంగా పరిణమించిందో ఆమె చూడ్డంవల్ల ఆమె జీవితం విచిత్రంగా మార్పుచెంది, చివరికి అంతకంటే ఘోరంగా ఆఖరయింది.

పురుషోత్తంగారు తన రెండవ కుమార్తెని భీమసేనరావుకి "ఆఫర్" చేసేరు. కట్నం కూడా ఎక్కువగానే ఆఫర్ చేసేరు. అయితే- కట్నానికి ఆశపడ్డంకంటె ఆస్తి కలిసొస్తుందని ఎక్కువ ఆశపడ్డారు భీమసేనరావుగారు.

శ్యామలా భీమసేనుల వివాహం చాలా వైభవంగా జరిగిపోయింది.

శ్యామలకి అప్పటికి పద్దెనిమిదేళ్ళు, ఆమెకి అందం తక్కువైనప్పటికీ పౌరుషం ఎక్కువ. పౌరుషం ఎంత ఎక్కువో పట్టుదలకూడా

ఆమెకి చాలా ఎక్కువ. పెండ్లినాడు ఆమె మేడమీద, తన తల్లి (చనిపోయిన) గదిలో భగవంతుని యెదట తండ్రి కెదురుగా నిలబడి.

"ఇదిగో! వినండి నాయనగారూ! నా తల్లి ఆత్మసాక్షిగా ఆ భగవంతుడి సాక్షిగా మీతో చెప్తున్నాను. ఈ రోజునుంచి తొమ్మిది మాసాలలోపున మీరు నా శవాన్ని చూస్తారు! అది తప్పదు, తప్పదు, తప్పదు!!"

అని ఘోరంగా శపథం చేసింది. పురుషోత్తంగారు ఏడ్చి నెత్తి మొత్తుకొని, కూతుర్ని అప్పగింతలకోసం కిందకి తీసుకు వెళ్ళేరు. శపథం పట్టిన శ్యామల ఆయన వెనక శాంతంగా నడిచింది.

పెళ్ళయిన వెంటనే శ్యామల భర్తతో కాపరానికి వెళ్ళింది. ఆ కాపురం భీమసేనరావుగారికి భయంకరమైన బాధగా పరిణమించి అతను యమయాతన పడిపోయేడు. చివరకి ఆ పెళ్ళి జరిగిన తొమ్మిది నెలల్లో పద్మజని కని, శపథం పట్టిన ప్రకారం బలవంతంగా ప్రాణాలు తీసుకొంది శ్యామలాంబ. అప్పుడు నిట్టూర్చేరు భీమసేనరావుగారు.

పద్మజ పుట్టగానే పురుషోత్తంగారు అల్లుడి ఇంటికివచ్చి కూతురు శవాన్ని కళ్ళారాచూసి, కొంతసేపు ప్రతిమలా నిలబడిపోయి ఆ తరువాత నిలువునా కూలిపోయేడు. ఆ తరవాత, ఆ రాత్రి అతను తనలోని మిగిలిన శక్తినంతా కూడగట్టుకొని లేచి నిలబడి, అల్లుడితో చెప్పకుండా, మనవరాల్ని తీసుకొని వెళ్ళిపోయేడు.

భయంకరమైన షాకు తగిలిందంటే వెన్నలాంటిదైనా, పువ్వులాంటిదైనా, ఆఖరికి, విషంలాంటి మనసైనా సరే చలిస్తుంది. కాని, విచిత్రం ఏమిటంటే. ఆ షాకుకి, భీమసేనరావుగారి రాయివంటి మనసు కూడా దెబ్బతింది.

అయితే ఓ ఏడాదిలోపున భీమసేనరావుగారు తన బీటలు వేసిన రాతి పలకని సిమెంటుతో సరిగా కలిపేసుకోగలిగేరు. శాంతంగా గంభీరంగా ఆయన తన వ్యాపారాలు యథాప్రకారం కొనసాగించుకొంటూ ఉండగా, ఆయన భార్య పోయిన ఏడాదినాడు, సరిగ్గా అదేరోజున,

ఉదయం ఆరో గంటకల్లా భీమ సేనరావుగారి బంగళా పోర్టికోలో ఓ టాక్సీకారు ఆగింది: ఆ కార్లోంచి ఓ ముప్ఫయేళ్ళ ఆడమనిషి దిగింది.

ఆమెని చూడగానే వెంకన్న వెళ్ళి భీమ సేనరావుగార్ని లేపి పిల్చుకు వచ్చేడు. నైట్ డ్రెస్‌మీద వదులు కోటు తొడుక్కొని నడుం దగ్గర ముడి వేసుకొంటూ గంభీరంగా మెట్లుదిగి హాల్లోకి వచ్చేరు భీమ సేనరావుగారు.

ఆయన కెదురుగా వెండి బంగారబ్బొమ్మ అతనికంటె గంభీరంగా నిల్చొని ఉంది.

గంభీరంగా ఉన్నప్పటికి విశ్వమోహిని చాలా శాంతంగా కనిపిస్తోంది. ఆమె జాలికళ్ళు భీమ సేనరావుగారిని చూడగానే వింతంగా మెరిసేయి. సిల్కు రుమాల్లో చుట్టిన పూల గుత్తిలా ఆమె ఆ ఉదయం ఆ హాల్లో చాలా మనోహరంగా కనిపించింది. అయితే, ఆమె అందం, ఆ సమయంలో, మెరిసే ఉదయకాంతిలా కాకుండా తడిసిన చంద్రకాంతిలా జాలిగా ఉంది.

"నాయనగారు పోయేరు" అంది విశ్వమోహిని.

భీమ సేనరావు రాతి బొమ్మలా నిల్చున్నాడు. అతనికి అన్ని సంగతులూ తెలుసు.

నాయనగారు మనవరాల్ని ఇవతల సంరక్షించుకొంటూనే అవతల నుంచి తమ్ముడి కొడుకుని దత్తత చేసుకున్నారు; దత్తత చేసుకున్నాక మతి పోగొట్టుకున్నారు. మతి పోగొట్టుకొని ఆ దురవస్థలోనే ఆయన కాలం చేసేరు, కాలంచేసి అప్పుడే రెండు నెలలకాలం అయింది. తెలుస్తెలుసు భీమ సేనరావుకి అన్నీ తెలుసుకాని,

ప్రస్తుతం ఇక్కడికి తమరెందుకొచ్చినట్టు ?

అని ప్రశ్నించకుండా ప్రశ్నించేడు భీమ సేనరావు.

"వత్తులకీ మాకూ సరిపడలేదు" అంది విశ్వమోహిని.

భీమ సేనరావు మాట్లాడలేదు.

"ఇప్పుడు మరి ఇలా వచ్చేరేం"

ఎవ రెవరు వచ్చేరు ?

అని అడగలేదు భీమ సేనరావు

"ద త్తత మర్నాడే నాయనగారు దత్తులతో పంపకాల దస్తావేజు రాయించుకున్నారట."

భీమ సేనరావు ఇద్దరూ చెరిసగం వాటాలు వేసుకున్నారట అప్రమత్తంగా ఉన్నాడే కాని మాట్లాడలేదు.

"ఆ మర్నాడు నాయనగారు వీలు రాసేరు."

"ఏమని ? "

అని అడుగుదాం అనుకున్నాడు భీమ సేనరావు.

"ఆయన వాటాలో సగంవాటా పద్మజకి రాసేరు."

భీమ సేనరావు మాట్లాడలేదు.

"పిల్ల ఇంకా మైనరు కాబట్టి గార్డియన్‌గా మిమ్మల్ని నియమించేరు. "

భీమ సేనరావు కదిలినట్టుగా కనిపించలేదు.

విశ్వమోహిని అంతవరకూ తాపీగా శాంతంగా మాట్లాడింది. కాని, భీమ సేనరావెంతకీ మౌనవ్రతం విడవకపోయేసరికి ఆమెకి కోపం వచ్చినట్టుంది. ఆమె అతని కళ్ళల్లోకి సూటిగా చురుగ్గా చూసి, పదునైన కత్తితో ఒక్కొక్క వాక్యంలోని ఒక్కొక్క మాటనీ మాంసం కోసినట్టు కోసి అతని మీదకి విసిరినట్టుగా చెప్పింది.

"శ్యామల విషయంలో భగవంతుడు మీకు అపచారమే చేసేడు ! ఘోరమైన అన్యాయమే చేసేడు !"

"అపచారం చేసింది భగవంతుడు కాదు." అన్ని సినిమాల్లో మనుష్యుల్లా గంభీరంగా పలికేడు భీమ సే్నావు.

కోసే కత్తి ఒక క్షణం సర్దుకొందికి ఆపినట్టు ఓ క్షణం ఆగి చెప్పింది విశ్వమోహిని.

"అవును ! భగవంతుడుకాదు. మా నాయనగారే చేసేరు. శ్యామల కూడా చేసింది. కాని, చేసిన ఆ అపచారాలకి తగినట్టుగా వారంతా శిక్ష

అనుభవించి మానిపోయి, పూర్తిగా పోనే పోయేరు. ఎవరు ఎవరియెడల ఎన్ని తప్పులు చేసినా పద్మజ మాత్రం ఎవరియెడలా ఏ తప్పూ చెయ్య లేదు. ఇప్పుడు ఆ చిన్నపిల్లకి ఆమె ఆస్తికి. అన్నింటికి మీరే గార్డి యన్లు. ఏంచేసినాసరే ఏం చేసుకోక పోయినా సరే. అదంతా మీఇష్టం. కాని ఒక్క విషయం మాత్రం మీరు గ్రహించగలరు. మీరు పద్మజ సంరక్షణ గురించి ముందుకి రాకపోయినంతమాత్రంచేత ఆ పిల్ల దిక్కు మాలిపోయినట్టుండిపోదు. పద్మజకోసం కాకపోయినా ఆమె ఆస్తిని రక్షించి కాపాడేందుకు నే నొక్క ర్తెనేకాదు లక్షమంది ముందుకొస్తారు. అందరికంటే ముందు మా ప్లీడరుగారే అందుకు తయారయిపోయి ముందుకొచ్చి కదలకుండా కూర్చుంటారు. ఆ పైన మీఇష్టం! పిల్ల సంరక్షణ నేను చూసుకోగలను. ఆస్తి సంరక్షణ నాకు సరిగా చేతగాదు. అది మీలాంటి పెద్దలు చెయ్యాలి!"

అని తీవ్రంగా చెప్పి ఆగింది విశ్వమోహిని.

"నూరుదాకా లెక్కపెడతాను. నూరు దాటేలోపున ఇతను "సరే" అన్నాడా సరే! లేకపోతే, నూరు దాటిన తరువాత, భగవంతుడు వొచ్చి ఇక్కడ ఉండమని చెప్పినాసరే ఉండను ఉండను!" అని గట్టిగా (మన సులో) తీర్మానించుకొంది విశ్వమోహిని.

ఒకటి, రెండు, మూడు....ముప్ఫైవరకూ ఆమె లెక్కపెట్టేసరికల్లా.

"నిల్చొనే ఉండిపోయేరు. కూర్చోండి." అని సోఫా చూపించేడు భీమసేనరావు.

అప్పుడు వెళ్ళి, కార్లోంచి పద్మజని ఇంట్లోకి తీసుకు వచ్చింది విశ్వమోహిని. అప్పటినుంచీ ఆమె అక్కడే ఉండిపోయింది.

ఆ తరవాత, భీమసేనరావుగారు చాలా పెద్దవారయేరు, అగ్గి పెట్టెల్లో ఉంటూనే ఆయన సొంతంగా కొన్ని ఏర్పాట్లు చేసుకున్నారు. జిల్లాకి ఖండసారి చక్కెర ఆయనే తెచ్చేరు. పంచదారమర రప్పించినది కూడా ఆయనే. బాంకుల్లో డైరెక్టర్‌గా ఉండడానికి బ్యాంకులు ఆయనకి స్వాగత మిచ్చేయి. పురపాలక సంఘ వ్యవహారాలు తీన్‌తారుగా ఉండి పురప్రముఖు లెవరికీ అవి ఉపయోగకరంగా ఉండక పోడంతో వారే ఆయన్ని ఛైర్మ

న్గా ఉండమని కోరేరు. ఒక టర్మ్ టర్మ్ ఉన్నాక మరో మూడు టర్ములు ఆయనే అందులో ఉండిపోవలసి వచ్చింది. ఆయన లేనిదే ఊళ్లో ఏ పెద్ద పనిగాని ముఖ్యమైన పనిగాని జరగదు. జరగడానికి వీల్లేదు. అనేకమైనటువంటి ముఖ్యమైన పనులు చేస్తూ వాటిలో పూర్తిగా నిమగ్నులయిపోయి ఆయన ఎల్లప్పుడూ ఊపిరి సలపక కొట్టుకొంటూ ఉంటారు.

హై ప్రెషర్ లివింగ్ !

అదే ఆయన కిప్పుడు దెబ్బతీసింది.

ఆ వత్తిడే లేకపోతే ఈ ఆక్సిడెంటు జరగనే జరక్కపోను. లేకపోతే ఆయనకి స్టీరింగ్‌మీద కంట్రోలు తప్పడం ఏమిటి ?

"ఒకసారి తెలివివచ్చి మళ్ళీ తప్పిపోయింది. ఎందుకైనా మంచిది-హాస్పిటల్‌లో అడ్మిట్‌చేద్దాం"అన్నారు పెద్ద డాక్టరుగారు విశ్వమోహనితో.

ఆస్పత్రిలో తండ్రి అడ్మిట్ చేస్తారనేసరికి పద్మజకి హిస్టీరియా వచ్చింది. ఆమెని బలవంతంగా వేరేగా తీసుకుపోయి, మత్తుమందిచ్చి ఆమెని పడుకోబెట్టవలసి వచ్చింది.

మర్నాడు.

పద్మజకి తెలవి వచ్చేసరికి ఉదయం తొమ్మిదిన్నర గంటలయింది. లేస్తూనే ఆమె

"డాడీ ఏడి ?" అని అడిగింది.

"ఆస్పత్రిలో కులాసాగా ఉన్నారు డాడీ," అంది ఆమె పక్కనే కుర్చీలో కూర్చున్న విశ్వమోహిని, ఆమె పద్మజ తల నిమురుతూ, "పద్మా, మరేం భయపడకు! మీ నాన్నగారికి ఏ భయమూలేదు. "అని మృదువుగా చెప్పింది.

"ఆంటీ"ని కౌగలించుకొని అలా పది నిముషాలపాటు ఉండిపోయి ఆ తరువాత చంగున లేచి ముస్తాబయింది పద్మజ, తండ్రిని వేగిరం చూడాలనే తహతహలో ఆమె పావుగంటలో అన్ని కాలకృత్యాలూ ముగించు

కొని గబగబ అయిదు నిమిషాల్లో ముస్తాబయి కార్లో బయల్దేరింది ఆస్పత్రికి.

సూర్యరశ్మి ప్రపంచానికి వజ్రాలపోత పూసినట్టుగా ఉంది. మెల్లగా వీచే చల్లగాలికి పచ్చటిచెట్లు బద్ధకంగా వళ్ళు విరుచు కొంటున్నాయి. పక్షులు కిలకిల మంటున్నా, జనం కలకల లాడుతున్నారు. తారు రోడ్డుమీద పద్మజకారు సరసరమని వెళ్తోంది.

ఆస్పత్రికి పద్మజ వెళ్ళేసరికి పదిగంటలు దాటింది. అందులో ఆరో అంతస్తులో స్పెషల్‌వార్డు లున్నాయి. అక్కడ 'పదో'నెంబరు గదిలోఉన్న తండ్రిని చూడ్డానికి తొందర తొందరగా పద్మజ వెళ్ళేసరికి ఓ నర్సు బైటకి వచ్చి, తలుపులు టక్కుమని మూసేసింది.

"డాడీకీ ఎలా ఉంది?" అని గాభరాగా అడిగింది పద్మజ.

ఆ నర్సు పద్మజ కళ్ళల్లోకి సూటిగా చూసి, మెల్లగా చల్లగా నవ్వింది. ఆమెని చూడగానే నల్లటి రోజ్‌వుడ్ మంచమూ, అందుమీద తెల్లని మెత్తని పరుపూ గుర్తుకొచ్చేయి పద్మజకి.

"మీ డాడీ కులాసాగా హాయిగా నిద్రపోతున్నారు డిస్టర్బ్ చెయ్యకండిప్పుడు. ప్లీజ్!" అని చాలా ఇంపుగా చెప్పింది ఆ తెల్లబట్టల నల్ల నర్సు.

ఆమె మాట ఇంపుగానూ కొంత మృదువుగానూ కూడా ఉంది. కాని, అది మెత్తని సన్నని వీణ పలుకుకాదు; అది చక్కని హార్మోనియపు ఆదట.

ఆమెని వింతగా చూస్తూ అలా నిలబడి పోయింది పద్మజ.

రంగుల కొడుక్కి మందుల తండ్రి - ఒకానొక మంత్రసాని వృత్తాంతము - ఆమె నిష్క్రమించిన తీరు - నల్లని రాధకి పుట్టిన కాఫీరంగు కాశీఆవే ఆమెకు చెల్లెలగుట - భీతంతా ఎగిరిపోయి భక్తంతా మిగిలిపోయిన మందుల భీముడు చిత్త శాంతి సంపాదించిన వైనం - లోకానికి మూల మైన చోర సిద్ధాంతాన్ని వివరిస్తూ ఆతడిచ్చిన పాపోపన్యాసము - అధ్యాయం ఆఖర్న కుతకుత లాడించే ప్రణయవార్త.

# 7

ఛేర్మన్ భీమసేనరావుగార్ని ఆస్పత్రికి తీసుకు వెళ్ళిపోయాక, రంగారావు తన స్కూటర్‌మీద తండ్రిని ఎక్కించుకొని ఇంటి ముఖం

రాత్రి పదకొండు గంటలయింది. సినిమాహాల్స్ దగ్గరా బ్రాదెల్ హవుసెస్ దగ్గరా తప్ప మిగతాచోట్ల అలికిడి బాగా తగ్గింది. నిండుచంద్రుడు చక్కని వెన్నెల్లో కొత్త వెండి పళ్ళెంలా వెలుగుతున్నాడు, వెన్నెలఇచ్చే సుఖంలో చల్లగాలి హాయిగా నిద్రపోతోంది. లోకమంతా ఎంతో బావున్న దని పించింది రంగారావుకి.

ఆ రోజున జరిగిన సంగతులన్నీ తల్చుకొని రంగారావు ఉత్సాహంతో చాలా ఉప్పొంగి పోతున్నాడు. ఆట సరిగ్గా ఆడినట్లయితే మిస్ ప్రేమ తన బుట్టలో పడకపోదని అతనికి ధైర్యం వచ్చేసింది. కాశీగోవుని కనిపెట్టి పట్టుకున్న గుంటనక్కలా, తాహతుకి మించిన అదృష్టం పొందబోతోన్నందుకు అతని నోరంతా ఊటలూరింది. రంగేళీరాజులా అతడు స్కూటర్‌ని స్పీడెక్కించి రయ్యిమని ముందుకి సాగేడు.

రంగారావు రంగేళీ పురుషుడే కాకుండా రంగుల పురుషుడు కూడాను. అతను మంచి మంచి రంగుల బట్టలు వేసుకుంటాడు. అతని బట్టలే కాకుండా అతని జోళ్ళుకూడా తెలుపు ఎరుపు. లేక తెలుపు నలుపు, లేక తెల్లని తెలుపు లేక ఎర్రని ఎరుపు రంగుల్తో బలే తమాషాగ ఉంటాయి. అతనికి రంగు రంగుల హవాయి చెప్పులున్నాయి, రంగు రంగుల కళ్ళద్దాలున్నాయి. అతనిజేబులో రంగైన పర్సుంటుంది. అతను ఆకుపచ్చ సిరా వాడతాడు. అతనికి పక్షుల్లోనూ మనుషుల్లోను కూడా రంగు రంగుల బంగరు చిలుకంటే ఎంతో ఇష్టం. అతనికి పంచరంగుల సినిమాలంటేకూడా చాలాఇష్టం. కరెన్సీ నోట్ల విలువంటే ఎంత ఇష్టమో వాటి చక్కటి రంగులంటేకూడా అతనికి ఇష్టమే. అతనికి పువ్వులంటే ఇష్టమే కాకుండా రంగుల ప్లాస్టిక్ పువ్వులంటే చాలా యిష్టం. రాజులు, సానులు. సినిమా తారలు. కొత్త కారులు, ఎత్తుమేడలు - అదంతా మాంచి రంగుల సరుకు! రంగారావు కూడా "నా పేర్లోనే రంగుంది భాయ్!" అని స్నేహితుల్తో అప్పుడప్పుడు తమాషాగా అంటూంటాడు. సాయంకాలం ఫుట్‌బాల్ గ్రౌండు దగ్గర గుర్రంమీద కూర్చున్నట్టుగా తన స్కూటర్‌మీద కూర్చుని.

రంగారావ్వెనకాతల స్కూటర్‌మీద కూర్చొని వెళ్తున్న అతని తండ్రికూడా ఆ రాత్రి పదకొండు గంటల సమయంలో ఉత్సాహంతో పొంగిపోయే ఉన్నాడు.

ఛేర్మెన్‌గారి కూతురు మన కోడలయిందా మనం కోట్లో పాగా వేసేం అన్నమాటే! అయినా అందుకు మనకదృష్టంవుండాలి. పిల్లొప్పుకున్నా తండ్రొప్పుకోవాలి. ఇద్దరూ ఒప్పుకున్నా ఆ పెద్దమ్మ - అదొప్ప

కోవాలి. మన పీకలమీదికి అదొహ_్తై! అసిరెమ్మలా అంతకు కన్నా ఉసిరికాయలా దమ్మిడీ అంత నోరూ అదీ-అది పణ్ణివ్వదు....పిల్లకి మను సై తే అది పణ్ణిచ్చేదేంటిలే!....అయినా ఇలాటి విషయాల్లో ఆడదానికి తెంపరితనం ఉండాలా! ఉండనప్పుడు, మొగోడు ఆడదాన్లో ఆ తెంపరి తనం పుట్టించాల! మొగతనం అంటే అది మొగతనం?

అనుకొంటూ వెళ్తున్నాడు రంగారావు తండ్రి. అతనికి ఆ రోజున ఆ రాత్రి సమయంలో, తన కొడుకు చాకచక్యంగా పిల్లదాన్ని తనచుట్టూ తిప్పుకోగలడని, ఒక విధమైన ధైర్యం వచ్చేసింది. అందుచేతనే అతను చాలా ఉత్సాహంగా ఉన్నాడు.

ఛేర్మన్ భీమసేనరావుగారిని ఊరంతా ఎరుగుదురు.

రంగారావు తండ్రి పేరుకూడా భీమసేనరావే. కాని అతణ్ని మందుల భీముడంటేనే చాలామందికి తెలుస్తుంది. అతను ఛేర్మన్ భీమసేనరావుగారికి బంధువేం కాడు. పులికి పిల్లి చుట్టం అయినట్టే ఛేర్మన్ భీముడికి మందుల భీముడు చుట్టం. కాని, అతను అయిదారు సంవత్సరాలనుంచీ హడావిడిగా ముందుకొచ్చి, ఛేర్మన్‌గారికీ తనకీ ఉండే గోరంత బంధుత్వాన్ని కొండంత చేసి, ఛేర్మన్ గారింట్లో ఇంట్లో మనిషిలా మసుల్తూ గొప్ప దర్జాగా తిరుగు తున్నాడు. అతనికి ధైర్యమూ పట్టుదలా ఉన్నాయని అతనంటే ఇష్టమున్న వాళ్ళంటారు. అతనికి సిగ్గూ లజ్జా లేవని అతనంటే ఇష్టంలేని వారంటారు. అతణ్ని చూస్తే ఆ రెండు మాటలూ కూడా నిజమే అనిపిస్తుంది.

మందుల భీమసేనరావు చాలాకాలం కిందట ఓ మందులషాపు పెట్టేడు. అధి బాగానే నడిచింది. కాని దివాలా తీసిం ది. వాలా తీసేక. ఆ షాపు అతన్దికాదనీ, అతను వట్టి మానేజిమెంటుమాత్రం చేసేవాడని తెలిసింది. ఆ షాపులో తను చాలా దెబ్బతిన్నానని అనడంమాత్రం అతను ఎన్నటికీ మానడు. అతని నాలిక్కి మందంటే ఇష్టం అని చాలామందికి తెలుసు. మందులతో అతనికి ఆ విధాలుగా సంబంధం ఉండటంవల్ల (కాబోలు) అతనికి మందుల భీముడని పేరువచ్చింది.

మందులషాపువారిచేత దీ: తీయించేక మందుల భీముడు రక రకాల పనులు చేసేడు. సున్నాలు పెన్నుల దగ్గర్నించి కోళ్లూ గొర్రెల దాకా అతను చాలా వ్యాపారాలు చేసేడు. తను మిలిటరీకి కూడా వెళ్ళేనని అతను అందరితోనూ చెప్తూంటాడు. అతనికి చాలామంది స్నేహితులుంటూం టారు. వారెప్పుడూ మారుతూఉంటారు. కొన్నాళ్ళు స్నేహంచేసేక ఎవరైనా సరే అతని గురించి చెడ్డగా చెప్తారు; కాని దెబ్బతిన్నది తనుకాదు కాబట్టి అతనెప్పుడూ వారి గురించి మంచిగానే చెప్తాడు. వాళ్ళు ఇతని గురించి చెడ్డ చెప్పినప్పటికీ ఇతను వాళ్ళగురించి మంచి చెప్పడంవల్ల, అతనే మంచి వాడు వాళ్ళే చెడ్డవాళ్ళు అనిపిస్తుంది విన్నవారికి.

సుమారు ఆరు సంవత్సరాలక్రిందట మున్సిపల్ ఎలక్షన్స్ వచ్చాయి. అప్పుడొక సిటింగ్ కౌన్సిలర్‌మీద పోటీ చేసేడు మందుల భీమసేన్రావు. అప్పుడే అతనికి ఛైర్మన్ భీమసేనరావుగారితో బాగా మాట్లాడం జరిగింది. సిటింగ్ కౌన్సిలర్ ఛేర్మన్‌గారి సపోర్టరు. "ఆడు పాప్యులర్ మనిషికాడు. అంచేత నాకు సపోర్టు చెయ్యండి" అని బతిమాలు కున్నాడు మందుల భీముడు. ఒక్క అయిదు వందలిస్తే చాలని నెగ్గేక "మీకే ఛేర్మన్ ఎన్నికలో ఓటెయ్యకపోతే నేనో అమ్మకీ అబ్బకీ పుట్టినోణ్ని కాను!" అన్నాడు. కాని ఛేర్మన్‌గారు వినుకున్నారు కారు. అప్పుడు అవతలి ఛేర్మన్ కాండిడేట్ దగ్గర ఓ రెండు వందలు బదులు పుచ్చుకొన్నాడు మందుల భీముడు. అతను ఆ ఎలక్షన్లో పెద్ద మెజారిటీతో నెగ్గడం జరిగింది. అవతలివాడు పరమ దుర్మార్గుడని అందరికీ వెల్లడయిపోవడంవల్ల మందుల భీముడు నెగ్గేడు, కాని తన మంచితనం వల్లకాదు; కాకపోయినప్పటికి మందుల భీముడు అతనికంటే పాపులర్ అయేడు. ఛేర్మన్ ఎలక్షన్స్ టైంలోనే అతనికి చాలా జరూరుగా వెయ్యి రూపాయిలు కావలసివచ్చేయి" అని ఛేర్మన్ భీమసేనరావుగారు అతనికి సర్దుబాటుచేసి మందుల భీముడికి ఆపద సమయంలో—బంధు ప్రేమవల్ల— అడ్డుపడ్డారు. ఆ వెయ్యిలోనూ రెండువందలు, అవతలి కాండిడేట్‌దగ్గిర తెచ్చిన బదులు తీర్చడానికి ఖర్చయేయి.

మున్సిపల్ కౌన్సిలర్ అయాక మందుల భీముడు జ్ఞాని అయేడని చెప్పడం నిజంకాదు. అప్పటికప్పుడే అతను ఒకటోరకం జ్ఞాని. కాని, కౌన్సిల్లో ప్రవేశించేక అతను మర్మాలెన్నో తెలుసుకొని తన కాయాన్ని పెంచుకున్నట్టే తన జ్ఞానాన్ని కూడా పెంచుకొని పూటుపడ్డాడు. "ఈ కలి కాలంలో బావుపడాలీ అంటే ఒక్కటే మార్గం! వక్రమార్గమే అయినప్పటి కిన్ని అది చక్కని మార్గం! సిగ్గు దైవభీతీ లజ్జ పాపభీతి విడిచిపెట్టిన మార్గమే భాగ్యలక్ష్మికి దగ్గర మార్గము. అందుచేత అయమేవ మార్గం మమ!" అని సరిగ్గా అవే మాటలు అనుకోనప్పటికీ ఆ విధమైన నిశ్చయానికి వచ్చేడు మందుల భీముడు.

అలా జ్ఞానం సంపాదించి కృతనిశ్చయుడైన తరవాత మందుల భీముడు ఊళ్ళో చెలరేగి విజృంభించేడు. రంగులూ ప్లేట్లూ మార్చడం ఫిరాయించడంలోని లాభాలు అతను తెలుసుకొని వాటిని పునఃపునః మార్చి ఫిరాయించడం నేర్చుకున్నాడు. బ్లాక్ మేల్ అంటే అర్థం తెలుసుకున్నాడు. రాజకీయపార్టీలు ఎందుకున్నాయో! మంచి వ్యాపారం అంటే ఏమిటో దొంగ వ్యాపారం అంటే ఏమిటో ఆ వ్యాపారాలకి రాజకీయాలకి ఉండే సంబంధం ఏమిటో అతను బాగా బోధపర్చుకున్నాడు. రజ్జు సర్పభ్రాంతి అర్థం అయేసరికి ఆదిశంకరులకి అద్వైతం అంతా అర్థం అయిపోయి నట్టు, మాయమార్గం తెలుసుకున్నాక మందుల భీముడికి మనిషి జీవితం అంతా స్పష్టంగా తెలిసిపోయింది. యాభయ్యేళ్ళు దాటి ఇప్పు డతనికి డబ్బు జ్ఞానం సంపాదించడానికి యుక్తమైన వయసొచ్చి. ఆ రెండింటి లోనూ మొదటిది కొంతగానూ రెండోది పూర్తిగానూ సంపాదించేసరికి అతని రూపుకూడా అందుకు తగినట్టుగా మారింది. ఇప్పుడతను సరువు కొచ్చిన పులిలాగ, ముదిరిన సింహంలాగ, బలిసిన కొండచిలువలాగ అందంగా గంభీరంగా భయంకరంగా కనిపిస్తాడు.

మందుల భీముడికి అందానికి తగ్గ సరసంకూడా ఎంతో ఎక్కువగా ఉండేది. అతను ఒకప్పుడు చాలా విధూజన ప్రియుడూ చెడిపోయిన మానినీ మానస చోరుడూనూ - అయితే, అతను అలనాడు వారందరివల్లా

చెడిపోయేదే కాని బాగుపడలేదు. ఒక్క కాళ్ళ రాధమాత్రం అతనికి తన జీవితం అర్పించింది.

ఆవిడ చాలా నల్లగా వుండడంచేత అవిణ్ని కర్రిరాధ లేక నల్ల రాధ లేక కాళరాధ అని అందరూ అంటూండేవారు. కాళ్లు కొంచెం పొడు గవడంచేత, ఆవిణ్ని కాళ్ళ రాధ అని కూడా చాలామంది అనేవారు. ఆమె కారునల్లగా ఉండేది. ఆమెకి అందం లేకపోయినప్పటికి అదొక రకమైన వింత ఆకర్షణ వుండేది. ఆమెలోని మంచితనంవల్ల ఆమెకొక చల్లదనం వచ్చింది. అమాయకంగా ఉండేవారి చల్లదనమే దొంగల్ని ఆకర్షిస్తుంది. అందుచేత ఆమె వెనక తిరిగేవాళ్ళు చాలామంది ఉండేవారు.

కాని, రాధ మాత్రం భీముణ్నే నమ్ముకుంది.

కాళ్ళ రాధ మంత్రసాని పని చేసేది. ఆమెకి పధ్నాలుగోయేట పెళ్ళయింది. ఆమె ఇరవయ్యోయేట ఆమె భర్తపోయేడు. అప్పటికి ఆమె కుమార్తెకి అయిదేళ్ళు.

భర్తతో రాధకి సౌఖ్యం లేనేలేకపోయింది. ఆ పెళ్ళి అతనికి ఇష్టంలేని పెళ్ళి, పెళ్ళి జరిగిన మూడేళ్ళలో అతను భార్యనీ కూతుర్నీ విడిచిపెట్టేశాడు. మరో మూడేళ్ళకి చనిపోయేడు. రాధకి ఆ జీవితంఅంతా అదేదో కలలా కనిపించింది. ఆ కూతురుకూడా "నిజంగా నా కూతురేనా" అనిపించిదామెకి. తనని అమ్మా అని పిలవటానికి బదులుగా తనని "అక్కా!" అని పిలవటం ఆ పిల్ల కెందుకోగాని చాలా గమ్మత్తుగా అలవాటయింది. అందువల్ల ఆ పిల్లపేరు మంగ అయినప్పటికీ తను మాత్రం "చెల్లెమ్మా" అని పిల్చేది.

ఆ తరువాత ఆమెకి మందుల భీముడు తారసిల్లేడు. ఆమెకి అతణ్ని చూడగానే ఎందు వల్లనో అతనియందు మనసు లగ్నమయి పోయింది. అతణ్ని ఆమె అతని భార్యకంటే ఎక్కువగా దాసిగా బానిసగా ప్రేమిం చింది.

ప్రేమించే బానిసలు దొరికితే ఎన్ని లాభాలుంటాయో మందుల భీముడు తెలుసుకొని ఆ ప్రేమలోని లాభాన్నంతా పూర్తిగా ఖర్చుచేసు

కున్నాడు. కాళ్ళ రాధకి అతన్తో సంబంధం తప్పుగా తోచలేదు. తనకి చిన్నప్పుడు చేసిన పెళ్ళి. అది పెద్దలు చేసిన పెళ్ళనీ, ఆ భర్త తనకి దైవమిచ్చిన భర్తకాడనీ, అందుకే భగవంతుడతణ్ణి చంపేసి తనకి నిజమైన భర్తని ప్రసాదించేడనీ ఆమె ఒక గట్టి నమ్మకం ఏర్పరచుకొంది. దాన్తో ఆమెకి మందుల భీముడియందు ఇంకా ఎక్కువ ఎంతో ఎక్కువ మమకారం ఏర్పడింది. ఆమె తన సర్వస్వం అతని కర్పించింది. మందుల భీముడు లేకపోతే జీవితం ఎందుకో ఆమెకి తెలిసేదికాదు.

కాళ్లరాధ ప్రేమ మందుల భీముడికి బాగా నచ్చింది. అవిణ్ని ఆవిడ ఎంతో తక్కువ చేసుకొని తనని ఎంతో ఎక్కువ చేసుకొని చూసుకొంటోందని అతను సులభంగా గ్రహించేడు. తను సిగరెట్టు కాలుస్తే ఆమెకి సరదా; తను చుట్ట కాల్చితే అదికూడా ఆమెకి సరదా; తను విస్కీ తాగితే ఆమెకది ఎంతో గొప్ప సరదా; తను ఏం చేసినా ఆమెకది సరదావే!

కర్రిరాధ మంత్రసానిగా సంపాదించిన కాసుల డబ్బంతా మందుల భీముడి విలాసాలకి విస్కీబుడ్లకే ఖర్చయింది. అతనికి నిత్య జీవితంలో ఏ చిక్కులొచ్చినా అతను తిన్నగా వెళ్ళి కాళ్ళరాధ ఇంట్లో కాళ్ళు నిగడ చన్ని పడుక్కొనేవాడు. ఆమె అతని అడుగులకి మడుగులొత్తి అతనికి సేద తీర్చేది. అతనికి డబ్బు ఎంత లేకపోయినప్పటికీ సొదరు ఖర్చుకి మాత్రం, కాళ్ళరాధ దయవల్ల అతనెప్పుడూ ఇబ్బంది పడలేదు.

జీవితం తనకీ అతనికీ కూడా అలా హాయిగా వెళ్తుందనే అనుకొంది కాళ్ళరాధ.

కాని, అయిదారేళ్ళ క్రితం ఆమె జీవితంలో ఘోరమైన తుఫాను చెలరేగింది. మందుల భీముడికీ మరికొందరు ఆడవాళ్ళకీ సంబంధా లున్నాయని ఆమెకి చూచాయగా తెలిసింది. ఆ రోజుల్లోనే మున్సిపల్ ఎలక్షన్స్ హడావిడిలో మందుల భీముడు ఆమెతో కలిసి కాలక్షేపంచేసే టైం తగ్గించేడు. దానితో ఆమెకి అదొకవిధమైన గాభరా పట్టుకొంది. మందుల

భీముడు మున్సిపల్ కౌన్సిలర్ అయి ఎవరెవరో పెద్ద పెద్ద ఆడవాళ్ళ వలల్లో చిక్కుకుపోయి తనకి దక్కకుండా పోతాడేమోననే తీరని భయం ఆమెని పట్టుకు పీడించ నారంభించింది - తన నిజనాథుడికి నిజంగా ఇతర స్త్రీలతో సంబంధం ఉందని తెలిసేసరికి ఆమె ఘోరంగా బాధపడింది. దానితో ఆమె ఏపనీ చెయ్యలేక పోయేది. ఏపని చేదామన్నా ఆమెకి ఆసక్తి లేక పోయేది. ఓనాడు మధ్యాహ్నం పన్నెండు గంటలకి ఒకరింట్లో కాన్పు పొయ్యడానికి వస్తానని చెప్పి వెళ్ళలేక కూర్చోబడిపోయింది. కబురుమీద కబురొచ్చి ఆమె అక్కడికి వెళ్ళేసరికి అక్కడ తల్లీపిల్లా చచ్చేసిఉన్నారు. ఆరోజున ఎంతో అల్లరయింది. తన మనసు చెడిపోడంవల్ల రెండు నిండు ప్రాణాలు పోయాయన్న బాధతో కాళ్ళరాధ వారంరోజులు మంచంమీంచి లేవలేకపోయింది. ఆ తరువాత ఆమె ఏదోవిధంగా లేచి తిరగ్గలిగినా ఆమె వృత్తిలో ఆమెకొక చెడ్డపేరు వచ్చేసింది. ఆమెకి లోకం అంతా తన శత్రువులతో నిండిపోయినట్లు కనిపించ సాగింది. కొంచెం వయసులో ఉన్న ఏమాత్రం అందమైన ఆడమనిషి కనిపించినా ఆమె మనసంతా ఈర్ష్యతో కుమిలిపోయేది. ఆమెకి జీవితం దుర్భర మనిపించింది. ఆ విధంగా జీవితం సాగించినా అది తనని త్వరలోనే ఏ అగాధంలోకో దింపక తప్పదని ఆమె తెలుసుకొంది.

మందుల భీముడు మున్సిపల్ కౌన్సిలర్ అవుతే తనకి మరింక దక్కడని ఆమెకు గట్టి అనుమానం కుదిరిపోవడంవల్ల అతను ఎలక్షన్‌లో నెగ్గకూడదని ఆమె భగవంతుణ్ని ఎంతగానో ప్రార్థించింది. అతను నెగ్గకుండా ఉంటే సింహాచలం దేవుడికి తన జుట్టంతా ఇచ్చేస్తానని మొక్కుకొంది.

మున్సిపల్ కౌన్సిలర్‌గా మందుల భీముడు ఎన్నికైనరోజున ఆమెకి కాళ్లూ చేతులూ చల్లబడిపోయినట్లయి పోయింది. అప్పటి కప్పుడే ఆమె సగం చిక్కిపోయింది. ఆ రోజల్లా ఆమె వలవల ఏడ్చింది.

కాళరాధకి పాతకాలపు పతివ్రతల కధలు మోడర్న్ ప్రేమ కధలూ చదవడం అన్నా, వాటిని తెరమీద చూడ్డం అన్నా ఎంతో యిష్టం.

ఆ భావాలన్నీ ఆమె మనసులో నిండుకొని ఆ మనసులో భాగంగా అయి పోయేయి. తన నాథుణ్ని తను రక్షించుకొందికి ఆమె ఏదైనా ఘోరమైన త్యాగం చెయ్యాలని సంకల్పించుకొంది. "అర్ధశేరు రక్తమైనాసరే ఆస్పత్రి వాళ్ళకి దానం ఇచ్చేస్తాను. లేదా అమ్మవారికి నైవేద్యం ఇచ్చేస్తాను" అని తీర్మానించుకొందామె.

ఆనాటిరాత్రి కాళరాధ పక్కలో మందుల భీముడు లేడు: మంగే ఉంది.

మంగకి అప్పటికి పద్దెనిమిదేళ్ళు, ట్యుటోరియల్ స్కూల్లో చదివి మెట్రిక్యులేషన్ పరీక్షకి కట్టి పాసయింది. ఆమె తల్లిలా నలుపే అయి నప్పటికీ తల్లంత నలుపుకాదు. కర్రిరాధ మిరియాల కషాయంలా ఉంటే, ఆ కషాయంలో కొంచెం పాలుపోసినట్టుంటుందిమంగ. ఆ పిల్లకి వయసుతోపాటు నునుపుకూడా వచ్చింది. తెల్లని చీర కట్టుకుంటే ఆమె కంచు విగ్రహానికి చీరె కట్టినట్టుగా కనిపించేది. చూడ్డానికి అంత గట్టిగా ఉన్నా ముట్టుకొందికిమాత్రం ఆమె ఎంతో మెత్తగా ఉండేది. గాలి కొడు తూంటే కారుచక్రపు ట్యూబు పొంగినట్టు ఆమె పొంగుతూండటం చూసి మందుల భీముడోసారి, "రాధా! పెద్దయితేనే నీ చెల్లెమ్మ ఊరంతా ఓ ఏలుబడి ఏలేగల్దు?" అని మెచ్చుకున్నాడు. అతను మెచ్చుకున్న నాటికి నల్ల కలువలా వికసిస్తున్న మంగ ఆ తరవాత అతి త్వరలోనే కాఫీరంగు కాశీ ఆవులా బలిసింది. ఆమెలో ఆరోగ్యపు శక్తి నిండా నిండుకొని, కళ్ళల్లోంచీ, బుగ్గల్లోంచీ, గుండెల్లోంచీ పెదవుల్లోంచీ పలువరసల నవ్వు ల్లోంచీ పొంగి పొర్ల నారంభించింది. నిండా చల్లని నీళ్ళతో నిండుకున్న మంచినీళ్ళ కూజాని చల్లగా చేతుల్తో పట్టుకొని ఎండవేళ ఎత్తుకు తాగాలని పించినట్టు ఆమెని చూసినవా రెవరికైనా ఆమె ఆరోగ్యాన్ని తాగాలనిపించే ట్టుగా ఉండేదామె. వేసవికాలంలో చల్లగానూ, చలికాలంలో వెచ్చగానూ ఉండగలిగేట్టుగా ఉంటుందామె అందం. ఆమె అందం పండిత పామర జనరంజకంగా ఉండడంవల్ల ఆమె చదివే ట్యుటోరియల్ స్కూల్లో ప్రిన్సిపాల్‌గారు ఇద్దరు బంట్రోతుల్ని డిస్మిస్ చేయవలసివచ్చింది.

ఓ తెలుగు పండితుడికి వార్నింగ్ ఇవ్వాల్సివచ్చింది. మరింత స్కూలు స్టూడెంట్సు ఆమె కాళ్ళముందు కెరటాలు విరగబడినట్టు పడుతూండేవారు.

ఆ రాత్రి తన పక్కలో పడుకొని నిశ్చింతగా హాయిగా "అందంగా" నిద్రపోయే మంగని - తన "చెల్లెమ్మ"ని - చూడగానే కాళ్ళరాధ మనసులో ఒక వింతైన ఆలోచన సన్నగా లేచింది. వెన్వెంటనే ఆ ఆలోచన బలంగా చెలరేగింది. తనని "అక్కా" అనే తన కూతురు మందుల భీముణ్ని "బావా!" అని గోముగా పిలుస్తుంది. ఈ తన చెల్లెమ్మని మందుల భీముడికిచ్చి పెళ్ళి చేసేస్తాము?!

ఆ ఆలోచన మెదళ్ళో మెసలగానే కాళ్ళరాధకి మరింక ఆ రాత్రంతా నిద్దరపట్టలేదు.

ఏం? ఎందుకూడదూ?

అది పాపం ఏమో?

అది కూడదేమో?

అని చాలా మథన పడింది, రాధమ్మ ఆమె ఆ రాత్రి తనకి నిజంగా పిచ్చెత్తి పోతుందేమో నని భయపడింది. తను తలచినది "పాపం! పాపం! పాపం!" అని వెయ్యి జిహ్వాలు ఆమె మనసులో జొరబడి ఘోషించేయి.

అది పాపం కాదు కాదు—అది త్యాగం త్యాగం అని సమర్థించు కొందికి ఆమె యమయాతన పడింది. ఆమె కళ్ళంట నీళ్ళు ధారలుగా ప్రవహించేయి. ఆమె వలవల ఏడ్చింది. జుట్టు పీక్కుంది. మంచంకోడుకి తలవేసి కొట్టుకుంది.

కాని, ఆమెకి మందుల భీముణ్ని మరోలా దక్కించుకొనే మార్గం కనిపించలేదు. అందమైన ఆడవాళ్ళ కౌగిళ్ళలో మందుల భీముణ్ని ఊహించుకొని ఆమె బాధతో మండిపోయింది. అతనావిధంగా చెడిపోవడం ఆమె సహించలేక పోయింది. అతను చెడిపోవడానికి వీల్లేదు. వీల్లేదను కొందామె. ఆతను బాగుపడాలంటే తన చెల్లెమ్మ అతణ్ని చేపట్టాలి. అలా అయితేనే అతను బాగుపడతాడు. అందుకు చెల్లెమ్మ కొంతత్యాగం చేస్తుంది.

ఇంత మంచిపిల్ల దొరికేక అతని మనసు మంచికి కట్టుబడిపోయి ఇక్కడే ఉండిపోతుంది.

తను తలచినది తప్పుకాదని నిశ్చయించు కొందికి ఆ ఒక్కరాత్రిలోనూ కాళ్ళరాధ కొన్నివేల నరకబాధ లనుభవించింది. కాని, ఆ నిశ్చయానికి వచ్చేక ఆమె మనసు ఎంతగానో శాంతించింది.

ఆ మర్నాటినుంచీ అందమైన ఆడవాళ్ళను చూస్తే కాళ్ళరాధకి గుండెల్లో బాకులు దూసుకోవడం మానేసేయి. వారిని తన కూతురితో సరిపోల్చుకుని ఆమెకంటె వారేమీ ఎక్కువ్వారు కారని తేల్చుకొంటే ఆమెకెంతో సంతృప్తి కలిగింది.

కాని తీరామోసి, ఆ విషయం చెబ్దాం అతన్తో అనుకొనేసరికి ఆమెనేదో సిగ్గూబాధాకూడా ముంచెత్తి వేసేవి. చీటికీ మాటికీ తన చెల్లెమ్మ చదువూ చెల్లెమ్మ పెళ్ళి, చెల్లెమ్మ అందం అన్నింటి గురించి అతన్తో ముచ్చటిస్తూండేదేకాని అసలు విషయం మాత్రం నోట్లోంచి పెగిలేదికాదు కాని చెల్లెమ్మ అండం గురించి రాధమ్మ మందుల భీముడితో మాట్లాడుతూంటే చెల్లెమ్మ ఓ రోజున చాలా భావగర్భితంగా నవ్వింది. నవ్విన వెంటనే ఏదో ఆలోచిస్తూ సీరియస్‌గా ఉండిపోయింది.

ఆ నవ్వు చూసి ధైర్యం తెచ్చుకొని ఓ రోజున చెల్లెమ్మలేని సమయంలో మందుల భీముడికో ఆ ప్రస్తావన తెచ్చి "రాధకి కృష్ణుడు అల్లుడు కాడా?!"

అడ్డమైన వాళ్ళకోసం అలా తిరుగుతావుకాని వాళ్ళు ఎవరైనాసరే నా చెల్లెమ్మ కాలిగోరికి చాల్తారా?" అంటూ సిగ్గూబాధా కన్నీరూ వేదనాఅంతా అతని గుండెల్లో దాచుకుంది. కాళరాధ.

మధ్యాహ్నం ఒంటిగంటయింది. చీకటిగదిలో పందిరి మంచంమీద ఎత్తు తలగడాలకి చేర్లబడి, వాలుకుర్చీలో కాళ్ళుజాచుకు కూర్చున్నాడు మందుల భీముడు. పంకాలేదు. గదిలో ఉక్కగాఉంది. అతనికి చాలా చమట పట్టేసింది. రాధమ్మ వళ్ళుకూడా చెమటగాఉంది. ఆమె పడేసిగ్గు చాలా భయంకరంగా వుంది.

ఆమె మాటవిని మందుల భీముడు అదిరి పడ్డాడు.

అదరిపడ కొంత సేపటికి—

"హమ్మ ముండా?"

అనుకున్నాడు మందుల భీముడు.

అప్పుడు అతనొక నిశ్చయానికి వచ్చేడు.

అటువంటి నిశ్చయానికి రావడమా మానడమా అని అతను కొంత కాలంనుంచీ సతమత మవుతున్నాడు. తనకి పాతరోజులు పోయి చెడ్డదశ రాబోతోందని అతను అప్పటి కప్పుడే బాగా తెలుసుకున్నాడు. తను మున్సిపల్ కౌన్సిలరయేడు. కొంత డబ్బుకూడా ఛేర్మన్ ఎలక్షన్స్‌లో సంపాదించేడు. పదిమందిని పోగుచేసి సిటీబస్ రూట్ పర్మిట్ కోసం ప్రయత్నం చేస్తున్నాడు. అది తప్పకుండా ఎలానూ వస్తుంది. ఇదివరకు నిల్చోబెట్టి చుట్టముక్కిచ్చి పొమ్మన్న వెధవలే ఇప్పుడు తనకి కుర్చీవేసి కాఫీ ఇస్తున్నారు. తన కొడుక్కి బియ్యే డిగ్రీ రావడమే కాకుండా ఓ మాదిరిగా మంచి నౌఖరీవే దొరికింది. కూతురు హెడియాకూడా ఏదో చిన్నుద్యోగం చేస్తోంది. రాని కెలాగో ఓలాగ ఒహణ్ణితెచ్చి పుస్తె కట్టిం చేవచ్చు.

తను ముందుముందుకి మంచి హైక్లాస్‌లోకి వెళ్ళగలననే ధీమా వచ్చేసింది మందుల భీముడికి.

మరింక తను బాగుపడినకొద్దీ ఈ కర్రిముండ తనని తినేయక తప్పదు. ఇన్నాళ్లూ నేను నీకిచ్చేను; ఇప్పుడు మరి నువ్వు నాకేంటిస్తావ్?" అని పిలక పట్టుకు జాడించగలిగిన మనిషికాని మామూలు మనిషికాదు. పోన్లే దీన్ని ఉంచుకున్నాం అంటే అందువల్ల మనకో పెద్ద పేరా ప్రతిష్టా? ఇది భూలోక రంభాకాదు, సినీమా స్టారూ కాదూ, ఏ చెడి పోయిన జమీన్దార్ గారిదో డబ్బున్న దవేజరు ముండా కాదు. అదృష్టం బావుండి తనవల్ల ఇన్నాళ్ళూ సౌఖ్యం అనుభవించింది. ఎన్నేళ్ళు తపస్సు చేస్తే ఇలాటి ముండలికి తనవంటివాడు దొరుకుతాడు; ఇన్నాళ్ళూ డబ్బిచ్చిందంటే ఇచ్చింది. కాదన్లేదే; కాని ఎందుకోసం ఇచ్చింది? తన

మోజుకొద్దీ ఇచ్చింది. అది డబ్బిచ్చింది. దానికి మనం సౌఖ్యం ఇచ్చేం: అక్కడికది చెల్లు! ఇప్పుడిది డబ్బుకీ ఆరోగ్యానికీ అన్నింటికీ చెడిపోయి ముసిలి ముండయి పోతోంది. తనుచూస్తే "పొద్దుపేళ సూర్యుళ్లా" ప్రకాశిస్తున్నాడు. "దీన్ని ఒగ్గేసి మనం డబ్బూ ఓదాతో పై కెళిపోతాం అన్చెప్పి కూతుర్ని ఎరచూపి తనింట్లోనే మంచంకోడుకి కూతురి జెడతో కట్టేద్దాం అని జూస్తోంది ముండ!"

అసలు దీన్ని ఒగ్గేస్తానని ఎన్నడైనా అన్నానా ?- కూతురితో నన్ను కట్టి పడేయడానికి? డబ్బు జూయిస్సరికి అంత దుర్బుద్ధిపుట్టింది ముండకి! "హమ్మముండా! ఎంత పెద్దప్లాటు ఏసేవే! నీ అదృష్టం బావుంది. ఇన్నాళ్లూ నన్నునుభవించింది చాలక ఇప్పుడు నా డబ్బుకోసరం కూడా ప్లాటేస్తున్నావా? అవున్లె! నాలాటోడు నీకెలా దొరుకుతాళ్ళే?! ఎన్ని జన్మలెత్తితే దొరుకుతాడు? అది నీ అదృష్టం. నీలాటి కోతిని పట్టుకు తిరగడం నా దురదృష్టం. ఎక్కడికి వెళ్ళినా ఎవర్చూసినా సిగ్గు సిగ్గు! అనుభవించేవు చాలు! ఇంకా అనుభవిద్దారనా నీ ఆశ? అందుకు నీ కూతుర్నిచ్చి నాకు పెళ్ళి చేస్తావా? లేకపోతే ఇంకేమైనా చేస్తావా? ఎంత పాపానికి, ఎంత పాపానికి ఒడికట్ట దల్చుకున్నావు?!! అమ్మమ్మమ్మ! నువ్వెంతకైనా సాహసించగలవే!! అయినా, పైన దేవుడున్నాడు, లేకపోతేలేదు; ఆ సత్యన్నారాయణమూర్తి నాయందున్నాదు కాబట్టి కళ్ళు తెరిచ్చూసుకు బావుపడేయోగం నాకుందికాబట్టే - ఆ బాబు నా కళ్ళు తెరిపించేడు. లేకపోతే - పొడుక్కాళ్ళ మంత్రసానిముండా కర్రిముండ? - నాచేతా నీ చెల్లెమ్మచేతా కూడా మహాపాతకం చేయించి పోదువే! నన్ను పీల్చి పిప్పిచేసి సర్వనాశనంచేసి పోయుందివే!

అని ఆ మాదిరిగా దెబ్బలాడి, నల్లరాధతో మందులభీముడు ఆ విధంగా ఆ మధ్యాహ్నంనుంచీ సంబంధం తెంపేసుకొని పూర్తిగా స్వతంత్రుడయేడు.

నల్లరాధతో సంబంధం తెంపుకొందికి వీలుండదేమోనని మందుల భీముడు అప్పటికి కొన్ని రోజులయి చాలాభయపడుతున్నాడు. సంబంధం

తెంపుకొందికి మంచి కారణం కన్పించి తను తప్పుకి పొరకుండా చేసి, తనకి స్వేచ్ఛ ప్రసాదించి, తన మర్యాద కాపాడినందుకు అతను ఆ భగవంతునియందు అమితమైన భక్తితో అన్నవరం వెళ్లి సత్యనారాయణ వ్రతం చేసుకున్నాడు. అక్కడికి వెళ్లేక ఆ దేవుణ్ని చూసేక మాత్రం, రాధయెడలా, ఆమె కూతురియెడలా తను చేసిన పాపాలన్నీ "క్షమించు తండ్రీ — నాకు బుద్ధొచ్చింది, బుద్ధొచ్చింది. క్షమించు తండ్రి" అని చాలా గట్టిగా వేడుకున్నాడు. అంతేకాదు, వెక్కి-వెక్కి ఏడ్చేడు.

దాన్తో మందులభీముడి తలబరువు పూర్తిగా తగ్గిపోయింది. ఆ ప్రార్థనతోనూ ఆ వ్రతంతోనూ చిత్తశాంతి లభించింది. మంగతో తను చేసిన పాపాన్ని భగవంతుడు క్షమించి తీరుతాడనే అతను నమ్మగలిగేడు. పాపం పోయినందువల్ల అతని మనసు చాలా తేలికపడింది.

అన్నవరం వెళ్లి సత్యనారాయణ వ్రతం చెయ్యడానికి ముఖ్యకారణం ఒకటవగా పైవాళ్ళకిమాత్రం మరో కారణం చెప్పేడు మందుల భీముడు.

"కౌన్సిలర్నయితే వ్రొతం చేయిస్తానని మొక్కుకున్నాన్నార్! ఎలక్షనంటే ఎంత డబ్బు ఖర్చవుద్దో మీరెరగరా? ఓడిపోతే ఎంతదెబ్బో ఆలోచిచ్చండి. బీదవాణ్ని, నెగ్గితే అందరూ ఈపు చరిసి బేష్ అంటారు. అల్లో అల్లో అంటూ చేతులు కలుపుతారు. ఓడిపోతే, మనపాట్లు కుక్కలు పడవు. అందెందుకు? మీరే ఇలా పలకరిచ్చరు నన్ను. ఓడిపోతే, నేలమట్టవేఁ! పెద్దెబ్బ తినేసుందును, అంచేత దేవుడికి మొక్కున్నాను. అన్నారంలో వ్రొతం. తిరపతే వెళ్దా రనుకున్నాను. కాని మనకా తాహతేదీ?? చేర్మేనూ మినిష్టర్లూ అయితే అట్టాసంగ తిరపతెళ్తారు. మనకి అన్నారం సింవాచలాలేగతి? అయినా, ఏరాయైనా రాయే అయినట్టు ఏ దేవుడైనా దేవుడేకదా! ఏటంటారు?"

అని నవ్వుతూ స్నేహితులతో చెప్పుకున్నాడు మందుల భీముడు. దాన్తో అతను మంచి దైవ భక్తుడనే సంగతి అందరికీ వెల్లడయింది.

అన్నవరం దేవుడికి మందుల భీముడు జుట్టంతా ఇచ్చేసి, పచ్చగా గుండు చేయించుకోడంతో అతను వింతగా - చంపిన మేకలన్నింటికోసం

చింతించి ప్రాయశ్చిత్తంకోసం గుండు చేయించుకున్న సింహమో పులో మరేదో పెద్ద జంతువులాగ - అతను గమ్మత్తుగా కనిపించేడు. వ్రతం చేసుకొని, గుండు చేయించుకొని వచ్చేసరికి అతన్లో నైర్మల్యం నిశ్చలత్వం కూడా కనిపించసాగేయి. నూనె పిండితో నాలుగు సార్లు నల్చుకు నల్చుకు స్నానం చేసినవాళ్ళా అతను కొత్తగా మెరియ నారంభించేడు. "డబ్బు చేసుకు పూటుపడ్డాడు దొంగ ముండాకొడుకు! చూడు, తనివితో ఎలా మెరుస్తున్నాడో!" అని కిట్టనివాళ్ళు అతనిగురించి చెప్పినప్పటికీ, తనలో వచ్చిన కొత్తమెరుపు తన భక్తికి మెచ్చి భగవంతు డిచ్చిన మెరుపేనని మందుల భీముడు గాఢంగా నమ్మేతాడు.

దుర్మార్గులు కొంతమంది, మందుల భీముడికి దైవభక్తి పాపభీతి లేవంటారు. అవి ప్యూర్ జెలసీమాటలు, పచ్చి అబద్ధంమాటలు. మందుల భీముడికి దైవభక్తీ, పాపభీతీ రెండూ ఉండేవి. అయితే కౌన్సిలర్ అయి వ్రతం చేసివచ్చాక అతనికి దైవభక్తి బాగా ఎక్కువయి పోడంతో పాప భీతి పూర్తిగా తుడుచుకుపోయింది. భగవంతుణ్ని నమ్మినవారికి భయా లన్నీ పోయినట్టు అతనికి పాపభీతులన్నీ పోయి నిశ్చలమైన దైవభక్తే మిగిలింది.

పూర్వకాలంలో, మందులభీముడు పాపాలు చెయ్యకపోలేదు కాని, అవి చెయ్యడానికి అతను పూర్వం భయపడేవాడు, చేసిన తరువాతకూడా భయపడేవాడు. పాపంచేస్తే భగవంతుడు క్షమించడనీ ఈ లోకంలోనే ఈ జన్మలోనే ఏదోవిధంగా అతిఘోరంగా శిక్షిస్తాడనీ అతను నమ్మేవాడు. ఇప్పు డతనికి అటువంటి భయాలన్నీ ఎగిరిపోయి, భగవంతుడియందు సంపూర్ణమైన భక్తి విశ్వాసాలు కుదురుకున్నాయి.

అమితమైన భక్తితోనూ విశ్వాసంతోనూ భగవంతుణ్ని సేవిస్తే ఎంతటి పాపున్నయినాసరే అతను క్షమిస్తాడు. ఆయనదయ అమెరికాలో డబ్బులాంటిది. ఎంత ఇచ్చినా తరగదు. ఆయన దయ సముద్రంలో ఉప్పులాంటిది. ఎంత తీసినా తరగదు. పిల్లకోతి తల్లికోతిని పట్టు కున్నట్టు మనం ఆయన్ని పట్టుకుంటే ఆయన మనల్నెప్పుడూ జారవిడి

చేడు. తల్లిపిల్ల తన పిల్లల్ని కరుచుకు తీసుకుపోయినట్టు మన భక్తికి మెచ్చిన భగవంతుడే మనల్ని ఎక్కడకో అక్కడికి తీసుకుపోయి ఓ పెచ్చని జాగాలో పడేయకపోడు.

అందుచేత....

భగవంతుడియందు భక్తి విశ్వాసాలు ఉంచుకోవడం మనకి చాలా ముఖ్యం.

మరింక పాపాలంటారా ?!

పాపాలు చెయ్యనోడు ఎవడున్నాడుసార్ ! అందరూ చేస్తారు. అల్లా అల్లా అని ఆడు పీకలు కోసేస్తాడు - మనందరం దేవుని బిడ్డలవేఁ అంటూ ఆళ్ళు పీక్కొరికేసి పీల్చుకు తినేస్తారు. అవుసరం ఒచ్చి నప్పుడు పాపాలందరూ చేస్తారు ! అలాగే మనవూఁ చేస్తాం ! చెయ్యనో డెవడు ? చూపించండి ! దొంగ డైరీవ్రాయకండా పోలీసోళ్ళు బతకలేరు దొంగసాచ్చికా లివ్వకండా కరణమ్మునసబులు బతకలేరు. దొంగకేసులో దించకండా ఏ ప్లీడరూ బతకలేడు. దొంగజబ్బులేకపోతే ఏ గుమాస్తాకీ ఆ ఆఫీసరూ సెలవివ్వడు బతకనివ్వడు. దొంగపాలే లేకపోతే పాలోళ్ళు బతకరు, కాఫీ ఒటేలోళ్ళు బతకరు, శాంట్రీఇన్‌సెట్టర్లు బతకరు. దొంగ సర్టిఫికేట్లూ దొంగిజెక్షన్లూ ఇవ్వకండ ఏ డాక్టరూ బతకడు. డబ్బుచ్చుకొని, ఎడ్మాష్టర్‌కి తెలకండా ఇంటికాడ దొంగతనంగ ప్రెయివేటు పాటా లెప్ప కండ ఏ టీచరూ బతకలేడు. దొంగలెక్కల్రాసి దొంగలంచా లిస్తేతప్ప ఏ సావుకారూ బావుపడీ బతకడు. దొంగొడ్డీల్లాక్కండా కాబూలోడు బతకనే బతకడు. దొంగతనంగ లంచాలుచ్చుకోకండ ఏ బంట్రోతు ఏ గుమాస్త ఏ ఆఫీసు బతకనేలేడు. కూలోడి కష్టం దొంగతనం జెయ్యకండ ఏ కంట్రాట్టిరోడూ కూడా బావుపడ్డు, బతకడు. మరింక, ఏంటిగురూ, అలా మాటాడతావేంటి ? పాపం చెయ్యనోడెవడు ? పాపం చెయ్యనోడు పుడమ్మీద ఇంతవరకు పుట్టలేదు. ఏ పాపం ఎరగనోడు బొందితో కైలాసం వెళ్ళాట్ట. నేన్చెప్పిన మాట కాదది. పెద్దల్చెప్పినమాట, మరింక, బొందితో కైలాసానికి గాంధీమహాత్ముడే వెళ్ళలేదు. ఆ బాబు.

రోజుకీ రాంబజన చేసేవోడు. ఎఱ్ఱోడయి చేసీవోడనుకున్నావా?! ఆ బాబుకంటే ఎక్కువ్వోడు ఎక్కడైనా ఉన్నాడనుకున్నావా?! ఏంటి గురూ అలా మాట్టాడతావేంటి? పాపం ప్రతివోడూ చేస్తాడు. పులి మేకని తింటది. మేక గెడ్డి తింటది. ఆ గెడ్డి బూవిన్దిని బతుకుద్ది, ఈ బూదేవి సూర్యచంద్రులమీద బతుకుద్ది, ఆ చెంద్రుడు ఆ సూర్యుడిమీద బతికేస్తాడు. ఏంటి గురూ. నేనన్నమాట నిజఁవేఁనా? మరింక ఆ సూర్యుడు ఎవుడిమీద బతుకుతాడంటావా? అది దేవుడు జెప్పాల! కాని ఆడుకూడా ఎవుడిమీదో ఒవుడిమీద బతకాలే కాని ఏ ఆధారం లేకండ బతుకుతాడంటే నే న్నమ్మను! అంచేత ఏంటంటే ఒకణ్ణొకడు తిను కుంటూ పాపం చేస్తూనే అందరూ బతకాలా! ఆ పాపాలు చమించేదేవేఁ భగవంతుడి ఉజ్జోగం! ఎక్కడా ఎవడూ ఏ పాపవూఁ చెయ్యకపోతే భగవంతుడికి ఉజ్జోగవేఁలేదు—పామ్మీద పడుకోడం గద్దెక్కి షికారెళ్ళడం తప్ప ఆ బాబుకి మరింక ఏరే పన్లుండవు. అంచేత నేననేమాటేవటంటే! తెలిసో తెలకో, నువ్వూ నేనూ గాంధీమాత్ముడూ, మన శేర్మేనూ, కిల్లీ కొట్టు బంగారీ, సారాకొట్టు నూకరాజూ, బోడిగుండు సాములోరూ— ఎవడు? అల్లక్కడ పాత్రాతి బంగళ సుట్టూ పువ్వుల్తోట ఏసుకు నుంటాడు చూడు! ఆడు!—ఆ సావు! లోరూ, అందరూ పాపాల్చేస్తాం. అయితే, ఏటంటే! తెలిసీ శెయ్యకూడదు! తెలిచ్చేసినా, అవసరవైఁతే తప్ప చెయ్యకూడదు; శీమన్సంపకూడదు. నిజవేఁ! కాని, అవసర వైఁతే చంపాల! అదీ ధరమవేఁ ఇదీ ధరమవేఁ! కూలోణ్ణి కొట్ట కూడదు నిజవేఁ! కాని అవసరమైఁతే కొట్టాల? అది ధరమవేఁ, ఇదీ ధరమవేఁ! అయినప్పుడు అయింన ధర్మం; కానప్పుడు యింసే ధర్మం! అవునంటావా? కాదంటావా? అంచేత ఏంటంటే: పాపం ఒప్పుడు చెయ్యాల్సొంటది. అలా పాపం జేసింతరవాత, స్తానంజేసి, ఉపాసం ఉండి, కోవిలకెళ్ళి, బేపనోడికి పావడబ్బులు పారేసి, దేవుడికో కొబ్బరి కాయా పూజా పుష్పాలూ ఇచ్చేసి, లెంప లేసుకొని, దండం పెట్టుకొని దేవుడి ముందు భక్తితో సీమకంటె శిన్నోడివిగా ఉండు! ఆయెనెక;

నీ కష్టాలిగించేవో లేనోటికెయ్యి; అప్పుడు మనసు శాంతిస్తే! అప్పు ణ్నేకు దేవుడవుపిస్తావు; పిలిస్తే పలుకుతావు : !" —

భీతంతా ఎగిరిపోగా భక్తంతా మిగిలిపోయిన మందుల భీముడు. వినేవారెవరైనా ఉంటే, వారికి ప్రపంచంలోని పాపం గురించి ఆ విధంగా విశదీకరించగలడు. అతనో వాదించడం చాలా కష్టం.

నల్లరాధ మనసుని అతను కికివేసిన రోజున ఆమె కుప్పకు పోయిందేతప్ప అతన్తో వాదించలేకపోయింది. "రాధకి కృష్ణుడు అల్లుడయినట్టే" నువ్వూ నాకు అల్లుడివి కాకూడదా అని ఆమె మళ్ళీ అంది, కాని సగంలోనే ఆగిపోయింది. అంతలోనే ఆమె నోరు నొక్కేసేడు మందుల భీముడు.

నువ్వు పురుగులడి చస్తావు! జాగర్త! అలాంటి పాపం మాటలాడినందుకు నీ నాలిక రాలి పడిపోద్ది! సందేహంలేదు! దేవుడికీ మనకీ సామ్యం తెస్తావే జెష్టా! నరుడికీ దేవుడికీ తేడాలేదే యెదవా? ఏభయమూ్ లేనోడు ఏ పాపమైనా జేస్తాడు. భగవంతుడికి భయఁవేఁవిటి? పాపఁ వేటి? అంతా వాడిష్టవేఁ! భగవంతుడితో చేసేతన్చెప్పి ఆ బాబు చేసిన పన్లన్నీ మనం శెయ్యగలవాఁ? ఆబాబు గోవుల్ని కాసేడు, గోవర్ధనఁ వెత్తేడు, గుద్దుకో రాక్షసుణ్ణి సంపేడు, భారతం భారతవంతా ఒక్కడే నడిపేడు; పదారువేలమందిని పెళ్ళాడేడు! అలాగన్చెప్పి నన్నుకూడా అయన్నీ శెయ్యమంటావా? "పదారువేలమందిని పెళ్ళాణ్ణా, పెళ్ళాడక పోయినా కనీసం నను నా కూతుర్నీ అంటావ్ శీశీ శీశీ! దేవుడూస్తెచ్చి నన్ను పాపం జెయ్యమంటావే?! అమ్మ జెష్టా! నువ్వు గుండె త్రీసిన బంటువి! నివురుగప్పిన నిప్పువి! ఇన్నాళ్ళేంటో అనుకున్నానుగాని ఇంత దురమార్గపుదాని వనుకోలేదు.

అసలు ప్లాటు డబ్బుకేసేవు నువు! శీ నీమోం జూడగూడదు!"—

అంటూ మందుల భీముడు ఆమెనొక పాతు పాతీసేడు. అలనాడు, రాజుగా మారిన నల్లనయ్య గొల్లగా మిగిలిపోయిన ఆనాటి రాధని అటు

తరవాత ఎప్పుడైనా చూసేడో లేదో తెలియదుగాని, మందుల భీముడు మాత్రం కౌన్సిలర్ కాగానే తన కర్రిరాధ వైపు కన్నెత్తి చూడ్డం మానేసేడు.

రాధ చాలా ఏడ్చింది. తను చేదామని తలపెట్టిన పని పాపమేమో నని అంతగా బాధపడి చివరికి ఏదో విధంగా సమర్థించుకొని ఆ ఉద్దేశం ఎలాగో కష్టపడి బైటపెట్టేసరికి దాని పరిణామం అంత ఘోరంగా చేయాలనడం ఆమె భరించలేకపోయింది.

తన గొయ్యి తనే తీసుకొని అందులో తనని తానే కప్పెట్టుకున్న ట్లనిపించిందామెకి. అంత పాపపు టాలోచన తనకి రాకపోయినా తన భీముడు తనకి దక్కడేమో అనే ఆలోచన ఆమె మనసుని ఎంతగానో కాల్చేసింది. తనవంటి హీనమైన ప్రాణి ఈ భూలోకంలో ఇంకొకర్తై ఉండదనుకొందామె. తను అంతటి పాపకార్యం తలపెట్టిన పాపానికి భగ వంతుడే తనని శిక్షించే డనుకొంది.

రాధ చాలా ఏడ్చింది. నిప్పుసెగకి కొవ్వు కరిగి కారినట్టు, ఆమె మెదడులోని మంటకి ఆమె కళ్ళు కరిగిపోయి కారిపోతున్నాయా అన్న ట్టుగా ఆమె కన్నీరు కార్చింది.

తరువాత కొన్నాళ్ళకి ఆమెకి నిజం తెలిసివచ్చింది. మందుల భీముడు మంగ శీలం చెరిచేడనీ, అలా చెరచేకే అతను ఆ విధంగా నాటకం ఆడి దొంగనీతులు చెప్పించి దొంగకోపం నటించి తనని దిక్కుమాలినదాన్నిగా చేసి దాటుకు పోయేడనీ ఆమెకి బోధపడేసరికి ఆమెకి గుండె బద్దలయి పోయి మాట పడిపోయి, మరి కొద్ది రోజుల్లోనే ఆమె శాశ్వతంగా నిద్రపోయింది.

పిలికి దైవం అంటూ ఉండదు. పులికి పాపం అంటే తెలీదు. మనుష్యులుగా మసిలే పిల్లులకీ పులులకీ మాత్రం పాపం అంటే తెలు స్తుంది. వారికి దైవం అంటూ ఒక డుంటాడు. కాని, వారు పాపం చెయ్యడానికి వెరువరు. దైవానికి జడియరు—

అని మంచివారు తెలుసుకునేలోపున వారు పాపం దెబ్బకి సగం చస్తారు; తెలుసుకున్నాక - వారిలో నూటికి తొంభైమంది గుండె పగిలి చస్తారు

నల్లరాధ చనిపోయిందని వినగానే మందుల భీముడు నిజంగా చాలా ఏడ్చేడు. ఆమె చాలాకాలం మం
నందుకు అతను చాలా విచారించేడు. తనతో ఆమె స్నేహాన్ని తల్చుకొని అతను ఎంతగానో చింతించేడు. రాధని తల్చుకొనగానే అతనికి ఎన్నెన్నో మధురక్షణాలు జ్ఞప్తికివచ్చి అతను కన్నీరు కార్చేడు. నిజంగా ఆమెని ఏ పెద్ద కులంలోనో ఏదో కాస్త కలిగిన కుటుంబంలో పుట్టినట్లయితే తనకీ ఆమెకీ సంబంధం చెడిపోకుండా ఉండును. ఆమె ఇంకా బతికే ఉండునుకదా అనిపించిందతనికి. అతను ఆ దినం చాలా చాలా దుఃఖించేడు. శవం వెనక శ్మశానికి వెళ్ళకపోయినప్పటికీ, అతను మంగదగ్గరికి వెళ్ళి ఆమెని ఓదార్చేడు. ఓదారుస్తూ ఆమెతోపాటు తను కూడా ఏడ్చేసేడు. ఆ రోజున మంగకి డబ్బు సహాయం చేదామనుకున్నాడు. కాని అంతకంటే ఆమెకి తనేదైనా మంచి ఉద్యోగం ఇప్పించడం మంచిదని భావించి డబ్బివ్వడం ఆపుచేసేడు. ఆ తరువాత ఆమెకి ఉద్యోగం గురించి నిజంగానే ప్రయత్నం చేసేడు. చాలామంది సాయం చెయ్యడంవల్ల ఆమెకి నౌకరీ దొరికింది! ఆమె తన బతుకేదో తను - భగవంతుడి దయవల్ల బతుకుతోంది. "ఎన్ని పాపాల్చేసినా కడకి దిక్కులేకుండా నిల్చున్నవార్ని భగవంతుడు ఓ కంట చూడకపోడు" అని మంగ గురించి అనుకున్నాడు మందుల భీముడు.

నల్లరాధ చనిపోయిన కొన్నాళ్ళకి మందుల భీముడు ఎందుకోగాని మళ్ళీ మరోసారి సత్యనారాయణ వ్రతం చేసేడు. అన్నవరం వెళ్ళలేదు. వ్రతం ఇంటిదగ్గరే చేసేడు. వ్రతం చేసేక తను అదివరకు చేసిన పాపానికి ఏదైనా మిగులుంటే - ఆ పాపంకాస్తా పూర్తిగా పోయినట్టే అతను భావించేడు. అందుకు దాఖలాగా మంగకి నౌఖరీకూడా దొరికింది" మందుల భీముడు అదివరకు చేసిన పాపం ఏకాస్తయినా మిగిలిఉంటే, ఆమెకి నౌఖరీ దొరక్కపోను; ఆ ఉసురంతా మందుల భీముడికి తగిలి ఉండును.

తనుచేసిన పాపాన్ని భగవంతుడు క్షమించేడు కొబట్టే తనకి ఆమె ఉసురు లేకుండా చేసేడు.

ఆ తరవాత మందుల భీముడు నల్లరాధగురించి ఇంత పిసరైనా విచారించలేదు. తనకి అడుగులకి మడుగులొత్తి తనకి ఆమె ఎంతగా లొంగి ఉండేదో తల్చుకొని అతను సంతోషించి గర్విస్తూంటాడు కూడాను.

ముదరదైనాసరే, హైక్లాస్‌లో ఎవర్తయినా, నల్లరాధవంటిది దొరికే ఛాన్సుంటే బావుండునని మందులభీముడు అప్పుడప్పుడు అనుకొంటూ ఉంటాడు. ఛేర్మేనొాదినె ఉందికాని దానికి టెంపరులావు. దానికి టెంపరు లేకపోయినా అది మంచిదే అయినా ఛేర్మెన్‌గాడు దాన్ని ఒగ్గడు మన్దాకా రానివ్వడు. పోన్లె! అయన్నీ మనకెందుకిప్పుడు?! రంగడికైనా అటువంటి హైక్లాస్ ఛాన్సు తగిల్తె అదే సంతోషం? పద్మనే కాని మనోడు అర్థెయ్యి నూటపదార్లు హుండీలో ఏసేస్తాను!!

అని ఆ విధంగా ఆలోచిస్తూ కొడుకు వెనక స్కూటర్ మీద కూర్చొని ఇంటికి వెళ్తున్నాడు మందుల భీముడు. ఆస్పత్రిలో ఛేర్మన్‌గారు అడ్మిట్ అయాక.

పద్మనే కాని తను పెళ్లాడితే సరిగ్గా అంతే సొమ్ము అదే దేవుడికి హుండీలో వేస్తానని ఆ తండ్రి కొడుకు అదే సమయంలో మొక్కుకున్నాడు.

తండ్రీ కొడుకులిద్దరూ ఒకే స్కూటర్‌మీద కూర్చొని ఒకేబాటలో ఒకే ఇంటికి ఒకే విధంగా ఆలోచించి ఒక్కలాగే మొక్కుకొని వెళ్తన్నారు. కాని, వాళ్ళ యింటికి వెళ్ళే వీధి మలుపు తిరిగి ఆ వీధిలోకి ప్రవేశించేసరికి మాత్రం తండ్రీ కొడుకుల ఆలోచనల్లో భేదం ఏర్పడింది.

ఆ వీధి, విశాలంగా లేకపోయినా, చిన్న సందులా మాత్రంలేదు. ఉన్న ఇళ్ళన్నీ పాతకాలపు ఇళ్ళు, మధ్యమధ్య కమ్మల ఇళ్ళుకూడా లేకపోలేదు. రోడ్డు తార్రోడ్డు సాపుగానే ఉంది. కాని ఆ వీధి ఏకారణం వల్లనోగాని పెద్దమంచి "సిరికళ" ఏమీలేదు. కిరాణా కొట్లవాళ్ళూ, పర్కుషాపుల్లో అసిస్టెంటు ఫోర్మన్లూ, రెయిల్వే టికెట్ కలెక్టర్లూ, చెడిపోయిన ప్లీడర్లూ, ఇంటికి పది పోర్షన్ల గుమాస్తాలూ, ఇంకా చిన్నవాళ్లూ ఉండే వీధిలా కనిపిస్తోందా వీధి. ఇళ్ళు పాతవి. వాటిలో కొన్నిం

టీని తిరగదోడి కట్టినప్పటికీ అవి దిట్టంగా కనిపిస్తున్నాయి కాని మోడ ర్న్‌గా కనిపించడంలేదు.

ఆ వీధిలో ఓ వందగజాలదూరం స్కూటర్ ఇంకా వెళ్ళలేదు; అప్పుడే దానికి పదిసార్లు బ్రేకు వెయ్యవలసొచ్చింది. ఒకదాని తరవా తొకటి వందగజాల్లోనూ పది గేదెలు అడ్డొచ్చేయి.

రంగారావు చాలా చిరాకు పడ్డాడు.

ఈ రాజమ్మముండ గేదెలు కాదుకాని టెరిబుల్ న్యూసెన్స్‌గా ఉంది. దానికి బుద్ధి చెప్పడానికి వీధిలో ఎవరికీ దమ్ముల్లేవు. పెద్ద మున్సి పల్ కౌన్సిలర్నంటాడే కాని ఫాదర్‌కే లేవు దమ్ములు. ప్రసాద్‌గాడు ఎన్ని పిటీషన్లు పెడితే మట్టుకు, ఎవడూ కలసి రానప్పుడు, అందువల్ల లాభం - నాట్ ఎ పై, దమ్మిడీ లాభంఉండదు. ఫాదరు మున్సిపల్ కౌన్సి లర్ అవడానికి రాజమ్మే దన్ను. అది ఫాదర్ని ఉపయోగించుకొంటుంది. ఫాదరు దాన్ని ఉపయోగించుకుంటాడు. అది రాణీ. అది రాణీ అయితే ఫాదరు దాని మంత్రి. వీధంతా రాజమ్మ రాజ్యం కింద మారిపోయింది. అది నయాన చెప్తే వినదు; భయపెడదామా అంటే పడదు; దాన్నోట్లో నోరు పెట్టటానికి మనుష లెవరూ ముందుకిరారు. మరింక వీధిలో అంతా దానిష్టమే.

రంగారావుకి ఆ వీధిలో ఉండడం చాలా చిన్నతనంగా ఉంది. ఆమధ్య వాళ్ళ కంపెనీ దొరనొకణ్ణి పిల్చినప్పుడు అతను కార్లో వచ్చి గుమ్మంముందు దిగేడు. కార్లోంచి ఇంట్లోకి వచ్చేలోపున ఆ దొరని రాజమ్మ గేదెలు నిలబెట్టేసి చాలా అమర్యాదా చేసేయి. "దొరమంచోడు" కాబట్టి సరిపోయింది కాని, అటువంటి కంగాళీ వీధిలో నివసించే రంగా రావు యెడల ఆ దొరకి గౌరవం ఏం పెద్దగా పెరిగినట్టులేదు. హెడియా ఎంత తియ్యగా నవ్వినప్పటికీ ఆ తీపినవ్వులు ఆ దొరగారి సూటుమీది పేడమరకలు తీసేయలేకపోయేయి. వెళిపోతూ వెళిపోతూ ఆ దొర, "రాయ్! ఈ సాయంకాలాన్ని నే నెపుడూ మర్చిపోలేను రాయ్! ఇది చెరగని ముద్ర విడిచింది నా మీద!" అంటూ ఛలోక్తిగా చెప్పి, కన్ను గీటి నవ్వేడు. అర్థం సరిగా బోధపడక ఎంతో స్వీటుగా నవ్వేసింది హెడియా, ఏడవలేక నవ్వేడు రంగారావు.

దొర వెళిపోయాక, రంగారావు ఆ రాజమ్మ గేదెల అరాచకాల గురించి తండ్రితో చాలా తగువు లాడేడు.

"దొర్లు ఇలాటివి పట్టించుకోరెస్ ! ఆళ్ళకి ఇలాంటి వంటే సర్దా కూడాను ! ఈదిలో గేదె లుంటే మనకేం బోయింది? మనం ఇంట్లో ఉంటాం. అయి యీదిలో ఉంటాయి మనకేం బోయింది? ఏం బోనప్పుడు ఈ శిన్న శిన్న కంగాళీ తగూల కోసరం అన్జెప్పి మన సపోటర్స్ మీదే మనం కత్తిగడతాంరా ? లేకపోతే, ఈదిలో గేదెలున్నాయన్జెప్పి ఇల్లొగ్గు కెళిపోతావా ?!

అని కొడుకు కోపాన్ని కొట్టిపారేసేడు తండ్రి.

రంగారావుకి ఏం చెయ్యడానికీ తోచలేదు. అతను కోపంతో కుత కుత లాడేడు, ఊరవతల హాయిగా ఏ బంగాళాలోనో ఉండకుండా ఈ గేదెల సందులో తనని పుట్టించి అక్కడే ఓ పాతు పాతేసినందుకు అతను భగవంతుణ్ని తిట్టుకున్నాడు. లక్ష రూపాయలు చేతిలో ఉంటే రాజమ్మ గేదె లన్నింటినీ, కాల్చేసి "పో ముండా, దిక్కున్నచోటుకెళ్లి చెప్పుకో!" అనగలిగి ఉండునో లేనో, కాని, లక్షరూపాయలుంటే ఈ వెధవ్వీధిలో ఉండేగతి ఉండనే ఉండదుకద?

రంగారావు, తనకి లక్షరూపాయలు లేనందుకూ రాజమ్మకి గేదె లున్నందుకూ దేముణ్ని తిట్టుకోడంతప్ప ఇంకేమీ చెయ్యలేకపోయేడు.

ఆ మర్నాడు ఆఫీసులో చాలా "లకీగా" భవానీ శంకర ప్రసాద్‌గాడు తనంతట తనే ఆ ప్రస్తావన తెచ్చేడు.

ఆ వీధిలోనే ప్రసాద్ చుట్టాల దెవరిదో పెద్ద ఖాళీజాగా ఉంది. అ చుట్టాల పర్మిషన్‌మీద ఓ కమ్మల కుటీరం చక్కా వెస్టర్న్ కాటేజ్‌లా వేసుకొని ఇంటద్దె లేకుండా ఉన్నాడు ప్రసాద్‌గాడు. గేదె లన్నింటినీ ఆ చుట్టూ కట్టకపోతే !

"మా ఇంటి చుట్టూ కట్టేస్తుంది. వీధిలో ఒదిలేస్తుంది. చాలా చాలా న్యూసెన్స్‌గా ఉందండీ రంగారావుగారూ !" అన్నాడు ప్రసాద్.

రంగారావుకి వెంటనే ఓ బ్రిలియంట్ ఐడియా తట్టింది.

"హెల్తాఫీసర్‌కి ఘాటుగా ఓ పిటీషను గుద్దు గురూ! తగులు కుంటే నీలాటివాడే ఇలాటి పనికి తగులుకొని, దాన్లాటిదాని ఆటలు కట్టిం చాలి?" అని ప్రసాద్‌కి హుషారిచ్చి అతణ్ని తెగ పొగిడేడు రంగారావు

ఆ విధంగా ఉసిగొలిపి వదిలేసేసరికి మరింక వెర్రిపీరులా తగులు కొని ఆ సంగతి వదలకుండా పట్టుకున్నాడు ప్రసాద్.

"బలే!" అనుకున్నాడు రంగారావు. అంతేకాని, అదో పెద్ద తగువుకింద ముదురుతుందనుకోలేదు.

ఆ తరవాత, ప్రసాద్‌గురించి కొన్ని అనుమానాలు కలగసాగేయి రంగారావుకి. అందుచేత అతను.

"తగువు ముదర్నీ! మనకేం?" అనుకున్నాడు.

ఆ రోజు రాత్రి ఛేర్మన్‌గారి బంగళానుంచి స్కూటర్‌మీద వస్తూ ఆ రాజమ్మ గేదెన్ని తప్పించుకొని తండ్రీ కొడుకులు తమ ఇంటి దగ్గర దిగే సరికి పదకొండు గంటల రాత్రి దాటింది.

స్కూటర్ శబ్దంవిని హెడియా తలుపు తీసింది.

రంగారావు భద్రంగా ఇంటి నడవలో స్కూటర్ పెట్టేలోపున, ఛేర్మన్‌గారి కారు ప్రమాదం గురించి హెడియాతో చెప్పేడు మందుల భీముడు.

"రోజూ అయిదు పెగ్గులేసుకునీవోడు. ఇయాళ ఆరు పెగ్గులేసిన ట్టున్నాడు. స్టీరింగు పట్టుకుంటే చేతులు పబ్లాగిసేయి. అది, దామూ, అసల్సంగతి!"

హెచ్ దమయంతిని ఊరంతా హెడియా హెడియా అని పిలు స్తారు. తండ్రి మాత్రం "దాము!" అని పిలుస్తాడు.

"కారు చెడిపోయింది ఛైర్మన్ మాత్రం సెశ్చేదు. దారాసింగూ కింకాంగూ ఉన్నార్చాడు! ఆళ్ళ తమ్ముళ్ళా దుక్కముక్కలా ఉన్నాడు. ఏక్సిడెంటయిందంటే పచ్చడనే అనుకున్నాను. మళ్ళీ ఛైర్మన్ ఎలక్ష నొస్తే మరో రొండేలయినా తడువు౯ కొందువు౯! కాని ముండాకొడుకు బతికిసేడు. పోన్లె! బతకనీ ఆడు బతికినా మనకి నష్టంలేదు."

అని తనని తను ఊరడించుకొని,

"ఆడి ఏక్సిడెంటు కాదుకాని మనకి కడుపుల కూడు పళ్ళేదు. పై మెంతయింది? పదకొండు దాటుద్దా? దాటుద్ది. మరి మనకి పేగీ ఒడ్డించి! ఆకలేస్తంది. పులుసన్నం మజ్జిగన్నవేఁ కాదు. తినేస్తే ఇయాళ పులుసుగిన్నె అన్నంగిన్నె మజ్జిగ ముంతా కూడా అరాయించుకు పోతాయి. అంతాకలేస్తుంది."

అంటూ భోజనానికి లేచాడు మందుల భీముడు.

తండ్రి భోంచేసేక, అక్కా తమ్ముడూ కూర్చొని కబుర్లు చెప్పు కొంటూ భోంచెయ్యడం వారికి అలవాటు.

మందుల భీముడు కాళ్లూచేతులూ కడుక్కొంటూంటే, రంగారావు ముందు గదిలో జోళ్ళు విప్పుకొంటున్నాడు. తండ్రికి వడ్డించ డానికి వెళ్తూ తమ్ముడితో,

ఇందాట్లా ఆ కమలముండ మళ్ళీ వొచ్చింది. మన పద్మకీ నీ ఫ్రెండు ప్రసాద్ గాడికీ పెద్ద రోగవేఁ పట్టుకుందట. కమల చెప్పింది. రాజమ్మందర్లో ఎర్రిమొకాలని తిడద్దిమాడు. అలాటి ఎర్రిమొకానిని నువ్వు. వాళ్ళెగిరిపోడానికి సిద్దంగుంటే వాళ్ళ తోకలు పట్టుకు వేళ్లాడతావు నువ్వు! డాడీ భోంచెయ్యనీ సంగతంతా చెప్తాను" అంది హేడియా.

అంతవరకూ అనుమాల వేడిమీదే ఉన్నాడు కాని అవి నిజమేనని తెలిసిన ఉకుకుమీద లేడు రంగారావు. మిస్ ప్రేమా ప్రసాదుల ప్రేమ వృత్తాంతం నిజమేనని తెలిసే సరికి అతను కుతకుత ఉడక నారం భించేడు.

చక్కని స్వామివారి విగ్రహంలోనూ, చక్కని మసీదు రాయిలోనూ ఉండే భగవంతుడు అతి చిన్న పెన్సిలు ముక్కల్లోకూడా ఇమిడి ఉండి పాపులకి గుణపాఠం నేర్పగలడని పాఠకులు గ్రహించగలరు-మానవుని పెనుగుడు స్వభావమును గురించి మందులభీముని ఉపన్యాసమును పాఠకులు వినగలరు. ఒక పాపి పశ్చాత్తాపం చెంది ఏ విధంగా పునీతుడయినాడో పాఠకులు తెలుసుకొనగలరు. శివాలెత్తడానికి సిద్ధంగా ఉన్న రాజమ్మని అధ్యాయం ఆఖర్న పాఠకులు చూడగలరు. మధ్యలో రామారావు పతనం గురించి పాఠకులు మర్చిపోగలరు.

# 8

అవతలి గదిలో మందుల భీముడు భోజనం చేస్తున్నాడు. ఇవతలి గదిలో సోఫాలో కూర్చొని హెడియా చెప్పిన సంగతి గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు రంగారావు.

రాత్రి పదకొండు గంటలు దాటింది. గదిలో వెలిగే ట్యూటులైటు ఆ గదిని వెక్కిరిస్తున్నట్లుగా ఉంది. ఆ వెలుగుతో ఆ గది, పగటివేషం వేసినట్టు కనిపిస్తోంది.

ఆ గది డాబాగది, కొంచెం ఇరుగ్గా ఉంది. ఎప్పుడో కొట్టిన మేకుల గోతులతోనూ, చిన్న చిన్న ఎగుడు దిగుడు దిగుళ్ళతోనూ ఉన్నప్పటికీ శుభ్రంగా వెల్లవెయ్యడంచేత గోడలు హాయిగానే కనిపిస్తున్నాయి. కాకపోతే కొంచెం ఎక్కువకోటా మొహాలకి కొట్టుకున్న యాక్టర్లలా ఉన్నాయి. పైన డాబాకి వేసిన వాసాలు తాటిమానువి. తారు పూయడం చేత అవి రంగుపూసిన రాక్షసుల జటల్లా కనిపిస్తున్నాయి. అవి కొంచెం వంకరగాకూడా ఉండటంచేత. గబుక్కున చూచినట్లయితే తలలూ తోకలూ తెగిపోయి, కరడుగట్టిపోయిన పెనుతాచుల మృతదేహాల్లా కనిపించ వచ్చునవి.

గదిలోంచి వెనక గదిలోకి వెళ్ళడానికి ఓ గుమ్మమూ, నడవలోకి రావడానికి మరో గుమ్మమూ ఉన్నాయి. వీధివైపుకి ఓ చిన్న కిటికీ ఉంది. ఆ గదిలో మూడు సోఫాలున్నాయి. అవి చిన్నవేకాని ఆ గదికి మాత్రం పెద్దవయిపోవడంచేత ఉన్నదానికంటే ఇరుగ్గా కనిపిస్తోంది ఆగది. ఆ సోఫాల అడుగు గుడ్డలు కొంచెం మాసినట్టుగా ఏమాత్రం జాగ్రత్తగా చూసినా తెలిసిపోతుంది. వాటిపై కవర్లుమాత్రం తెల్లగా శుభ్రంగా ఉన్నాయి. ఓ వార పాతది చిన్నది, అద్దాల బీర్వా ఒకటుంది. దానికి శుభ్రంగా మట్టిరంగు పెయింటు పూసినప్పటికీ, రంగు పూసుకున్న అరవయ్యేళ్ళ కాయశరీరపు ముసలమ్మలా, దాని వయసు తెలిసిపోతోంది. ఆ అద్దాల బీరువాలో కొన్ని వెండికప్పులూ విప్పిన పెట్టిల్లో వెండి పతకాలూ, ఎలక్ట్రిక్ బల్బుల్లో బొమ్మలూ రంగులు పూసిన ఒక మట్టి లక్ష్మి, మరొక గాజు కృష్ణుడూ, హెడియా వారచూపుల ఫొటో, రంగారావు చంకన ఫుట్‌బాల్‌తో తీయించుకున్న ఫొటో ఇంకేవేవో చిల్లర సామానులూ కనిపిస్తున్నాయి. బీర్వామీద రెండు ప్లాస్టిక్ పువ్వులు, చచ్చిన పువ్వులకి రంగు పూసినట్టుగా మెరుస్తున్నాయి. ఓ వార చిన్నబల్లమీద చిన్న రేడియో ఒకటుంది. గాంధీ, నెహ్రూ, జీససు క్రైస్తూ గది గోడలకి అంటుకుపోయున్నారు. తనకి అన్ని మతాలవారూ స్నేహితులున్నారని తెలియ

జేయడానికి హెడియాపే జీససు క్రైస్తుని తెచ్చింది. అది మంచి ఐడి యావేనని రంగారావుకి ఆ తరువాత తెలిసింది. ఆ బొమ్మలు చూస్తూ మినహాయిస్తే గోడల్ని మిగతావన్నీ సిల్లీ బొమ్మలే, అవన్నీ ఆడవాళ్ళ బొమ్మలే. అన్నీకూడా కాలెండర్ల మీదివి కత్తిరించి పటాలు కట్టించినవే. అ బొమ్మల్లోని ఆడవాళ్ళంతా స్నానానికి వెళ్తున్నవారూ, స్నానాలు చేస్తున్నవారూ, స్నానంచేసి తలారబెట్టుకొంటోన్న వాళ్ళేతప్ప మామూలు వాళ్ళు లేరు. మున్సిపల్ కౌన్సిలర్స్ ఫొటో ఒకటి, ఆడవారి క్లబ్బు ఫొటో ఒకటి, బంతాట క్లబ్బు ఫొటో మరొకటికూడా గదిలో కనిపి స్తున్నాయి. పంచరంగుల ఫొటోలు మూడున్నాయి. ఒకటి రంగారావుదీ, ఇంకోటి హెడియాది. మూడోది వాళ్ళ డాడీది. ముగ్గురుకూడా పంచ రంగుల ఫొటోల్లో ఎందుకోగాని పకపక నవ్వేస్తున్నారు. ఓవార వేళ్లాడే మరో ఫొటోకి కాయితపు పారిజాతాల దండ వేళాడుతోంది. ఆ ఫొటోలో ఉన్నావిడ మందుల భీముడు భార్య. ఆ గదినిచూసి బెదిరిన అమాయకపు పల్లెటూరి మనిషిలా ఇలా కనిపిస్తోందామె.

కొందరి ఫొటోలు చూసీ చూడగానే "వీరు చచ్చిపోయేరు" అని తెలుస్తుంది. తల్లే ద్రోహం చేసిన తనయుల్లా ఉంటారు వాళ్ళు. మందుల భీముడి భార్య అలానే ఉంది. ఆమె చాలాకాలం కిందట చనిపోయింది. బాధల బరువును మోయలేనివారు పాపుల అన్యాయాలని ప్రతిఘటించ లేనివారూ ఆమెలానే కనిపిస్తారు.

ఆ వూళ్లో ఓ అమ్మవారు ఏనాడో నిల్చిఉంది, ఆమెని నమ్మి కొలిచినవారికి ఆమె అష్టైయిశ్వర్యాలూ ఇస్తుందట. ఆమె ఫొటో ఒకటి బ్రాకెట్‌మీద కనిపిస్తోంది. ఆమె ముందు నాలుగు పువ్వులూ, రెండు (కాలిపోయిన) ఊదొత్తుల కొనలూ కనిపిస్తున్నాయి. ఆ బ్రాకెట్‌మీదని గోడని శ్రీ తిరుమల వెంకటేశ్వరుడు కనులు మూసుకొని శాంతంగా, గంభీరంగా భక్తులకెంతో మనోహరంగా వజ్రకవచం తొడుక్కొని విచిత్రంగా వెలుగుతూ కనిపిస్తున్నాడు.

ఆ అమ్మవారన్నా, ఆ స్వామివారన్నా మందుల భీముడికి మంచి భక్తి, హెడియాకి చక్కని భక్తి, రంగారావుకి ఎంతో భక్తి.

రంగారావుకి నాలుగేళ్ళ క్రితం మామూలు దైవభక్తి - పండుగల నాడు మాత్రం దేవుడి పూచ్చెయ్యడం, దేవుణ్ని ఊరేగిస్తూంటే ఆగి దండం పెట్టడం, ఎవరైనా ప్రసాదం ఇస్తే కళ్ళకద్దుకు తినడం - అటువంటి మామూలు దైవభక్తి ఉండేది. అది నాలుగేళ్ళ కిందటిమాట. మూడేళ్ళనించీ మాత్రం అతన్లో విపరీతమైన దైవభక్తి బలిసిపోయింది. ఆ నాలుగూ ఈ మూడూ మధ్య ఒక ఏడాదిమాత్రం అతను దైవభక్తి లేకుండా - లేనే లేకుండా - వట్టి నాస్తికుడుగా బతికేడు.

సుమారు నాలుగు లేక అయిదు సంవత్సరాలక్రితం, రామారావని ఒకాయన, వాళ్ళ కంపెనీలో "స్టెనో"గా చేరేడు. అతనికి అప్పటికి దగ్గర దగ్గర ముప్ఫయ్యయిదేళ్ళుండవచ్చు, చాలా చోట్ల సర్వీసు చేసి అన్నిచోట్లా తగువులుపడి చివరకి ఈ కంపెనీలో చేరేడతను. పొడవుగా సన్నంగా ఎర్రగా ఉండేవాడతను. ఎర్రగా ఉన్నప్పటికీ అతని ఎరుపు, జ్వరంవల్లవచ్చిన ఎరుపులా ఉండేది. ఒక్కొక్కనాడు అతను పాలిపోయి కనిపించేవాడు. అతను "స్టెనో"గా చేరేక ఆఫీసు చాలా మారిపోయిందంటే, అతనే అందుకు కారణం.

వచ్చిన ఆర్నెల్లలో ఆఫీసులో అందరికీ సన్నిహితుడయేడు రామారావు. అందరి పరిస్థితులూ అతను ఎలాతెలుసుకోగలిగేడో ఆశ్చర్యం; అంత వేగరం ఎలా తెలుసుకున్నాడో ఆశ్చర్యం. ఆఫీసులో పనిచేసేవారికి ఎవరింట్లో ఏ కష్టం వచ్చినా అతనికే కష్టం వచ్చినట్టుగా ఉండేది. అదంతా తన స్వంత బాధ్యతలా తీసుకొని, వారి వ్యవహారాల్లోకి చొరబడి వాళ్ళకి శక్తికి మించి సహాయం చేసేవా డతను. వారి ఆఫీసులో ఓ గుమస్తామీద అతని భార్య మనోవృత్తి దావా వేసింది. అతను ఆఫీసుకి వచ్చి చాలా అన్‌హేపీగా కూర్చొని ఏ పనీ సరిగా చేయలేక పోయేవాడు. రామారావుకి ఆ సంగతి తెలిసి వారిరువురికీ ఎలా రాజీచేసేడో కాని రాజీ చేసేడు. మరో గుమాస్తాని నూర్రూపాయలకోసం ఓరోజు సాయంకాలం కాబూలీవాడు కాలరు పట్టుకు ఆపి అల్లరి చేసేట్ట. మర్నాడతను సెలవుపెట్టి ఇంటిదగ్గర ఉండిపోయేడు. ఎందుకు ఉండిపోయేడో ఎవరూ పట్టించుకోలేదు. రామారావు మాత్రం అతని ఇంటికివెళ్ళి అసలు

కారణం కనుక్కొని, మరోచోట సూత్రప్రాయలు అరువు పుట్టించి కాబూలీవాడి బాకీతీర్చి అతని పరువు కాపాడేడు. ఆ తరవాత అతను "బీద గుమాస్తాల సహాయార్థమై" ఓ ప్రఖ్యాత బృందంచేత నాటకం కట్టించి ఊళ్ళో టిక్కెట్లు అమ్మి ఆ డబ్బు పోగుచేసేక గుమాస్తాల సంఘం స్థాపించి ఆ సంఘం అకౌంటుకి ఆ డబ్బును జమకట్టేడు. దాన్తో అతను గుమాస్తా లందరికీ కావలసినవాడయేడు. అతను చిలీనుంచి జపాన్ వరకూ, అర్కిటిక్‌నుంచి అంటార్కిటిక్ వరకూ ఏ దేశంలో ఏం జరిగినా అందుగురించి మాట్లాడగలిగేవాడు. గుమాస్తాల సంఘం స్థాపించిన వెంటనే ఆ సంఘానికి సెక్రటరీగా అతణ్ని అందరూ ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

రామారావు చాలా మంచివాడని అందరికీ తెలుసు. అతన్లో ఎన్నో సుగుణాలుండేవి. వాటితోపాటు - అది సుగుణమో దుర్గుణమో తెలియదు కాని-అతన్లో దేముడు లేడనే గుణం కూడా ఉండేది. అయితే అతను అందులో ఎక్కువ తక్కువలు చెయ్యకుండా అన్ని మతాలవారినీ ఒక్కలాగే హేళన చేస్తూండడంచేత అతను స్వతహాగా ఎంతో మంచివాడవడంచేతా అతని నాస్తికత్వాన్ని ఎవరూ పట్టించుకొనేవారు కారు. అమెరికా చైనాలు ఒకదాన్నొకటి చూసుకున్నట్టు ప్రబల శత్రువుల్లా కాకుండా, పిల్లులు లేవన్న ఎలకని మిగతా ఎలకలు చూసినట్టు, అతణ్ని ఆ విషయంలో కొంచెం వెర్రివాళ్లా చూసేవారు. దేముడి గురించి అతను పరిహాసంగా ఆడే మాటలన్నీ వారు ఆటల్లో మాటల్లా వింటూ నవ్వుకొనేవారు. వాళ్ళది బ్రిటిష్‌కంపెనీ అవడంచేత (పాలసీ ప్రకారం నియమింపబడిన) అన్ని మతాలవారూ అందులో ఉండేవారు. ఆఫీసులో సాయబు గుమాస్తాని రామారావు చాలా అల్లరి ప్రశ్నలు వేసేవాడు. ఆ కొండమీద స్వామివారి రాయీ, ఆ పక్కని అదే కొండమీద మసీదు రాయీ ఒక్కటే అయినప్పుడు ఈ రాయిలో ఉండే అల్లా ఆ రాయిలో ఎందుకు లేడు అంటూ అతను చిలిపిగా మాట్లాడేవాడు.

"ఏసు అవతరించకముందు బతికి చచ్చినవారంతా నరకంలోనే ఉన్నారా?" అంటూ పరిహాసంగా మాట్లాడే వాడతను. "భగవంతుడికి

జంధ్యమున్నదా లేదా? లేకుంటే అది ఎందుచేత లేదు? ఉంటే అది ఎంత పెద్దదుండ వలెను?" అంటూ తమాషాగా నవ్వే వాడతను. అతనిమాటలు చవకబారుగా ఉన్నప్పటికీ ఏ గుమాస్తాకూడా అతన్ని అసహ్యించుకోడం మాత్రం చెయ్యలేదు.

గుమాస్తాల సంఘానికి సెక్రటరీ అయిన రామారావుకి ఆఫీసులో పరపతివల్ల వచ్చినదే కాకుండా అతన్లో మరో ముఖ్యమైన ఆకర్షణ ఒక టుండేది. అది గుండె నిబ్బరంవల్ల వచ్చిం దతనికి. ఆ ఆకర్షణవల్లనే అతను అంతమందినీ తనచుట్టూ తిప్పుకోగలిగేడు. అతనికి స్వతహాగా గుండె ధైర్యం ఉంది. లొసుగులు లేని మంచి మనిషవడంచేత అతని మంచితనం ఆ ధైర్యానికి దోహద మిచ్చింది.

నాటకం కట్టించి చందాలు వసూళ్ళు చేసే సమయంలో రామా రావుకి రంగారావు మంచి సన్నిహితు డయేడు. ఆ వసూలు చెయ్య డంలో రంగారావు యాభై రూపాయలుదాకా మిగుల్చుకున్నాడు. రామా రావు స్వంతంగా వసూలుచేసినడబ్బంతా అతను నయాపైసల్తోసహా సరిగ్గా లెక్కజెప్పి సంఘానికి జమకట్టడం అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది. అంత మంచివాణ్ణిచూసి అతనికి చాలా భయంకూడా వేసింది. నక్షత్ర కుడు హరిశ్చంద్రుణ్ణి చూసి ఆశ్చర్య పడినట్టు రంగారావు ఆశ్చర్యపడి, అతణ్ణి తమ ఆఫీసుకి శ్రీరాముళ్లా చూడ నారంభించేడు. అతను చెప్పేదే పరమవేదంలా తోచ నారంభించింది రంగారావుకి. మానేజిమెంటు వారు కూడా రామారావుని చూసి అతనంటే బెదురుతో ఉండడం రంగా రావు కనిపెట్టి, "రామారావులో ఏదో గొప్పతనం ఉంది!" అనే నిశ్చ యానికి వచ్చేడు.

రామారావు అడే నాస్తికపు మాటలు రంగారావుకి తమాషాగా తోచేయి. నచ్చేయి. అందరూ ఆస్తికులుగా ఉంటే తనుకూడా రామారా వ్వంటి కొద్ది గొప్ప వాళ్ళల్లా నాస్తికుడుగా ఉండడం రంగారావుకి ఓ చక్కటి సుపీరియారిటీ కాంప్లెక్సు తెచ్చింది.

రంగారావు కంపెనీ స్టోర్సు సెక్షన్లో- గుమాస్తాగా ఉండేవాడు. ఆ స్టోర్సుకి ఒక మానేజరు ఉండేవాడు. రంగారావు కులంకాదు. ఆ మానేజర్‌కి రంగారావు షోకులు గిట్టేవికావు.

ఆ మానేజర్‌గారి చాదస్తం, బుర్ర తిరుగుడు అన్యకులద్వేషం, స్వకులాభిమానం, అతని పంచె, అతని కోటు, అతని మాసిన గడ్డం - అవన్నీ చూస్తే రంగారావుకి పడేదికాదు. పిల్లికీ రుద్రాక్షప్పిల్లికీ పడనట్టు వారిద్దరికీ సరిపడేదికాదు.

ఆ స్టోర్సు మానేజర్‌కి మూఢభక్తెక్కువ. అతను ఉపవాసాలూ అవీ ఉంటూండేవాడు. కులచిహ్నాలూ, మతచిహ్నాలూ ధరించేవాడు, రాలూ, వర్జాలూ, శకునాలూ అన్నీ సరిచూసుకొనేవాడు. ఆ మానేజరంటే ఇష్టం లేకపోడంవల్ల అతని మూఢభక్తీ ఇత్యాదులుకూడా రంగారావుకి ఇష్టం లేకపోయేవి. అందుచేత రంగారావుకి రామారావులా నాస్తికమ్మాటలు మాట్లాడ్డానికి ఏ సంకోచమూ లేకపోయింది. నాస్తికుడైపోగానే రంగారావు తను ఆ స్టోర్సు మానేజర్‌కంటే ఎన్నోరెట్లు ఎక్కువవ్వాళ్ళు ఫీల్‌అయేడు. ఆ మానేజరు వింటూండగా తనుకూడా రామారావులా దేవుణ్ని తిట్టడం ప్రారంభించేడు.

రంగారావుకి అప్పటికప్పుడే ప్రొబేషన్ పీరియడు పూర్తయి రెండు మూడేళ్ళయినప్పటికీ ఎందుచేతనో కంపెనీవారు అతణ్ని సర్వీసులో పర్మనెంటు చెయ్యలేదు. పర్మనెంటు కానివ్వకుండా స్టోర్సు మానేజర్‌గాడే అడ్డుపుల్లలు వేస్తున్నాడని రంగారావుకి గట్టి అనుమానం ఉండేది. ఆ "ఇస్యూ" గుమాస్తాల సంఘంచేత "టేకప్" చేయించి, హడావిడిచేసి బెదిరించి రంగారావుని సర్వీసులో పర్మనెంటు చేయించేడు రామారావు.

అందు గురించి రంగారావు తన ఇంట్లో తన ముఖ్య స్నేహితులందరికీ విందు చేసేడు. బంతాట క్లబ్బువారంతా కూడా వచ్చేరు. ఆవేళ రామారావే ఆ విందులో అందరికీ హీరో. హెడియా అతనిమీద చిరునవ్వుల వర్షం కురిపించింది. మందుల భీముడుకూడా రామారావుని, "గట్టోడివి గురూ !", అని మెచ్చుకున్నాడు. "మావోడిచేత ఓవర్‌టైము

చేయించి ఓవర్ టైమ్ డబ్బుమాత్రం ఎగేసేస్తున్నారు కంపెనీవాళ్ళు! ఆ విషయంకూడా చేకప్‌చేసి కంపెనీ యెదవలకి బుద్ధి జెబ్బా!" అని రామారావుకి సలహా చెప్పేడు. రామారావు "నా చేతుల్లో ఏముంది గురువుగారూ? అందరూ నా వెనక నిలబడితేనే నేనేదైనా వెళ్ళి అరవగలను!", అని మోడెస్టుగా అన్నాడు. "అరవ్వయ్యా! నీ కద్దేముంది? అరు, గెట్టిగా అరు!" అని ప్రోత్సహించేడు మందుల భీముడు.

ఓ ఏడాదిపాటు గుమాస్తాలందరి తరపునా రామారావు చాలా గట్టిగా అరిచేడు. అంతలో గుమాస్తాల సంఘపు ఎన్నికల సమయం తిరిగి వచ్చింది.

ఓ రోజు సాయంకాలం స్టోర్సునుంచి రంగారావు ఇంటికి వెళ్ళిపోతోంటే, ఓ బంట్రోతు అతణ్ని అటకాయించి, "దొర రమ్మంటున్నాడు", అని చెప్పేడు.

దొరగారి ఆఫీసువైపు నడవబోయేడు రంగారావు.

"అటుకాదు. ఇదిగో ఇక్కడే ఉన్నారు!" అని ఆఫీసు వరండాలోనే రంగారావుకి వెనగ్గా నిల్చున్న దొరని చూపించేడు బంట్రోతు.

పులుల్లో దొరలుంటాయోలేదో తెలియదు. గాని, అతనుమాత్రం పులిదొరలా (లేక, దొరపులిలా) నిల్చున్నాడు. అతని పక్కనే స్టోర్సు మానేజరు ఆ దొరయెడల వినయంగానూ, రంగారావు యెడల పొగరుబోతుగానూ నిల్చున్నాడు.

"అస్క్ హిమ్ ఇఫ్ హి హేజ్ పించ్‌డ్ ఎనిథింగ్!", అన్నాడు దొర.

"ఇంటికేంటి పట్టుకెళ్తున్నావ్? దొరగారు అడుగుతున్నారు. వినిపిస్తోందా?". అని కాలి వేళ్ళమీద పైకి సాగి మరీ అడిగేడు స్టోర్సు మానేజరు.

ఆరోజు మధ్యాహ్నం ప్రతి గుమాస్తాకీ స్టేషనరీ ఇస్యూ చేసేరు. రంగారావుకి మిగతా సామాన్లతోపాటు ఆరు రంగు పెన్సిల్సు ఇచ్చి సంతకం పుచ్చుకున్నారు. దొర చెక్ చేస్తే రంగారావు జేబులో నాలుగు

రంగు పెన్సిళ్లు కొత్తవి వున్నాయి. అతని ఆఫీసు టేబిల్ డ్రాయర్లో రెండు మాత్రం ఉన్నాయి.

ఆఫీసునుంచి చాలామ గుమాస్తాలు చిన్నచిన్న చిల్లరసామాన్లు ఇళ్ళకి పట్టుకు పోతూంటారు. పెన్సిలు, రబ్బరు, బ్లాటింగ్ పేపరు తెల్ల కాయితం, సిరా, బ్లేడు, అట్టముక్క, పిన్ను, మేకు, చాకు, టాగు, దారం —అలా వాళ్ళు పట్టుకు పోయేవి చాలా చిల్లర సామాన్లు వాటి గురించి ఎవరూ ఏమీ అంతగా పట్టించుకునే వారుకారు. అలా ఆ సామాన్లు పట్టుకు పోయాక ఏదైనా లోటొస్తే ఆ లోటు ఆ గుమాస్తాలే భర్తీ చేసుకొంటూండేవారు. అయితే ఆఫీసు సామాను ఇంటికి పట్టుకు వెళ్ళడం పద్ధతికి విరుద్ధం.

డియాకి కమల అనే పేరుగల క్లబ్బు స్నేహితురాలుం ఆ పిల్లది కోలముఖం; ఆ వి పెద్ద కళ్ళు; ఆ పిల్లది ఎత్తుగుండెలు; ఆ పిల్లవి పొడావు జుట్టు; ఆ పిల్లది నిలకడలేని మనసు; ఆ పిల్లకి స్కూల్ టీచరు నౌఖరీ; ఆ పిల్ల పెనిమిటి—ఆ పిల్లకి పెనిమిటిలేడు. ఎందుచేత లేడో ఎవరికీ తెలియదు.

అంతకు ముందురోజు ఆదివారం సాయంకాలం ఆ అమ్మాయి వచ్చి, ఏవో కబుర్లు చెప్తూ.

"మా స్కూల్లో రాసుకుందికి ఓ సుద్దముక్కా ఇవ్వరు, ఓ పెన్సిలుముక్కా ఇవ్వరు. పిల్లల నోట్సు దిద్దాలంటె రంగుపెన్సిల్లేక చస్తున్నాను" అంది.

"మీకు మంచివి పుంజీడు పెన్సిల్సు తెస్తానుండండి !" అన్నాడు రంగారావు ఆమె మెడ కిందకి చూసి, ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"సరసీరుహాన్ని సినిమాకి తీసుకువెళ్తా నన్నట్టే, మీరు పెన్సిల్సు తెస్తాననడం! మీ మాట ఎవరు నమ్మార్లెండి? రావుగారి మాటమంచి నీటి మూటే !" అంది కమల, జారినపైట సర్దుకొంటూ, కొంటెగా నవ్వుతూ.

"సరసీరుహాన్ని నీకు తెలుసునని నాతో ఎప్పుడూ చెప్పలేదేం రా తమ్ముడూ ?" అని తమ్ముడి వైపు చుర చుర చూస్తూ అడిగింది హెడియా అక్క.

"కమలగారు తమాషాకేదో అంటే, నువ్వు నమ్మడం మరీ బావుందే అక్కా!" అని నవ్వేసేడు రంగారావు.

"హెడియాగారూ! మీ తమ్ముడిగారి మాట నమ్మకండి. ఆయన గోపాల కృష్ణులు!", అంటూ కిలకిల పకపక నవ్వింది కమల.

రంగారావు గర్వించకుండా ఉండలేక పోయాడు.

మర్నాడు సాయంకాలం ఆ నాలుగు పెన్సిల్స్‌తోనూ దొరగారికి దొరికిపోయేడు రంగారావు.

అతణ్ని వెంటనే సస్పెండు చేశారు.

రంగారావు గడగడ లాడిపోయేడు. అతనికి చెమటలు పోసేసి కాళ్ళూ చేతులూ చల్లబడి పోయేయి. అతనికి ఏం చెయ్యాలో తోచలేదు. ఆ సమయంలో, రామారావు తప్ప తనని మరొకరు రక్షించలేరని అతనికి అకస్మాత్తుగా తట్టి వెంటనే అతనికి తనని రక్షించడానికి ఒకరైనా ఉన్నందువల్ల, అతికొంచెం మనసు స్థిమిత పడినట్లనిపించింది. వెంటనే రామారావున్నాడేమోనని, అతని సీటు దగ్గరికి గబగబ వెళ్ళేడు. రామారావు చాలాసేపయి వెళ్ళిపోయాడని అక్కడ బంట్రోతు చెప్పేడు. రామారావింటికి తొందరగా వెళ్ళేడు రంగారావు. అతను ఇంటిదగ్గిరలేడు; ఏదో పనిమీద రెయిల్వే లేబర్ యూనియన్ ఆఫీసుకి వెళ్ళేడంది అతని భార్య. రంగారావు అక్కడికి పరిగెట్టేడు. "రామారావుగారా? ఆయన ఇప్పుడిప్పుడే ఎన్‌జీవో క్లబ్బుకి వెళ్ళేడు" అన్నారు లేబరువారు. రంగారావు ఆ క్లబ్బుకి పరిగెట్టేడు. రామారావు టెలిగ్రాఫ్ ఆఫీసుకి వెళ్ళేడన్నారు ఎన్జీవోలు. అక్కడికి రిక్షామీద అతి తొందరగా వెళ్ళేడు రంగారావు. అక్కడ చాలా మందున్నారు కాని, రామారావు మాత్రంలేడు. అక్కణ్నించి రామారావింటికి మళ్ళీ పరిగెట్టేడు రంగారావు. రామారావు ఇంకా ఇంటికి చేరుకోలేదు. "ఎక్కడికి వెళ్ళేరో ఏమిటో?" అంది అతని భార్య.

"అయన ఎన్నిగంటలకి వస్తారండి?" అని నీరసంగా అడిగేడు రంగారావు.

"రోజూ ఈ పాటికి వచ్చేసేవారండి! ఇవాళ. మరి :
ఆలస్యం అయిందో ఏమిటో?" అని చెప్పి ఆ తరవాత రామారావు
చేతో నుదుటిమీద కొటుకొని.

"అయ్యో! నా మతిమండా! లేబరాఫీసులోనూ మరెక్కడో పని చూసుకొని ఆఖరి బస్సులో శ్యామలారం వెళ్ళి రేపొద్దున్నే మళ్ళీ ఫస్టు బస్‌లో వచ్చేస్తాం అన్నారండి! నేను మర్చిపోయేను!" అంది.

రంగారావుకి ఆ సమయంలో కళ్ళంట నెత్తురు చుక్కలు రాలేయి. ఏముంది? మరింక "తన పనంతా అయిపోయినట్టే" అనిపించేసింది తనికి. ఉద్యోగం లోంచి డిస్మిస్ అయిపోడమే కాకుండా తను జెయిలుక్కూడా వెళ్ళిపోవలసి వస్తుందని అతను గజగజ వణికిపోయేడు. అతనికి భయం వల్ల గుండెలు కాళ్ళల్లోకి జారిపోయి భూమిలోకి దిగబడి పోయేయి.

కాళ్ళీడ్చుకొంటూ ఇంటికి వెళ్ళేసరికి రంగారావుకి గుండెలు గొంతుకలోగి ఎక్కిపోయి అక్కడ చిక్కుకుపోయి ఉండిపోయేయి. దుఃఖంవల్ల అతనికి ఊపిరి సలిపిందికాదు.

అతను ఇంటికి వెళ్ళేసరికి రాత్రి తొమ్మిదయింది. మందుల భీముడు ఇంకా ఇంటికిరాలేదు. హెడియా పక్కర్తే ముందు గదిలో కూర్చొని రేడియో పెట్టుకొని ఇంగ్లీషు పాటలు వింటోంది. తమ్ముడి ముఖం చూసి తెల్లబోయి.

"ఏంరా తమ్ముడూ! అలా ఉన్నావేంరా? ఊష్ణం కాని తగిలిందా?" అని అడిగిందామె.

అక్క అలా అభిమానంగా అడిగేసరికి వల వల ఏడుస్తూ సోఫాలో కూలబడిపోయేడు రంగారావు.

హెడియా గాభరాపడిపోయి, సోఫాలోంచి లేచిపోయి, కాలు కాలిన పిల్లిలా తమ్ముడుచుట్టూ తిరిగిందేతప్ప, ఆమెకి ఏం జరిగిందో తెలియలేదు. ఏం చెయ్యాలో బోధపడలేదు.

"జరిగిన సంగతి ఇంట్లో ఎలా చెప్పడం?" అని అంతవరకూ బాధ పడిన రంగడు. సొఫాలో కూర్చొని ఏడుస్తూనే జరిగిన సంగతంతా అక్కకి చెప్పేసేడు.

"అయ్యో! కమలముండకోసరం ఎంత పన్చేసేవురా!" అంటూ గోలపెట్టేసింది హెడియా. "అది వచ్చి దాకూరా! అది రోజు కొకణ్ని మాపేస్తదిరా! దాని కోసంట్రా ఇంత పన్చేసేవూ! అయ్యో! నీ కోకల సరదా నీ కొంప తీసిందిరా!" అంటూ హెడియా కేకలు వేసింది.

అంతలో మందుల భీముడుకూడా ఇల్లు చేరుకున్నాడు.

కొడుకు ఏడవడంచూసి తండ్రికూడా కూతుర్లాగా గాభరాపడ్డాడు. అతనుముందు అనుకున్నదేమిటంటే! "ఈడు ఏ ఆడదానెనకాలో ఎంట బడి, తన్నులు తినొచ్చేడు" అనుకున్నాడు. అసలు సంగతి తెలియగానే అతను:

"హోరి జెస్టెదవా! !", అంటూ రెండు చేతుల్తోనూ తలపట్టుకొని మరో సోఫాలో కూలబడిపోయేడు

ఈదురుగాలికి దెబ్బతిన్న చెట్టులా ముగ్గురూ కొంతసేపు అలా ఉండిపోయేరు. ఆ తరువాత ముగ్గుర్లో ముందుగా హెడియాయే లేచి, వెళ్ళి, అమ్మవారి ఫొటోముందు నిలబడి, ఆ తల్లికి దండంపెట్టి, ఫొటో లోని ఆ దేవి పాదాలు చేతుల్తో ముట్టుకొని, కళ్ళ కద్దుకొని, అమ్మవారి ఫొటో పైనున్న వెంకటేశ్వరుడి పాదాలుకూడా అలాగే కళ్ళ కద్దుకోని ఆ తరవాత ఆ ఇరువురి ముందు అమితమైన భక్తితో సాష్టాంగపడి నమస్కరించి, తన తమ్ముణ్ని కాపాడమని ఎంతో నిర్మలమైన మనసుతో ప్రార్థించింది.

ఆ సమయంలో హెడియాకి, ఎన్నో ఆశలు పెట్టుకొని, ఎంతో మంచిగా బతికి ఎన్నోకష్టాలుపడి కాలం చేసిన తన తల్లీ, డబ్బుకోసం ఎన్నో దురవస్థలుపడి, కేసులలో పడి కొట్టుకుపోయి, ఓ మంత్రసాని చేతుల్లోపడి అపకీర్తి పాలైపోయి, అష్టకష్టాలు పడ్డ తన తండ్రీ; కన్పడ్డ కోకలకోసం చచ్చుపెద్దమ్మలా తిరగడంతప్ప వేరేమీ తెలియని తన అమాయకపు తమ్ముడూ; పెళ్ళిలేక పాడులేక, ఎందరి చేతుల్లోనో పడి నలిగిపోయి ఎందుకు బతుకుతున్నానో తెలియని తన బతుకూ - అవన్నీ ఆ సమయంలో హెడియాకి గుర్తుకి రావడంతో ఆమె కళ్ళంట వెచ్చని కన్నీరు వరదగా కారి, ఆమె బతుకులోని పాపాన్నంతా - కడిగి పారేసి

నట్టుగా చేసింది. ఆమె గంతంగా లేచి నిలబడి ఆ లక్ష్మీ అమ్మవారికీ, ఆ వెంకటేశ్వర స్వామివారికీ తిరిగి నమస్కరించి, పైటచెంగుతో కళ్లొత్తు కొని, రంగారావు పైపు

"రా, తమ్ముడూ? మన లక్ష్మమ్మకి మొక్కుకో! స్వామికూడా మొక్కుకో నీ కష్టం తీరుద్ది! మరేం భయంలేదు. మొక్కుకో! అని ఎంతో మృదువుగా అతణ్ని పిల్చింది.

"బాబొరే! లెగరా! లెగిసెళ్ళి దండంపెట్టుకో, లెంప లేసుకో! ఈ కేసు గడిసి గట్టెక్కితే దేవుడికి జుట్టిచ్చి! ఓ నెల్జీతం ముడుపుకట్టి ఉండీలో ఏస్తానని మొక్కుకో! కష్టంవొచ్చి నప్పుడు అంతా నష్టలేం! ఏం జేస్తాం? లెగిసెళ్ళి లెంపలేసుకో!", అని తండ్రి కూడా తనయుడికి బోధచేసి అతణ్ని హెచ్చరించేడు.

రంగారావు రుమాల్తో ముఖం తుడుచుకొని, లేచివెళ్ళి, ఆ పైవాల ముందు హీనంగా దీనంగా, "దిక్కుమాలిపోయేం! మాకు మరింక దేముడే దిక్కు!" అన్నట్టుగా నిలబడి లెంపలు వేసుకొని దండం పెట్టు కొని అయిదు నిమిషాలపాటు నిలబడ్డాడు. తను నాస్తికుణ్నన్నమాట అ సమయంలో అతను మర్చేపోయేడు.

తమ్ముడి నాస్తికత్వం హెడియాకే చటుక్కున జ్ఞప్తికి వచ్చింది.

"హదిరా డాడీ!!"

"ఏంటి దాము?

"మనోడి ఫ్రెండు రామారావు లేడూ? వాడు చెడిపీసేడు మనోణ్ని!" అని కోపంతో అలా ఉంచి పోయింది హెడియా.

"ఎవడెవడూ: రామారావు గాదా? ఆ జెష్టెదవేం జేసేడు??" అని తీవ్రంగా ప్రశ్నించేడు మందుల భీముడు. ఎవరో చెడ్డవెధవ చెడిపేస్తేనే తప్ప తన మంచికొడుకు చెడిపోడనే భావం అతని ప్రశ్నలో ధ్వనించింది.

"ఆ రామారావుగాడెనకాల తిరగడం! వాడు కంపినీ వోళ్ళు దొంగలో!" అని కేకలేస్తే, ఈడూ వాడెనకాల, "అవును! కంపినీ వోళ్ళంతా దొంగలో!" అని కేకవెయ్యడవేం! వాడు "గుమాస్తాల

సంఘవోఁ!" అని ఎగిరితే వీడు కూడా సంఘవోఁ! సంఘవోఁ! అని ఎగరడవేఁ? వాడు "దేవుళ్లేడో!" అని అరిస్తే వీడూ వాడెనకాల "అవును! దేవుళ్లేదో!" అని అరిసి సావడవేఁ! దేవుళ్లేడని ఎగురెగిరేసరికి ఏంట యిందో చూసేవా? టంగుమని ఒక్క మొట్టికాయ మొట్టేసేడు!", అంది హెడియా.

హోరి జెష్టెదవా!", అని కొడుకుని మళ్ళీ తిట్టేడు తండ్రి.

జెష్టవెధవలా ముఖం పెట్టుకొని కూర్చున్నాడు కొడుకు.

"ఈ రోజుల్లో మాలోణ్ని తిడితే ఆ డూరుకోడు! అలాటప్పుడు, దేవుణ్ని తిడితే." అని లెంపలు వేసుకొని "ఆ దేవుడూరుకుంటాడా?!" అని తిరుగులేని ఆర్గ్యుమెంటు చెప్పింది హెడియా.

కూతురు అందించిన భావాన్ని పెంచుకొంటూ పోయేడు తండ్రి.

"అడవిలో పులైతే మెడకాయ కటక్కుమని కొరికేస్ది; ఊళ్ళో కుక్కయితే అరుస్ది కరుస్ది; గొర్రెపోతైతే పొడుస్ది; ఆవైనా గేదైనా కొమ్మిసురుద్ది; ఆకరికి గాడిదైనా సరే. దాన్ని చెడ్డమాటంటే ఎనకాళ్ళతో పళ్ళు రాలగొడద్ది కాని ఊరుకోదు! అలాంటప్పుడు దేవుణ్నితిట్టి బోర ఇరుచుకు నడిస్తే ఆడు నడ్డి ఇరగొట్టీడుర్రా, జెష్టెధవా!" అని నెత్తీ నోరూ కొట్టుకున్నాడు తండ్రి.

తండ్రీ అక్కా కలిసి రంగారావుని పశ్చాత్తాప పడమనిచెప్పి, వెళ్ళి మళ్ళీ ఆ దైవాలకి సాగిలబడి మొక్కుకున్నారు. నుదుటిమీద చెమటంతా మళ్ళీ తుడుచుకొని, ఆ దైవాల దగ్గరికి వెళ్ళి సాగిలబడి మొక్కి లేచేడు రంగారావు.

"సీకట్లో ఎళ్తున్నప్పుడు బాట్రీలైటు చేతులుంటే ఎంత ధయిర్యం గుంటది? అలాటపుడు ఆ దేవుడే మన ఎనకాలుండి మనకి ముందుకి మంచిదారి సూపిచ్చి తీసికెళ్తున్నాడంటే ఎంత నిబ్బరంగ మనం నడొచ్చో ఆలోచిచ్చుకో!", అని కొడుకుని ఆలోచించుకోమన్నాడు తండ్రి.

బాగా ఆలోచించి, ఆ తండ్రి వాక్కులోని సత్యాన్ని గ్రహించ

గలిగేడు రంగారావు. ఆ తరవాత, పైవానుగ్రహంవలన అతనికి మంచి రోజులు వచ్చేయి కూడాను.

ఆ మర్నాడు మందుల భీముడు చీకటితో లేచివెళ్ళి మేనేజర్ని కలుసుకొని, మాట్లాడి, ఇంటికి తిరిగి వచ్చేసరికి పదిగంటలయింది. తమ్ముణ్ని ఓదార్చడానికీ అతనికి ధైర్యం చెప్పడానికీ హెడియా కూడా ఆ రోజు సెలవుపెట్టి ఇంటి దగ్గరే ఉండిపోయింది.

మందుల భీముడు ఇంటికి వస్తూనే.

"కిష్టారావుట. ఎవడ్రా?" అని కొడుకుని ప్రశ్నించేడు.

"మా కంపెనీలోనే వాడో గుమాస్తా." అన్నాడు రంగారావు.

"మీ గుమాస్తాల సంగం సెక్రెట్రీ రామారావుగాడికి ఆ కిష్టారావు గాడు పోటీటకదా?" అన్నాడు తండ్రి.

అవునన్నాడు కొడుకు.

"కిష్టారావు పార్టీనా నువ్వు?". అని ప్రశ్నించేడు తండ్రి.

"ఛీ!", అన్నాడు కొడుకు.

"ఛీ అంటే, ఏటా "ఛీ"కి అర్థం?"

"నేను రామారావు పార్టీ!", అన్నాడు కొడుకు.

దాన్తో విరుచుకు పడిపోయేడు తండ్రి.

"ఇలాటి యెధవేసికా లేసే ఇంత మట్టుకు తెచ్చేవు యవారం! ఏం? రామారావు మనకి సుట్టవాఁ? ఆణ్ణీకు మేనత్తకొడుకా? కిస్టారావు కాకపోయాడా? మంచోడ్ని ఒగ్గేసి దేవుళ్ళేదు దెయ్యం లేదనే యెధవెన కాల తిరిగితే ఏంటయిందో కానుకున్నావా? దేవుళ్ళేడనేసే యెదవ రేపొద్దున అమ్మా అబ్బాకూడా లేదనేస్తాడు! ఆడికేటి బోయింది? ఆడినోటికి అడ్డా ఆపా? అలాటోడు కంపెనీ వోడితో కుక్క జట్టీ లెట్టుకున్నాడంటే ఎట్టుకోడూ?? ఆ కుక్క జట్టీల్లోకి నువ్వూ దిగిపోయి ఆడు అరుస్తూంటే నువ్వూ అరడవాఁ? నీ కసలు జీతం ఎవడిస్తున్నాడు? కంపెనీ వోడా లేకపోతే రామారావుగాడా? కంపెనీవోడు నీకు జీతం ఎందు కిస్తున్నాడు? పన్జెయ్యడానికా, లేక అరడానికా? బోలెడు మదుపు

లెట్టుకొని లాబం కోసరం ఆడు కంపెనీ ఎట్టుకొని, కష్టపడి పన్చెయ్య డానికి అణ్నీకు జీతం ఇచ్చుకుని ఉజ్జోగం ఇస్తే నువ్వేటి జే_స్తన్నావు? కాళ్ళ నిగడదన్నడం, రామారావుగాడితో కలిసి అరడం ఆడితోపాటు నువ్వూ రోజుకో పితూరీ లెగదియ్యడం! అదీ నువు జేస్తున్నపని! అలా చేసే పీకలమీదికి తెచ్చుకున్నావు యవహారం! మరింక, ఇప్పటికాణ్నీం పైనా తెలివితక్కువ యెధవేసికా లెయ్యక తిన్నగ నీ బతుకేదో నువ్వూ జూసుకో: దొరకోకపం వొచ్చి నౌకిర్లోంచి బర్తఫే చేయిస్సినాడంటే, నీ తెల్లనొక్కా, రంగు పంట్లాం, ఓసన్నూనె, పకపక నవ్వు, రంగురైక కంటి కానగానే దానెనికాలపరుగూ, సినీమాలూ, జల్సా గిల్సా అన్నీ ఎత్తి కట్టేసి బోడిముంతలా గదిలో ఓమూల కొంగేసుక్కూర్సోవాల! ఈధిలో కెళ్లేవంటే. కూర్చున్న బోడిముంతకూడా నిన్నుజూసి లెగదు. అంచుచేత, నీ బతుకేంటో ఆలోచిచ్చుకొని, అందుకు నువ్వేం జెయ్యాలో తెలుసుకొని ఆ యిదంగ బతుకు! మనం ఎందుకు బతుకుతున్నాం? యింత పెద్దపట్టంలో? మనం బతుకుతున్నాం అంటే ఈ పేడ కంపు గేదల సందులో ఉండిపోడానికి బతకడం లేదే మనం! ఇందు లోంచి మనం పైకి లెగాల! ఊళ్లో పెద్దోళ్ళ వనిపించుకోవాల! మనుషులం చిన్నోళ్ళమైనా పెద్ద ఐడియాలుండాల! మన చేర్మేను గాడున్నాడు. ఆడు మనకంటె పెద్దోడా? కాడే! కాని. పెద్దో డయేడు? ఎలా గయేడు? మసిబూసి మారేడుకాయజేసి, తల్రాయి బుల్రాయి తాటికాయజేసి. చెందాలు పోగుజేసి కంపినీలు తయార్జేసి, పిల్లిమీ దెలకనీ, ఎలకమీద పిల్లినీ, రెండింటిమీదా ఇంకో కోతినీ ఎక్కించి, మళ్ళీ మద్దెని మద్దెవర్తిగ తనేఉండి, పెళ్ళాంసైడు డబ్బులాగి, ఒదిన్ని మాయజేసి దాని డబ్బంతా లాగి, లొంగినోణ్ని అణిచేసి, లొంగ నోడి కాళ్ళట్టుకుని పెద్ద గరానాగా తిరిగి ఊరికి మొగుడనిపిచ్చుకొని, అందరిశేతా "శెబాస్ రాజా!" అనిపిచ్చుకొంటున్నాడు మన చేర్మేన్ గాడు! ఆడికంటె మనవేం తీసిపోలేదే! కాని, ఆడు పెద్దోడయేడు; మనంవింకా గోసిపాతర్లా ఇలా ఉండే పోయినాం! అయితే, ఆడు పెద్దొ డయేడన్చెప్పి ఆడికి సంతుష్టుందా? లేదు. ఉండదంతే! చిన్న జెంతు

వుని తిన్నోడు పెద్దజంతువు కావాలంటాడు. పెద్దజంతువు తిన్నాక యింకా పెద్దజంతువు కావాలంటాడు. అదికూడాతిన్నాక అలాటియి రోజుకి పదికావా లంటాడు. మున్సిపాల్టి శేర్మేను జిల్లా శేర్మేనవాలంటాడు. ఆయెనక మినిస్టుర్రి కావాలంటాడు. ఆ తర్వాత చీఫ్ మినిస్టర్రివాలంటాడు. అక్కణ్నించి డిల్లీ ఎళ్ళాలంటాడు. ఇంగిలీషోడు ముందు శిన్న రెవు కావాలన్నాడు. ఆ తరవాత అక్కడ కోట కడతానన్నాడు. తరాత ఊరంతా తన ఆడాలో ఉండా లన్నాడు. అలాగే మెద్రాసు, కలకత్తా, బొంబాయి అన్నీ ఆక్కరమించేసి ఆకరికి దేశందేశఁవంతా పాకిరిపోయి డిల్లీ కోటమీద బావుటా ఎత్తేడు. అయితే - దాన్తో అదికి సంతుస్టుందా? లేదు. ఆయెనక బర్మాకావాలన్నాడు. అక్కణ్నించి మలయా సింగపూర్లు నాయే అన్నాడు-అలాగ్గ ప్రపెంచవంతా పాకిరిపోయేడు. మరిప్పుడు అమెరికాజూడు,రస్యాజూడు! ఆళ్ళదేశాలు శిన్నయాఆళ్ళకయిసాలవా! ఆదికంటె ముందు ఈడు. ఈడికంటె ముందు ఆడు బేగెళ్ళి శెంద్రమండలఁవంతా ఆక్కరమించేద్దాఁవని జూస్తున్నారా లేదా? ఇద్దరూ ఒక్కచుట్టే అందల దిగితే. శెంద్రమండలఁవంతా చెరిసకం పంచేసుకొని మూడోవోణ్ని మరక్కడ అందల అడుగెట్టనివ్వరు! అంచేత ఏంటంటే: మానవుడన్నోడు పుట్టడం శిన్నగా పుడతాడు. పుట్టేక, అమ్మపాలమీద, ఆయెనక అయ్య జీతంమీదకూడా పెరుగుతాడు. పెద్దోడయాక మాయజేసో కష్టపడో నెత్తులు కొట్టో పెరుగుతాడు. అంచేత మానవుడు పెరగాల! - అది ఒకటోరూలు, నువ్వు పెరగడం నీకూ మంచిది, నేను పెరగడం నాకు మంచిది, శేర్మేన్గాడు పెరగడం ఆడికి మంచిది. అంచేత మనం పెరగడం మనకి మంచిదన్నమాట – అది రెండోరూలు, అయితే మనం పెరగాలని జూసినట్టే ప్రెపంచకంలో ప్రతివోడూ పెరగాలనే జూస్తాడు, అంచేత అవతలోడి దెబ్బకి దొరక్కండ మనం పెరగాల! ఆడికి దెబ్బతీసైనా మనం పెరగాల. లేకపోతే ఆడే మనకి దెబ్బ తీసేస్తాడు. మనం పోతే ఆడు ఏడ్డు. అంచేత ఆడుపోతే మనం ఏడకూడదు. తురకోడు మనమీద సవారీ జేసిన్నాళ్ళు జేసేడు. మనం ఏడిస్తే ఆదేడిసేడా? అలాగ్గే ఇంగిలీసోడు మనం ఏడిస్తే ఆడు ఏడిసాడా? సాగినన్నాళ్ళు ఆళ్ళేంజేస్తే అది నాయెం! ఇప్పుడు మనం

ఏంజేస్తే అదే నాయెం! అంచేత దెబ్బకి చెరక్కుండ మన బాక్కోసరం మనం ఏచ్చేస్తే అదే నాయెం - అది మూడోరూలు, అంచేత ఏంటంటే రామారావుగాడు మనకి మంచిచేస్తే మంచిదే, అయితే, ఆడితో ఉండడం మనకి చెడ్డయినప్పుడు ఏం చెయ్యాల? ఎంత్నే ఇడిసి పెట్టెయ్యాల! మనం పెరగడానికి ఆడు అడ్డయినప్పుడు ఆణ్ని ఇడిసిపెట్టి పోమ్మనా అంతేగాని ఆణ్ని పట్టుకు ఏళ్ళాడగూడదు...."

అంటూ కొడుక్కి ఆ రోజంతా హితబోధ చేసి చేసి,

"అంచేత ఏంటంటే: లైపులో మనకి కనీసరం ఓ శిన్న బంగళా, ఓ శిన్నకారు, ఓ శిన్న బాంకులో అకౌంటు, ఓ మంచి శిన్న ఉజ్జోగం, సంగంలో మనకి ఎక్కడకెల్లినా గౌరవం - అయన్నీ మనం సంపాయించాల! అందాకా పెరిగేక అక్కణ్నుంచి ఎలా పెరగడం ఎందాకా పెరగడం అని అప్పుడాలోచిచ్చుకోవచ్చు. కాని, కనీసరం మనం అందాకైనా పెరగాల! సంగవంటే మీ బోటి యెదవ గుమాస్తాల సంగం కాదు. అందలైనా బావుపడాలంటే ఆ రామారావుగాడెనకాల తిరిగితే మరింక నువ్వూ బావుపడినట్టే: బేగెల్లి ఆ స్టోరు మేనేజర్‌గాణ్నీ, కిష్టారావునీ కలుసుకొని ఆళ్ళని గట్టిగ పట్టుకో!"

అంటూ హితబోధ ముగించేడు మందుల భీముడు.

ఆ మర్నాడు రంగారావు దగ్గరికి రామారావు వచ్చి, సానుభూతి చూపించి, సహాయం చేస్తానని అనరా ఇచ్చేడు. కాని, రంగారావు బుంగమూతి పెట్టుకొని. "బాగా ఉన్నప్పుడు అంతా స్నేహితులే! కష్టంలో ఉన్నప్పుడు పెత్తే! "ఇంటిదగ్గిర్లేరు, ఊరికెళ్ళేరు ఇప్పుడొస్తారు. అప్పుడొస్తారు", అనిపించేసుకుంటారు. ఏం చేస్తాం? ప్రపంచం అంతా అలా ఉంది. ఇప్పు డంతా బోధపడిందిలెండి! మా బాధలేవో మేం పడతాం. మీరు సాయం చేస్తే వద్దంటానా? సాయం చెయ్యకపోతే మిమ్మల్నిం సతాయించగలనా?", అంటూ రామారావుని మెత్త మెత్తగా నిందించేడు. నిందించిన వెంటనే వెళ్ళి, స్టోర్సు మానేజర్‌గార్నీ, కృష్ణారావునీ కలుసుకున్నాడు. పెన్సిల్సు "దొంగతనంగా తీసుకుపోడంలేదు. వాటిని భద్రంగా దాచే నిమిత్తం ఇంటికి పట్టుకు వెళ్తున్నాను." అని

సంజాయిషీ చెప్పమని సలహా చెప్పేరు వాళ్ళు. ఆ ప్రకారం వారే కాయితం వైపు చేయించగా అందుమీద వినయ విధేయతలతో సంతకం చేసి దొరగారికి సంజాయిషీ చెప్పుకున్నాడు రంగారావు.

ఆ తరవాత-

ఈసారి ఎలక్షన్స్‌లో రంగారావు రామారావుని సపోర్టు చెయ్య కుండా కృష్ణారావుని సపోర్టు చేస్తున్నాడనే దుఃఖంకొద్దీ, నీతి నిజాయితీల మిషతో రామారావే వెధవ నాలుగు పెన్సిల్స్‌తో రంగారావుని దొంకి పట్టి అప్పచెప్పి నా నా అల్లరీ పెట్టించేడని ఒక అపవాదు బయల్దేరింది. నీతి కబుర్లు చెప్పే రామారావు తను సెక్రటరీ అయిన పలుకుబడి ఉప యోగించుకొని వాళ్ళ చుట్టానికి కంపెనీలో నౌకరీలేయించుకున్నాడని కంపెనీలో ఒక ప్రచారం కూడా బయల్దేరింది. "అవును. నాకు తెలుసు! మన లంబాచౌడా ప్రసాద్‌గాడు రామారావుకి చుట్టమే ?" అని అందరి తోనూ రంగారావు చెప్పేడు - ఆ తరవాత, స్టోర్సు మానేజర్‌గారు రంగా రావుని దగ్గిరుండి దొరదగ్గరకి తీసుకు వెళ్ళేరు, తప్పుచేసి వెర్రిమొహం వేసుకు తిరిగివచ్చిన పెంపుడు కుక్కతో యజమాని మాట్లాడినట్టు రంగా రావుతో ఆ దొర చాలా గట్టిగానూ. అభిమానంగానూ మాట్లాడేడు. "నువ్వు మంచివాడివి! మంచివాడు చెడిపోతూంటే నా కోపం రాదా మరి ? !" అన్నట్టుగా, కొంచెం కోపంగా మాటాడినప్పటికీ ఎంతో ఆప్యాయంగా మాట్లాడేడు దొర. అతని కోపానికి తలవంచి, అతని ఆప్యాయతకి పొంగిపోయిన రంగారావు అతని ముందు వినయంగానూ గర్వంగానూ కూడా నిల్చున్నాడు.

రంగారావు యిచ్చిన సంజాయిషీ మానేజిమెంటువారు వప్పు కున్నారు. అతను యథాప్రకారం పన్లో ప్రవేశించేడు. ఎలక్షన్సులో ఒక్క రెండు వోట్ల మెజారిటీతో నెగ్గి గుమాస్తాల సంఘానికి సెక్రటరీ అయేడు కృష్ణారావు. అటు తరవాత, రంగారావు స్టోర్సునుంచి సేల్సు సెక్షన్లోకి మార్చబడ్డాడు. అప్పుడతనొక స్కూటర్ కొన్నాడు, కంపె నీలో చాలామంది అతని స్నేహాన్ని కోరుతుంటారు. కంపెనీ ఫుట్‌బాల్

టీముకి రంగారావు కాప్టెన్ అయేడు. అతను మానేజర్ దొరనేకాకుండా అప్పుడప్పుడు డైరెక్టర్ దొరగార్ని కూడా కలుసుకొని వారికి మిగతా గుమాస్తాల యోగక్షేమాలు తెలియజేస్తూంటాడు.

ఓడిపోయిన రామారావు నీతి నియమాలు లేనివాడే కాకుండా చాలా పొగరబోతు మనిషని కంపెనీలో కొంతమంది చెప్పుకోడం ప్రారంభించేరు. అత నొకసారి ఓ స్వాములవారి గురించి హేళనగా మాట్లాడితే ఓ ఆచారి అతన్ని తన్నబోయినంత పనిచేసేడు. "దేముడంటే వాడికి నమ్మకం లేకపోవచ్చు. కాని, నమ్మకం ఉన్నవాళ్ళని అతనలా ఇన్సల్ట్ చెయ్యకూడదు! "ఆచారీ, మంచిపని చేసేవు! ". అని చాలామంది ఆచార్ని మెచ్చుకున్నారు. ఓసారి రామారావుని దొర ఏదో అంటే, మంచీ చెడ్డా చిన్నా పెద్దా తారతమ్యం చూడకుండా, రామారావు దొరమీద తిరగబడి మాటకి మాటా జవాబుచెప్పి నానాతిట్లూ తిట్టేడు. అందుమీదట అతణ్ని సస్పెండ్‌చేసి ఆ తర్వాత ఉద్యోగంలోంచి తీసేసినపుడు, గుమస్తాల సంఘంవారు అసహాయంగా ఉండిపోవలసి వచ్చింది.

ఉద్యోగం ఊడిపోయాక, రామారావు నానాపాట్లూ పడ్డాట. మరొక ఉద్యోగం దొరక్కపోడమే కాకుండా అతనికి దొరికినా పనిచెయ్యటానికి వీలులేకుండా టీ. బీ. రోగం అంకురించిందట.

రామారావు టీ. బీతో బాధపడుతున్నాడని కంపెనీలో తెలిసినప్పుడు రంగారావు చాలా విచారం వెలిబుచ్చేడు. "గురుడు మంచోడే కాని దొరనీ దేముణ్ని తిట్టి చెడిపోయేడు!" అని చమత్కారంగా అన్నాడు రంగారావు. "రామారావు, దొరనీ దేముణ్నీ తిట్టి చెడిపోయేట్ట! మన రంగారావు చెప్తున్నాడు. విన్నావా?", అని రంగారావు ఆడిన చమత్కారం మాట కంపెనీ అంతా చెప్పుకున్నారు.

ఉద్యోగంలో తిరిగి ప్రవేశించేక ప్రమోషన్ వచ్చేక, స్కూటరు కొన్నాక, రంగారావు కొండకి వెళ్ళి స్వామివారి దర్శనం చేసుకున్నాడు. హెడియాకూడా అతన్తో వచ్చింది. దేవుణ్ని స్పెషల్ టిక్కెట్టుకొని చూద్దాం అనుకున్నారు వాళ్ళు. కాని, ఆరోజున ఎవరో మినిస్టర్‌గారు

పేదజనంతోపాటు క్యూలో నిల్చొని ధర్మదర్శనం చేస్తారని రంగారావుకి కబురు తెలిసి "అక్కా! మనవూ ధర్మదర్శనం చేద్దాం" అన్నాడు. ఆ రోజున అక్కా తమ్ముడూ మినిష్టర్‌గారికి ముగ్గురు మనుష్యుల వెనకనే క్యూలో నిల్చున్నారు. నిరాడంబరులైన ఆ మినిష్టర్‌గార్ని అనేకమంది వచ్చి ఫొటోలు తీసేరు. అవి ఆ మర్నాడు పేపర్లలో పడ్డాయి. ప్రతి ఫొటోలోనూ మినిస్టర్‌గారితోపాటు రంగారావూ హెడియాకూడా నవ్వుతూ పడ్డారు. ఆ పేపర్ల కత్తిరింపులన్నీ ఇప్పటికీ రంగారావుదగ్గరా హెడియా దగ్గరా ఉన్నాయి. "చూసేవా! చిన్నోళ్ళ దగ్గర్నించి పెద్దపెద్ద మినిస్టర్ల దాకా అందరికీకూడా దేముడంటే ఎంత భక్తో?", అని హెడియా తన తమ్ముడికి భగవంతుడికి ఎంత పలుకుబడుందో నిరూపించింది. గుడిలో దేవుడిముందు నిలబడ్డానికి మామూలుగా అయితే అట్టే టైము ఇవ్వరు. కాని, ఆ రోజున మినిస్టర్‌గారి వెనకాతల ఉండడంచేత రంగారావూ, హెడియాకూడా తనివితీరా భగవంతుణ్ని చూసి లెంపలు వేసుకొని, కిందనిపడి నమస్కరించి, లేచి ధన్యులయేరు. తను చేసిన అన్నిపాపాలూ "క్షమించు తండ్రీ" అని రంగారావు అతిదీనంగా వేడుకున్నాడు. "రామారావుయెడల నేనేమైనా పాపంచేస్తే అదికూడా క్షమించి ఆ ఉసురు నాకు లేకుండా చెయ్యి తండ్రీ!" అని ఎంతో దీనంగా ప్రార్థించేడు. అతనలా ప్రార్థిస్తూండగా భగవంతుడి సన్నిధిలో ఉన్న పూలకుప్పలో కొన్ని పూలు కదిలి జారేయి. తన ప్రార్థన విని భగవంతుడు నిజంగా కదిలేడనే నమ్మకం రంగారావుకి వెంటనే కలిగిపోయింది. ఆ తరవాత బైటకి వచ్చేక రంగారావు అన్నాడు :

"అక్కా! నాకు వెయ్యేనుగుల బలం వచ్చినట్టుందక్కా!"

తమ్ముడు అలా అనగానే హెడియా కళ్ళంట ఆనందాశ్రువులు రాలేయి. తమ్ముణ్ని ఆపదనుండి కాపాడిన భగవంతుడు తనకి పెళ్ళికూడా తప్పక చేయించగలడని నమ్మకం కుదిరిపోయింది.

రంగారావు భగవంతుడికి తన తల నీలాలన్నీ ఇచ్చేసేడు. దాన్తో పాపాల బరువంతా పోయినట్టు అతను ఎంతో చులకన పడ్డాడు. గుండు

చేయించుకున్నాక, షోకైన తురకటోపీ ఒకటి పెట్టుకుందాం అని అత ననుకున్నాడు, కాని, నిజంగా భగవంతుడియందు భక్తుంటే. అతనికోసం గుండు చేయించుకొని, ఆ గుండు "అందరూ చూస్తారని సిగ్గుపడకూడదు మనం!" అనుకున్నా డతను. అందుచేత టోపీ లేకుండానే అతను తిరగ నారంభించేడు.

ఇప్పుడు రంగారావు జీవితంలో చాలా ముందు కొచ్చేడు. నిజంగా ఏనుగు బలంతో విజృంభించేడనే చెప్పాలి. అత నిప్పుడు కంపెనీ ఫుట్ బాల్ టీముకి కాప్టెన్ కాడు! మానేజర్‌గా ఉంటున్నాడు. అతనికి కంపెనీ వారు స్కూటర్ అలవెన్సుకూడా ఇస్తున్నారు. ఆ వూళ్లో పెద్దల స్కైగర్ క్లబ్బొకటుంది. అందులో అతను మెంబరయేడు. ఊళ్లో స్కూటర్స్ ఉన్నవాళ్ళూ వారి స్త్రీలూ ఓసారి పిక్‌నిక్ వేసుకున్నారు. ఆ రోజున హెడియా అక్కనీ స్కూటర్‌మీద ఆ పిక్‌నిక్కి తీసుకువెళ్ళేడు రంగా రావు. స్కూటర్ క్లబ్బులో పెద్ద పెద్ద వాళ్ళంతా మెంబర్స్‌గా ఉన్నారు. వారిలో చాలామంది పులిక్లబ్బు మెంబర్సుకూడాను, ఆ రోజున రంగారావు శరీరం అంతా ఆనందంతో పొంగింది. ఆ స్కూటర్ క్లబ్బే విమానాల క్లబ్బయినట్టుగా ఫీలయేడతను. ఆ క్లబ్బులో పదిమంది అమెరికనులు కూడా మెంబర్స్‌గా ఉన్నారు. ఆ పిక్‌నిక్ రోజున అమెరికనులూ, వారి భార్యలూ టోకున వెయ్యి భారతీయుల కంటె ఎక్కువ ఉత్సాహం ప్రక టించేరు. కొంచెం నల్లగా ఉన్నప్పటికీ హెడియాని వారంతా అభిమా నించేరు. ఆ తరవాత హెడియాకికూడా జీవితంలో ఏదైనా పెద్ద అవకాశం రాగల సూచనలు కనిపించసాగేయి. ఆమెకి అక్కడ కొత్త కొత్తవారితో పరిచయం అయింది. తారా జువ్వలా పైకిలేచి, తను లేవడమేకాకుండా తన వారినందర్నీ కూడా పైకి లేపుకు పోగలననే ధైర్యం వచ్చేసింది రంగారావుకి.

కొండమీద దేవుణ్ని చూసివచ్చేకే రంగారావు మిస్ ప్రేమ పరి చయం సంపాదించేడు. అతనికి ఆమె నెలాగైనా పొంది పెళ్ళాడాలనే కోరిక ఓ పెద్ద కసిలా పట్టుకుంది, భగవంతుడి అనుగ్రహంవల్ల ఆ కోరిక తప్పక సిద్ధిస్తుందనే అతను అనుకున్నాడు.

అందుకు ప్రేకు పడేసరికి రంగారావు తోక తొక్కిన తాచు లాడేడు.

మండుల భీముడు భోజనం అయేక, రంగారావు, హెడియా భోజనానికి కూర్చున్నారు.

"ఇందాక్లో కమల ముండొచ్చింది," అంది హెడియా.

"అదెప్పుడొచ్చినా మనకి పాడే!" అన్నాడు రంగారావు.

"ప్రసాద్‌గాడూ, మన పద్మా దానికి మొన్నాదివారం హాపీవాలీలో కనిపించేరట."

రంగారావు ఊరుకున్నాడు.

"ఇద్దరూ చేతులు కలుపుకొని చెట్టాపట్టా లేసుకు పోతున్నారంట."

రంగారావు గుండెలో బాకులు గుచ్చుకున్నాయని అతని ముఖం చూస్తే బోధపడుతుంది:

"ఆ వేళ పాములు కనిపించేయని చెప్పేను చూసేవా? ఆ పాములు మన పీకల మీదికొచ్చేయేయనుకో! అప్పణ్ణించీ ఇద్దరికీ కల్సిపోయినట్టుంది. వాలీలో కూర్చుని ఇద్దరూ .... ఓఓ .... చెప్పలేం! వాళ్లేం చేసేరో ఏంటో అంతా ముద్దుముద్దుకీ ఒర్లించి చెప్పింది కమల ముండ!"

"ఆ కమల ముండెందు కెళ్ళిందక్కడికి?"

"ఏ రంకు మొగుడితోనో వెళ్ళుంటుంది. ఇంకేంటి?"

"చత్కారీ ముండ!"

"అది చతకారీ ముండే. ఒప్పుకున్నాం. అలాటి దానికి ఇలువేం ఉంటది? ఉండదు కాని, మన పద్మకి బుద్ధిలేదంటని జూస్తున్నాను. పెద్ద ఛేర్మన్ కూతురు! లక్షాధికారిణి! అలాంటి బేడాపరక ప్రసాద్‌గాణ్ని తగులు కుందంటే ఆశ్చర్యం! అయినా ఏంటి రాయ్? ఈ రోజుల్లో పెద్దా చిన్నా లేదనుకో! ఆడా, మగా రెండే జాతులు! ఏం జేస్తాం? అయినా నువ్వు చేజేతులా ఒదులుకున్నావు. కమలా సరసీరుహం తాటకీ చుప్పనాతీ అంటే చొరవగా ఎళిపోతావుగాని పువ్వులాటి పద్మంటే నంకిరొడుతూ

ముట్టుకోలేకపోయావు. పెర్లిన్ సూపేస్తేనేంటి, స్కూటరెక్కితేనేంటి? అవెందుకూ? మొగాడికి చౌరవుండాలి! అని తమ్ముడి చౌరవలేమికి వాపోయింది హెడియా.

"ఆ కమలముండ కక్షకొద్ది చెప్పింది! పద్మకోసం మీ తమ్ముడు ప్లాపేస్తున్నాడుగాని దాన్ని మరోడు తన్నుకు పోయేశ్లే! అని నన్ను ఎక్కిరిస్తందన్నమాట! ముండ!"

పద్మజని తన తమ్ముడు కాకుండా మరొకడు తన్నుకు పోయేడన్న విచారంకంటె, ఆ భోగట్టా కమలకి తెలిసిపోయినందుకు ఎక్కువ కోపం కనపరిచింది హెడియా.

"పనెట్టుకొని ఒచ్చి మరీ చెప్పింది! ముండ", అని మళ్ళీ తిట్టింది కమలని కసిగా హెడియా.

"అయినా ఆవేళ నేను పద్మని మాతో పిక్నిక్కి తీసికెళ్ళక పోయినా బావుణ్ను. వాడక్కడ దానికి తగలకా పోను. కథింతవరకు నడవకాపోను. అయినా, మనం ఒకటి తలుస్తే దేవుడింకోటి తలుస్తాడు" అని వేదాంత ధోరణిలో పలికింది హెడియా.

దేవుడు ఆ విధంగా ఇంకోటి తలవడం రంగారావుని మరీ బాధ పెట్టింది. ఆ రాత్రంతా అతను నిద్రపోలేదు. మందుల భీముడిగురించి మంత్రసాని రాధ పడినకంటే అతను ఎక్కువ యాతన అనుభవించేడు. ఆ రాత్రికి రాత్రే ఏదైనా ప్రమాదమైన జబ్బుచేసి ప్రసాదుగాడు ఛస్తే బావుండునని పించిందతనికి. అయినా "ఆడముండలకీ బుద్ధిలేదు" అనుకున్నాడతను. అతనికి మిస్ ప్రేమని కమ్చీతోకొట్టి బలవంతంగా చెరిచి "పోముండా! ఇప్పుడు అ ప్రసాద్‌గాడితోనే పోతావో! ఇంకెవడితో పోతావో: పో ఇప్పుడు!" అని అరిచి చెప్పాలనిపించింది. ప్రసాద్‌గాడు అన్ని సౌఖ్యాలూ ఆమెతో అనుభవించే ఉంటాడని అనుకోడం ఇష్టంలేక ఆ రాత్రల్లా అతను యమయాతన పడ్డాడు. ఏదో విధంగా ఆ సౌఖ్యాన్ని భస్మం చేస్తేనే తప్ప "నేను మరింక బతకను!" అనిపించేసిందతనికి. తను పద్మజకోసం పైర్రి చేస్తున్నట్టు ఊరందరికీ తెలుసు! ఆ ప్రసాద్ గాడి

క్కూడా సే ఉండాలి! తెలిసుండీ కూడా-డర్టీ రాస్కెల్-తెలిసీ కూడా వానికి సీక్రెట్‌గా ప్రై చేసి లాగేడు! దొంగ రాస్కెల్! వాడు దొంగ రాస్కెల్ అవునా, కాదా? ఒకరు ప్రై చేస్తూన్న పిల్లని ఇంకోడు ప్రై చెయ్యొచ్చా? పాపంకాదూ? అందులోనూ వాడు మనకి మళ్ళీ ఫ్రెండు కూడాను! "రంగారావుగారూ! రాజమ్మగేదెలు నా పీకల మీదకెక్కి-పోతున్నాయండీ! ఏం చేద్దా(మండీ రంగారావుగారూ?" అని మళ్ళీ మన దగ్గిరికే పెద్ద ఫ్రెండులా రావడం! ఛ ఛ! ఏదైనా క్షమించొచ్చు కాని స్నేహంగా ఉండీ ద్రోహం చెయ్యడం క్షమించకూడదు! అలాటోళ్ళని ఏం చేసినా పాపంలేదు. ఉండ్రా అబ్బాయ్ ఉండుండు: రంగారావుగాడంటే నఖియా(గా డనుకుంటున్నావు కాబోలు! మంచిగా ఉంటే మంచోణ్ని! లేకపోతే దెబ్బకిదెబ్బా తియ్యగల్ను!" సెంటర్ ఫార్వార్డ్ ఆడతాను. ఛైర్మన్ కూతుర్ని లాగేను, అని గుర్రాగుంది కాబోలు! గుర్రాగిర్రా ఊడ దీసేస్తాను! రేపొద్దున్న రెయిల్వేక్లబ్బు జానీగాడితో చెప్పేనంటే ఎల్లుండి మాచ్‌లో బంతొదిలేసి నీకు కాలిరిచేస్తాడు! ఫీల్డులోకి వాడు దిగేడంటే పోలీసుటీమ్‌కూడా బెదురుతుంది! అదికాబోలు అనుకుంటున్నావు! అయినా ఒరే వెధవా! నువ్వేపాటి వాడివిరా? నిన్ను మసిచెయ్యాలంటే నిముషం జాల్ను! కాని నా కెందుకు? పాపాలు చేసిన వెధవల్ని భగవంతుడే శిక్షిస్తాడు! నీ పాపం నిన్ను తినేయకపోతే నా పేరు రంగారావేకాదు! అయినా పద్మా! నీకేం బుద్ధిలేకపోయింది? అందులోనూ ఆడితో అంత నాటకం ఆడుతూ ఏమ్మోహం పెట్టుకుని ఊళ్ళో తిరుగుతున్నావు? మన కుటుంబాల గౌరవం అంతా తీసిపారేసేవు కదే! అయినా, నీదేం తప్పు లేదులే! తియ్యగ మాటాడుంటాడు దొంగెధవ! హైక్లాస్ ఆడపిల్లల్తో ఇదే చిక్కు! ఎవడు మంచో ఎవడు చెడ్డో తెలుసుకోలేరు! అయినా, పద్మా! వాడికి పాఠం నే చెప్తాను. లేకపోతే, దేవుడు చెప్తాడు!

అలా తెల్లవారు ఝాము నాలుగ్గంటలదాకా రంగారావు బాధపడుతూనే ఉన్నాడు. అతనికి మహాపడితే ఓ రెండుగంటలు మాత్రం నిద్ర పట్టుంటుంది. ఆరోగంటకల్లా నిద్రలేచి కాలకృత్యాలన్నీ గబగబా పూర్తి చేసుకొని పెద్దపనున్న వాళ్ళా బయల్దేరేడతను.

ఆ రోజు శనివారం. కంపెనీకి మధ్యాహ్నం ఒంటిగంట నుంచీ సెలవు. ఉదయం ఎనిమిది గంటలకి ఆఫీసుకి వెళ్ళాలి, కాని, రంగారావు ఆ రోజున ఆరున్నరకే బయల్దేరి, దార్లో రాజమ్మని చూసి ఆగినవాళ్లా వాళ్ళ ఇంటిముందు స్కూటర్ ఆపేడు.

పూర్వం అయితే ఆ పాటి వేళకి రాజమ్మ తన గేదెల్ని తోలుకొని పాలవాడికల గురించి ఊరిమీదకి పోయేది. కాని, ఇప్పుడామెకి నౌకర్లూ చాకర్లూ అంతమంది ఉన్నారు. మూరెడు వేప్పుల్ల పట్టుకొని ఆమె పళ్ళు తోముతూ రోడ్డుమీద ఎవరో నీళ్ళ బిందెల ఆడంగులతో ఏదో చెస్తోంది.

రంగారావు స్కూటర్ ఆపడంచూసి, నోట్లో పుల్లతీసి, ఆమె అతని దగ్గరికి వెళ్ళింది. రంగారావు స్కూటర్ దిగకుండా కాళ్ళు నేలకి ఆన్చి,

"ఏం రాజమ్మా! ఏంటికత?" అని నవ్వుతూ అడిగేడు.

"కతేటుంది. రాయిబాబూ! మీ కంపినీలో పన్చేస్తన్నాడు సూడు! అల్లక్కడకమ్మలింట్లో ఉంటన్నాడు; కమ్మలింటి రాజుగా డంటారు; ఆడి కతే సెప్తున్నాను?" అంది రాజమ్మ.

"కమ్మలింటరాజుగాడంటే ప్రసాద్‌గాడేనా?" అని ఇంకా నవ్వు తూనే అడిగేడు రంగారావు.

"ఆఁ ఆఁ. ఆ జెష్టదవేబాబూ! చినిమా ఏక్టరు రాజేశ్వరరావుగాళ్ళా ఆడుంటా డంట? అందుకోసరం ఈధిలో ఆడముండలంతా ఆణ్ని అడు గోటే రాజేశ్రావంటే అడుగోటే రాజేశ్రావని ఎగబడతారు! ఆడే కమ్మలింటి రాజుగాడంటేను! అయినా, మా ఆడముండ్లకి బుద్ధిలేదు బాబూ ఎవుడెర్రగుంటే ఆడికే ఎగబడతారు?"

"అందరాడవాళ్ళూ అలాగుంటారా, రాజమ్మా!" అన్నాడు రంగా రావు.

"అందరలాక్కాక పోయినా. శానామందిరంతేబాబూ!" అంది రాజమ్మ చాలా విచారిస్తూ.

"సరే కాని - కమ్మలింటి రాజుగాడి కతేంటి. చెప్పేవు కావు?"

"సెప్పడాని కేటుంది రాయిబాబూ? ఏం జెప్పినా నువ్వు ఆర్సాలా తీర్సాలా? అడికీ నీకూ ఒక్కసోటే నౌకరీ! ఇద్దరూ ఏకమై(పోయి మల్లా నా మీదే కత్తిగడతారు! సమాకునోళ్లంతా ఒక్కటేగదా? మాలాంటి సదువులేని మూర్కులంటే మీకు లోకువ!"

"ఛ! అవేం మాటలు రాజమ్మా! నే నెప్పుడైనా నిన్ను అలా చూసేనా? ఆ కమ్మలింటి రాజుగాడితో చెప్పేనుకూడాను. "తప్పురా! నోర్లేని జంతువులు మనకేం చేశాయి, నోరున్నాకూడా ఆ రాజమ్మ నోర్లేని గోవుతో సమానం! ఆవిడ ఊసు మన కెందుకు? అంటే వాడు విననే. నన్నేం చెయ్యమంటావు రాజమ్మా!" అని జాలిగా అడిగేడు రంగారావు.

"అలా మంచిసెవర సెప్తే అలాటోళ్ళు ఇనరు రాయిబాబూ: సెప్పేయిదంగ సెప్పాలి! సమాలేనిముండ, ఎ(కెముండ ఇదేటిజేస్తాదని సూస్తన్నాడు, నేకపోతే, నిన్నమాపిటేళ—అన్నట్టు! నువ్వూ అక్కడే ఉన్నావుగదా రాయిబాబూ!—సూల్తో ఉన్న గేదమీదకి అలా రాయిసి రేసినాడు! నువ్వే జూసినావు! ఆ దెబ్బకి గేద ఈనేసినాది. పెయ్య సచ్చేసి నాది!"

"అయ్యో!" అన్నాడు రంగారావు.

"నా మీద పేపర్లకి పిటీసన్లెట్టి, నా గేదలమీదికీ రాళ్ళిసిరి, నా పెయన్సంపి ఆడెలా తప్పించుకెళిపోతాడో నానూ జూస్తాను! ఇయాళ ఆడి పిలక బట్టుకు జాడించిపోతీ నాను రాజమ్మని గాను. నానో అమ్మకీ అబ్బకీ పుట్టిందాన్ని గాను! పబిలీగ్గ పిలకపట్టుకు జాడించేస్తే నువ్వే అడ్డు కుంటావో, నీ అయ్యే అడ్డుకుంటాడో ఈధిలో ఏ సమాకునోడు అడ్డు కుంటాడో నాను జూస్తానియాళ!" అని కేకలు వేసింది రాజమ్మ.

"వాడు గిల్లికజ్జాలు తెచ్చుకుంటే మేంకూడా గిల్లికజ్జాలు తెచ్చు కుంటావా(. రాజమ్మ?! అయినా, మొదట్నించీ ఇక్కడున్నవాళ్ళం మనం! వాడు నిన్నకాక మొన్నొచ్చేడు! ఉన్నూరుకుక్క పొన్నూరు కుక్కతో పొద్దంటే, కుక్కకాబట్టిపోద్ది! కాని, మనుషులం అలాచేస్తావా( రాజమ్మా?!" అని అభిమానంగా అన్నాడు రంగారావు.

"పెయ్యకరీదు ఇవ్వకపోతే అడి అయువుకి ఇయాళగాలే!", అని ఖచ్చితంగా చెప్పింది రాజమ్మ.

"ఏం చేసినా, జాగ్రత్తగా దెబ్బకి దొరక్కుండా చెయ్యి:", అని సలహా ఇచ్చేడు రంగారావు.

"నాను శివాలెత్తిపోతే మరింక ఇక్కడా అక్కడా అని జూణ్ను! ఇదీ అదీ అని జూణ్ను! ఈడూ ఆడూ అని జూణ్ను!"

"వాడెలాపోతే నాకేంగాని, నీ మంచికి చెప్తున్నాను, రాజమ్మా! ఏం చేసినా జాగర్త మీచ్చెయ్యి:" అని స్కూటర్ నడిపించుకు వెళ్ళిపోయేడు రంగారావు.

సెక్యులర్ సౌభాగ్యమునకు ముఖ్య చిహ్నము లైన కిల్లీకొట్ల ప్రశంస — ప్రశంసానంతరం మధ్యాహ్నం ఒంటిగంటకి చింతచెట్లు నీడలో బంగారి కిల్లీకొట్టుకి పాఠకులు వెళ్ళగలరు—బంగారపు బంగారీ, కాకి బంగారపుటమ్మలు, ఈగల్ని దాచిన రొట్టెలవాడు, అడారి ఆదినారాయణ, పీనుగు గుమాస్తా, కమ్మలింటిరాజు పాఠకులకు పరిచయ మవగలరు—పడబోయె పిడుగుల వర్షమునకు నాందీగా ఒకానొక ఉగ్రకంఠమురిమిన ఉరుమును పాఠకులు వినగలరు.

# 9

సెక్యులర్ సౌభాగ్యమునకు ముఖ్య చిహ్నములైన కిల్లీకొట్ల ప్రశంస - ప్రశంసానంతరం మధ్యాహ్నం ఒంటిగంటకి చింతచెట్ల నీడలో "బంగారి కిల్లీకొట్టు"కి పాఠకులు వెళ్ళగలరు. బంగారపు బంగారీ, కాకి బంగారపు టమ్మలూ, ఈగల్ని దాచిన రొట్టెలవాడూ, అడారి ఆదినారాయణా, పీనుగు గుమాస్తా, కమ్మలింటి రాజూ పాఠకులకు పరిచయ మవగలరు - పడబోయే పిడుగుల వర్షమునకు నాందిగా ఒకా నొక ఉగ్రకంఠ మురిమిన ఉరుమును అధ్యాయం ఆఖర్న పాఠకులు వినగలరు :

"ఒరే ! కవీ ! కిర్లీ కొట్టు నిర్మించరా !"

చిత్తము వినుడు.

కిళ్లీ కొట్లు మన భారతదేశములోని ప్రతి గ్రామములోనూ ఉండును. అచ్చట మీఠా మిఠాయి లేక మసాలా కిళ్లీలు మీ యిష్టానుసారము కొన వచ్చును. కిళ్లీ కొట్లవద్ద కిళ్లీలే కాకుండా వాడీవీడీలున్ను, వాచిసిగరెట్లున్ను కూడా అమ్మకము చేయబడును. మీరు చిన్నవారైనచో అవి అక్కడ కొనుబడి చేసుకొని ఇంటిలో తెలియకుండా అక్కడనే కాల్చుకొన వచ్చును. అగ్గిపెట్టె కావలసి వచ్చినచో అదికూడా కొనుబడి చేసికొన వచ్చును. లేనిచో; కాలే చేంతాడుకాని, మండే దీపపుబుడ్డికాని మీ కక్కడ నిప్పుకి కొరతలేకుండ సిద్ధముగా లభించగలవు. మీకు దాహము కలిగినచో కిళ్లీ కొట్టువద్దకు పొండు : అచ్చట మీకు అల్లికాయసోడాలే కాకుండా, లెమను సోడాలే కాకుండా రకరకాల రంగుబుడ్లు దొరకగలవు; అవి త్రాగినచో మీ దాహబాధ తీరగలదు. మీకు తక్కువ డబ్బులుండి ఎక్కువ ఆకలి వేయుచో అప్పుడుకూడా మీరు కిళ్లీ కొట్టు వద్దకే పొండు ! అచ్చట మీకు పండిన అరటిపండ్లు మెండుగ లభించును ! అవి తినినచో మీ ఆకలి తీరును. అరటిపండ్లు తినుచూ నంజుకొనుటకుగాను మీ కచ్చట గాజుసీసాలలో భద్రపరచిన కొబ్బరుండలు, ఎర్రపంచదారుండలు, స్ప్రింగు పెప్పరమెంటులు, చాకలేటులు వగైరాలు విరివిగ లభింపగలవు. రౌడీ మూకలతోచేరి మీకు తలలు బ్రద్దలు చేసుకొనవలెనను తలంపుకలిగినదా ? వెంటనే కిళ్లీ కొట్లవద్దకు పొండు ! పొండు ! అచ్చటదొరకు సోడాబుడ్లను దొరకబుచ్చుకొని వాటిని మిక్కిలి చక్కని మారణాయుధములవలె మీరు ఉపయోగించుకొనవచ్చును. మీకు దెబ్బ తగిలినదా ? వెంటనే కిళ్లీ కొట్టు వద్దకు పొండు ! ఆలసింపకుడు ! అచ్చట సోడాతో దెబ్బను శుభ్రముగా కడిగికొని, కాచు కలిపిన సున్నము పూసుకున్నచో మీకు తగిలినదెబ్బ త్వరితముగా మానగలదు. మీకు బ్రహ్మానందము కావలెనా? పిరికితన మనే జ్వరమును మీరు పోగొట్టుకొనుటకున్ను, కష్టాల విషబాధలను మీరు దులుపుకొనుటకున్ను, మీ దేహమునకు విశ్రాంతి, మీ మనసుకు

ఉల్లాసమూ కలిగి మీకు బ్రహ్మానందము సిద్ధించుటకున్ను అనువుగా మద్యపానపు శాఖవారి రహస్యానుమతిపై కొన్ని కొన్ని ప్రత్యేకమైన కిల్లీకొట్లవద్ద ఒకటవరకం వంటసారా సరసమైన ధరకు మీకు లభింప జేయబడగలదు. మీకు స్త్రీ వాంఛ ఉన్నచో... మీకు స్త్రీవాంఛ యున్నదా? చిత్తము చిత్తము! సంగతి గ్రహించితిని. మీకు వాంఛ అధికమై కంపె నీలు దూరమై భార్యలుగాని, ఏ తప్పమాన చారికలుగాని కరవైనప్పుడు ఓ రొక అడ కిల్లీకొట్టు పరిచయ భాగ్యమును ముందుగానే సంపాదించు కొని యున్నయెడల మీకు సంభవించిన తాత్కాలిక కష్టదశ నిమిషములో కడతేరిపోవునే! మీరు కళాకారులా? మీకు సౌందర్యాపేక్ష కలదా? మీరు ఇంకెక్కడకూ పోకుండ కిల్లీకొట్లవద్దకు పొండు! కిల్లీకొటలో పటములు కట్టిన క్యాలెండర్ల బొమ్మలలో రంగు రంగులుగా పొందిన స్త్రీ సౌందర్యమును మీరు కనులారా గ్రావి, ఆనందించి ఆ సౌందర్యమునకు మించిన సౌందర్యము భూ ప్రపంచములో లేనేలేదని గ్రహించగలరు! మీరు భక్తులా? మీకు భగవంతుడు కావలెనా? మీకు భక్తియే కావలెనా? మీకు భక్తియే కావలెనన్న అది కిళ్ళీకొట్లవద్ద మెండుగ లభించు ముఖ్య పదార్థములలో నొకటికదా! మళయాళపు కిల్లీ కొట్లయందు గురువా యూరు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని మీరు దర్శించగలరు. కన్నడపు కిల్లీకొట్ల యందు శాంత సాయిబాబాను మీరు కనులార గాంచగలరు. అరవయ్యరు కొట్టునందు మధురమీనాక్షినిగాని, రామేశ్వరునిగాని ప్రాంతీయపు ఆరు ముగమునుగాని మీరు వీక్షించగలరు. మహమ్మదీయుల కిల్లీకొట్టయినచో పటముకట్టిన కురానుసూక్తులు మీరు చదవగలిగినచో చదువుకొనగలరు; లేదా నయనానందకరముగ కాంచగలరు. ఇవి యేవియునుగాక, 'జాను తెనుంగు' కిల్లీకొట్టే అయినచో శ్రీ వేంకటేశ్వరునిగాని, సింహాచలా ధీశునిగాని, అన్నవరం సత్యనారాయణునిగాని, కాళహస్తీశ్వరునిగాని, కనక మహాలక్ష్మి, కనకదుర్గనుగాని, ముమ్మడివరపు బాలయోగివార్నిగాని మీ తనువు పులకింప, మీ డెంద ముప్పొంగజూచి, ఆమేరకు మీపాప ములను కడతేర్చుకొని ఆపాటి పుణ్యమును మీరు మూటగట్టుకొనగలరు!

ఈలోపున మీరొక సోడాత్రాగి, ఒక కిళ్ళీ బిగించి ఒక సిగరెట్టు అంటించి,
కనులు కాయలుకాచేలా సిటీ లేక రూటు బస్సుకొరకై వెయిటు చేయవచ్చును.
రాత్రివేళలందు మీరు కిల్లీకొట్లవద్ద బ్రాకెట్టు చీట్లు వ్రాయించు కొనవచ్చును.
పోస్టాఫీసులు మూసిన ఏ సమయమందైననూ హెచ్చుధరలకు, కవర్లు
కార్డులు స్టాంపులు అన్నియును మీరు లభింపజేసికొన వచ్చును. అర్ధరాత్రి
సమయములో లాడ్జింగు హవుసులోని మీ తాత్కాలిక ప్రేయసికి ఏమర్జం
టుగా తోముడుసబ్బు, పాముడు పౌడరు, వాసన్నూనె, రబ్బరుసన్నె, సిగ
పిన్ను ఇత్యాదులు కావలసి వచ్చినచో మీరు లాడ్జిబాయ్‌ని కిల్లీకొట్టువద్దకు
తగిలినచో అవి యన్నియు కూడా అధికధరలకు అచ్చట లభించగలవు.
ముక్కుపొడుము పొగచుట్టలు వారపత్రికలు, బూతుచిత్రములు, తలనొప్పి
మాత్రలు, చెక్కపొట్లములు, దారపుండలు, పండ్లపోడులు, వగైరా
వగైరాలు కావలయునన్నచో సరసమైన ధరలకు అవికూడా కిల్లీకొట్లవద్ద
మీకు లభింపజేయబడగలవు. మీకు లోకంపోకడ, సామాన్యుని వేదాం
తము, రంగుల కథలు, పుక్కిటి పురాణములు ఇత్యాదులు కావలయు
నన్నచో అవి లభ్యమగుచోటు కిల్లీకొట్టుగాక వేరొండు గలదే! అది
యుంగాక, వర్ణవిద్వేషములు మతవైషమ్యములు, ప్రాంతీయ దురభి
మానములు లేని మన కిల్లీకొట్లు అవి మన పుణ్యభూమిలో బంగారు
జాగాలు, అతి పవిత్రస్థలములు, మనజాతికి గర్వకారణములు! వేయేల?
సిరిసంపదలకు, బీదసాదలకు, గాంధి నెహ్రూలకు, వరదలకు
వర్ధంతులకు ఆలవాలమై హిందుబౌద్ధశిఖ జైనపారశిక ముసల్మాను క్రీస్తా
నీలకూ, పెను అమీరులకూ కడుగరీబులకు ఉనికిపట్టయి తిరోగమనమును
ఆపుకొని పురోగమింప ప్రయత్నంచేసే మనపవిత్ర భారతదేశపు వర్త
మాన (సెక్యులర్) సౌభాగ్యమునకు మన కిల్లీకొట్లు అతిముఖ్య చిహ్న
ములు, మచ్చు వజ్రపు తునకలు!

*

ఆవిణ్ని "కిల్లీకొట్టు బంగారి" అంటారు.
ఆ కొట్టును "బంగారి కిల్లీకొట్టు" అంటారు.

వీధికి మలుపుంది, మలుపులో చింతచెట్టుంది. చిగుర్న కొంగ లుంటాయి. దిగువున బంగారి కొట్టుంటుంది. ఆ కొట్లో ఆ బంగారి గుళ్లో విగ్రహంలా, బలిసిన చిలకలా, చలికాలంలో రగ్గులా, పేదవాడి కండ్లోని పర్మనెంటు కలలా, గుమ్మటంలా కూర్చొనుంటుంది.

కొంగల రెట్టలు కొతాదార్లమీద పడకుండా కొట్టుముందు చల్లని పందిరి వేయించింది బంగారి. కొతాదార్లంతా చెట్టు నీడకింద కొట్టు (దగ్గిర పందిరి) నీడకింద డబుల్‌నీడలో హాయిగా కూర్చుంటారు - మానవుడు ఈ లోకంలో ఎవర్ని ప్రేమించినా ప్రేమించకపోయినా తనని తాను ప్రేమించుకుంటాడు. అందుచేతనే, అద్దాల్లేని కొట్లకంటె అద్దాలున్న కిళ్ళీ కొట్లకి ఎక్కువ బేరాలుంటాయి. బంగారికొట్లో అందాల అద్దం ఒకటుంది. ఆ అద్దంలో కొతాదార్లు తమ తమ అందాలని తిలకించుకొని తనివి తీర్చుకుంటారు. అక్కడ పందిరికింద హాయిగా కూర్చొనేందుకు వీలుగా రెండు కొయ్యబల్లలు వేయించింది బంగారి. ఆ బల్ల లెప్పుడూ చాలా బిజీగా ఉంటాయి.

బంగారి వీరపత్ని, అంతేకాదు ఆమె వీరమాత.

బంగారి భర్త ఇదివరకు ఆ వూరికి తలవంచని పరమ వీరుడు, వీరులు చాలామంచివాళ్ళే. కాని, వాళ్ళు వేగిరం చచ్చిపోతుంటారు. ఎక్కడైనా ముసిలివీరుడంటూ ఉంటే వాడు జగదేక వీరుడైనా అవాలి, లేకపోతే అబద్ధపు వీరుడు - ఎప్పుడో ఒకప్పుడు తోకముడిచి దౌడుతీసిన - దొంగవీరుడైనా అయుండాలి. నిజమైన వీరులు అట్టే కాలం బతకరు. రౌడీల కొట్లాటలోబంగారిభర్త వీరమరణం పొందేడు. శవ పంచాయితీ, పోలీసుల సమక్షములో, జరిగింది. శవపరీక్ష ఆస్పత్రిగదిలో రహస్యంగా జరిగింది. అప్పుడా వీరుడి శవాన్ని బాజాల్తో ఊరేగించి, శవంముందు భజనపార్టీలు "మన అప్పారావు దాసు అప్పటికింకా శిన్నోడేగాని పార్టీలో ఉన్నాడు" — మూడు భజనపార్టీలు, నడిపించి, చంపిన కోడితోసహా ఉచితవీర లాంఛనాలతో దహనపరచేరు. అప్పుడు ఆ వీరుడు చావుగురించి నలుగురు దుర్మార్గులు కోర్టుకి వెళ్ళి అక్కణ్నించి అండమాను ద్వీపాలకి

వెళ్ళేరు. ఆ విషయాలన్నీ చెప్పుకొని బంగారి చాలా గర్వ పడుతూం టుంది.

వీరులవల్ల ఊరికి పేరొస్తుంది. దేశానికి పేరొస్తుంది. వారి కుటుం బాలకి కూడా మంచిపేరొస్తుంది. కాని. ఎక్కడో కొందరు కొందరికితప్ప, వారి పెళ్లాం [illegible]లకి వరుసగా చిప్ప చేతికొస్తుంది.

బంగారికి పిటుడి భా[illegible] పేరూ వచ్చింది. అతను పోగానే చేతికి చిప్ప రా[illegible] వచ్చింది. భర్త పోయేసరికి ఆమెకి నిం[illegible] ద్దెని[illegible] యవ్వనం నిండుతుంది. ఆమె కొడుక్కి సరిగ్గా రెండేళ్ళు నిండేయి. అయితే, చిప్పలు ఎ[illegible]నిగాని, అవి తోముకొనిగాని బతగలిగే మనిషి కాదు బంగారి. ఆవిడ ఏవో విధంగా నాలుగురాళ్ళు పోగుచేసి ఆ చింత చెట్టుకింద కిళ్లీకొట్టు తెగదీసింది.' ఆ కొట్టూ ఆవిడాకూడా పరమేశ్వరుడి దయవల్ల ఇప్పటికీ అలా చెక్కుచెదరకుండా నిల్చొని కూర్చొని వర్ధిల్లుతూనే వున్నారు

బంగారి కొడుక్కి ఇప్పుడు ముప్ఫయేళ్ళకి ఓ ఏడాది తక్కువ. అతనొక వీర పురుషుడు. పేరొకచోట ఓ కిళ్లీ - సారాకొట్టు నడుపుతున్నాడు. అతనొక చిల్లర రౌడీగ్యాంగుకి లీడరు. అతను — మున్సిపల్ ఎలక్షన్స్ టైంలో ఛైర్మన్‌గారి పార్టీకి, మామూలు సమయాల్లో పోలీసు వారికి కుడిభుజం, శ్రీరామనవమి సంబరాల్లో పెద్దపులి, గ్యాంగు దెబ్బలాటల్లో వీరసింహం.

వీరమాతకీ వీర పుత్రుడికీ ఒకరియెడల ఒకరికి విపరీతమైన అభిమానా లున్నాయి కాని వారి కాపురాలుమాత్రం వేరుగా వుంటాయి. ఎంచేతనంటే కోడలు పిల్లంటే వీరమాతకి సరిపడదు. ఆమెకి రెండేసేళ్ళకి ఓ కొత్త కోడలొస్తూంటుంది. పాతయాదీ, కొత్త యాది, ఏ కోడలన్నా ఆమెకి పడదు. అంచేత తనకొట్టు తనే నడుపుకొంటూ తన చిన్న మిద్దె యింట్లో తనే ఉంటూ తన బతుకు తనే బతుకుతోంది వీరమాత.

వీరుడైన పతి పోయాక వీరపత్ని మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. ఆమెని తియ్యడానికి వీరులు ముందుకి రాకపోలేదు. కాని వీరబంగారి వారందర్నీ నిరాకరించింది.

బంగారికి నలభయ్యయిదేళ్ళ వయస్సుంటుందిప్పుడు. ఆవిడ అందంగానే ఉంటుందికాని: పెద్దసైజు గుమ్మడికాయలా ఉంటుంది (ప్రశ్న: “ఆవిడ అందచందాలు వర్ణించడానికి ఆవిడే హీరోయినా”) గుమ్మడికాయల్లో అందమైనవీ ఉండొచ్చు. వికారమైనవీ ఉండొచ్చు, బంగారి నిండుగా శుభ్రంగా కనిపించే గుమ్మడికాయలా ఉంటుంది. అయితే, వయసు వచ్చింది కాబట్టి తోలు కొంచెం ముడిపడింది. కాని ఆమె జుట్టు మాత్రం పండలేదు. ఆమె కళ్ళు పెద్దవి, చెవులు పెద్దవి, ముక్కు పెద్దది, నోరు పెద్దది, నడుము [illegible]ది, జుట్టు పెద్దది, ఆమె చాలా పెద్ద మనిషి.

పాతివ్రత్య ధర్మాన్ని బంగారి పాటిస్తోందా లేదా అని కొంతమందికొత్తవాళ్ళకి సందేహాలు కలుగుతూంటాయి. ఆ ధర్మాన్ని ఆమె ఎక్కువ కాలం పాటించవచ్చు, తక్కువకాలం పాటించ లేకపోవచ్చు, కాని ఆ ధర్మాన్ని పాటించడానికి ఆమె తప్పక పాటుపడే మనిషేనని తెలిసిన వారు నమ్ముతారు. అ పదేపాటంతా ఆఫీసర్లని చూసేసరికి భస్మం అయిపోతుందని తెలిసీ తెలియని వారంటూ ఉంటారు.

లోకంలో ప్రతిమానవికీ మానవుడికీ ఎవో వీక్ నెస్సులుంటాయి, నర్సులకి, డాక్టర్లంటే వీక్నెస్సు, డాక్టర్లకి రిచ్ పేషెంట్సంటే వీక్నెస్సు, పాఠకులకి రచయిత్రులంటే వీక్నెసు (?) రచయితలకి సినిమాలంటే వీక్నెసు (?) అభ్యుదయ కాముకులకి కమ్యూనిస్టులంటే వీక్నెసు. కోటీశ్వరులూ కూలివాళ్ళూ ప్రజాస్వామ్యమూ కలసిమెలసుండాలనే వారికి కెనెడీ వీక్నెసు, పోలీసువారికి డబ్బూ హోదా అంటే ఎంతో వీక్నెసు, లాయర్లకి జడ్జీలంటే వీక్నెసు, డబ్బంటే మరింక చెప్పలేనంత వీక్నెసు. జడ్జీలకి మరింక ఏయే వీక్నెసులుంటాయో ‘బ’ కార ‘భ’ కారాలకేతెలుస్తుంది - అంటే బంట్రోతుకీ బెంచి గుమాస్తాకి బడా లాయర్కీ ఆ తరవాత ఆ భగవంతుడికే తెలుసు. మరింక, “జనరల్గా అధికార్లకి ఏయే వీక్నెసు లుంటాయి?” జనరల్గా వారికి అన్నీ వీక్ నెసులే ఉంటాయి.

ఈ విధంగా, కొందరికి ఎక్కువ డబ్బులంటే, కొందరికి ఎక్కువ

అందాలంటే, కొందరికి ఎత్తుధనాలంటే, కొందరికి ఎత్తు వంశాలంటే - [illegible]హాల పిచ్చెనులుంటాయి. బంగారమ్మకి పోలీసు ఇనస్పెక్టర్లూ, సీనియర్ హెడ్డులూ, డిప్యూటీ తహశీల్ద సానిటరీ ఇనస్పెక్టర్లూ - ఆఫీసర్లంటే అటువంటి వారంటే ఆమెకి - అటు వారంటే ఆమెకు పిచ్చెనుటంటే ఉండవచ్చుగాక, అంతమాత్రంచేత అధర్మం. బంగారివంటి అమాయకుల్ని ఆక రించడం అది ఉద్యోగ ధర్మం. అందుచేత బంగారి శీలాన్ని భస్మం చేసూంటే ఆఫీసర్ని నిందించడం కూడా చాలా అధర్మం.

"చిన్నప్పుడు మన బంగారప్పని సూశేవు నువ్వు! సక్కంగ పీట చెక్కినాగ ఇంతెడల్పు మొకవూ. మొకానికి తగ్గ కల్లూ, కోవారంగూ ఎలాగుండేదంటే: - కలిపేరుకైన ఇంతమంచి పెల్లం దొరకదన్నట్టు గుండేది: దాని మొగుడికి దానందం అనుబవించే అదుష్టం నేకపోయింది. ఏటిజేస్తాం: ఆ దినాల్లో మన బంగారప్పది బొబ్బిలి కాదు ఇజీనారం కాదు. పిఠాపురం కాదు ఏ రాజైనా సూసేదంటే ఎత్తుకెలి పోయి అద్దాల మేడ్లో ఎట్టుకుని పట్టపురానీలా సూసుకోవాలన్నమాట! అంత వంపంగ గజలచ్మిలా గుండే దన్నమాట! నానప్పుడు నీయంతుండే వోణ్ని, రొలిపాలున్నాసినప్పుడు 'ఏట్రా! పట్నంలోంచి బొమ్మకాని దిగినడ స్తుందా?!' అని నోరెళ్ళబెట్టేసి నిలబడిపోన్ను! బీచికాడ లెర్చి లైటెలి గించినట్టు కల్లు జిగేల్మన్నాయి, బంగారప్పా! అప్పటికీ ఇప్పటికీ ఒక్క లాగున్నావు! కంచుచెంబువీ ఇత్తడిముంతవీ కావు—ఒజ్రాల ఆరానివి!!"

అంటూ ఓ నాడు మధ్యాహ్నం ఒంటిగంటకి తాలూకా కచేరి బంట్రోతు ఆదినారాయణ, అక్కడ బల్లమీద కూర్చున్న రొట్టెలవాడికి భోగట్టాచెప్పి, బంగారప్పని ధట్రాజులా పొగిడేడు.

ఆదినారాయణకి దగ్గిర దగ్గిర అరవయ్యేళ్ళుండవచ్చు. కాని, ఇంకా సర్వీసులో ఎలాఉన్నాడా అని ఆశ్చర్య పడవలసిన అవసరంలేదు—అతను నలభయ్యేళ్ళవాళ్ళా కనిపిస్తాడు. అతనెప్పుడూ లావెక్కడు, ఖాకీపంట్లాం వదలడు, తెల్లగడ్డివంటి జుట్టు దువ్వుకోడు. గడ్డంమీదుండే పది పది

పోను వెంట్రుకల్ని ఎప్పుడూ గీసుకోడు. వచ్చినా తన ఆదారి మాటలు మానడు. బంగారప్పకి మూడేళ్ళనించీ బాకీఉన్న మూడు రూపాయలూ ఎన్నటికీ ఇవ్వడు.

బంగారప్ప వీపుగోకించు కొంటోంది.

పన్నెండు, ఇరవయ్యేళ్ళమధ్య వయస్సుగల పిల్ల ఎవర్తో ఒకర్తె రోజూ మధ్యాహ్నం వేళ బంగారికి తప్పక వీపు గోకుతూంటుంది, లేదా పేలుతీస్తూంటుంది. ఆ రోజున కాకిబంగారంలా మెరుస్తూన్న ఓ పద్దెనిమి దేళ్ళ పిల్ల — సన్నని శరీరంపుది, బరువు గుండెది, నల్లకోకది, ఎర్రరైకది, విప్పారిన కళ్ళది - బంగారికి వీపుగోకుతోంది.

తీపిలో అర్ధనిమీలితనేత్రురాలైన బంగారప్ప ఆదినారాయణ చేసిన పొగడ్తవిని,

"ముసిలోడివై పోనావుగాని ఆదారిమాత్రం మాన్నావు కావురా ఆదినారాయణా!"

అంది వెనకనున్న పిల్లకి తన వీపులో ఇంకా కొంచభాగం ఎక్కువగా అందిస్తూ.

"నిన్నుజూస్తే కపిత్తం పుడద్ది బంగారప్పా!" అంటూ పరమ సంతోషంగా నవ్వేడు ఆదినారాయణ. ఆ తరవాత,

"నిన్నుజూస్తే నీ కొట్టొగ్గాలనిపిచ్చుడు. అవతల ఆ పీనుగ్గుమాస్త చిగిరెట్లో అని తినేస్తడు, బేగి, రొండుకత్తిర్లిచ్చీ!" అన్నాడు.

"తీసుకో!" అంది బంగారి.

రెండు కత్తెరమార్కు సిగరెట్లు తీసుకొని, "పీనుగ్గు వాఁస్త ఇది కూడా పద్దురాసుకో మన్నాడు" అన్నాడు ఆదినారాయణ.

"నువ్వు రాస్తావా? నాన్నా?" అంటూ పుస్తకం పెన్సిలూ అతని వైపు తోసింది బంగారి.

రెండు సిగరెట్లఖరీదూ పీనుగ్గుమాస్తా పద్దులోరాసి,

"అన్నట్టేచేటి బంగారప్పా: నిన్నపేల కమ్మలింటి రాజుబాబుకి మన గంగరాజు పెల్లంకీ తగువేటీ అయిందిటా?" అంటో తియ్యటి చింత పండు తింటోన్నవాళ్ళా అడిగేడు ఆదినారాయణ.

"ఎక్కడ తగువైతే నీ కెందుకరా, రాత్రి డపేదారుద్యోగం ఎదో నువ్వు జూసుకోక?! అన్నానుగా నీకే కావాలి!" అంది బంగారి.

"ఊసులే నేకపోతే, నోకమేసేదు! చంగతేదో సెబ్దూ!" అని అడిగేడు ఆదినారాయణ.

"[illegible] సూపునేదు. ఏటయిందో ఏటో అమ్మల్నడుగు!" అని చెప్పి, పిప్పగోకే పిల్లతో "సెప్పే అమ్మలూ! ఊరోళ్ళ తగూలన్నీ యింటుంటే మన ఆదారాదినారాయణకి ఆకలుండదు, దప్పికుండదు!" అని చెప్పింది బంగారి.

"అమ్మలుందేటక్కడ?!" అని ఆశ్చర్యపోయి, "అక్కడెందుకుంది." అని అడిగేడు ఆదినారాయణ.

"అమ్మలిప్పుడు కమ్మలింటి రాజుకాడే కుసురుకుంది!" అన్నాడు కొయ్యబల్లమీద కూచ్చున్న రొట్టెలవాడు.

ఆ రొట్టెలవాడికి పాతికేళ్ళ వయసుండవచ్చు. జుట్టంతా నీటుగా ఎగదువ్వుకున్నాడతను. నుదుటి మీంచి వెనకవరకూ ఆ జుట్టు పొడవు పదహారంగుళాలుంటే, అతని నుదుటి వెడల్పుమాత్రం అంగుళమున్నరే ఉంది. మొత్తం మొహం అంతా చిన్న నూనె గరిటంత ఉంది. అంత జిడ్డుగానూ ఉంది. అతను తలకి రాసుకున్న నువ్వులనూనె అంతా గిన్నెలోకి పిండితే పావలా ఖరీదు నూనె జుట్టునిండా మిగిలిపోగా మరో పావలా ఖరీద్ది గిన్నెలోకి దిగుతుంది. కొందరు కొందరు మానవులకి కొన్ని కొన్ని భాగాలే అందంగా ఉంటాయి. కళ్ళు కొందరికి బావుంటే ముక్కు ఒకరికి బావుంటుంది. ఇంకోడికి నోరు బావుంటుంది. మరొకరికి కాళ్ళూ చేతులూ బావుంటాయి, వేరొకరికి నడకే బావుంటుంది. కొంత మందికి బట్టలు మాత్రం బావుంటాయి. వారు ఆయాభాగాలపైనా ఆయా పరికరాలపైనా ప్రత్యేకమైన శ్రద్ధ చూపుతూంటారు. రొట్టెలవాడికి జుట్టే ఎక్కువ అందమైన భాగంలా కనిపిస్తోంది. ఆ జుట్టుకి అతను ఎక్కువ గర్విస్తున్నాడని అతణ్ణి చూస్తే స్పష్టంగా తెలుస్తుంది. అతని కళ్ళు దమ్మిడీలాగా, అతని ముక్కు గిడసదొండకాయలాగా, అతని చెవులు ఎండు

టాకుల్లాగా ఉన్నాయి. అతని నోరు రొమ్ముదిన్నెల అంగుళాలుంది. అతని జుట్టు నానాసేటుంది. కాని ఎవరిదో పెద్ద మనిషి జుట్టు తెచ్చి చిన్న మనిషికి తగిలించినట్టుగా ఉంది. అతను వేసుకున్న చొక్కాకాలరు నూనె జిడ్డుతో అట్టగట్టి ఉంది. అతను తొడుక్కున్న ఖాకీ నిక్కరు అతని చిన్న తమ్ముడి నిక్కర్లా ఉంది. అతని పక్కన ఓ చిన్న అద్దాలకర్ర పెట్టె ఉంది. ఆ పెట్టెలో ఉప్పుడు ఉప్పుడీ బిస్కట్లూ, కాటీ కాటీ బిస్కట్లూ, అరిటా అరిటా పొగుల్లూ, అజా అజా రొట్టెలూ, నలపై రెండు తూకలూ, కత్తిరించిన కాయితాలూ, ఉమ్మిచుట్టిన పొట్లంలా ఉన్నాయి. బంగారప్ప పిప్పగోకే కాకిబంగారప్పిల్లపైపు ఆ పెద్దమనిషి చూసే తీరుచూస్తే, అతను చాలామంచి మన్మథావస్థలో ఉన్నాడని తెలుస్తుంది.

"అమ్మలిప్పుడు కమ్మలింటి రాజుకాడే కుదురుకుంది. తెల్దేటి?" అని మళ్ళీ అన్నాడు రొట్టెల పెట్టెలో ఈగల్ని దాచినవాడు.

"ఏటమ్మలూ? సేర్మేన్‌గారింట్లో పని మానీసినావేటి? అదెప్పుడు? ఏటికత?" అంటూ అదారాదినారాయణ సానందంగానూ, సాశ్చర్యంగానూ అడిగేడు.

"టక్కుటిక్కు దొరసాన్తో దెబ్బలాడి మానీసినాది. ఇంకేటుంది?!" అన్నాడు ఈగల్ని దాచిన రొట్టెలవాడు.

"నూసీనూణ్ని ఊసులెత్తుకోని సెకాలీ మాటలాడమోక! అఁ!" అంటూ ఈగలవాణ్ని కోప్పడింది కాకిబంగారం.

ఆ పిల్లని ఏదోవిధంగా మాటల్లోకి దించగలిగినందుకు రొట్టెలవాడు సంతోషం పట్టలేక—

"అబ్బ! ఏటోలె; ఆ కోపవూఁ?!" అంటూ వికవిక నవ్వేడు. అతని పళ్ళన్నీ నిలవుంచిపోయిన తెల్ల బిస్కట్లలా ఉన్నాయి. నవ్వుతూ అతను కుడిచేత్తో తన జుట్టు సవరించుకొని, అమ్మల్ని తనదగ్గరకు రమ్మన్నట్టుగా తలతో సంజ్ఞ చేసేడు.

గోకడం టక్కున ఆపేసి "రొట్లపెట్టె ఇసిరిగల్ను! నా దగ్గిర పోకిరి ఏసికాలెయ్యకు!" అంది అమ్మలు ఎంతో విసురుగా.

"ఎప్పుడిమీదే అంత అలకా ?" అని అడిగేడు ఆదినారాయణ.

"ఆడు సూడేటి జేస్తన్నాడు !" అంది అమ్మలు.

"నానేటి జేసేను ? !" అని ఆశ్చర్యపోయేడు సూరెజుట్టువాడు.

"రమ్మని పిలిసుంటవు ! ఇంకేటి జేస్తావు ? అయినా, ఆడపిల్ల నలా పబిలీగ పిలిస్తే బెదిరిపోదురా, కుర్రెదవా ? ఇంత ఒయిసొచ్చి సరసం తెలకపోతే నువ్వేంచేస్తవురా ? — గతిలేక దొరికినాడు బిస్కెత్తు మొగుడని సామెజ్జెప్పినట్టు !" అని ఎంతో హుషార్‌గా రొట్టెలవాడితో చెప్పి, ఆ తరవాత అమ్మలువైపు తిరిగి, "మనుసైతే ఎల్తావు. మను సవకపోతే ఎల్లవు ! దానికంత ఉపద్రం ఎందుకే ? !"అని తిప్పుకొంటూ తిప్పుకొంటూ ఎంతో హుషార్‌గా నవ్వేడు ఆదినారాయణ.

అమ్మలు ఏదో అనే లోపున బంగారప్ప అందుకుంది.

"అదినారాయినా ! నువ్వు ఉపాయాల్చెప్పి కుమ్మెక్కిస్తేనేగాని ఆడు సరసం జెయ్యలేడేటి ? సరసం జెయ్యడానికి ఆడికి ఒయిసుందో లేదోగాని బోకరుపన్జెయ్యడానికేనేటి నీకింత ఒయిసొచ్చింది ? మొదవేసికాలెయ్యక నీ పనేదో నువ్వు జూసుకోగూడదా ?" అని ఆదినారాయణకి చీవాట్లుపెట్టి, అప్పుడు ఈగలవాడివైపు తిరిగి, "ఓరె రొట్లిప్పిగా ! తిన్నతిండి అరిగ దేట్రానీకు ? అసలు నువ్వు నా కొట్టుకాడ కెందుకొచ్చినట్టు ? రొట్లమ్మ కానికా ? సరసం జెయ్యదానికా ? రొట్లయితే, అమ్ముకో ! నా నొద్దన లేదు. సరసం జెయ్యడానికైతే, అదిగోసూడు, అదే రోడ్డు ! తిన్నగ అమ్మాజమ్మ కంపెనీ కెలిపో ! రొట్లెపెట్టి ఒట్టుకెల్లకు : ఒట్టుకెల్లేవంటే పెట్టీ రొట్లూ ఉచ్చుకుని నిన్నుమాత్తరం మెడమీద సెయ్యేసి గెంటేస్తది ఆమాటకొస్తే అమ్మాజమ్మేకాదు" దానికాడ కుక్కలున్నాయి-ఆ కుక్కలు కూడ రానియ్యవు నిన్ను. దగ్గిరికెల్తే కరుస్తాయి : ఇన్నావురోరె రొట్లి ప్పిగా : సరసం జేసేవు సరసం ! ఈ సుట్టుకి అయిపోన్దేదో అయిపోన్ది గాని—మల్లీసుట్టు నువు నా కొట్టుకాడకొచ్చి ఇక్కడకొచ్చిన అమ్మల్నే గాదు ఏ ఆడకూతుర్నయినాసరే ఏదైనా అన్నావో, సొక్కా ఇప్పించేసి సింతరువ్వతో నీకు తోలొలిసేపోతే నా పేరు బంగారికాదు, నాను

పెదప్పలనాపేం చెప్తాన్లేరా!! ఇంటున్నావా ? ఏటలా జూస్తున్నావు ? నామాట ఇనిపిస్తుందా ? ఏట్రా అలా జూస్తున్నావు ? సూడ్డురా సూడ్డురా! అది సటనం మొకం ఎట్టుందో ఒక్కసారి సూడ్డురా !" అంటూ ఆ రొట్టెల అప్పారావుమీద విరుచుకు పడిపోయి, అతను పలానాపని చేసినట్లయితే అతనికి ఫలానావిధంగా పరాభవం జరక్క తప్పదని హెచ్చరించి. అతని ముఖాన్ని చూడమని అందరికీ ఆహ్వానించింది బంగారప్ప.

కామవికారాన్నీ అవమాన భారాన్నీ ఒక పెద్ద వెర్రినవ్వులో దాచుకున్నాడు రొట్టెల అప్పారావు. అవసరానికి మించిన పరాభవం జరగడంతో ఆ సమయంలో అతను చాలా జాలిగా కనిపించేడు. అతని పెదవుల మీద ఎంత పెద్ద నవ్వుందో అతని కడుపులో అంత ఎక్కువ కోపం ఉన్నదని అతనికి తప్ప ఇంకెవరికి తెలియదు.

తన యుద్ధం బంగారప్ప ఆ విధంగాచేసి విజయం సాధించినందుకు అమ్మలు తన కళ్ళల్లోని రోషకషాయాన్ని వంపేసుకొని వాటిని వెలుగుల రవ్వల జడితో నింపుకొంది.

'సినిమాలో కామిక్కుగాడిమీద ఎందుకు బంగారప్పా, అంత ఇరుసుకు పడిపోనావు ?" అని ఆదారాదినారాయ మాత్రం మొదలి సానుభూతి చూపించేడు.

"ఇయాలొక్కసుట్టే కాదాదినారాయిణ మూడోరాల్నించి రోజుకీ ఇద ఓంస: దాన్ని ంటికాణ్నించి కొట్టుకాడికి కొట్టుకాణ్నించి ఇంటికాడికి అలా ఎంట తగుల్తున్నాడేకాని, ఒగ్గటంలేదు !" అంది బంగారప్ప.

"అవున్రా ! నీకేటి పోయికాలం ఏట్రా ?" అని అడిగేడు ఆదినారాయణ.

"ఇయ్యాళ్దినం నాకు బావులేదు. నానేటననుగాక అన్నా! అప్ప తిట్టినా నామొంగ తిట్టిందనే ఒల్లకుంటాను !" అన్నాడు రొట్టెల అప్పారావు.

"ఒల్లకోరా ! బంగారప్ప తిట్లన్నీ నీకు దేవనోడి దీవెన్లా వస్తాయిరా !" అన్నాడు ఆదినారాయణ.

అందుకు అమ్మలుకూడా సరదాగా నవ్వడంచూసి రొట్టెలవాడు కూడా సరదాగా నవ్వేడు.

"అమ్మలూ! కర్రిగున్నావేకాని, నవ్వితే ఎలాగ్గున్నావో ఎరికా! సినిమాష్టార్లా గున్నావు. నన్నూ, రొట్టెప్పిగాణ్నీ ఒగ్గీసి సినిమాల్లో కెలిపోకూడదా? ఎలిపోతే ఏ రాజేశ్రావులాటోడో తగలకపోడు! బలేశాన్సంటే శాన్సు! అన్నట్టమ్మలూ! సినిమాలో రాజేశ్రావు ఒద్దుగాని, కమ్మలింటి రాజబాబునైనా పెళ్ళాడీగూడదా? చండీలూ, బస్కీలూ తీసి పిక్కలాగున్నాడు! ఎర్రిగుంటాడు! మంచోడు! ఏటంటావమ్మలూ? నీ అందసెందాలకి స్టూడెంటు మొగుడుండాల! మామూలోడుసాలు!" అంటూ కిచకిచ నవ్వేడు ఆదినారాయణ.

"సీ! నోర్ముయ్! పళ్లు రాలగొట్టీగల్ను!" అని చిరునవ్వు నవ్వుతూ అంది అమ్మలు.

"ఎద్దు ఈనీ ఎరిగదు - పాలిచ్చీ ఎరగదని, ఓ రాదినారాయణా నీకెందుకురా ఆ పెళ్ళూసులు? చిగిరెట్లుచ్చుకు ఆపీసు కెలిపోక, ఆడారి సోది మాటలన్నీ ఆడతావేటి?" అని మందలించింది బంగారి.

"నిన్నటి ఊసేదో అమ్మల్సెప్తే ఇనీసిపోదారని ఉండిపోన్ను బంగారప్పా!" అన్నాడు ఆదినారాయణ.

"ఏటుంది? గంగరాజు మాఁవఁగేద - ఎర్రగేదె, దాన్ని దొరసాని గేదంటాడు గంగరాజు—ఆ గేద కమ్మలింటి రాజుబాబు దొడ్లో బీరపాదు బస్సలిపాదు అరటిమొక్కలూ అన్నీ దుమ్ముసుట్టీసి నోట్లో ఎట్టీసుకొంది. మంచి మంచి గులాబంట్లు కుమ్మీసి తొక్కీసినాది. బాబు తగల్డానికెళ్తే కొమ్మిసిరినాది గేద. అమ్మతల్లి గేదగదా మరి? రాజుబాబుకి తొడ సీరుకుపోనాది, పేళ్ళ పడిపోనాడు, అదురుష్టం బావుండి పెద్దెబ్బేం తగల్లేదు. ఆస్పత్రికెళ్ళి మందేయించుకొన్నాడు. నానప్పుడు రాయిసిరి గేదని బైటకి తగిల్నాను. అది కుంటుకొంటూ ఇంటికెల్లిందంట. దాన్లో ఎవుడు కొట్టినాడో ఏంటో? గేదని ఒకుడింటిమీది కొగ్గేస్తే ఒవుడూరుకుంటాడు? నిజంగా కుంటుకొంటూ గేద ఎల్లిందంటే ఒవుళో కొట్టే

రిన్నమాటే !   ఐతే నానుగాదు, రాజుబాబు కానేగాదు. ఆ యెనక రాజు ఆస్పత్రికెల్లిపోనాక నాను స్నేసీసుకొని చినిమాకు పోన్ను. అప్పుడు గంగరాజు స్త్రీ 'జమ్మ అమ్మతల్లి రాజు బాబింటి మీదికెల్లి ఆ బాబు అమ్మగోర్ని అబ్బుద్ద తిట్లూ తిట్టిందంట. ఊరంత నోరెట్టుకెల్లి, నన్ను నోరుగాదు, సేపలబజారు—ఊరంత నోరెట్టుకెల్లి, డొక్క సింపేస్తాను, డోలు కట్టేస్తాను, కొంపకి నిప్పెట్టేస్తాన్ అని ఆ ముసిలమ్మని బెదిరిగొట్టీసెలిపోనాదంట. ఇయ్యాళ పొద్దున్నే రాజుబాబు పోలీసోళ్ళకి సెప్తానని సెప్పెళ్ళేడు. అదీ సంగతి. అంతకంటే ఇంకేటీ నేదు."

అని గత సాయంకాలపు భోగట్టా టూకీగా చెప్పింది అమ్మలు.

"ఇద్దీన్తో ఆగదు సూసుకో !" అన్నాడు ఆదినారాయణ.

"యేం ?" అని అడిగింది బంగారి.

"రాజమ్మొవినికి నీలాగే కోపం లావు" అన్నాడు రొట్టెల అప్పారావు.

"గేదల్ని ఊరిమీద కొగ్గేస్తే దానిక్కోపం లావన్జెప్పి ఊరందర మందీ ఒల్లకోవాలేటి ?" అని తీవ్రంగా ప్రశ్నించింది అమ్మలు.

"అది మీ రాజుబాబుని తిట్టిందనా నీ కంత బులుపు ?" అని అడిగేడు అమ్మల్ని అప్పారావు.

"మల్లా దా నూసు నీకెందుకురా !" అని ఆదినారాయణ అతనికి చీవాట్లు పెట్టేడు.

"అదిగాదు గాని యేం ఆదినారాయినా, ఈ తగువింకా ముదురిద్ది అంటున్నావు ఎందుసేత ?" అని అడిగింది బంగారి.

"కమ్మలింటిరాజు తక్కువోడు కాడు. గంగరాజు గేదెలు ఊరంతా కంగాలీ చేసేస్తన్నాయని కాయితాలు బక్కిరి అచ్చేయిస్తన్నాడు."

"అందుకు రాజమ్మకా బాబ్మీద అంతకసి అదీసంగతి !" అని రాజమ్మకి ఆ కమ్మలింటిరాజుమీద ఎందుకు అంత తీవ్రమైన కోపం ఉందో బోధపర్చుకుంది బంగారి.

"గేదెల్చేత పొడిపిచ్చిగల్దు రాజమ్మొదినె!"అన్నాడు రొట్టెలవాడు.

"ఇవతలోళ్ళు గాజుల్తొడిగిచ్చుకు కూకుడుంటే రొట్ల అప్పారావు

ఊరికి యజమానే : రాజమ్మ గేదెలు ఊరికి మొగుళ్లే !” అని ఎటకా రంగా అంది అమ్మలు.

“అంతలో.”

“వెధవా : ఒరే అడారివెధవ !” అని ఓ కేక వినిపించింది.

మధ్యాహ్నం ఒంటిగంట దాటింది. ఎండ ప్రచండంగా ఉంది. గాలి చాలా వేడిగా ఉంది. మనుష్యులంతా కాలిపోయేరా అన్నట్లుగా రోడ్డంతా నిర్మానుష్యంగాఉంది. బంగారి కొట్టుకి వందగజాల దూరంలో తాలూకా ఆఫీసు గేటుదగ్గిర ఓ ముష్టివాడు అక్కడ గేటు నీడలో కునికిపాట్లు పడుతున్నాడు. కదిలే శవంలా ఉన్నాడతను. ఎండవేడికి ముష్టివాడు కళ్ళు మూసుకున్నట్టు ఎదురుగా ఉన్న ఇళ్ళవాళ్ళంతా కిటికీలు మూసుకున్నారు.

తాలూకా ఆఫీసు గేట్లో ఓ ముప్పయియిదేళ్ళ పెద్దమనిషి నిల్చున్నాడు. నుదుట పైకొననించి నాలుగంగుళాల దూరంవరకూ అతని తలబట్ట తలగామారి, రాగిచెంబులా మెరుస్తోంది. అక్కణ్నించిమాత్రం తలమీదజుట్టు వుంది. వాడి వాడి మరింక వాడకుండా విడిచిపెట్టిన ఎర్రబూటు బ్రష్‌లాఉంది ఆ జుట్టు. పిండుకుపోయి పిడచకట్టుకుపోయిన పాత గావంచాలా అతని ముఖం కళాకాంతులు లేకుండా శవం ముఖంలా ఉంది. అతను కేకవేసినప్పుడు పై పెదవి పాత గొడుగు లేచినట్టులేచిపోయి, కేక వేసేక కూడా కొంతసేపు అలావుండిపోయింది. అతనిపళ్ళు పెద్దవి, ముక్కుచిన్నది. అతని చెవులకి పోగుల్లేవు కానీ కుట్లున్నాయి. ధూళిరంగు పట్లాంమీద ధూళిరంగు చొక్కా వేసుకున్నాడతను. అతని ఎడమచేతి మణికట్టున అలారం గడియారం అంత వాచీ ఉంది. దానికి సన్నంగా మొలతాడువంటి స్ట్రాప్ ఉంది.

“సిగరెట్లేవిరా, అడారి వెధవా ! !” అంటూ కేకవేసేడతను.

“బేగి ఒట్టుకెళ్ళు : నేకపోతే మీ పీనుగ్గు వాఁ స్త పేగు త్తెగి సస్తాడు ;”, అంది అదినారాయణతో బంగారమ్మ.

“ముష్టెధవ ! పెట్టికి పెట్టే సస్తే కొన్డు ! అయిదేసి నిమిసాలకి పావు చిగిరెట్టు పట్రమ్మంటాడు ముష్టెధవ !”, అని విసుక్కున్నాడు అదినారాయణ.

బంగారీ, అమ్మలూ, రొట్టిప్పారావూ ఆ పీనుగ్గుమాస్తాని పరమా నందంతో చూస్తూ కూర్చున్నారు. అందమే ఆనందమైతే అందవికారం కూడా ఒకప్పుడు ఆనంద మిస్తుంది.

"ఏవిరా వెధవా సిగరెట్లూ? సిగరెట్లూ?"

"ఇయిగో తెస్తున్నా!" అంటూ నడుం చక్రంలా తిప్పుతూ పరిగెట్టాడు ఆదినారాయణ. పీనుగ్గుమాస్తా ఆ సిగరెట్లు తీసుకొని చూసుకొని "బర్క్లీ సిగరెట్లు తెమ్మంటే ఇవా తెచ్చేవు? ఇవి కత్తెర్లురా వెధవా! ఛో! ఇచ్చేసి రెండు బర్క్లీలు పట్రా! రెండు సిగరెట్లకీ రెండు గంటలు చేసేవు. పెట్టె తెమ్మంటే రేపే ఒద్దువు కాబోలు! ఇవిచ్చేసి బర్క్లీ సిగరెట్లు పట్రా!" అని ఆదినారాయణమీద కేకలేసేడు.

"నువ్వు తప్పయినా సెప్పుండాల! నాను తప్పయినా ఇనుండాలా!" అని విసుక్కొంటూ మళ్ళీ కొట్టుదగ్గరికి వచ్చేడు ఆదినారాయణ. పీనుగుమాస్తాకూడా ఎందుకోగాని ఆదినారాయణ వెనకాతలే తనుకూడా బంగారి కొట్టుదగ్గరికి వచ్చి!

"ఏం బంగారీ? మా ఆడారి వెధవ నీ కొట్టు పట్టుకుని వదలడెందుచేత?" అని ప్రశ్నించేడు.

"ఏవోఁ బాబూ! ఆన్నే అడగండి. మీ వోడికి మాఁవేం మందూ మాకూ ఎట్టీ లేదు. మందెట్టినా మాకెట్టినా నీలాటోడి కెడితే మాకేపైనా లాబం, గాని ఆడారోడికి మందెట్టి మేవేం బావుకోవాల?!", అంది బంగారి నవ్వుతూ.

"భేష్ బంగారీ! మాటకి మాట అప్పజెప్పేస్తావు. పోనీ నాకు మాంచి మందుచూసి నిజంగా పెట్టేద్దూ! వెధవుద్యోగం మానేసి నీ దగ్గరే ఉండిపోతాను!" అని సరదాగా అన్నాడు పీనుగ్గుమాస్తా. అతని నోటంట తుంపర్లు రాలేయి.

"ఉజ్జోగం మానేస్తే నీకు మందెట్టి మాకేటి లాబం?" అని వెటకారంగా అంది బంగారి.

"బాబుకి కత్తెర్లొద్దంట. బర్క్లీలు ఇమ్మంటన్నాడు" అన్నాడు ఆదినారాయణ.

"అయితే తీసుకుని బాబుకి బర్కిలీలంట ఇచ్చీయులే అమ్మలూ!" అంది బంగారి.

అమ్మలు ఆదినారాయణ చేతిలోంచి కత్తెర సిగరెట్లు పుచ్చుకొని అవి కత్తెరమార్కు పెట్టెలోపెట్టి, బర్కిలీపెట్టె విప్పుతూంటే రొట్టెల అప్పారావూ పీనుగు గుమాస్తాకూడా ఆమెవైపు కళ్ళు రెప్పార్చకుండా చూస్తున్నారు.

అంతలో పీనుగ్గుమాస్తా వెనకనించి –

"ఏదమ్మా. ఓ నాలుగు మొఖిరీ పళ్ళిస్తావా?" అని ఎవరో మృదువుగా అడిగేరు. అలా అడగ్గానే అంతా అతని వైపు చూసేరు.

అతనికి పాతికేళ్ళుండవచ్చు, తెల్లటి పంట్లాంలో తెల్లటి చొక్కా టక్ చేసుకున్నాడతను. పల్చగా పొడవుగా ఎర్రగా కనిపిస్తున్నాడు. అతని జుట్టు, గాలికి బాగా చెదిరిఉంది. చెమటగా ఉన్నా, అతని ముఖం అందంగా కనిపిస్తోంది. ఎడమకాలిమీద బరువుమోపి, కుడికాలు తీరిగ్గా అన్చి నిల్చున్నాడతను. అతను కూలింగ్ గ్లాసెస్ పెట్టుకున్నాడు. అమ్మల్ని చూసి అతను చిన్నగా నవ్వి,

"నువ్వేనా అమ్మలూ? ఏం, ఇక్కడున్నావేం?" అని అడిగేడు.

బంగారి, రవిక సరిచేసుకొని,

"మజ్జానపేళ నాకు కుసింత సాయం బాబూ మీ అమ్మలూ!" అంది.

"బావుంది, మంచిదే. చూడమ్మలూ, నాకు మంచివి నాలుగు మొఖిరీలియ్యి" అని అంటూ జేబులోంచి చిల్లర డబ్బులు తీసేడతను.

"దెబ్బలావుంది బాబు?" అని అతణ్ని ప్రశ్నించింది బంగారి.

"ఏం దెబ్బ?" అని అతను ఆశ్చర్యపోయి ఓహో! అదా?! అప్పుడే ఆ సంగతి నీ కెలా తెలిసిందమ్మా?" అని ప్రశ్నించి, "అన్నట్టు. అమ్మలు చెప్పుండాలి నీకు" అని తన ప్రశ్నకి తనే జవాబు చెప్పుకొని, "చిన్న పిసరు చీరుకు పోయింది. పెద్ద దెబ్బేం కాదు" అంటూ నవ్వేసేడతను.

పీనుగ్గుమ్మాస్తాకి సిగరెట్లివ్వకుండా, ఆ కొత్త మనిషికి నాలుగు మొఖిరీలు తీసి ఇచ్చి, అతని దగ్గర అర్ధరూపాయి తీసుకొని,

"ఎంతుచ్చుకోవాల, బంగారప్పా?" అని అడిగింది అమ్మలు!

"నా నిస్తానుండు", అంది. బంగారి అమ్మలు దగ్గర్నించి అర్ధ రూపాయి కాసు తీసుకొని,

ఆదినారాయణ పీనుగ్గుమాస్తా నిలబడున్నారు. రొబ్బెల అప్పారావు కొయ్యబల్లమీద కూర్చొనే ఉన్నాడు. కొట్లో కూర్చున్న బంగారి, డబ్బుల పెట్టె తెరిచింది. అమ్మలు కొంచెం సిగ్గుపడుతూ ఆమె వెనక కూర్చుంది. కమ్మలింటి రాజుబాబు అనబడే భవానీశంకరప్రసాద్ ఎడమచేత్తో అరిటి పళ్ళు పట్టుకొని నిల్చున్నాడు.

అంతలో-

"ఇదుగో! ఇక్కడే ఉన్నాడు! నచ్చిన పెయ్యకి ఏటి సంజాసీ సెప్తాడో అడగండెదవని!", అనే ఉగ్రకంఠపు ఉరుములు వారికి విని ంచేయి. అంతా అటువైపు చూసేరు....

ఒకానొక విధ్వంసపు కొనపింజ చెప్పిన యుద్ధ వృత్తాంతము - వీరవనితలు, యుద్ధవీరులు; వీర ప్రేక్షకులు, భీరప్రేక్షకులు - పులివెనుక నక్కలు, వాటిపర్మనెంటు ఫిలాసఫీ:

# 10

ఆ మధ్యాహ్నం ఒంటిగంటన్నరా రెండు గంటల మధ్య బంగారి కిర్లీ కొట్టుకి ఎదురుగా ఎండలోనూ అక్కడ చింతచెట్టు నీడలోనూ జరిగిన సంఘటనలగురించి, అటుపిమ్మట చాలా చాలా కథలు ప్రచారంలోకి వచ్చేయి. కాని ఆనాడు జరిగిన సంగతి 'ఇది' అని పీనుగ్గుమస్తా ఆరోజే మూడు గంటలకి కాఫీ టిఫినూ సేవించి తీరుబాటుగా కూర్చొని తోటి గుమస్తాలు చుట్టూ చేరగా వారితో ఈ విధంగా చెప్పేడు:—

నే నక్కడ కసలు వెళ్ళకనే పోదును. వెళ్ళకపోతే ఏ సంగతీ తెలియకుండా నేనుకూడా మీలాగే సెకండ్ హేండ్ ఇన్ఫర్మేషన్‌గాణ్ణాయి పోదును. మా ఇంట్లో దిబ్బముండ వర్ధనమ్మ లేదూ ? ! ఇవాళ పొద్దున్నే దాని శకునం మనకి ! అయితే దాని పక్కనే కూతురుకూడా ఉందను కోండి ! తల్లికి గోరోజనం, కూతురికి అంతకంటే ఎక్కువ గోరోజనం, ఏమైనా తల్లి వెధవది, కూతురు కాదు. అయితే తల్లి శకునంలోని కీడు కూతురి శకునంతో కొంత తగ్గింది. దెబ్బలు మనక్కాకుండా మరొకరికి తగిలేయి. అది కూతురి ఫలితం. మనకి దెబ్బలు తగలకపోయినా మనం దెబ్బలాటలో ఇరుక్కోవలసొచ్చింది. తల్లి ఫలితం చూసేర్రా గురుడ్లూ !

అదీ సంగతి. ఇంతకీ నేనక్కడ కెందుకెళ్లే నంటారా? ఏదీ ఓ సిగరె ట్టీవండి...రైట్....రెండు సిగరెట్లు తేరా అన్చెప్పి మన ఆడారి వెధవని తగిలేను. ఎప్పుడు తగిలేను? సరిగ్గా పన్నెండున్నరక్కా బోలు తగిలేను! కాని, వెధవ, ఒంటిగంటన్నరయినా తిరిగొచ్చి చావడే! సిగరెట్లేక నాకు దవడలీకు పట్టుకుంది. ఓసారి పట్టుకుందా, మళ్ళీ సిగరెట్టు కాల్చే దాకా నాకా పీకు చస్తే ఒదల్దు, అప్పుడు సిగ్గూ లజ్జా విడిచిపెట్టేసి మన డొక్కగాణ్ని "ఓ సిగరెట్టీవ్వరా బాబూ ఇవ్వరా నాయినా" అని ప్రేయ సిని ముద్దుకోసం బతిమాలుకొని అడిగినట్టడిగేను, అడిగితే ఈ డొక్క గాడు, ఉన్నట్టుండి ప్రేయసిముండ "ఇవాళ్నించీ నేను పతివ్రతనండోయ్" అని కేకేసి చెప్పినట్టు, తుసుక్కుమని "నే నివాళినించీ సిగరెట్లు కాల్చడం మానీసేన్రా" అన్నాడు. దాన్తో నాకు ఒళ్ళు మండిపోయిందను కోండి. నేను సిగరెట్టడుగుతాననే వాడు కాల్చడం మానీసేడు వెధవ! నాకు తెలీదూ? ఏ వెధవ కడుపులో ఏ పాపం ఉందో కళ్ళు మూసుకు కనిపెట్టీగల్ను నేను; అది కాబోల్సు అనుకుంటున్నారు?? అప్పుడు "నీ డొక్క మొహం తట్టెడు సిగరెట్లతో తగలెట్టా!" అని ఈ వెధవని కసిగా తిట్టి - ఏఁవిటిరా, తిట్టేనా లేదా నిన్ను? .... అలా ఒప్పుకో! - వీణ్నలా కసిగా తిట్టి సీట్లోంచి ఉసూరుమంటూ లేచి గేటుదాకా వెళ్లేను. పైన ఎండొకటి! మన ఇద్దరు పెళ్లాల తాశీల్దారు ఇంట్లో కోపఁవంతా మనమీద చూపించినట్టు ఆ సూన్నారాయణమూర్తి వాడి తడాఖా అంతా ఊరిమీద చూపించేస్తున్నాడు. నాకు చెప్పుల్లేవు ఎవడి చెప్పులైనా వేసు కెళ్దాం అనుకొంటూనే మర్చిపోయాను. ఎత్తెత్తి కాళ్లేస్తూ పరిగెట్టి పరిగెట్టి గేటుదగ్గిర స్తంభంవార నీడలో నిలబడి బంగారి కొట్టువేపు దుర్భిణీవేసి చూద్దును! మన ఆడారి ముసిలాడు ఆ బంగారిముండ కొట్టుదగ్గిర పాతుకుపోయున్నాడు. అదంటే వీడికెందుకంత మోజో ఏఁవిటో నా కర్థం ఎప్పటికీ అవదు! ఆ కొట్లో కూర్చొని పెద్ద పిప్పళ్ళ బస్తాలాగ అప్పుడా దిబ్బ బంగారేం చేస్తోంది? వీపు గోకించుకొంటోంది! అది చూస్తే నాకు ఒళ్ళంతా కితకిత లేసినట్టయింది. అక్కడున్న ఆదినారా

యణగాణ్ని "ఒరే ఆడారి వెధవా" అని పింద్రింపుకు కేకేస్తే, అప్పుడు కాళ్లాడబీక్కొని "చిత్తం చిత్తం" అంటూ మన ఆడారాడు సిగరెట్లు పట్టుకొని పరుగెట్టుకొంటూ వచ్చాడు. మన ఆడారాడి పరుగెప్పుడైనా చూసేరా? పిక్చర్ తీసి అమెరికా పంపిస్తే అరవై లక్షల ఫారిన్ ఎక్స్ఛేంజొస్తుంది. వాడికి హైక్లాస్ తారల్తో హీరో ఛాన్సొంస్తుంది – అవ్రా వెధవల్లారా! సివిలిజేషను పెరుగుతున్నకొద్దీ ఆడారోళ్ళు హీరోలూ బంగారమ్మలు హీరోయిన్లూను! ఇది సూరిగాడి వేదవాక్కు! నమ్మండి నమ్మకపోతే చావండి! అంతే!.... ఆఁఆఁ! అసల్సంగతి చెప్తానుండండి మరి! దుర్భిణీవేసి చూస్తే మన కిల్లీకొట్టు బంగారి భద్రంగా కొట్లో కూర్చుని వీపు గోకించు కొంటోందని చెప్పేనుకదూ? వెనకనో కొత్త చిట్టాని కూర్చోబెట్టుకొని వీపు గోకించు కొంటోంది. నల్లచీర కట్టుకొని ఎర్ర రవిక తొడుక్కుంది. లేతనీటి వంకాయలా నవనవ మెరుస్తూంది, మన దూరదర్శినీ యంత్రలో ఆ నల్లచీరె చిట్టా!! వెంటనే మనకి దాన్ని దగ్గరకెళ్ళి చూడాలనిపించింది. ఆడారాణ్ని రెండు కత్తెర్లు తేరా అంటే పాపం వాడవే తెచ్చాడు. కాని, "వెధవా! బర్కిలీలు తెమ్మంటే ఇవా తెస్తావు?" అని వాణ్ని కసిరికొట్టి "ఇవిచ్చేసి బర్కిలీలు పట్రా పట్రా?" అంటూ వాణ్ని కొట్టు దగ్గరికి వెంటతగుల్తా నేనూ అక్కడికి వెళ్లాను. వెళ్ళిచూద్దును! ఆ వీపుగోకే కొత్తముండ ఉన్నాదొరే! ఎండాకాలంలో ఏటినీరులా హాయ్‌హాయ్ మనిపించింది చూడ్డానికి! నాకు నల్లగలువ పువ్వులూ, నిమ్మచెట్టు నీడలూ, చుక్కల రాత్రుళ్లూ జ్ఞాపకం వచ్చేయి. నక్షత్రం బావులేకపోతే శాంతి చేయించి ఊర్వశి మొహాన్ని నువ్వుల నూనెలో నీడగా చూపించినట్లనిపించింది. నాకు దాన్ని చూడగానే ఆ నల్లకోక చిట్టా అంత బావుంది! హాలీవుడ్డుకి పంపిస్తే దాని కళ్ళకివ్వాలి నలభై లక్షలు! కవిత్వం మనకి అబ్బలేదుగాని అబ్బితే దానిమీద "నల్లచీర పిల్లా రావా రావా" అంటూ శ్రీనాథుళ్లా ఓ శతకం రాసిపారేద్దును. ఏఁవర్రా వెధవల్లరా, అలా నవ్వుతున్నారు? సినిమా పాటలు అంతకన్నా బావున్నాయట్రా?! సినీమా హీరోయిన్సు దానికంటే బావున్నారా? తెలీఖడుగు

తున్నాను. చెప్పండి. చెప్పకపోతే నోరుమూసుకు పడుంతండి!.... ఆఁ.... ఇంతకీ అవెవర్తె, ఎక్కడివి, ఏం చేస్తాంది వగైరా వగైరా ఫోగట్టా లన్నీ ఎలా లాగడమా అని నే నాలోచిస్తూ నిలబడితే నాకు ప్రక్కన — చెప్పుకుంటే సిగ్గు సిగ్గు! కాకి వెధవ రొట్లప్పిగాళ్ళేమూ? — ఆ వెధవ నా ప్రక్కన బల్లమీద కూర్చొని నాకు పోటీగా వాడుకాడా దానివేపే సైటు సైటంతా అప్పగించేసి కూర్చున్నాడ్రా! అప్పుడు నా గురించి నాకే ఏఁవఁనిపించిదంటే: "ఒరే సూరిగా! ఎలాటి వేద పండితుల వంశంలో పుట్టేవురా! నాలుగు వేదాలూ పరపరమని పూరీకూరా ఇడ్లీ చట్నీ లాగిం చేసినట్టు లాగించగలిగిన మహాపండితుల వంశంలో పుట్టిన సూరిగా! నువ్విప్పుడు ఏం చేస్తున్నావురా? ఓ నల్లకోక కర్రిదానికోసం - బంగారి. వీపుగోకే స్టాటస్‌కంటే ఎక్కువ స్టాటస్‌లేన్దానికోసం - అంతకంటే తక్కువ్వెధవ రొట్లప్పిగాడితో పోటీపడే దురవస్థకి దిగిపోయేవుగదరా! హోరి నీ కర్మకాలిపోనూ" అంటూ నన్ను నేను తిట్టుకొని నెత్తీ నోరూ కొట్టుకున్నాను. అయినా ఏం చేస్తాం? అందానికి ఎక్కువా, స్టాటస్‌కి తక్కువా అయిన్దానికోసం మెట్టు దిగినప్పుడు మెట్టుకింద వెధవల్తో పోటీలు జట్టీలూ తప్పవు. అంచేత ఏం చెయ్యను? చూస్తూ నిలబడిపోక తప్పిందికాదు. అలాచూస్తూ నిలబడ్డాను. ఇంతలో వచ్చేడు కమ్మ లింటి రాజుగాడు - బేడా పరక పంట్లాం. అణాపరకా షర్టూ వేసుకొని పెద్ద దొరగార్లా దిగేడు వెధవ! వాడేదో పెద్ద అందంగా ఉంటాట్ట; ఈ వీధి కుళ్లముండ లందరికళ్ళకీ వాడో పెద్ద హీరోలా కనిపిస్తాట్ట! ఆడదానికో రుచి! వాడు కొట్టు దగ్గరికి ఒచ్చి అరటి పళ్ళు అడిగేడు. అడిగి నా వైపోసారి చూసేడు. చూసేడుకాని, నన్ను పలకరించలేదు. నవ్వితే వాడి యాపదాస్తి ఒలికిపోతుందేమో నన్నట్టు చిన్న దమ్మిడీ నవ్వు నవ్వేడు. వాడికి నేను ఆపాటి నవ్వూ ఇవ్వకుండా నల్లకోకవేపు మొహం తిప్పేసుకున్నాను. ఆ కర్రిది, అంతసేపూ, ముట్టిం చని సిసింద్రీలా మొహం ముడుచుకూర్చుందా?! ఆ కమ్మలింటి రాజు గాడు రాగానేమాత్రం ముత్యాల మతాబా వెలిగినట్టు వెలిగి ముసిముసి

నవ్వులు వలకబోసేసింది: ఏరుకోవచ్చున్నమాట! అన్ని నవ్వులు!.........
ఆడదానికి ఏం కావాలో నాకు తెలుసు(న్రా, ఒరే శవం వెధవ! నువ్వు చెప్పక్కర్లేదు, నెత్తిమీదివి సహం పండిపోయేయి. మిగతా సహవూ( ఊడిపోయేయి — ఆడదానికేంకావాలో నాకు చెప్తావు?! ఆడకోతి నైచ్చి నిలబెట్టి "నీకేం కావాలే?" అని అడగండి! అది(ఏవంటుందో మనకి తెలుసు! మన్ది వేదవంశంరా వెర్రివెధవ! గెడ్డాలూ మీసాల్తో అయిదుగు రున్నారు అచ్చాణీలాంటి రుషులు! కార్చిచ్చులాంటివాడూ కాలకూటవిషం లాంటివాడూ అసలు గోత్రికుడు! అందులో ఏ ఒక్కడు తల్చుకున్నా ఇంద్రుణ్ని దించేసి రావణాసురుణ్ని ఎక్కించీగల్రు సింహాసనం! అలాంటి చింతనిప్పులాంటి వంశంలో పుట్టేను? సిసింద్రీలా పరిగెడుతుంది మేధాశక్తి! ఎంత చచ్చు పుప్పిమిరియాలైనా మీ ఆవాలపాటీ ధనియాల పాటీ చెయ్యకపోవు! మనకెవడూ ఏం చెప్పక్కర్లేదు! ఆరుసార్లు దండ యాత్రకొట్టి పాసయేను మెట్రిక్యులేషను. ఈ పాటి చదువుకున్న నా దమ్మిడీ వెధవ నాలికఘాటీకే మీరాగలేకుండా ఉన్నారు కదా! నేనేకాని వేదాలూ గీదాలూ నిజంగా చదువుకున్నానంటే నాముందు నిలబడగల్రా మీరు?! నన్ను కన్నెత్తి చూడగల్రా?! కూలి కుంటిగుడ్డి గూని జనం అలగా జనంలోంచి మీతాతెవడు దిగొచ్చినా నా కాలిగోరికిసాల్రు! తెలుసా?, ఏదిరా ఒరే దిబ్బా! ఓ సిగరెట్టిలాఇయ్యి! గోకినచోట గోక్కుండా దిబ్బ బంగారివీపు ఆర్రోజులు గోకినట్టు తిట్టిన తిట్టు తిట్టకుండా ఏడ్రోజులు తిట్టగల్ను! రమ్మనెవణ్నయినాసరే మన్తో కుస్తీకి! ఓడిపోయేడంటే, మనకు కప్పు కాఫీ ఇప్పించేసి సలాంకొట్టి పొమ్మను. అంతకంటే ఎక్కువ పందెం నా కక్కర్లేదు, దురాశవెధవని కాన్నేను! అంచేత, ఒరేశవం! ఆడదానికేంకావాలో నాకు తెలుస్రా! ఆడకోతికూడా అనకా పల్లి బెల్లంలాటి మొగుడూ, తుంపాల పంచదార్లాంటి ప్రియుడు కావాలం టుంది! అంచేత ఆ నల్లచీరకర్రిది కమ్మలింటి రాజుగాణ్నిచూసి నవ్విం దంటే నవ్వదూ?! నవ్వుతుంది తప్పకుండా నవ్వుతుంది! అదీకాక, అది వాడింట్లో అంట్లుతోమే పని మనిషిట! ఆ తరవా తెలిసింది నాకు? దానికి

ఊఁ ఎంత గోరోజనంట! మన ఫేషన్ ధీవృద్ధింపో మొన్న మొన్నటిదాక పన్నేసి ఇప్పుడీ కమ్మలింటి రాజుగాడింట్లో కుదురు కుండిట. రోడ్లు ఊడ్చే వాళ్ళూ, కాలవలు కడిగేవాళ్ళూ అంట్లు తోమే-ఒహాళ్ళేవిఁటి? ఎడ్రసులేలేని వాళ్ళూ ఆడాళ్ళంతాకూడా సినీమాల్ళూసీడం, ఉచ్చంపేఁవిఁటో నీచంపేఁవిఁటో పెద్దా చిన్నా తారతమ్యం ఏఁవిఁటో తెలుసుకోకుండా చింకి వాయిల్చీరలు కట్టేసుకుని రంగుసుద్దలు మొహాలికి రాసేసుకొని పెద్దింటి మొగుళ్ళకోసం గేలాలు పట్టుకు తిరిగివేయడం! ఎక్కువ తక్కువలూ ఉన్నత వంశాలూ పోయిన తరువాత - ఒరే దొమ్మరి వెధవల్లార! - దేశం ఇలా మండి పోతూందంటే పోదుట్రా మరి? మండిపోడవేఁ కాదు; భస్మపై పోతుందలా చూస్తూండండి! సరే. దానికి మనవేం జేస్తాం? మహామహాలగోలే ఎవరూ విననప్పుడు మన గోలెవడు వింటాడు? ఇంతకీ, ఆ చిట్టా చిరునవ్వులు నవ్వేస్తూ అరటిపళ్ళు తెంపింది. ఈ కమ్మలింటి రాజుగాడు చిరునవ్వులు నవ్వేసుకొంటూ అవి అందుకున్నాడు. రొట్లప్పిగాడు కళ్ళప్పగించేసుకొని బల్లమీద అలా కూర్చున్నాడు. మన అడారివెధవ నడుం తిప్పుకొంటూ అరటి గెళ్ళపక్కని నిల్చున్నాడు. అందరికీ కొంచెం ఎడంగానే నిల్చు న్నాను. అప్పుడ్రా వినిపించిది కేక!! కే కంటే కేక్కాదు! హడిలిపోయేం! ఏఁర్రేడ్ సైరన్‌లాంటి కేక! కడుపుతోఉన్న ఆడది వింటే పురుడొచ్చేయా లన్నమాట——అంత కేక!! ఏవిట్రా అని వెనక్కి తిరిగి చూద్దుం, గుళ్ళోంచి తిన్నగా అమ్మతల్లో అసిరెమ్మో నడుచుకొచ్చేసి అక్కడ నిల్చుందా అనుకున్నాను!! అలా నిల్చుందది! ఎవరు? మన రాజమ్మ ముండ! ఎర్రచీరా నల్లరవికా, కాళ్ళకి అందెలు కడియాలూ, చేతులకి అంతలేసి దళసరి దుక్క బంగారపు మురుగులూ, గాజులూ, చెవలకి ఎత్తు గొలుసులూ, మెళ్లో నానూకంటేపట్టెడా, కళ్ళకి చెదిరిన కాటికముద్దా! తలంటి స్నానంచేసి నూన్రాసుకోకుండా ఎగురుతూన్న తట్టిడుజుట్టూ. ఇత్తడి చేటనిండా చేటడు చింతనిప్పుల్లాంటి మొహవూఁ- ఆ టైంలో దాన్ని ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియావేకాదు, అమెరికా, రష్యా ల్ళూసినా గడగళ్ళాడ వలసిందే: మామూలు బేడాపరక, వెధవ

[redacted] వెనక, అసిరమ్మ మొగళ్ళొ దాని మొగుడు గంగరాజు ! ! ఖాకీ నిక్కరు, కళ్ళీలాల్చీ, రెండు మైళ్ళెత్తు జుత్తు, మూడు మైళ్ళ పొడవు మీసాలు, చేతిలో చిన్నదేకాని మనకి మాత్రం గునపంలా కనిపించే లాఠీకర్రా వాడూ వెధవ, ఎలా ఉన్నాడంటే ఇంద్రజిత్తూ, ఘటోత్కచుడూకూడా సాల్లేకుండా, హిరణ్యకశిపుడి తమ్ముళ్ళాగో హిరణ్యాక్షుడి అన్నలాగో ఉన్నాడు ! చూసేరంటే, హిట్లరుగాడూ, ముసోలిన్‌గాడూ ఊష్ణాలు పెట్టేసుకుని జాయింటుగా మంచం ఎక్కవల్సిందే ? ఒరే నంగిరి వెధవా వాణ్ణి నువ్వు చూసుంటే ఈపాటికి మీ అయ్యకి, "మీ నంగివెధవ చచ్చేడండోయ్ !" అని టెలిగ్రాం వెళ్ళుండును ! తెలిసిందా ? అలా ఉన్నాడా గంగరాజుగాడు ! అంతెందుకు ? మా ఇంట్లో మా రెండో గుంట వెధవున్నాడా ? వాడిది వరకోసారి ఈ గంగరాజుగాడ్ని చూసినప్పుడు భయంతో నూటమూడ్డిగ్రీల జ్వరం పెట్టేసుకున్నాడు, డాక్టర్ చేత ఇంజెక్షన్లిప్పించవలసొచ్చింది. అందులో ఓసారి ఆ కంపౌండరు వెధవ ఉడికించని సిరింజితో ఇంజెక్షనిచ్చేస్తే మావాడికి దండ ఇంతెత్తు వాచిపోయింది. దానికి మళ్ళా మూడింజెక్షన్లు ! ఇలా, మూడ్రోజులు ఊష్ణం కాదుగాని ముప్పయి రూపాయలూడిపోయాయి. అప్పుడే ఈ డొక్కు వెధవని ఓ అయిదు సాయం చెయ్యరా అంటే చేసేడా ? కాటికైనా పోతానుకాని కాణీ అయినాసరే ఇవ్వనన్నాడు ! వెధవ్వెధవ ! పీనారి పిసినిగొట్టు ముష్టివెధవ ! వాడి మొహం చూద్దురూ ! సిగిరెట్లు మానీసేట్ట ! మానీసేడు ! డెక్కన్ సిగిరెట్ల డబ్బుతో మేడ కట్టించీరా వెధవా! లేకపోతే కారు కొనీ ! కొనీసి ఏ బంగారిముండ లాంటిదాన్నో పెళ్ళాడీసి దాన్ని కార్లో ఊరేగిస్తూ తిరుగు ! ఏం ? నావగ్గిర కంయ్ కుంయ్ వేషా లెయ్యకండి మరి ! తెల్సిందా ? నా నాలిక మంచిదికాదు. మా పూర్వం వెధవలు వేదాలు వల్లించినట్టు నేను బొర్లించగలను తిట్లు ! ఖబడ్దార్ ! సాత్తే, ఒక్క రాజమ్మముండ మన్తొ సాలాలేమోగాని, మరోడు సాల్లేడు ! తెలిసిందా! ....అఁ, సంగచ్చెప్తా నుండండిమరి ! రాజమ్మా దాని మొగుడూకాక,

మరో నలుగురైదుగురు పరివారం ఉందక్కడ. ఒక్కొక్కడూ కండ తిరిగి మన ఆఫీసాఫీసూ- గోడలూ, పెంకులూ, కుర్చీలూ, బల్లలూ, గుమాస్తాలూ, కాగితాలూ మన మామూళ్లూ - అంతటితో సహా మనాఫీసాఫీసూ పులుసులో వేసుకు నంచీసుకునేట్లున్నాడు. అందరికీ ముందు లీడర్లాగ రాజమ్మే నిల్చుంది పేద్ద జెమా జెట్టీలాగ! నిలబెట్టి కిరసనూనె పోసి అంటించిన అయిదడుగుల చింతమొక్కలా మండిపోతూ నిల్చుంది! మేంవంలా చింతచెట్టు నీడలో బంగారి పందిరికింద నిల్చున్నాం. 'పెయ్య నచ్చింది! ఏటి సంజాసీ సెప్తాడో అడగండెదవని!!" అంది రాజమ్మ. అడగం డెదవననే అంది!! కమ్మలింటి రాజుగాడి తెల్ల చొక్కా తెల్లపంట్లాం కాలికి ఎర్రజోడు, కంటికి నల్లజోడు ఉంగరాల జుట్టు, కంపెనీ ఉద్యోగం, ఊళ్ళో గౌరవం - ఇంత మనిషినీ "సీ,పో, యెదవా!" అనేసింది! కూల్దవనీ నాల్దవనీ కడజాతి చల్కారీది అవనీ - కాని ఆ ముండ తెగింపుకిస్తాన్నేను మెడలు! చీరా రవికా పసుపు కుంకుం హారతి కర్పూరం అరవైతులాల బంగారపు పతకవూఁ ఇచ్చి ఆ ముండ ధైర్యానికి దండం పెట్టాలన్నమాట ప్రజ యావన్మందీను; ఎవణ్ని తిడుతూందో ఏఁవిఁటో ముందు మాకర్థంకాలేదు. కాని, కమ్మలింటి రాజుగాడు మాత్రం గజగజమని ఎలా ఒణికిపోయేడు తెలుసా? పిడుగు దెబ్బకి కొబ్బరిచెట్టొణికినట్టొణికి పోయేడు. బూటుకి లేసూ, జేబులో పెన్నూ చొక్కా కాలర్తోసహా ఒణిపోయేడు. పెనంమీద అట్టులా మొహం మాడిపోయింది వెధవకి! మన రాజమ్మమాత్రం నడుంమీద చెయ్యేసుకొని చెక్కు చెదరకుండా ఇనప చేగోడీలా నిల్చుంది. దాని జుట్టు, దాని కుంకంబొట్టు, దాని ఎర్రటి మొహంమీద పచ్చటి పసుపు, దాని నగలు, దాని వగలు, దాని కళాకాంతులు, దాని గుండెధైర్యం అన్నీ చూసి—" ఆహా! ఇలాంటి ముండని పెళ్ళాడేస్తే గజలక్ష్మి గజ్జెలమోత్తూ ఇల్లు దద్దరిల్లి పోదా -! అనిపించేసింది నాకు - నిజం చెప్పొద్దూ! ఆఁ ఇంతలో ఏఁవఁయిందంటే — పరివారంలో ఒకడు ఓ అడుగు ముందుకొచ్చాడు. మిలిటరీకమాండర్ కి ఏడీఖాన్ గాళ్ళా

ఉన్నాడు. వాడు ముందుకొచ్చి, "నిన్నటాయింకాలం సూల్తోవున్న గేదని రాయేసి కొట్టేవంట! ఆ దెబ్బకి రేత్తిరి గేదె ఈనీసినాది పెయ్య సచ్చీసినాదిగదా! ఏటి సెప్తావు సంజాసీ?!" అని అడిగేడు. "ఓరి యెద వోరె యెదవ! సూల్తోవున్న గేదని కొట్టడానికిట్రా ఇంత సదూ సదుం కున్నావు నువ్వు?" అంది రాజమ్మ. యెదవరె యెదవ అన్నప్పుడు ముంద తొణకలేదు బెణకలేదూ! వెంటనే ఊరుకోకుండా తిట్లబండీకి స్పీడెక్కించింది, ఉరే జెష్టెదవా! చచ్చినెదవా! నీకా సొక్కా ఎందుకరా? ఆ నల్లద్దా లెందుకరా! నోర్లేని గొడ్డుని కసాయోళ్ళుగూడా అలా కొట్రు కదా. సదుంకొన్నాడివి నీకు సేతులెలా ఒచ్చేయిరా?!" అంటూ డబుల్ స్పీడెక్కించి మరీ అడిగింది. నాకెలా అనిపించిందంటే సర్కసో సిని మావో వీధిభాగోతవో చూస్తున్న ట్టనిపించింది. అదలా తిట్టగానే కమ్మ లింటి రాజుగాడు "ఏం చేస్తాడా, ఏం చేస్తాడా?" అని చూస్తూ నిలబడ్డా న్నేను. అదలా తిడుతూంటే అలా నిలబడ్డాడే కాని వెధవ ఏవీ చెయ్యడే! ఏదో అనబోయేడు కాని, నోటంట మాట పెగల్లేదు. ఇంతలో 'ఏవయిందంటే - పీల్డులోకి మరో ఆడసోల్జరు - అదీ ఓ కమాండర్ లాంటిదే—అది దిగింది. ఎవరనుకున్నారు? మన బంగారి. అది కొట్టు దిక్కుండానే "నా వార్ జోన్‌లో" యుద్ధం జరగడానికి వీల్లెదంది. "ఉలే" రాజమ్మత్త! నువ్వు తగూలాడాలంటే ఎక్కడైనా ఆడుకాని నా కొట్టుకాడమాత్తరం ఆడ్డానికీల్లేదు!" అంది. అవున్లేయే! నీ కొట్టుకాడ సానాట్లు తప్ప ఇంకే ఆట్లు ఆణ్నియ్యవే నువ్వు?!" అంది రాజమ్మ. "అందుకేనేటి ఒచ్చినావు నువు?!" అని బంగారంది. ఓసి ఒల్లకోయే అంటే ఓసి ఎల్లవే అని ఒకర్నొకర నుకున్నారు. రాజమ్మకి బంగారికి పడదు. ఇద్దరూ దొందుకి దొందేకదు! ఆ పిడకా ఈ పిడకా ఒక్కలాటి పేళ్లోంచి ఒచ్చినవే! తేడా లేదు. అంచేత ఇద్దరికీ పడదు. అప్పుడు, బంగారి "గంగరాజు మావా? ఇక్కడ తగూవొద్దు! ఇప్పుడే పెప్తున్నాను. పెళ్ళాంతో నువ్వూకూడా సెప్పు అంది నీ ఊసెత్తనేదు. నీ జోలెత్తనేదు నీ కొట్టుకాడికి రానేదు. పబిలీకు రోడ్డిది! నీ కెందుకు

మావ్రాసు? నువ్వొల్లికో!" అని గెంతింది రాజమ్మ, రెండడుగులు ముందుకొచ్చి చేత్తో గాల్లో పోట్లు పొడుస్తూ అంతలో కమ్మలింటి రాజు గాడి నోరు పెగిలింది. "ఏయే! అమ్మే! ఎవర్ని తిడుతున్నావో ఏమోగాని మేంమాత్రం మీ గేవెని కొట్టలేదు!" అని అనగలిగేడు - నాలిక పిడచ కట్టుకు పోయినట్టు - అలా వచ్చింది వాడి మాట! దాన్తో ఒక్క ఎగు రెగిరింది రాజమ్మ, "అమ్మా అంటావురా! వెదవా! నీ పెళ్లం నను కున్నావురా పిచ్చివెదవా?! ఇయాల నీ రోగం మూడిందిరా; ఇయాల నీ తెగులు సల్లాపడ్డిరా! ఇయాల నీ పెళ్లం తాళి తెగుడ్డిరా! మాపిటి కాణ్నుంచి దాన్ని నా మొగుడేలుకుంటాడ్రా!" అంటూ ముందుకొచ్చి తెయ్‌తెయ్‌మని ఎక్స్‌పర్ట్‌లా డాన్సు చేసింది రాజమ్మ. అంతలో మన బంగారి కొట్టు దిగిపోయి, రెగ్యులర్ రంగంలోకి ప్రవేశించి, "ఇది నా కొట్టు! ఇక్కడ ఓవురైనాసరే, తాళిల్దారు పెళ్లమైనాసరే, కలకతే యుంచుకున్న ముండైనాసరే, అప్పన్నంపి దాని మొగుణ్ని పక్కల ఎసు కున్న ఏ బటాచోరైనాసరే నా కొట్టుకాడి కీల్లేమ, ఇక్కడ జట్టీలాడ్దాని కీల్లైదు!" అని తకతై తకతై. మంటూ గెంతింది బంగారి. "ఓ పెల్లవే! సవితి నాయరాలా! నీ కొట్టుకాడికి నీ రంకు మొగుళ్ళంతా రావొచ్చే! మరియాదస్తు్రాకూడదే! ఓసి కొట్టుదిగిపోనావని మాకు బయ్యంవేంటేం!!? ఊరికో మొగుడే నీకు! ఈదికో మొగుడే నీకు! పేటకో మొగుడే నీకు!" అంటూ రాజమ్మ రెండు చేతుల్తోనూ లయగా తొడలు బాదుకుంటూ అరిచింది. "పోలీసోడో మొగుడు, ఏడ్డో మొగుడు. బావో మొగుడు, మందుల భీవుండు మరో మొగుడు!! ఎల్లవే ఎల్లవే! "నా కొడుకొచ్చి నీ యీపు సిట్లగొట్టేస్తా డెల్లవే!!" అంటూ బంగారి దాని పందిరంత ఎత్తు ఎగిరింది. "నీ కొడుక్కి తండ్రెవరే? నీ కొడుక్కి పనేంటే? ఆణ్నిలా రమ్మనే!" ఆణ్ని, ఆడి ముండల్ని కట్టగట్టి కొట్లో ఎయించేస్తానే!" అంటూ రాజమ్మ తాటిచెట్టంత ఎగురెగిరింది. బలే బలే! లంకిణీ శూర్పణకల దెబ్బలాటలా ఉందనుకోండ్రా! అయితే_ తగవుబండీ ఆ మాదిరిగా లూప్ లైన్లోకి వెళిపోయినపుడు కమ్మ

లింటి రాజుగాడు తన ఇంజను పక్కతోవకి మరో లైన్లోకి మళ్ళించి తీసుకుపోవాలా? అబ్బే, అదేంలేదు. అలా బెల్లంకొట్టిన రాయిలా నిల్చుండి పోయేడంతే! మతి పోయింది వెధవకి. మరో కారణంలేదు. గంగరాజుగాడి చిన్నరాణీముండా కిల్లీకొట్టు డవేజ్రాణీ ముండా అలా జుట్లూ జుట్లూ పట్టుకునే పైంకి ఏఁవఁయిందను కున్నారొరే! పుట్టలోంచి, ముందుతోకా, తరవాత ఒళ్లూ, తరవాత తలా తీసుకొని పైకొచ్చే తాచు పావుఁని గాని నాగుబావుఁనిగాని మీ రెప్పుడైనా చూసేరా? కర్రిది, నల్ల కోకది; అమ్మల్ల దానిపేరు! అది, ఆ కిల్లీబడ్డీ సైడు తలుపులోంచి ముందు కాళ్ళుదించి ఆ తరవాత నడువూఁ వళ్ళూ తలా పైకిలాగి సర్రున తాచు పాం ఒచ్చినట్టు తగవులో కొచ్చిందిరా! అమ్మ, ముండా, ఎంతకైనా తగుదువే అనుకున్నాను! రంగంలోకి జూనియర్ లంకిణిలా రంయ్‌ఁమని దిగింది. "ఒలె, రాజమ్మ! నానున్నానే అక్కడా! మీ గేదని మా బాబు కొట్టనేదు. రాయిసర్నేదు, పాములన్నీ పాడుజేసేస్తే నానూ బాబూకూడా ఎల్లేం! బాబ్మీదనే కొమ్మిసిరింది, మీ గేద! మీ గేదని నానే బైటకి తగిల్నాను! ఎరికా? మరింకట్టే పొగరుమోతు మాట్లమిగలకిక్కడ! ఒచ్చిన్దారంట తిన్నిగెలిపో!" అంటూ కర్రిసివంగిలా కేకలు వేసింది ఆ అమ్మలు ముండ! దాన్తో" ఈ కర్రిముండకి ఆ కమ్మలింటి రాజుగాడిమీద ఎందుకురా ఇంత అభిమానవూఁ ఇంత ప్రేమా?" అని అందరికీ కూడా అనిపించేసింది. అంతా ఆశ్చర్యపోయేం! సరే! చేపల కంపుదాన్ని మహారుషే పట్టుకున్నప్పుడు కమ్మలింటి రాజుగాడో లెక్కా? ఉప్పావపర్రా? అప్పుడింతకీ ఏఁవయిందంటే: అది అలా తాచుపావుఁలా మధ్యకొచ్చి పడగెత్తి బుసకొట్టేసరికి రాజమ్మేం చేసింది?! టక్కుమని దానిపిలక పట్టుకుని పడ పడ లాడించేసి దాని పీక పిసికేసింది! కుర్రముండ కుఁయుఃక్కుమని ప్రాణం ఒదిలేస్తుందనుకున్నాను. అపుడు ఆ గంగరాజుగాడేం చేసేడు? "అసలోణ్ని ఒగ్గేసి దాన్ని ఒట్టుకుంటావేటేలంజా!!" అంటూ పెళ్లాం చేతిమీద కర్రతోకొట్టేడొరే!! నేను కళ్ళుమూసుకున్నాను. రాజమ్మ చెయ్యా కాబట్టి ఆ దెబ్బకోర్చుకుంది కాని, అదే నీ చెయ్యా నా చెయ్యా అయితే

పుప్పి చెరుగ్గడ పుటుక్కున విరిగిపోయినట్టు విరిగి పోనన్నమాట! అయితే అంత దెబ్బతిందేకాని, రాజమ్మ తనపట్టుమాత్రం విడవలేదు. అప్పుడేఁ వయిందను కున్నారు! అంతవరకూ అలా మంత్రం వేస్తే నిలబడిపోయిన నాగుపాములా ఉండి పోయేదుకద ఆ కమ్మలింటి రాజుగాడు! ఆ రాజమ్మ లంకిణివాడి పనిపిల్ల పీక పట్టుకొనేసరికిమాత్రం, వాడొక్క ఊపులోవెళ్ళి ఆ రాజమ్మని రెండు చేతుల్తోనూ వెనక్కి తోసేసేడ్రా! బక్కిలా ఉంటాడు వెధవ—అన్నెల్ల నించీ వాయుభక్షణమాత్రం చేస్తున్న సన్యాసి వెధవలాగ! వాడికంత శక్తి ఎక్కణ్ణించి వచ్చిందో ఆశ్చర్యం! ఆ రాజమ్మ, చిన్నమనిషేంకాదు. మిమ్మల్నీ నన్నూ మన తాశిల్దార్నీ తినేసి కలెక్టర్ని మారడగ్గలదు! ఆరుబస్తాల సిమెంటు ఒక్క బస్తాలోకి ఎక్కించినట్టు ఫైల్మాన్లా ఉంటుంది! అంత ఫైల్మాన్లా ఉన్నదీకూడా వాడి తోపుకి పదహారుగజాల దూరం తుళ్ళిపోయి, దుబ్బుమని పళ్ళతో సహా పనసచెట్టు పడిపోయినట్టు పడిపోయిందిరా! అంత సీరియస్ సిట్యుయేషన్లోనూ, అది పడిపోయేసరికి మాత్రం నాకు తెగనవ్వొచ్చింది, కమ్మలింటి రాజుగాణ్ణి నేను మెచ్చుకొనేరకం కాదుగాని, వాడిక్కూడా ఓ మెడలివ్వొచ్చు ననిపించిందినాకు ....అయితే ఇంతకీ ఆఖర్నేఁ వఁయిందా? అవడవేఁ అయింది. ఆ గంగరాజుగాడూ పరివారమూఁ కలిసి పాతేసేరు ఆ రాజుగాణ్ణి! ఆ దెబ్బలకి వాడు చచ్చేస్తా డను కున్నాను. ఆ రాజమ్మకూడా తిరిగిలేచి వాణ్ణి నలుగురితోపాటు కాళ్ళూ వేళ్ళా కుమ్మేసింది. మన్ను కుమ్మేసినట్టు!....మేఁవేం చేసేవాఁ? మనం ఏం చెయ్యగలవుఁరా? మనం కలం మనుషులం కాని కత్తి మనుషులం కావేఁ! మన ఆడారాడు అదంతా చూసి ఆఫీసు గేట్లోకి కాబోలు దౌడు తీసేసేడు, రొట్లప్పిగాడు బల్లమీద రొట్టెలపెట్టె బల్లమీదే ఒదిలేసి ఎక్కడికి ఉడాయించీసేడో వాడుమట్టుకు వాడు ఉడాయించీసేడు. ఎటు వెళ్ళడానికి ఎక్కడికి పారిపోడానికి ఏమీ తోచక నాకు మతిపోయి కాళ్ళల్లో కంపరం పుట్టేడంతో, దగ్గిరగా ఉందికదా అన్చెప్పి బంగారి కిల్లీ బడ్డీలో నేను దూరీసేను. అయితే, అంతా నిమిషంకంటె ఎక్కువ పట్ట లేదు. మళ్ళీ అటు చూద్దును! గంగరాజుగాడూ, వాడి రాణీ, వాడి పరివారవూఁ అంతా అరఫర్లాంగు దూరంలో ఉన్నారు. కమ్మలింటి రాజు

గాడు చచ్చిన గొడ్డులా ఎండలో పడున్నాడు. స్పృహ తప్పిపోయింది. దెబ్బల్నించి కొంచెం కొంచెం నెత్తురు కారుతూంది. నిజం చెప్పొద్దూ : వాణ్ని చూసి నాక్కొంచెం జాలివేసింది. "హయ్యో, వెధవా !" అనుకున్నాను. ఇంతలో మీరంతా ఒచ్చేసేరు. అదిరా సంగతి : దగ్గరుండి ఇంత మంచి దెబ్బలాట నే నెప్పుడూ చూళ్ళేదు. గొప్ప ఛాన్సే : మీకు లేదు. నాకు తగిలింది. అయితే, ఇది కోర్టుదాకా వెళ్లిందా — నేను సాక్షి బోనెక్కవలిసొస్తుందేమోనని భయపడుతున్నాను.... ఆఁ, కోర్టుదాకా వెళ్తుందేంటిలే ! వాడికి ప్రస్తుతారీక్కి కడిగేసిన రాళ్ళు రెండొందలో మూడొందలో జీతం తప్ప కాణీ ఆస్తున్నట్టులేదు. కుక్క జట్టీ తెచ్చుకుని కోర్టులంట తిరుగుతూంటే వీడికింక ఉద్యోగం ఉన్నట్టే ! అందులోనూ, గంగరాజుతోనూ రాజమ్మతోనూనా కుస్తీ ?! ఇవాళ తంతే, వీడు రేపు కేసు పెడతాడు. ఎల్లుండి తంతే అవతల్నాడు కేసు పెడతాడు. ఇలా ఎన్నిసార్లు తంతే ఎన్ని కేసులు పెట్టగలడు వీడు ? అబ్బే లాభంలేదు ....అయినా ఒరే అబ్బిగాళ్లూ యిదంతా ఆ కమ్మలింటి రాజుగాడు చేజేతులా తెచ్చుకున్నాడనుకోండి ! వాడి కంపెనీ నౌఖిరీ ఏఁవిఁటోఁ, వాడి బతుకేవిఁటోఁ—అదంతా, వాడి విషయాలూ వాడి మంచిచెడ్డలూ వాడి బాగోగులు వాడు చూసుకోక ఊరిమీద భోగట్టాలన్నీ వాడి కెందుకు ? దీన్నే నేలనిపోయిాది నెత్తికి రాసుకోడం అంటారు. వీడి మానాన్న వీడు పడుండక టంయ్ఁ టుంయ్ఁమని చోటా లీడర్లా ముందు కొచ్చేసరికి ఏఁవయిందో చూసేరా ? ఆ రాజమ్మ దాని గేదెల్నది దాని దొడ్లోనే కట్టుకుందో మెయిన్ రోడ్డునే కట్టుకుందో అదంతా వీడికెందుకు ? వీడి ఇంటిచుట్టు అది గేదెల్ని కడుతూందట. కడితే కడుతుందది ! వీడి ఇంటి చుట్టూ జాగా వీడిది కాదుకద ! మరలాంటప్పుడు వీడి సొమ్మేం పోయింది ? వీడికి న్యూసెన్సుగా ఉందట ! ఉంటే ఉంటుంది. వీడి కమ్మల కుటీరాన్ని పీక్కుపోయి మరోచోట కట్టుకోమను ! పోనీ మ్యున్సిపాలిటీకి రాసుకోమను ! రాసేడు బాగానే ఉంది. వాళ్ళు యాక్షన్ తీసుకోలేదు. ఎలా తీసుకుంటారు ? తీసుకోరంతే ! రాజమ్మ నేమైఁనా అంటే దాని కులంవాళ్ళంతా దాన్ని వెనకేసుకొస్తారు. దాని ఓట్లన్నీ మందులఖీఁవుఁడిక్కావాలి, అంటే ఛైర్మన్‌గారికి కావాలి.

అంటే వాళ్ళ పార్టీ మొత్తానికి రాజమ్మ కావాలి. రాజమ్మమీద యాక్షన్ తీసుకొంటే రేప్పొద్దున్న మ్యునిసిపాల్టీ నడవడఁవెలాగ? న్యాయవోఁ అన్యాయవోఁ పరిస్థితి ఇది! యాక్షన్ తీసుకోవలసినవాళ్ళు యాక్షన్ తీసుకోనప్పుడు రేప్రొద్దున్న మళ్ళీ ఒచ్చి ఎలక్షన్సులో యాక్షన్ తీసుకునీ వాళ్ళని ఎన్నుకోమనవయ్యా! ఎవడొద్దన్నాడు? కాదు, నీ చేతిలో కలం ఉంది కాబట్టి దాన్తో ఊరందరిమీదా యుద్ధం చేస్తానన్నావు, చెయ్యి! ఒద్దన్నవాదెవడు? నీకు శక్తున్నపని నువ్వు చేసేవు. వాడికి శక్తున్నపని వాడు చేసేడు. వాణ్ని "వెధవా అంటే వాణ్నిన్ను 'ఏఁవండి రాజుగారు!' అంటాడా? వాణ్ణో చిన్న గిల్లా గిల్లితే వాడుకూడా నిన్ను చిన్న గిల్లు గిల్లాలనే ఎక్కడుంది రూలు? నువ్వు గిల్లేగిల్లగలవు, వాడు ఎవిఁకలు విరిచీగల్డు, అంచేత మన శక్తిసామర్థ్యాలేఁవిఁటో మనం తెలుసుకు వ్యవహరించాలంతే. ఈ కమ్మలింటి రాజుగాడు అలాకాడు; అబ్బాయిగారికి నీలుగు లావు! మ్యున్సిపాల్టీవాళ్ళు ఏచర్యా తీసుకోలేదుట. వాళ్ళంతా ధన దౌర్జన్యాలకి లొంగిపోయారుట. వీడి చేతిలో ఓ పెద్ద మంచి కలం ఉందిట, అంచేత పేపర్లకి సంపాదకులకి "ఆర్యా! మా వీధి రాజమ్మ తనయొక్క దుక్కబలసిన గేదలను అక్రమముగానూ, అన్యాయముగానూ. దౌర్జన్యముగానూ గాడిదగుస్సుగానూ కంకరపిస్సుగానూ" అంటూ సంపాదక లేఖలు రాసేట్ట వెధవ! కలం ఉందికదా అని వీడు బక్కరేస్తే జెబ్బసత్తువుంది కాబట్టి వాళ్ళు దంపు దంచీసేరు. కొవ్వు కరిగిపోయింది. వెధవకి, అబ్బాయిగారికి సందుచూసి ఖచ్చితంగా ఖర్సు కిచ్చీసేరు. సంపాదకలేఖల అప్పంతా దబదబమని కాళ్లావేళ్లా కర్రల్తో కూడా తీర్చేసేరు. "పోయెదవా! దిక్కున్నచోట సెప్పుకో! అరుసుకో పిటిస నెట్టుకో, ఏటిసేసుకో! మాగేదెల పేడపాటి ఖరీదు సెయ్యని యెదవ్వి, దిక్కున్నసోట సెప్పుకో యెధవా!" అంటూ పబ్లిగ్గా చితగొట్టీసి పోయేరు వెధవని. మరింక వీడూ నేనూ చేసేదేఁవుంది? అమ్మలు వాడి మొహమ్మీద నీళ్ళు జల్లితే లేచి ఆ బంగారి ఓ సోడా యిస్తే తాగి, అది కొట్టు మూయిస్సి అమ్మలు సాయంతో ఓ రిక్షాలో వీణ్ని వేసి ఆస్పత్రికి తీసుకెళ్తేనేగాని దిక్కు లేకపోయింది. ఇంక వీడూ నేనూ చేసీదేవిటిఁ నోరు మూసుకు పడుండవేఁ! అంతకంటే చేసేదేంలేదు. కూ్యబావాడు కంయ్!

కుంయ్! మంటే అమెరికా వాడేంచేసేడు? డొక్క చించేస్తాన్! జాగ్రత్తన్నాడు. వియత్నాం వెధవలు నీలుగు నీలిగితేకూడా అమెరికావాడేంచేసేడు? బాంబుల వర్షం కురిపించి సగం దేశం ధ్వంసం చేయిన్చేడు. వాణ్ని ఎవడైనా ఏమైనా చెయ్యగలిగేరా; అన్నీ తెలిసినవారు, పెద్దవారు, అనుభవజ్ఞులు! తమరే ఇలా చేస్తే ఎలాగ?"అని మర్యాదాగా అంతా మందలిస్తున్నారంతే! అంతకంటే హెచ్చేమైనా ఎవణ్నాయినాసరే చెయ్యమను చూదాం! చెయ్యరు! నాకు తెలుసు; ఎవడైనా మధ్యలోకి మన కమ్మలింటి రాజుగాళ్ళా తగుదునమ్మా అని జోరబడ్డాడో డొక్క చీరీసి డోలు కట్టేస్తారు వాడికి! అంచేత నేచెప్పే దేమంటే! పూర్వంరోజుల్లోను ఇపుడు ఈరోజుల్లోకూడా తన్నగలిగి తన్నేవాడే రాజు. పల్లెటూరికైనాసరే, పట్నానికైనాసరే దేశానికైనాసరే, ప్రపంచానికైనాసరే, ఆఖరికి దేవుడి రాజ్యానికైనా సరే అదే రూలు! మరో రూలంటూ లేదు. అబ్బిగాణ్ని దిబ్బిగాడు కొడితే దిబ్బిగాణ్ని మరో పెద్దిబ్బిగాడు కొడితే, ఒకడు రాజు, ఇంకోడు రారాజు, మరోడు పదహారు పేజీల టైటిల్స్‌తో పెద్ద చక్రవర్తిరాజూను!! ఆ వెధవలే ఇప్పుడూ కొత్తపేర్లతో చలామణీ అవుతున్నారు. మరింక మన్లాటి నౌఖరీ వెధవలవా? మనం ఏ ఎండకి ఆ గొడుగ్గాళ్ళం. రాజుగారు సంస్కృతంతప్ప ఇంకేమీ ముట్టుకోరంటే పిలక్కి తాడు కట్టుకొని అదే చదివేం. నవాబుగారు ఉర్దూ అరబ్బీ పారశీకాలు తప్ప మరేమీ పట్టుకోరు ముట్టుకోరంటే జీహోసర్కార్ అన్చెప్పి అబ్బుద్ధవాటి కాళ్ళూ పట్టుకొని కుడినుంచి ఎడమకి ఆ భాషలన్నీ తిళ్ళు కూడా మానుకొని వేదాలకంటే ఎక్కువగా చదివేం. దొరగారు ఇంగ్లీషు తప్ప ఇంకేదీ నచ్చదు మాట్టాడరంటే ఎస్సారన్చెప్పి అహోరాత్రాలు నిద్ర మానుకుని ఆ భాషే చదివేం. అప్పుడూ ఆ వెధవల వెనకే తిరిగేం. ఇప్పుడూ ఆ వెధవల వెనకే తిరుగుతున్నాం. అప్పుడు తాటాకులూ గంటాలూ పట్టుకు తిరిగేం. ఇప్పుడూ కాయితాలూ కలాలూ పట్టుకు తిరుగుతున్నాం. వాళ్ళ పద్దుల్రాయడం, వాళ్ళవసూళ్ళు చెయ్యడం, వాళ్ళకి పాటాల్చెప్పడం, వాళ్ళ పాపాలు సమర్థించడం, వాళ్ళకిలేని సుగుణాలు వర్ణించడం, వాళ్ళకి ఉండే దమ్మిడి మంచికి వాళ్ళని బంగారు గనులూ, వజ్రాల ఖనులూ అని పొగడ్డం-అప్పుడూ మనకదేపని! ఇప్పుడూ మన

కదేపని: అప్పుడూ చి త్తం చి త్తంగాళ్ళవేఁ! ఇప్పుడూ చి త్తం చి త్తం గాళ్ళవేఁ! ఇదే పూర్వం రోజులై తే ఇందాట్లా జరిగినదంతా గంగరాజ వరేణ్యుని వీరగాథగా చెప్పి అందులో రాజమ్మ రాణి సాహసకృత్యాలన్నీ వివరించి లంజాచౌడా గ్రంథంరాసి భ క్తి పురస్సరంగానో కృతజ్ఞతా పూర్వకంగానో మనవేఁ వాళ్ళకి అంకితం ఇచ్చుకొని నాలుగు ఒట్టి పోయిన గేదెల్ని దానంగా పుచ్చుకొనుందువుఁ! "అందులో రాణీగారి మొహమ్మీద మాడుమచ్చ అంత బావుంది. రాజుగారి మొండిచెయ్యి ఇంత బావుంది" అని ఆ గ్రంథంలో సహం పేజీలు వాళ్ళని పొగిడుందువుఁ! విన్నావుకొరే. శవం వెధవ! మనం ఎవరవోఁ తెలుసా? మనం పులివెనక నక్కగాళ్ళవిఁ! అదో గొడ్డుని కొడితే మనకో నాలుగు దుమ్ములు దొరుకుతాయనే కని పెట్టుకు నుంటాం, తెలిసిందా? మనం పులివెనక నక్క వెధవలవిఁ! "ఇవాళ్టికి గంగరాజే రాజావారు!" చి త్తం చి త్తం! జై జై! వారు చేసిం దంతా రై ట్ రై ట్! ఇవాళ్టికి కమ్మలింటి రాజుగోరే రాజావారు!" చి త్తం చి త్తం! జై జై! వారు చేసిందంతా రై ట్ రై ట్! తెలిసిందా?! అదీ మన పద్ధతిఁ—

అంటూ అంతా వివరించేడు పీనుగ్గుమస్తా.

మానవలోకంలో మదనుడివంటి మహాసామ్య వాది మరొకరు ఉండరని ఈ అధ్యాయం చదివి పాఠకులు తెలుసుకుంటారు—మదనుడి సమతా వాదాన్ని మంచి తండ్రులైనా ఒకప్పుడు మెచ్చక పోవచ్చునికూడా పాఠకులు తెలుసుకుంటారు— మగని బలానికి కాని మదనుడి బలానికి కాని లొంగని మగువలు ఇలలో ఉంటారని కూడా పాఠ కులు తెలుసుకుంటారు—సొసైటీలో ఎక్కు వ్వారు, ఇబ్బందిలేని జబ్బులకి, అపుడపుడు మంచం ఎక్కడం వారికెంతో మంచిదని హైక్లాస్ పాఠ కులు గ్రహించుకుంటారు——నల్లనర్సెవరో తెలుసు కొని ఆమె ఆడతనానికీ జాణతనానికి ఏ క్లాసు పాఠకులైనాసరే అయితే ముగ్ధులవుతారు, కాక పోతే, కాకపోతారు.

# 11

సమతా వాదులంతా సామ్యవాదులైతే, మదనుడు సామ్యవాది – ఆ మాట కొస్తే అంతకంటె హెచ్చు!

మానవులంతా సమానులని సామ్యవాదులు వాదిస్తూ కూర్చుండిపోతే, మానవులంతా సమానులని ముక్కుమీద గుద్దినట్లు నిరూపించి చక్కా పోతాడు మదనుడు.

మాట వరసకి -

ఆస్పత్రి ఆరో అంతస్తులో చల్లని గదిలో మెత్తటి పరుపుమీద వెచ్చగా సుఖంగా పడుకున్న ఛేర్మన్ భీమసేనరావుగారూ, ఆస్పత్రి గేటు బైట ఎండలో నిలబడి పెట్టెని మోసుకుని రొట్టె లమ్ముకొనే అప్పిగాడూ కూడా అనంగుడి త్రాసులో సమానంగానే తూగుతారు. అదే విధంగా పద్మజా గిరిజా, అదే విధంగా రంగారావూ ప్రసాదూ, అదే విధంగా రాజమ్మా బంగారీ, అదేవిధంగా హెడియా అమ్మలూ, అదే విధంగా ఇంకొకరూ ఇంకొకరూ! మదనుడి దెబ్బకి దొరకని వారు మహామహు లనే చెప్పాలి

అయితే, 'డాడీ'కి ఆక్సిడెంటు జరిగిన దగ్గర్నించీ మిస్ ప్రేమ, అనంగుడికి దూరంగానూ, డాడీకి దగ్గరగానూ జరిగింది.

మంచం మీంచి దించేయవలసినంత ప్రమాదం చెయ్యకుండా మంచం మీదకి ఎక్కించేటంత మాత్రం ప్రమాదం చేయడం మానవుడికి ఎంతో మంచిది. అందులోనూ, ఆ మానవుడు డబ్బున్న మానవుడైతే అతనికి అంతకి మించిన సౌఖ్యం ఎప్పుడోకాని దొరకదు.

ఛేర్మన్‌గారికి జరిగిన ప్రమాదం పెద్దది. తగిలిన దెబ్బ చిన్నది. ఆయనకి అందువల్ల విశ్రాంతీ సానుభూతీ రెండూ లభించేయి. మనిషికి మానవసంఘంలో ఎంత పలుకుబడుందో అటువంటి సమయాల్లో ఎంతో బాగా తెలుస్తుంది. తెలుసుకొని ఆ మనిషి ఆ సౌఖ్యాన్ని సంతృప్తిగా అనుభవించగలడు.

భీమసేనరావుగారికి దేశం నలుమూలలనుంచీ వచ్చిన సానుభూతి సందేశాలని చదువుకొని భీమసేనరావుగారు ఎంతమట్టుకు 'ఎన్జాయ్' చేయ గలిగేరో తెలియదు కాని మిస్ ప్రేమ మాత్రం 'థరో'గా 'ఎన్జాయ్' చేసింది.

తన తండ్రి గొప్పవాడనే విషయం గురించి ఏమంత పెద్దగా ఎన్నడూ ఆలోచించలేదు మిస్ ప్రేమ. ఎవరైనా తిరుపతి కొండమీదే పుట్టిన దగ్గర్నించి ఉండిపోతే, తాము ఎంత ఎత్తునున్నారో వారెప్పుడైనా

కొండ దిగితేనేగాని తెలుసుకోలేదు. కారు ప్రమాదంలో డాడీకి చిన్న దెబ్బతగలగానే—తను కొండమీంచి కిందకి దిక్కపోయినా—తను కొండమీద ఉన్నాననే సంగతి మాత్రం ఎంతో బాగా తెలుసుకోగలిగింది మిస్ ప్రేమ.

ఛేర్మన్ భీమసేనరావుగారికి ఆక్సిడెంటు జరిగి ఆయన ఆస్పత్రిలో అడ్మిట్ అయిన మర్నాడు రోజల్లా మిస్ ప్రేమ ఆస్పత్రిలోనేఉంది. పుర ప్రముఖులంతా ప్రవాహంలా వచ్చి తన తండ్రిని చూడ్డంతో ఆమె ఎంత గానో పొంగిపోయింది. అక్కడ రోజల్లా డ్యూటీలోఉన్న నల్లనర్సు మాత్రం డాడి 'రెస్ట్‌లెస్‌గా అయిపోకుండా ప్రేక్షక ప్రవాహంనుంచి డాడీని' కాపాడుకొంటూ వచ్చింది.

తరవాతరోజు ఉదయం లేస్తూనే మిస్ ప్రేమ డాడీకి ఎలా ఉంధో ఏమిటో అన్చెప్పి మంచం మీంచి లేవకుండానే ఆస్పత్రికి ఫోన్ చేసింది.

"మీ డాడీ చిన్న పిల్లలకంటె ఎక్కువల్లరి చేస్తున్నారు పద్మా! మీ డాడి నీ కంటె పెద్దా లేక చిన్నా?" అంటూ నవ్వుతూ సమాధానం ఇస్తూ, పెంకెగా ప్రశ్నించింది నల్లనర్సు.

ఆ నర్సు తనని "నువ్వు" అని సంబోధించి నందుకు ఆశ్చర్య పోతూనే ఆ నర్సు సమాధానానికి మాత్రం పకపకనవ్వుతూ ఫోన్ పెట్టే సింది మిస్ ప్రేమ.

విశ్వమోహిని స్నానం చేసుకువచ్చి నిలువుటద్దం ముందు నిల్చొని మెత్తని తువాల్తో చెవలసందులు తుడుచుకొంటోంది.

"అంటీ అంటీ! డాడీ నాకంటె చిన్నట!!" అంటూ పకపక నవ్వింది మిస్ ప్రేమ.

"విశ్వమోహిని వెనక్కితిరిగి."

"ఎవరన్నారలాగ?" అని వింతగా చూస్తూ అడిగింది.

"నర్సు!" అని జవాబు చెప్పింది మిస్ ప్రేమ.

"ఏ నర్సు?" అంటూ ఆశ్చర్యపోయింది విశ్వమోహిని.

"ఆస్పత్రి నర్సు."

"ఎవరావిడ?"

"ఆస్పత్రి నర్సు!"

"ఊరూ పేరూ లేదా ఆవిడికి?"

నర్సులకీ, ఆయాలకీ, డాక్టర్లకీ - యర్లకీ, కూలీలకీ, మేస్త్రీలకీ పేరుంటాయనే సంగతి జనం అప్పుడప్పుడు మర్చిపోతుంటారు.

"ఊరూ పేరూ ఈసారి కనుక్కుంటానుండు. చాలా మంచినర్సు" అంటూ మంచంమీంచి లేవకుండానే పక్కనున్న బల్లమీది న్యూస్ పేపరు తీసింది మిస్ ప్రేమ.

పేపరు మడతవిప్పి చూసీ చూడగానే "అహోమ్!" అని అరిచింది మిస్ ప్రేమ.

విశ్వమోహిని బైటకి వెళ్ళబోతూ "ఏంవిటి పద్మా!" అని ఆగి అడిగింది.

"డాడీ ఫొటో పడిందాంటీ చూడు! ఆక్సిడెంట్ గురించి అంతా రాసేరు కూడాను!" అంది మిస్ ప్రేమ. ఇంట్లో పెళ్ళి జరిగినకంటే ఎక్కువ సంబరపడిందామె.

విశ్వమోహిని దగ్గరగా వచ్చి, పత్రికలో పడిన ఛేర్మన్‌గారి ఫొటో చూసి సంతోషించకుండా ఉండలేకపోయింది. అయితే మిస్ ప్రేమ చిచ్చుబుడ్డిలాగా తారాజువ్వలాగా సంతోషిస్తే విశ్వమోహిని చిన్న కాకర పువ్వొత్తుపాటిగా సంతోషించింది.

తన తండ్రి - పురుషోత్తంగారు — ఓ మాదిరిగా పెద్ద జెమీన్దారే అయినప్పటికీ ఆయన పోయినప్పుడైనా ఆయన ఫొటో పత్రికల్లో పడకపోవడం గుర్తుకి వచ్చింది విశ్వమోహినికి. చిన్న దెబ్బ తగలగానే తన మరిదిగారి గురించి అన్ని వివరాలు ఫొటోతోసహా ప్రచురణ కావడం ఆవిడకి కొంత సంతోషం కలిగింది. అలా పత్రికల్లో పడ్డంవల్ల తనమరిది గొప్పవాడయేడని ఆమె అనుకోలేదు. అది తన మరిదిగారి గొప్ప తనానికి చిన్న చిహ్నంగా ఆమె తీసుకొంది! అతను ఇంకా వృద్ధిలోకి రాగలడనే ఆశతో ఆమె కొంచెం సంతృప్తితో నిట్టూర్చింది.

విశ్వమోహినికి పిల్లల్లేరు. ఆమెభర్త మంచివాడు, యోగ్యుడు, కల వాడు, ఓ మాదిరిగా చదువుకొన్న వాడూను. అతను పెద్ద మొఖాసావారు, ఎంతోమంచివాడు ఎవరడిగిన డబ్బిచ్చేసేవాడు, చేతికి ఎమికలేని మనిషని పించుకున్నాడు. అయితే, అతనికి అట్టే పెద్దచదువులేదు. కావలసినంత డబ్బుమాత్రం ఉండేది, అతనికి, వివేకంలేకపోడం అటుంచగా,పుణ్యానికైనా పాపానికైనా చలించిపోయేమనసుండేది. ఓస్నేహితుడిచెల్లెలికికట్నండబ్బు చాలక పీటలమీద పెళ్ళి తప్పిపోతూందంటే అతను ఉచితంగా ఆ స్నేహి తుడికి రెండువేలరూపాయ లిచ్చేసేడు. మన జిల్లా ముఖ్యపట్నానికి కల కత్తానించి అప్సరసవంటి వారకాంత వచ్చింది. మనిషిని నచ్చితేనే రాని స్తుందట. విజయపురి రాజుని ఆవిడ దగ్గిరికెళ్తే మొహంచూసి రావద్దందిట - అని ఎవరైనా వార్త చెప్తే అతను వెంటనే జిల్లా ముఖ్యపట్నానికి వెళ్ళి పోయి, ఆ వారకాంత విజయపురి రాజుని పొమ్మన్నప్పటికీ తనని మాత్రం రమ్మన్నందుకు తెగ పొంగిపోయి, ఆ రాజుకంటే తను ఎక్కువవాడయి నట్టుగా గర్వించేవాడు. జమీన్దారీ పద్ధతిలో పెరిగిన ఆ కుర్రవాడికి చిల్లర రకపు స్త్రీలంటే చిన్నప్పుడే మోహం ఏర్పడిపోయింది. వారిని చూసి అతను పులకరించేవాడు, ఆతణ్ని చూసి వారు కిచకిచలాడేవారు. వారి కిచ కిచలు అతనికి కితకితలుగా ఉండేవి. అయితే అతను తనెంతో మంచి వాణ్ననీ, గొప్పవాణ్ననీ నమ్మేవాడు. అతను చాలా అమాయకుడు. ఎంతో మూర్ఖుడు, ఎంతో చక్కని అందగాడు. అతన్లో తక్కువ గుణాలు ఉండేవికావు. కాని తక్కువ అలవాట్లు మాత్రం ఎక్కువగా ఉండేవి. నక్కలతో చెలిమిచేసి చెడిపోయిన ఆబోతులా ఉండేవాడతను.

పెళ్ళి జరిగిన మర్నాటినుంచీకూడా విశ్వమోహినికీ ఆమె భర్తకీ మధ్య విముఖత్వం ఏర్పడింది. ఓ పెద్ద మహా సామ్రాజ్యానికి చక్రవర్తినిగా ఉండే ఆమె ఓ చిల్లర సామంత రాజుని చూసినట్టుగా చూసింది విశ్వ మోహిని తన భర్తని. ఆ రాత్రి అతను చూపిన చిల్లర నవ్వులూ తక్కువ సరసాలూ ఆమెలో వాంఛని కాకుండా అసహ్యాన్ని రేపేయి. ఆమె ఆ రాత్రి మంచుముక్కలా మంచంమీద ఉండిపోయింది. అత నామెని చూసి చూసి, చివరికి, కొరకంచులా ముఖం మాడ్చుకు కూర్చున్నాడు.

గడ్డకట్టిన చెరువులా విశ్వమోహిని మిగిలిపోతే ప్రవహించే వరదలా ఆమె భర్త కొట్టుకు పోయేడు. అతను సర్వనాశనం అయిపోతాడని, పెళ్ళిజరిగిన అనతికాలంలోనే విశ్వమోహిని తెలుసుకోగలిగింది అయితే, అతణ్ని రక్షించగలిగినశక్తి తనలో ఉన్నదని ఆమె తెలుసుకోలేక పోయింది. తెలుసుకున్న తరువాత - అప్పటికప్పుడే అసహ్యాలూ కోపాలూ పెరిగిపోవడంవల్ల - మెట్టు దిగడానికి ఆమెకి అభిమానం అడ్డొచ్చింది.

పెద్ద డబ్బుకలిగి ఎక్కువగా వివేకంలేని పాతకాలపు భూకామందులు ఏ విధంగా అయితే చెడిపోయేవారో ఆ విధంగానే విశ్వమోహిని భర్త చెడిపోయేడు. విశ్వమోహిని ప్రవర్తన అందుకు ఎంతగానో దోహదమిచ్చింది, అతను చెడిపోయినకొద్దీ ఆమె గర్వంగా సాగింది. ఆమె సాగిన కొద్దీకోపంతో అతను పతనమైపోయేడు.

అతను తాగివచ్చి ఆమె చూపులోని కాఠిన్యాన్ని చూసి క్రుద్ధుడయి ఆమెని కొట్టిననాడు ఆమె ఏడవలేదు. ఆమె, అతన్ని చూసి కోపగించినకంటే ఎక్కువగా అతన్నిచూసి అసహ్యించుకొంది.

అభిమానంగా ఆపాయ్యంగా ఒక్క రెండు మాటల్తో ఆమె అతణ్ణి బాగుచేసుకొని ఉండేది. "తనేదో పెద్ద ఎక్కువదాన్నని చెప్పి దీనికి తెగ గర్వం మనం అంటే నిర్లక్ష్యం" అని అనిపించేది ఆమె భర్తకి. "నేను మీ భార్యని, మీ చరణదాసిని, ఎన్నటికీ మీ కంటే ఎక్కువదాన్నికాను" అని ఆమె అనేసి ఉంటే అతను ఆమె చెప్పినమాట వినేవాడే! బాగుపడగలిగేవాడే! కాని, ఆమె అలా అనలేకపోయింది. ఆమెపై అతను చెయ్యిచేసుకున్నాడు, ఆమె పడగెత్తిన ఉక్కునాగులా అలా నిలబడిందేకాని అతనికి లొంగలేదు. అతను కొట్టినకొద్దీ ఆమె మొండికెత్తేసింది. ఆమె మొండికెత్తినకొద్దీ అతను అత్యాచారాలు ఎక్కువ చేయనారంభించేడు. కొవ్వెబలిసి అయ్యగార్ని ధిక్కరించే నౌకరీవాడ్ని అధికారి చూసినట్టుగా ఆమె నతడు చూసేవాడు. నడమంత్రపు సిరిరాగానే బుద్ధీ జ్ఞానం లేకుండా విర్రవీగిపోయే బండివాణ్ని ఆ వూరి రాజుగారు చూసినట్టుగా ఆమె అతణ్ని చూసేది. ఎలాగైనాసరే ఆమె మదం అణచి ఆమె కొవ్వు కరిగించడానికి

అత నామెని ఎన్నో విధాలుగా అవమానించేడు. సింహాన్ని అవమానించ దానికి గ్రామ సింహం విశ్వప్రయత్నంచేసినా ఫలితం లేకపోయినట్టు, అతని ప్రయత్నాలన్నీ విఫలం అవడమే కాకుండా, పై పెచ్చు అతనేఅవ మానించబడినట్టుగా అవుతూండేది. "నీవుకుక్కవి నీవుకుక్కవి!" అనినిత్యం తనని ఆమె వెక్కిరిస్తున్నట్లుగా అతనికి అనిపించేది. ఆమె పల్లెత్తుమాట అనక పోయినప్పటికి ఆమె చూపు, కుక్కని చూసే ఏనుగుచూపులాగో, సింహం చూపులాగో అనిపించి అతను వెర్రెత్తి పోయేవాడు.

ఆ వెర్రిలో అత నొకసారి తన ఇంటికి నలుగురు స్నేహితుల్ని పిల్చి, అయిదుగురు చెడిపోయిన ఆడవార్ని రప్పించి, రాత్రంతా ఆ అందరి తోనూ కలిసి తప్పతాగి ఆమె కళ్ళముందు విచ్చలవిడిగా తప్పుడు పనులు చేసేడు. ఆమె ఎటు వెళ్ళడానికీ వీల్లేకుండా ఆమె నతను ఆ హాల్లో నిర్బం ధించి తెల్లవార్లూ అక్కడే కూర్చోబెట్టేడు.

అతనికంటె తను ఎక్కువదాన్ననే భావం ఒక్క నిమిషంపాటు అణచుకొని అతణ్ని ఒక్కసారి ఒక్కమంచిమాట అడితేచాలు అతను బాగుపడగలడని అప్పటి కామెకి తెలిసీకూడా ఆమె అతణ్ని బాగుచేసు కోలేక పోయింది. ఆ రాత్రి వాళ్ళనందర్నీ ఆమె ముందు కొంతసేపు రోగక్రిముల్ని శాస్త్రజ్ఞుడు చూసినట్టుగా క్యూరియస్‌గా చూసింది. ఆ తర వాత, వాళ్ళని జంతువుల్ని చూసినట్టు చూసింది. మనిషిని జంతువులు అవ మానించ లేకపోయినట్టు, ఆమెను వారుఅవమానించలేక పోయేరు. పందుల్ని చూసిరాజహంస అసహ్యించుకున్నట్టు వారినిచూసి ఆమె అసహ్యించుకొంది.

జంతువులా, అందులోను హీనమైన బురద జంతువులా తనని తన భార్య చూసేసరికి ఆ తెల్లవార ఝామున ఆమె భర్త పిచ్చికోపంతో పిచ్చి కేకలు వేసేడు. అతని కంఠంలోని నరాలు రబ్బరు గొట్టాల్లా పొంగేయి. రాత్రంతా తప్పతాగి ఉన్నమీదట, ఆ గావుకేకలు వెయ్యడంలో ఆ రౌద్రంలో అతనిది ఏ రక్తనాళం ఎక్కడ తెగిందో కాని అతను కేకలు వేస్తూ వేస్తూ నిలువునా కూలిపోయేడు.

అతనిలా కూలిపోయేసరికి—రాత్రల్లా తప్పతాగి తందనాలాడిన—

నలుగురు స్నేహితులకీ, అయినగురాదవాళ్ళకికూడా నిషా వదిలిపోయింది. ఎవళ్ళ బట్టలు వాళ్ళు లేక, ఒకరి బట్టలొకరు లుమ్మలు చుట్టుకొని ళ్ళ వీధిలోకి పారిపోయి ఆ మసక చీకటిలో కలిసిపోయేరు.

ఆ తరువాత, డాక్టరు వచ్చి విశ్వమోహిని భర్తని చూసి పెదవి విరిచేసేడు.

భర్త చనిపోయిన పదమూడో రోజున విశ్వమోహిని తన తండ్రి గారింటికి వెళ్ళిపోయింది.

తండ్రి ఇంట్లో కూడా విశ్వమోహినికి సుఖం లేకపోయింది. ఆమెకి ఏం చెయ్యడానికి తోచేదికాదు. ఆమె మనసుని భగవంతుడివైపు మళ్ళించడానికి ఆమె తండ్రి చాలా ప్రయత్నం చేసేదేకాని ప్రయోజనం లేకపోయింది. అటు మళ్ళడానికి ఆమె మనసు వప్పుకొంది కాదు.

తనకంటే ఎక్కువవారిని సహించని విశ్వమోహిని, తన కాపురం కాలిపోయిన తరువాత భగవంతుడి ఎక్కువతనాన్ని ఆమోదించ లేకపో యింది. అంతేకాదు. శక్తి సామర్థ్యాలు లేని నాయకుణ్ని ప్రజలు ఏ విధంగా అయితే మెచ్చరో, ఆ విధంగా ఆమె భగవంతుణ్ని మెచ్చుకో లేక పోయింది.

"నా కాపురం బాగుపడ్డానికి మీరు భగవంతుడికి నోళ్ళ మొక్కులు మొక్కేరుకదా నాయనగారు ఏం జరిగింది?" అని ఆమె తన తండ్రిని ప్రశ్నించింది.

పురుషోత్తంగారు జవాబు చెప్పలేకపోయారు.

మంచిని పెంచటానికి భగవంతుడికి శక్తి ఉండయినా ఉండాలి; లేదా, లేకపోయైనా ఉండాలి. నిజంగా ఆయనకి ఆ శక్తే ఉంటే- ఎంత ప్రార్థించినప్పటికీ ఏ మంచీ చెయ్యనివాణ్ని ఎంత ప్రార్థించిమటుకు ఏం లాభం? నిజంగా ఆయనకి ఆ శక్తే లేకపోతే-ఆయన్ని ఎంత ప్రార్థిస్తే మట్టుకు అతనేం చెయ్యగలడు!

అంటూ, నిరుపయోగమైన తండ్రి ప్రార్థనబట్టి భగవంతుడు వట్టి నిష్ప్రయోజకుడని తండ్రికి తెలియజేసింది. విశ్వమోహిని, చేతకానివారూ,

మూఢులూ, దొంగలూ - మూడేరకాల మనుష్యులు భగవంతుణ్ని నమ్మి ప్రార్థిస్తారని ఆమె తన తండ్రికి తెలియజెప్పి పెద్ద వేదాంతులకంటె తెలివైనదాన్లా మాట్లాడింది.

ఆ విధంగా మాట్లాడిన తన పెద్దకుమార్తెనిచూసి పెద్దపులిని చూసి బెదిరినకంటె ఎక్కువ బెదిరేడు పురుషోత్తంగారు. కుర్చీలో నిటారుగా కూర్చున్న తన కుమార్తె ఆయన కంటికి వెండి బంగారాలతో మనోహరంగా చేసి వజ్రాలు పొదిగిన విషనాగులా కనిపించింది. ఆయన జడుసుకొని వారం రోజులపాటు ఏదో ఆలోచిస్తూ కూర్చొని, మతిపోయినవాళ్ళా ఉండిపోయేడు.

తన చెల్లెలు శ్యామల విషయంలోకూడా విశ్వమోహిని ఏమీ పట్టించుకోకుండా కూర్చుంది. శ్యామల వింత ప్రవర్తన గురించి ఆమెకి తెలిసిననాడు అమె వెటకారంగా చిరునవ్వు నవ్వింది. అంతకిమించి ఆమె ఇంకేమీ చెయ్యలేదు. శ్యామల వట్టి అమాయకురాలని ఆమెకిబాగా తెలుసు. తను కలుగజేసుకొని శ్యామలకి మంచి చెడ్డలు బోధించినట్లయితే ఆమె ఇంకోలా ప్రవర్తించి ఉండడానికి అవకాశం ఉండేదని ఆమె తెలుసుకోలేక పోయింది. శ్యామల ప్రవర్తన చూసి అసహ్యం తప్ప ఆమెకి ఇంకేమీ కలగలేదు. ఆ విషయంలో కలుగజేసుకొందికి ఆమె గర్వమే ఆమెకి అడ్డొచ్చింది. కుక్కల జట్టీల్లోకి సింహాలు దిగకుండా దూరంగా ఉన్నట్టు ఇంట్లో ఘోరాలు జరిగిపోతున్నప్పటికీ ఆమె వాటికి దూరంగా ఉండిపోయి తన గది తలుపులు బిడాయించుకొని తన మానాన్న తను కూర్చుంది.

ఓరోజు సాయంకాలం పురుషోత్తంగారు ఎవరో వస్తారని చెప్పి వీధిగదిలో వాలుకుర్చీలో వంటరిగా కూర్చొని వచ్చేవారి రాకకోసం నిరీక్షిస్తున్నాడు.

శ్యామల వచ్చి తండ్రి ప్రక్కన నిల్చొని,

"నాయనగారూ!" అని పిల్చింది.

గుమ్మం అంత ఎత్తు మనిషి శ్యామల; అందులోనూ ఆమె

అక్కలా సన్నగా ఉండేదికాదు. వీధి గుమ్మం అంత వెడల్పుగా ఉండేది. అక్కలా అందంగా లేకపోయినప్పటికీ అక్కకంటె ఆమె గంభీరంగా కనిపించేది.

"ఏవమ్మా?" అని తలెత్తి చూసేరు పురుషోత్తంగారు.

"ఇదిగో, ఈ చీటీ చదువుకోండి!" అంటో వాలుకుర్చీపక్క బల్లమీద ఓచిన్న తెల్లకాయితం మడతపెట్టి ఉంచింది శ్యామల.

"చీటీ ఏవిటి తల్లీ:", అని పురుషోత్తంగారు అడిగేలోపున తాజుగా గంభీరంగా లోనికి నడుచుకు వెళిపోయింది శ్యామల.

ఆ చీటీలో రెండే వాక్యా లున్నాయి. అంతకంటే ఎక్కువ లేవు సాల్లో ఆవుముందు రెండు బాంబులు మాత్రం తెచ్చి పెట్టినట్టు ఆమె తన తండ్రిముందు ఆ రెండు వాక్యాలూ పడేసి వెళిపోయింది.

పురుషోత్తంగారు, గాభరాగా కళ్ళద్దాలకోసం తడుముకొని, పెట్టుకు చదవబోయేరు. కాని, గదిలో చీకట్లోనూ ఆ గాభరాలోనూ ఆయనకేమీ కనిపించింది కాదు. తొట్రుపాటు పడుతూ కిటికీ దగ్గరికిపోయి చదువుకొని అతను గజగజ వణికిపోయేడు.

పలానావాణ్ని "నేను ప్రేమిస్తున్నాను. అతన్ని నేను పెళ్లి చేసుకుంటాను!"

అంతేవుంది ఆ చీటీలో. పురుషోత్తంగారికి మతిపోయినట్లయిపోయింది. ఆయనికి కాళ్లు చేతులు అల్లల్లాడిపోయేయి. ఓ కూతురు విధవరాలైపోయి పాషాణ ప్రతిమైపోయింది. రెండోకూతురు వంశానికీ, కుటుంబానికీ మాయని మచ్చ తెచ్చే విధంగా, ఎన్నడూ ఎవరూ ఎక్కడా కని విని ఎరుగని విధంగా ప్రవర్తిస్తానని భీష్మించు క్కూర్చుంది. అతనికి మనసంతా కలత చెందిపోయి నిప్పుల కుంపటిమీద ఉడికినట్టు ఉడకనారంభించింది.

పురుషోత్తంగారు చాలా మంచివారనే విషయం జిల్లా అంతటికీ తెలుసు. ఆయన తన జమీన్దారీ ఆదాయంలో ఎక్కువ భాగం రైతుల వ్యవసాయాభివృద్ధికి ఖర్చు చేసేరు; పేదవాడలో ఉండేవారికి ఆయన

అనేకమైన సౌకర్యాలు కలుగజేసేరు; అనేకమంది బీద విద్యార్థులకి చదువు చెప్పించేరు? గ్రామంలో హైస్కూల్ నెలకొల్పించేరు; వేద పాఠశాల పెట్టించేరు; నాటక సంస్థలకి విరాళాలిచ్చేరు; తాలింఖానాలకి మదుపు లిచ్చేరు; దాన ధర్మా లెన్నో చేసేరు. ఆయన మంచిపనులెన్నో చేసి ఎంతో మంచివారని పేరు గణించుకున్నారు. ఎవరు వచ్చి "దేహి !" అన్నా ఆయన పొమ్మనలేక పోయేవారు. ఆయన మాట కూడా చాలా నెమ్మదిగా ఎంతో శాంతంగా వినిపించేది. అతను గోవువంటివాడని అందరూ చెప్పుకొనేవారు. అందుగురించి పురుషోత్తంగారు చాలా గర్వించే వారు కూడాను-

కాని ——

శ్యామల రాసిన చీటీ చదువుకున్న క్షణం నుంచీకూడా తను అన్నాళ్ళూ గోవుగా ఉండిపోయినందుకు పురుషోత్తంగారు చింతించ నారంభించేరు. తను సాధు జంతువులా ప్రవర్తించబట్టే తన కూతుర్ని తన అల్లుడు చితగ్గొట్టి అనేక విధాల అవమానించి హింసించ గలిగేడు! తను సాధు జంతువుననే ధీమాకొద్దే ఓ తక్కువ్వాడు తన కూతుర్ని పెళ్ళా డ్డానికి ముందుకు రాగలిగేడు !

పురుషోత్తంగారు మానసికంగా చాలా ఘోరమైన బాధ అనుభ వించేడు. ఆయన మంచివారేకాని ఆయన మంచితనం కులమత విచక్షణ లేని మంచితనం కాదు; ఎక్కువ తక్కువలూ, వంశ మర్యాదలూ పాటిం చని మంచితనం కాదు. ఆయన పేదవాణ్ని ప్రేమించగలిగే వ్యక్తే కాని ఆ పేదవాణ్ని అల్లుడిగా ప్రేమించగలిగిన వ్యక్తి కాదు. బంట్రోతుకి ఆయన మంచి జీతం ఇవ్వగలరు. దయగా చూడగలరు. బాగుచేయ గలరు; అంతేగాని ఆయన వాడికి అర్ధసింహాసనం ఇవ్వలేరు.

పురుషోత్తంగారింట్లో విశ్వాసంగా ఎంతోకాలం పనిచేసి అకస్మా త్తుగా చనిపోయే డొక బంట్రోతు. అతనలా అకస్మాత్తుగా చనిపోవడంతో అతని భార్యా, అతని ఒక్కగాని ఒక్క కొడుకూ దిక్కుమాలిపోయిన ట్లుండిపోయారు. పురుషోత్తంగారి జాలిగుండె వారి దీనావస్థచూసి కరిగి

పోయింది. అందులోనూ ఆ కుర్రవాడు చాలా చురుకైనవాడు. అందు చేత పురుషోత్తంగారు ఆ కుటుంబానికి ఎంతో సహాయంచేసి ఆ కుర్ర వాణ్ని బియ్యేవరకూ చదివించేరు. "ఇంతా చేస్తే పంచని చేరినవాడే కొంపకి నిప్పంటిస్తున్నాడు" అనిపించింది పురుషోత్తంగారికి.

"అయ్యో! మన మంచితనం మన కొంప ముంచిందే!" అని బాధపడినవాడు, అటుపిమ్మట, ఇతరులని బాధపెట్టడానికి జంకడు. అందు చేత—

బంట్రోతు బియ్యే కొడుకుని బతుకులోనిలబెట్టిన పురుషోత్తంగారే ఆ కుర్రవాణ్ని బతుకులోంచి పడగొట్టేరు.

రాత్రి చాలా చీకటిగా ఉంది. మబ్బులు దట్టంగా అలుముకున్నాయి. వర్షం చిక్కగా పడుతోంది. గాలి ఏడుస్తూవచ్చి, ఏడ్చుకుంటూ ఎక్కడికో పోతోంది. పైనుంచీచూస్తే పురుషోత్తంగారి భవనం ఓ పెద్దచీకటి కొండలా కనిపిస్తోంది. ఆ కొండలో ఓవార ఓపెద్ద గుహలో పురుషోత్తం గారు పచారు చేస్తున్నారు. గదంతా చిట్టచీకటిగా ఉంది. తెరచి ఉంచిన కిటికీల్లోంచి ఈదురుగాలి బుసకొడుతూ లోనికి వస్తోంది. పురుషోత్తంగారు బోన్లో బెబ్బులిలా అటూఇటూ తిరుగుతున్నాడు. ఆత్మకర్మ క్షమందేహం క్షాత్రోధర్మ ఇవాస్థితః అన్నట్టు అతను చెట్టంత ఎత్తుమనిషి. అతని తల పెద్దది, భుజాలు పెద్దవి. ఆయన మీసాలే ఉండేవి అటూఇటూ వంగిన కొబ్బరి మట్టల్లాగ! ఆయన చీకట్లో చిన్న పిల్లాళ్ళా పాకిరేడంటే, పెద్ద సైజు పులిలాగో, సింహంలాగో కనిపించగలడు. ఆయనకి ఏనుగు కున్నంత బలం ఉండేది.

"అన్యాయం! అన్యాయం" అని ఎడమ అరిచేతిలో కుడి పిడికిలి గుద్దుకొని అరుచుకున్నారు పురుషోత్తంగారు. గుడ్డెద్దుని చిన్నపిల్లలుకూడా వచ్చి గుద్దులు గుద్దినట్టు జీవితంలో అందరూ తనని అన్యాయం చేస్తున్నారనిపించిందాయనకి. తన మంచితనమే అందుకు ముఖ్యకారణం అని తోచడంవల్ల అతనికి ఆ సమయంలో పిచ్చికోపం వచ్చింది. ఆ రాత్రి ఆ చీకట్లో అతనికి ఏ సోఫావో విరిచేదాం అనిపించింది. బైటకి వెళ్ళి

ఏ చెట్టునో పీకి దూరంగా విసిరేదాం అనిపించించింది. కనిపించిన వాణ్నెవణ్నయినాసరే గుద్దుకి చంపేద్దాం అనిపించింది. అతను కోపంతో కాలిపోతూ చీకట్లో నిప్పుల సింహంలా ఆ చీకటి గదిలో అటూ ఇటూ తిరిగేడు.

ఆ సమయంలో ఓ పెద్దమెరుపు మెరిసింది. ఆ మెరుపులో పురుషోత్తం గారిమేడ వెనుక పెరడంతా పెద్ద వెలుగు వెలిగింది. ఆ మెరుపు వెలుగు ప్రాణంఉన్న వెలుగులా కాకుండా, చచ్చిన ఎండలా, దయ్యపు నవ్వులా, మృత్యువు చూపులా ఉంది. ఆ వికృతపు వెలుగులో పెరటి గోడమీంచి పెరట్లోకి ఓ వ్యక్తి గెంతడంచూసి, ఆగకుండానే ఆ వ్యక్తెవరో పోల్చి, అప్పుడాగేరు పురుషోత్తంగారు.

ఆయన ఆ రాత్రి మెరుపులా ఒక్క క్షణంమాత్రం ఆగి, ఆ తరువాత పిడుగులా విరుచుకు పడ్డాడు. గది తలుపులు గభాల్న తెరుచు కొని వెళ్ళి శ్యామల గది తలుపుకి బైటనుంచి గొళ్ళెం పెట్టేసి, మూడు అంగల్లో మేడమెట్లు దిగి, పెరటి తలుపులు తెరచి పెరట్లోకి పరిగెట్టే డాయన.

ఆ మర్నాడు శ్యామల ప్రియుడి శవం చెరువుగట్టున తుప్పల్లో పడి ఉంది. అతని గుండెలమీది ఎమికలు ఏనుగు అడుగువేసి విరిచేసినట్టు విరిగిపోయున్నాయి. అతణ్ని ఎవరు చంపేరో ఏమిటో ఆచోకీ ఎవరికి తెలియలేదు.

ఈ విషయాలన్నీకూడా విశ్వమోహినికి బాగా తెలుసు. కాని, వాటి గురించి ఆమె ఏమీ పట్టించుకోలేదు చీమల పుట్టలోని చిల్లర అల్లర్ల గురించి మనుషులు పట్టించుకోనట్టు ఆమె ఇంత పిసరైనా పట్టించుకో కుండా తన గదిలో ఏమేమో చదువుకొంటూ కూర్చొనేది.

ఆ తరువాత శ్యామలకి భీమసేనరావుగారితో వివాహం జరిగింది; ఆమె కాపరానికి వెళ్ళింది, పద్మజని కన్నది, ప్రాణాలు తీసుకొంది. ఆ తరవాత పురుషోత్తంగారు పద్మజని తన ఇంటికి తీసుకువచ్చేరు.

పద్మజని చూసేక జీవితంతో కొంత సంబంధం పెట్టుకోసాగింది

విశ్వమోహిని, రెండు మూడు రోజులయి పుట్టిన ఆ చిన్నపిల్లని చూసే సరికి విశ్వమోహినికి తన శక్తి ప్రయోగించి ఫలితాలు చూడ్డానికి వీలుగా ఓ ప్రాణి దొరికినట్టనిపించింది. ఆ చిన్న పిల్లని తను తన ఇష్టానుసారం పెంచవచ్చు ననిపించిందామెకి. దాన్తో, తనకేదో కొత్తబలం వచ్చినట్టుగా ఆమెకి తోచింది.

అప్పటిలోనే ఆమె భీమసేనరావు గురించి ఆలోచించ నారంభించింది. వినికిడివల్ల ఆమెకి తెలిసిన భోగట్టాబట్టి అతన్లో కొన్ని సుగుణా లున్నట్టు ఆమెకి తోచ నారంభించింది, ఓ ఆరు నెలలపాటు ఓ పద్ధతి మీద పద్మజని ఆమె పెంచేసరికి ఆమెకి ఆ విధంగా జీవితంలో ఎవర్నయినా పెంచి తారస్థాయికి తీసుకు పోవాలనే వింతకోరిక కలిగింది. కలగడంతో ఆ కోరిక పెరిగి పెద్దదయింది. ఆమెకి అంతవరకూ జీవితంతో ఏ సంబం ధమూ లేకపోవడంతో ఆమెకి తనా విధంగా పెంచవగ్గవారెవరూ దగ్గర్లో భీమసేనరావుకంటె దగ్గిరవారెవరూ కనిపించలేదు. ఆమె శక్తిసామర్థ్యాలు ప్రయోగించి చూడ్డానికి ఆమె తండ్రి చాలా పెద్దవాడయిపోయాడు. పద్మజ చాలా చిన్నపిల్లయిపోయింది. భీమసేనరావు ప్రయోజకుడనీ, పనికొస్తాడనీ ఆమె కెందుకోగాని నమ్మకం కుదిరిపోయింది. తన శక్తి అతనిమీద ప్రయోగించాలనే కోరిక ఆమెకి కలగడం ఏమిటి - అంతటితో ఆమెకి అతని దగ్గరకి వెళ్ళిపోవాలనే తహతహ రోజురోజుకీ ఎక్కువవ నారంభించింది. ఆమెలోని తీవ్రమైన శక్తికి ఎవరో గట్టువేసి అడ్డుతూ న్నట్టుగా ఆమె గిజగిజలాడ నారంభించింది.

పురుషోత్తంగారు దత్తత చేసుకున్నప్పుడు ఆమె అందుగురించి ఏమీ పట్టించుకోలేదు. ఖర్చుపెట్టుకు తినడానికితప్ప ఆ దత్తుడు మరెం దుకూ పనికిరాడని ఆమెకి తెలిసిపోయింది. భూములమీద వచ్చే రాబడి ఖర్చు చేసుకు తినే కామందులు, కన్నెలతో రాటలకి కట్టేసి ముందు ఇంత గడ్డి పడేస్తే తింటూ కూర్చున్న పనికిరాని ముసలి పశువుల్లా ఆమెకి కని పించ నారంభించేరు. వాళ్ళని చూస్తే ఆమెకి అసహ్యంవేయ నారం భించింది.

తండ్రి చనిపోయినప్పుడు విశ్వమోహిని ఏమంత పెద్దగా విచారించలేదు. ఇల్లు విడిచిపెట్టి భీమసేనరావు దగ్గరికి వెళిపోవడానికి అవకాశం వచ్చినందుకు ఆమె ఓ విధంగా సంతోషించింది కూడాను. శ్యామల పోయిన సరిగ్గా ఏడాదినాడు ఆమె పద్మజని తీసుకొని టాక్సీ చేయించుకొని భీమసేనరావింటికి వచ్చేసింది. తన నాతడు తిరస్కరించ లేడని ఆమె కెందుకో ముందుగానే తెలిసిపోయింది. తన శ్రేయస్సేమిటో తను తెలుసుకోలేనంత అప్రయోజకుడతను కాడని ఆమె గ్రహించ గలిగింది.

అయితే—

ఊళ్ళో అంతా అనుకున్నట్లుగా భీమసేనరావుతో విశ్వమోహిని తప్పుగా వ్యవహరిస్తోందనుకోడం చాలా తప్పు. తెలివైన విద్యార్థుణ్ని ఆచార్యుడు అభినందించి ప్రోత్సహించినట్టు ఆమె అతణ్ని ప్రోత్సహించి వ్యవహరించిందే కాని అంతకి భిన్నంగా ఎన్నడూ వ్యవహరించలేదు.

అయితే-

భీమసేనరావు ఆమెను తప్పుగా అర్థం చేసుకొని ఆమె యెడల అత్యాచారం చేయడానికి సంకల్పించకపోలేదు. ప్రయత్నం చేయక పోలేదు.

ఓనాడు రాత్రి ఒంటి గంటకి తాగివచ్చి అతను ఆమె గదిలోకి చొరబడ్డాడు. అటువంటి ప్రమాదం- మగవారు పశువులు కాబట్టి—ఎప్పుడైనా జరగవచ్చునని విశ్వమోహిని తలంచకపోలేదు. అందుగురించి ఆమె ముందుగా జాగ్రత్తపడేఉంది కూడాను. ఆ రాత్రి అతను తాగివచ్చి మీదని పడబోయేసరికి ఆమె తప్పించుకొని మెరుపులా ఓ బాకుతీసి అతణ్ని అడుగు ముందుకి వెయ్యకుండా చేసింది. ఆమె కనుబొమ్మలు కత్తుల్లా ఉన్నాయి. ఆమె చూపులు మెరుపు బాకుల్లా ఉన్నాయి. ఆమె ముక్కు ఉక్కు చాకులా ఉంది. ఆమె పెదవులు వంకర కైజారుల్లా ఉన్నాయి. ఆమె నిల్చోడం తీరు చూస్తే ఆమె ఆ సమయంలో ఓ విచ్చు కత్తిలా ఉంది.

ఆ విధంగా ఆమెను చూసిన భీమసేనరావు తిరిగి మరెన్నడూ ఆమెని అగౌరవ పరచలేదు. ఆ దినం నుంచీ ఆమెని పూర్తిగా అర్థం చేసుకొని ఆమె నతను ఎక్కువగా గౌరవించడం నేర్చుకున్నాడు.

విశ్వమోహినికి పౌరుషం ఎక్కువ. ఆమెకి దేహసంబంధమైనవాంఛలు కలిగినప్పటికీ, అటువంటి వాంఛలు చాలానీచమైనవని ఆమెకి అభిప్రాయం ఏర్పడ్డంవల్లఆమె ఆవాంఛల్ని తీవ్రమైన ప్రయత్నంచేసి వాటిని చల్లార్చి చంపుతుంది. ఒకనాటిరాత్రి ఆమె ఆ వాంఛల తాపానికి ఓర్వలేక తలుపు తీసుకొని వెళిపోయి భీమసేనరావు గది తలుపు తట్టి లోనికి వెళిపోదాం అనుకొంది. కాని, "ఛీ"అని తననిచూసి తనుఅసహ్యించుకొని, వెంటనే పక్క క్రింద దాచిన కైజారు తీసి జబ్బమీద పొడుచుకుని బలబలకారే రక్తాన్ని చూచుకుంటూ కొంతసేపు ఉండిపోయిందామె, కొంతసేపయాక ఆమెలేచి వెళ్లి ఆ గాయాన్ని చన్నీటితో కడుక్కొని ఆ జబ్బకి కట్టు కట్టుకొని కళ్ళు మూసుకొని హాయిగా నిద్రపోయింది.

దేహసంబంధమైన అవినీతికి విశ్వమోహిని ఎందుచేతనోగాని దిగజారలేకపోయింది. ఆ విధంగా ప్రవర్తించడం అది "దిగజారిపోడమే" అవుతుందనే భావనే ఆమెని దిగజార్చకుండా నిలబెట్టి ఉండవచ్చు. ఏ విషయంలోనైనాసరే తనకంటె ఎక్కువ్వాడు త్రిలోకాల్లోనూ ఎక్కడా లేరనే ఆమె మనోగర్వం ఆమెకి - అగ్నిశిఖకి ఉండేటటువంటి-భయంకరమైన అందాన్ని తెచ్చి పెట్టింది. తన మనసు దోచుకోగలిగిన వ్యక్తెవ్వరూ ఆమెకి కనిపించలేదు. భగవంతుడు దిగివచ్చి ఆమె పొందు కోరినట్లయితే ఆమె అతడి గుండెల్లో బాకు గుచ్చి చుక్క చుక్కచొప్పునా అతన్లోంచి అంత రక్తమూకారి అతడు చచ్చేవరకూ అక్కడ నిలబడి చూడగలదు. పురాణాల్లోకాని చరిత్రలోకాని తనని మించినవారెవరూ ఎక్కడా లేరనే భావనతో ఆమె మంచు శిఖరంలా నిప్పుల గోపురంలా నిలబడింది.

భీమసేనరావుగారికి ఒకొక్కప్పుడు విశ్వమోహిన్ని చూసి భయం వేస్తుంటుంది. కాని అతను ఆమె ప్రోత్సాహంవల్లనే ముందుకు వెళ్ళగలి

గేడు. ఆమె అతని అన్ని వ్యవహారాల్లోనూ జోక్యం కలిగించుకొని అన్నింటిలోనూ అతనికి సలహా లిచ్చేది. ఫలానా విధంగా "చెయ్యండి?" అని ఆమె చెప్పడం తడవుగా ఆ ప్రకారం అతను చేసేవాడు. అగ్గిపెట్టెల కంపెనీ ఎవరిది? అని ఓ సారి ఆమె అడిగింది. ఫలానావారిది అని అతను జవాబు చెప్పేడు. అతను మీ కంటే ఎక్కువ్వాడా అని ఆమె అడిగింది. అతనికి అవకాశా లెక్కువ అని అతను సమాధానం చెప్పుకున్నాడు, అవ కాశాలు కల్పించుకొంటేనేగాని రావని ఆమె అతనికి తెలియజేసింది. దాన్తోనే అతను ఖండసారీ చక్కరలోకి దిగేడు. అక్కణ్నించి చక్కర ఫ్యాక్టరీలోకి ఎక్కేడు. ఆ విధంగా అతను జీవితంలో ముందుకి సాగేడు.

అభివృద్ధి చెందేరు భీమసేనరావుగారు. కాని, విశ్వమోహినికి సంతృప్తి కలగలేదు. ఆమె ఒకసారి పండిత నెహ్రూని చూడ్డం తటస్థిం చింది. ఆయన తన చేతిలో వ్యక్తే అయినట్లయితే అయినకంటె ఆయన్ని ఎంతో ఎక్కువచేసి ఉందునని ఆమె అభిప్రాయపడింది. ఛేర్మన్ భీమసేన రావుని కనీసం ఆ పాటి వ్యక్తిగానైనా తను చేయకపోయినందుకు ఆమె చాలా చిరాకు పడింది. మానవ ప్రపంచాన్నంతా మార్చగలిగిన శక్తి సామార్థ్యాలు తనకి ఉండీకూడా ప్రయోజనం లేకుండా పోతోన్నందుకు ఆమె కోపంతో కుతకుతలాడింది.

కొన్నాళ్ళకి కాని ఆమె తిరిగి సర్దుకోలేక పోయింది. తరవాత యధా ప్రకారం భీమసేనరావుగారి జీవితాన్ని సరిదిద్దడంలో ఆమె నిమగ్నురాలయి పోయింది. కొన్నాళ్ళక్కాకపోతే కొన్నేళ్ళకైనా తను ఆశించినంతగా భీమసేనరావు అవడా అనే ఆశతో ఆమె వదులుకోకుండా పనిచేస్తూనే ఉంది.

అందుకే, ఆ రోజున ఛేర్మన్ భీమసేనరావుగారి ఫొటో పేపర్లలో పడినందుకు ఆమె ఎక్కువ గర్వించలేకపోయింది. ఆమెకి ఒక చిన్న నిట్టూర్పుడు సంతృప్తి మాత్రం కలిగింది.

కాని, మిస్ ప్రేమ మాత్రం ఆ రోజున గర్వంతో కొండంత ఎత్తు ఎదిగిపోయింది. తండ్రికి జరిగిన ప్రమాదం గురించి పేపర్లలో వార్త పడ గానే ఆ రోజున ఇంటికి టెలిగ్రాంలు కుప్పలుకుప్పలుగా వచ్చిపడ్డాయి.

మినిష్టర్లూ జడ్జీలూ కలక్టర్లే కాకుండా ముఖ్యమంత్రికూడా సానుభూతి తెలుపుతూ టెలిగ్రాం పంపించి, ఛైర్మన్‌గారికి భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యాలు ప్రసాదించాలని తను నిత్యం ప్రార్థిస్తూన్నట్టుగా ఆ టెలిగ్రాంలో తెలియజేసేరు.

ఆ రోజున, అసలు, కాలేజీకి వెళ్దామని మిస్ ప్రేమ అనుకోలేదు. హాయిగా ఆస్పత్రిలో ఉండిపోదామనుకొంది. కాని, అన్ని టెలిగ్రాంలు వచ్చేక, కాలేజీకి వెళ్ళకుండా ఉండలేకపోయింది. కారు దిగి, ప్రిన్సిపాల్ గారి రూంపక్కనే ఉండే గర్ల్సు వెయిటింగ్ రూంకి ఆమె ఇంకా వెళ్ళకుండానే ప్రిన్సిపాల్‌గారు ఆమెని రమ్మని కేకవేసేరు. చిరునవ్వు నయాపైసంత నవ్వి వెంటనే రూపాయంత సీరియస్‌గా అయిపోయింది మిస్ ప్రేమ గదిలోకి వెళ్ళి! ఆమెని కుర్చీలో కూర్చోమన్నారు ప్రిన్సిపాల్‌గారు. ఆయన ఖద్దరుసూట్లో ఉన్నారు. ఖద్దరు సూటుమాత్రం వేసినప్పటికీ అప్‌టుడేట్ అమెరికన్ ఫాషన్సు అన్నీకూడా తెలుసుననే గర్వం ఆయనకుంది. మిస్ ప్రేమకి ఆయన రెండు నిమిషాల్లో రెండు టన్నుల సానుభూతి చూపించేడు. “నిన్న ఆస్పత్రికి వెళ్ళేను పద్మా! నువ్వు అప్పుడే, జెస్టుదెన్, ఇంటికి వెళ్ళేవుట. డాడీ చెప్పేరు” అన్నారు ప్రిన్సిపల్‌గారు. “థాంక్సండీ” అంది మిస్ ప్రేమ థాంక్సుచెప్పక. ఛీఫ్ మినిష్టర్‌గారుకూడా టెలిగ్రాం పంపించినట్టు ప్రిన్సిపాల్‌గారికి తెలియ జేసింది మిస్‌ప్రేమ, అయామ్ వెరీ హాపీ అయామ్ వెరీ హాపీ అన్నారు ప్రిన్సిపాల్‌గారు. ఖద్దరు సూటునిండా సూటుడు సంతోషాన్ని ఆ రూంలో కుర్చీలో విడిచిపెట్టి బైటకి వచ్చింది మిస్ ప్రేమ. కాలేజీగర్ల్సు అంతాకూడా పద్మజ చుట్టూమూగి ఆక్సిడెంటు గురించి ఎన్నో విశేషాలడిగేరు. అయ్యో ఆక్సిడెంటులో నేనుకూడా ఉంటే ఎంత బాగుండునో కదా అనిపించేసింది మిస్ ప్రేమకి. లెక్చరర్లంతా కూడా మీ డాడీ ఎలా వున్నారంటే మీ డాడీకి ఎలా ఉందని, ఒక్కరైనా మిస్ అవకుండా అంతాకూడా మిస్ ప్రేమని అడిగి తెలుసుకున్నారు. అందులో ఒక లెక్చరరు - అతనికి ఇంకా పెళ్ళి కాలేదు - ఆయన ఆ మర్నాడే లీవింగ్ ఫర్ స్టేట్సు ట. “రేపు ప్లేనుమీద ఢిల్లీ వెళ్ళి అక్కణ్ణించి

ఐ విల్ బి లీవింగ్ బై ప్లేన్ ఎగన్ ఇన్ ఎ కపుల్ ఆఫ్ డేస్ నే నక్కడికి వెళ్ళేక ఐ విల్ బి రైటింగ్ టు యు. మీ డాడీకి ఎలా వుందో తప్పకుండా రాయి. ప్లీజ్ రిమెమ్బర్ మీటు హిమ్, సో....సో లాన్గ్ దెన్! బై బై!" అంటూ 'గ్రేస్‌ఫుల్' గా 'బో' చేసి ఆయన టకటక వెళిపోయేడు. సంతోషంతో ఏం చెయ్యాలో తెలియని మిస్ ప్రేమ తన కుడి జడని ముందుకి వెనక్కి ముప్పయిసార్లు తిప్పింది. చాలామంది బాయ్ స్టూడెంట్సుకూడా సారీ ప్రేమ అంటే సారీ ప్రేమ అంటూ సానుభూతి తెలియజేసేరు. ఒక్క గిరిజే కనిపించలేదు. సారీ చెప్పలేదు. పోన్లే! నా పాప్యులారిటీ చూసి దానికి జెలసీ! సారీ చెప్పిన బాయ్స్ అందరికీ థాంక్స్ చెప్పి ఎంతో మురిసిపోయింది మిస్ ప్రేమ. అందులోనూ టెన్నిస్ ఛాంపియన్ హిమ్మత్ సింగూ ఎస్‌రన్నర్ హైదర్ అల్లీకూడా ప్రత్యేకంగావచ్చి డాడీ గురించి అడిగి, పంజాబులోనూ, హైదరాబాద్‌లోనూ జరిగే కార్ ఆక్సిడెంట్సు గురించీ అమెరికాలో జరిగే కార్ ఆక్సిడెంట్సు గురించీ ఆమెతో ముచ్చటించేరు. వారితో కిలకిలనవ్వుతూ మాట్లాడిన మిస్ ప్రేమ వారిస్పెషల్ ఇన్టరెస్టు గురించి తల్చుకొని కిచకిచలాడి పోయింది. అంతలో ఆమెకి భానీ గుర్తుకొచ్చాడు.

కాలేజీనుంచి వేగిరం, పదకొండున్నరకే బయల్దేరేసింది మిస్ ప్రేమ. తన ప్రాముఖ్యత ఫీల్ అవడానికి కాలేజీకి వెళ్ళిందేకాని ఆ దినం చదువుకొందామని కాలేజీకి వెళ్ళలేదామె. ఆస్పత్రిలో సానుభూతి 'షో' మిస్ కాకుండా ఉండేందుకు ఆమె కారెక్కి అటుదారి తీసింది. అప్పుడామెకి గుర్తు కొచ్చింది.

ఇంతమంది సానుభూతి తెలియజేశారు కాని భానీవే రాలేదు.

భవానీశంకర్ ప్రసాద్‌ని మిస్ ప్రేమ ముద్దుగా ప్రేమగా 'భానీ' అని పిలుస్తుంది. అలా పిలవడానికి వీలుగా అతనికి పేరుండడం అతని యెడల ఆమెకిఉండే ప్రేమని ఎక్కువ చేసింది. భానీ అనే పేరు 'ఎక్సొటిక్'గా అదేదో ముస్లింపేరులా, పార్సీపేరులా, స్వీట్ సింధీ పేరులా సహానీతో రైమ్‌చేసే పంజాబీపేర్లా, ఏంతోచక్కని ఇటాలియన్ పేర్లా "ఎంతో చక్కగా ఉందికదూ, భానీ?! "అంటూంటుంది మిస్ ప్రేమ.

ఛానీ గురించి ఆలోచిస్తూ కారునడుపుతు వెళ్తోంది మిస్ ప్రేమ.

తను అంతగా ప్రేమించే ఛానీ, తన తండ్రికి అంత ప్రమాదం జరిగినా కూడా రాలేదు!

మిస్ ప్రేమ మనసు నిజంగా చాలా చివుక్కుమంది.

నిజంగా తను ఛానీని ప్రేమిస్తోందంటే ఛానీకి నిజంగా ఎంతో అదృష్టం అన్నమాట! అయినా కూడా, రావడం మానీసేడు!

ఛీ! అనుకొంది మిస్ ప్రేమ. ఛానీ గురించి ఆలోచిస్తూ చాలా కోపంగా ఆస్పత్రికి వెళ్ళిందామె.

కాని, అక్కడ నల్లనర్సుని చూడగానే మాత్రం ఆమె కోపం అంతా పటాపంచలై పోయింది.

భీమసేనరావుగారి రూంలోంచి నల్లనర్సు బైటకి వస్తూ పద్మజని ఆపి, "మీ డాడీని డిస్టర్బ్ చెయ్యక, నాతో ఇట్రా!" ఆమెని రెక్క పట్టుకొని తీసుకువెళ్ళి కారిడర్‌లో ఓ కార్నర్లో ఉన్న తన కుర్చీలో కూర్చోబెట్టింది.

"ఇదేంటి నర్స్? మా డాడీని చూణ్నివ్వకండా నిన్నా ఆపేసేవు ఇవాళా ఆపేసేవు!", అంది పద్మజ.

"మీ డాడీ 'నిద్రపోతాను, లేపొద్దూ', అన్నారు, అల్లరిపిల్లా!" అంటూ చనువుగా చెప్పింది నల్లనర్సు.

ఆమె చనువు తీసుకున్నందుకు ఆశ్చర్యపడలేదు పద్మజ. ఆ నర్సు తను పద్మకంటె ఎంతో పెద్దదాన్లా పద్మతో చనువు తీసుకొంది. ఆమెకి మహ ఉంటే ఓ పాతికేళ్ళుంటాయేమో.

"అన్నట్లు, నీ పేరేంటో అడిగింది మా ఆంటీ" అంది మిస్ ప్రేమ.

"మీ ఆంటీ పేరేంటసలు?"

"విశ్వమోహిని."

"ఆంటీ అంటే నీకు ఎలాంటి ఆంటీ?"

"మా అమ్మకి అక్క"

"సరి, బావుంది. నువ్వేం చదువుతున్నావ్?"

"ఫస్టు బియ్యే!"

"మరి నా పేరేంటో మీ ఆంటీ అడగమంటేనే కాని అడగలేవా నువ్వు" అని నవ్వుతూ అడిగింది నర్సు.

నల్లనర్సు కుర్చీలో కూర్చోకుండా, వంగొని అక్కడ బల్లమీద కాయితాలేవో నింపుతూ పద్మజతో మాట్లాడుతోంది.

"సరేలే! నేనే అడుగుతున్నాను. నీ పేరేంటో చెప్పు." అంది పద్మజ.

"చెప్తే నాకేంటిస్తావ్?" అంది నల్ల నర్సు.

పద్మజ నవ్వేసి ఊరుకొంది.

"ఏయ్, అల్లరిపిల్లా! పేరు చెప్తే నాకేంటిస్తావ్?"

"ఏమీ ఇవ్వను" అంది పద్మజ.

"అయ్యకి కూతురివే!", అంది నల్ల నర్సు.

పద్మజ తత్తరబోయింది.

"ఏం? ఏం?" అంది.

నల్లనర్సు మాట్లాడలేదు.

"ఏం; 'అయ్యకి కూతురివే' అని ఎందుకన్నావు?" అని మళ్ళీ అడిగింది పద్మజ.

"చెప్తే ఏంటిస్తావు?" అని మళ్ళీ అడిగింది నల్లనర్సు.

సమాధానం చెప్పకుండా మళ్ళీ ఊరుకొంది పద్మజ.

"ఏయ్, అల్లరిపిల్లా! అయ్యకి కూతురివేనని అందుకే అన్నాను. 'మీకు నూటారు డిగ్రీల జొరం ఉంది, రెండు డిగ్రీలిద్దురూ నాకు.' అంటే ఇవ్వరు మీ డాడీ! తెలిసిందా, అల్లరిపిలా!" అంది నల్లనర్సు.

ఆ మాట విని ఏం చెయ్యాలో తెలియక వెర్రినవ్వు నవ్వింది పద్మజ.

"అంచేత - నీ కా రొద్దు, నీ డాడీ ఒద్దు, నీ బంగళా ఒద్దు,

నాకేం ఒద్దు - ఓ కప్పు కాఫీ ఇప్పించి: నా పేరు చెప్తాను." అంది వల్లి నవ్వు నవ్వుతూ.

"లేకపోతే, చెప్పవా?"

"చెప్పను."

"చెప్పకపోతే మరో నర్సు నడుగుతాను."

"నర్సులంతా కట్టు. చెప్పరు."

"అయితే, డ్యూటీ డాక్టర్నడుగుతాను."

"అంతేకాని కాఫీ ఇవ్వవు?"

"ఇవ్వను."

"అయితే, డ్యూటీ డాక్టర్నడిగి చూడు, చెప్తాడేమో చూదాం."

"చెప్పడా?"

"లంచం ఇస్తేగాని చెప్పడు."

"ఏం లంచం?"

"సాయంత్రం తన్తో సినిమాకిరమ్మంటాడు. రా, అక్కడి అందరి నర్సుల పేర్లూ చెప్తానంటాడు. ఆడితో సినీమాకి వెళ్తావా?"

"వెళ్తే వెళ్తాను."

"అయితే వాణ్నడుగు. చెప్తే చెప్తాడు. సాన్దాన్తో; ఎవడో వెళ్ళి 'సానమ్మా నీ మొగుడు చచ్చేడే అన్నాట్ట అంటే సానమ్మ ఏంటందో తెలుసా?"

"తెలీదు చెప్పు"

"చెప్తే ఏంటిస్తావ్?"

"అబ్బ! చెప్పు నర్స్!"

"కాఫీ ఇప్పిస్తావా?"

"ఇప్పిస్తాను. చెప్పు"

"అలా దారికిరా!"

"మొగుడు చచ్చేడంటే సానమ్మ ఏంటంది?"

"తప్పు! అలాంటి సంగతులు నువ్వు వినకూడ దల్లరిపిల్లా!" అంటూ సీరియస్‌గా ముఖంపెట్టి ఫక్కున నవ్వింది నల్లనర్సు.

"అబ్బ, చెప్పు నర్స్!"

"నర్సెస్‌ని సిస్టర్సనాలి."

"చెప్పు సిస్టర్!"

"ఛీ! నేన్నీకు సిస్టర్నికాను."

"అబ్బ, చెప్పు నర్స్!"

"సానమ్మ ఏంటందో మర్చిపోయేను."

"అయితే కాఫీ యివ్వను."

"మీ డాడీ పద్దులో ఓవల్టిన్ తెప్పించుకు తాగేస్తాను. లేకపోతే, మీ డాడీ రూంలో హార్లిక్స్ కలుపుకు తాగేస్తాను. ఏం?" అంది నవ్వుతూ నల్ల నర్సు.

పద్మజ ఏడుపుముఖం పెట్టుకుంది.

"సానమ్మ నీలా ఏళ్లేదు."

"మరేం చేసింది?'

"చెప్పను."

"అబ్బ చెప్పు నర్స్!"

"మొగుడు చచ్చేడంటే" ఏ వీధి మొగుడూ!" అని అడిగిందంట తెలిసిందా?"

అటువంటి మాటలు కాని, సామెతలు కాని అంతకు ముందెన్నడూ వినకపోడం చేత పద్మజకి తెగ నవ్వొచ్చింది.

"అంచేత ఏంటంటే: డ్యూటీ డాక్టర్‌ని నా పేరడిగితే, 'ఏ వార్డులో నర్సు' అని అడుగుతాడు. నువ్వు నా ఫొటో ఇచ్చినా నా పేరు చెప్పలేడు. తెల్సిందా అల్లరిపిల్లా?"

"అయితే నీ పేరు చెప్పవన్నమాట" అంది పద్మజ.

అంతలో ఓ ఆయా వచ్చి నల్లనర్సుతో, "అమ్మా నాలుగో నెంబ ర్రూం బాబుకి కట్టు జారిపోతూందంట రమ్మంటున్నాడు" అని చెప్పింది.

"ఏమ్‌! ఆయా, ఈవిడ పేరేవిఁటి?" అని ఆయాని నల్లనర్సు పేరేవిఁటని అడిగింది పద్మజ.

"ఆ అమ్మ పేరేదో ఆ అమ్మకి తెలదేంటి?" అంటూ నవ్వేసింది ఆయా.

"కట్టుజారిపోతే, డాక్టరొస్తాడన్చెప్పు. అంతగా అయితే నేనా తర వాతొస్తాను. నువ్వు బేగిక్కడ్నించి పారిపో!", అని ఆయాని పంపించేసి పద్మజవైపు తిరిగి.

"ఏది నా కాఫీ?" అని అడిగింది నల్ల నర్సు.

"ఇస్తాలే?"

"ఎప్పుడు?"

"ఇప్పుడే ఇస్తాను."

"అయితే చూడు, నా పేరు చెప్పేదా?"

"నన్ను రాధమ్మ కూతురంటారు."

"అది నీ పేరా?"

"నా పేరదికాదు. అమ్మకూతురని ఎక్కడైనా పేరుంటుందా, అల్లరి పిలా?!"

"మరైతే నీ పేరేమిటి?"

"మంగ"

"మంగా?"

"ఏం? మొహం అలా పెట్టేవు? పేరు బావులేదేంటి?"

"అబ్బే! పేర్లో ఏముందిలే?" అనేసింది పద్మజ.

"పోనీ, మనిషిని బావున్నానా అని?" నవ్వుతూ అడిగింది మంగ.

పద్మజ కొంతసేపు ఆలోచించింది.

"చెప్పనా? అని నెమ్మదిగా అడిగింది.

"చెప్పు!" అని అడిగింది మంగ.

"చెప్తే ఏమిస్తావ్" అని పెంకెగా అడిగింది పద్మజ.

"ముందో ముద్దిస్తాన్" అంటూ పద్మజ వాదించేలోపున ఆమె బుగ్గ మీద గట్టిగా ముద్దు పెట్టుకొని, "బావున్నావని చెప్తే మరో రెండు ముద్దులు- ఇంకా మంచివి ఇస్తాను" అంది మంగ.

పద్మజ తెగసిగ్గుపడింది. ఆమెకి కితకితలు పెట్టినట్టయింది.

"బావున్నానా లేదా? చెప్పు" అని బుగ్గపట్టుకొని నెమ్మదిగా గిల్లింది మంగ.

"అబ్బ నన్ను ముట్టుకోకు" అంది పద్మజ.

"ఓయబ్బ! ఇలాంటోళ్లే ఆదోరం ఒస్తే ఒళ్ళోపడుకొని రోజల్లా ముద్దులెట్టించుకుంటారు?" అని పద్మజ మరో బుగ్గమీద మరో ముద్దు పెట్టుకుంది నల్ల నర్సు.

పద్మజ ముఖం ఎఱ్ఱబడింది.

"అంచేత, వేగిరంచెప్పీ! చెప్పకపోతే మళ్ళీ ముద్దెట్టుకుంటాను. నువ్వు ముద్దొస్తున్నావు. మొగోణ్నయితే పెళ్ళాడేసుందును నిన్ను, ఆడ దాన్నయిపోయేను. కాబట్టి, పెంచుకుంటాను. ఒస్తావా?" అని కిలకిల నవ్వింది నల్ల నర్సు.

పద్మజకి సంభాషణ మరో దారికి మళ్ళిస్తే బావుండుననిపించింది.

"ఇందాట్లో నువ్వు మా డాడీ రూంలోంచి ఒస్తున్నప్పుడు ఎలా ఉన్నావో చెప్పనా?" అని అడిగింది.

"చెప్పు చెప్పు! నా బంగారు తల్లివి కదూ! వేగిరం చెప్పు!"

"నల్లటి గుఱ్ఱానికి తెల్లటి జీనువేసి తెల్ల తురాయి పెట్టినట్టున్నావు."

"బలేబలే!" అని నవ్వింది నల్ల నర్సు.

"నిన్న మొదటిసారి చూసినప్పుడు నాకేం జ్ఞాపకం ఒచ్చిందో చెప్పనా?"

"మంచిదే అయితే చెప్పు."

"నల్లటి మంచి రోజ్‌వుడ్ మంచంమీద తెల్లగా మెత్తగా వేసిన దూది పరుపు జ్ఞాపకం వచ్చింది:"

పద్మజ మాటలకి మంగ విరగబడి నవ్వింది. నవ్వి నవ్వి ఆ తరువాత ఇంకా నవ్వుతూ

"ఆడదానివి కాబట్టి ఏం జ్ఞాపకం వచ్చినా ఇబ్బందిలేదు. నన్ను జూసేస్సరికి జీనేసిన గుర్రాలూ పరుపులేసిన మంచలూ మొగోళ్ళకి గ్యాపకం వస్తాయిస్మీ!" అంది మంగ.

అందులో అర్థం కొంతకొంతగా బోధపడి సిగ్గుపడింది పద్మజ. బాగున్నావని చెప్పకపోయినందుకు నల్ల నర్సు బాధపడిందేమోనని ఆ బాధ తగ్గించడాని కన్చెప్పి

"నీ కళ్ళెంతో బావున్నాయి. మా ఆంటీ కళ్ళు నీ కళ్ళలాగే ఉంటాయి" అంది పద్మజ.

"నా కళ్ళు బావున్నాయా?"

"ఊఁ"

"ఏయ్ అల్లరి పిల్లా!"

"ఆఁ"

"ఆడదానికి కళ్ళెందుకు, ముక్కెందుకు, నోరెందుకు? చెప్పు చూదాం!" అంది నల్ల నర్సు.

అంత సింపుల్ ప్రశ్నకి సమాధానం చెప్పలేక తెల్లబోయింది పద్మజ.

ప్రశ్న వేసిన నల్ల నర్సే అప్పుడు జవాబు కూడా చెప్పింది.

"అయన్నీ మొగుడికోసం!! తెలిసిందా?"

తెలిసిందన్నట్టుగా నవ్వేసింది పద్మజ.

"కాని, ఇదిగో, ఇలా చూడు!" అని పద్మజని తనవైపు చూడమంది మంగ.

పద్మజ ఆ ప్రకారం ఆమెవైపే చూసింది.

"అయన్నీ అందంగా ఉన్నాయా లేవా అని మొగోడు చూడ్డు! మొగోడికి నిండుగా ఉన్న ఆడదే కావాలి! తెలిసిందా? ఆ ఎర్రటి

కుఱ్ఱోడు నీ కళ్ళు చూసి నిన్ను వలిచేడను కొంటున్నావేంటి ? నీ కళ్ళు బాగులేవు. కాని ఆ కుఱ్ఱోడు నిన్ను వలిచేడు !"

పద్మజకి మంగ మాటలు అర్థంకాలేదు. మంగ చెప్పుకుపోతోంది.

"కాని చూడు ! మీ డాడీకి, పేరుకి పెద్ద ఏక్సిడెంటేకాని చిన్న పిసరు దెబ్బయినా తగల్లేదు. అయినా అన్నిమాట్లు చూడ్డానికొచ్చేవుకదా! నిన్ను నచ్చిన కుఱ్ఱోణ్ణి ఒక్కసారైనా ఎళ్ళి చూసేవు కావేవిఁ ? మరెవర్తో ఎఱ్ఱటి పిల్ల అక్కడ కూచుంది. ఎగరేసుకు పోగల్దు జాగ్రత్త! చక్రాల్లా కళ్ళూ పిల్లా చక్కగానే ఉంది. ఆడది, గుఱ్ఱంలాగా పరుపులాగా ఉండాలన్నావు ! ఆ పిల్ల అలాగ్గే ఉంది. దాని కళ్ళనిండా ఆశే ఉంది ఇంకేం లేదు. అందులోనూ యీ కుఱ్ఱోడు గుమ్మగా ఉన్నాడుకూడాను. ఆ ఎఱ్ఱపిల్ల కళ్ళల్లో నీకు డేంజరు సిగ్నలుంది. అంచేత ఆలస్యం చెయ్యకు, నేనే నువ్వయితే ఈపాటికి కుఱ్ఱోడి రెక్కుచ్చుకు ఏ కొండ మీదికో తీసుకుపోయి తాళి కట్టించేసుకునుందును ! చక్కగున్నాడు ! మంచోళ్ళా ఉన్నాడు. మంచోడవడం మరీ డేంజరు ! ఆస్పత్రినిండా చుట్టూ జెనం ఉన్నారు కాబట్టి కాని లేపోతే ఆ చక్రాల కళ్ళపిల్ల నీ కుఱ్ఱోణ్ణీపాటికి గుండెల కత్తుకొని కోకలో దాచేసుకొని ఇంటికి పట్టుకు వెళ్ళిపోనన్నమాట. మన కళ్ళముందు ఏ ఆడదైనా మొగోడి వైపు కన్నెత్తి చూసిందంటే చాలు, దాని కార్డియోగ్రాపు నేను లాగీ గల్ను ! అంచేత, అసలోణ్ణి అవతల్దానికి విడిచిపెట్టేసి ఇక్కణ్నువు డాడీ చుట్టూ తిరుగుతున్నావంటే, అల్లరిపిల్లా ? ! అయ్యో ! నువ్వు వెఱ్ఱి పిల్ల లాగున్నావే అల్లరిపిల్లా ! మీ డాడీకేం భయంలేదు. మేఁవంతా ఉన్నాం. మీ డాడీ తక్కువోడు కాడు. పదిమంది మేట్రన్లు కనిపెడుతూ కాపలా కాసినా యాభైమంది నర్సుల్ని మంచంకింద దాచీగల్డు ! అయితే, నువ్వు ఇక్కడ లేకపోతే మేం మీ డాడీని ఎగరేసుకు పోవుఁ ! కాని, నువ్విక్కడ కెళ్ళకపోతే నీ కుఱ్ఱోణ్ణి ఆ ఎఱ్ఱపిల్ల మాత్రం తప్పకుండా ఎగరేసుకుపోద్ది !" అంటూ గబ గబా ఏమేమో చెప్పుకుపోయింది నల్ల నర్సు.

పద్మజ తెల్లబోయింది; ఆ తరవాత ఎర్రబోయింది; :ంగ కళ్ళ లోకి భయపడుతూ చూసి తల దించుకుంది.

ఆ మార్పులన్నీ కనిపెట్టిన మంగ మాటాడకుండా ఊరుకొని, కాయితాలు రాయడం పూర్తి చేసుకొని, అవన్నీ సరిపెట్టుకున్నాక, బల్ల మీద కూర్చొని పద్మజ గడ్డం పట్టుకు పైకెత్తి తనవైపు తిప్పుకొని,

"ఏం ? అల్లరిపిల్లా ! అలా సిగ్గుపడతన్నావేంవి ? ఏం ? ఎవరికీ ఇందాక తెలదను కొంటున్నావా ? ఊరందరికీ తెలుసు. పాలముంత ఈధిలో కెల్లిందంటే ఏ పాలముంత కాడికి ఏ పిల్లి ఎళ్తుందో ఊరంతా కనిపెడతానే ఉంటారు. ఆదోరం ఆదోరం హాపీవాలీ కెళిపోయి కుర్రోడాళ్లో కళ్ళు మూసుకు పడుకుని ముద్దు లెట్టించీసుకొంటూ ఉంటే ఊరందరికీ కళ్ళు మూసుకు పోయేయనుకున్నావా ? లేకపోతే, చెవులు వినబడవనుకున్నావా ? ఇంట్లో అయినా ఈధిలో అయినా తోట్లో అయినా ఎక్కడైనా సరే ఏదైనా దాగుద్దేమోకాని ముద్దుల చప్పుడు మాత్రం దాగదు. అంచేత, ఏయ్, అల్లరి పిల్లా, నీ పరమ రహస్యం వూరందరికీ బట్టబయలే ! తెలిసిందా ? కమల చూసింది, కొంతం చూసింది, సరళ చూసింది, సరసీరుహం చూసింది, భక్తులంతా తిరపతి కొండ కెళ్ళినట్టు మా నర్సులంతా హాపీవాలీకి ఎళ్తా ఉంటారు. అయితే కొండమీద దేవుడున్నట్టు హాపీవాలీలో దేవుడుండడు, అంచేత, దేని దేవుణ్ణి అదే తీసుకుపోవాల ! తెల్సిందా ? అక్కడ కెళ్ళినోళ్ళంతా కూడా నిన్నూ నీ దేవుణ్ణీ అందరూ జూసేరు ! అంచేత నా దగ్గిర దాపరికంచేసి లాభంలేదు. నాకంతా తెలుసు. మీవోడు దెబ్బలితినున్నాడు. సరస చెప్తే వెళ్లి చూసేను. సర్జికల్ వార్డులో మూడో నెంబరు బెడ్డు, నిన్నమధ్యాన్నం అడ్మిట్ అయేడు. గేదల గంగరాజూ ఆడి మరదలూ కలిసి మీవోణ్ని కొట్టీసేరంట. కాదుకాని, మీవోడు ఆ వెధవల్తో తగువెందు కెట్టు కున్నాడు ? అయ్యో ! నీ కింకా ఈ సంగతి తెల్సేతెల్దా ? ! అయ్యో పాపం! అయితే నీకోసరం ఎంత చూస్తా ఉంటాడో ఛేర్మన్‌గారి కాబోయీ అల్లుడు దెబ్బలితిని సర్జికల్ వార్డులో ఉన్నాడే అప్పా అంది సరస.

అ కాబోయీ అల్లుడు ఎంత బావుంటాడో ఎళ్ళి చూసేను పిల్లా ! ఏయ్ ! అల్లరిపిల్లా ! నీ సెలక్షన్ బాగానే ఉంది. తక్కువపిల్లకైనా ఎక్కువ పిల్లకైనా ఆ కుర్రోడు చక్కని మొగుడే ! ఏయ్ అల్లరిపిల్లా ! ఇంకా చూస్తావేంటి? వేగిరం వెళ్ళు ! ఊ కదులు ! నా దగ్గిరే సిగ్గంతాను ! అక్కడ కెళ్లేక ఓ ఓ! " అంటూ నవ్వుతూ మిస్ ప్రేమ అక్కడికి వెళ్ళే వరకూ వెంట తగిలింది నల్లమంగ.

అయితే,

ఎందుచేతనోగాని మిస్ ప్రేమకి అక్కడికి వెళ్ళడానికి అంత ఉత్సాహం కలగలేదు. సానుభూతి పొందడంలో ఆమెకి కలిగిన సరదా సానుభూతి చూపించడానికి ఆమెకి కలగలేదు. నిజం చెప్పాలంటే, ఆమెకి కొంచెం చిరాకుకూడా వేసింది. తన పుట్టిన రోజునాడు హాపీగా తన దగ్గరికి రావడానికి బదులు గేదెల్తో తగవు తెచ్చుకొని కుంటుకొంటూ కూర్చుండి పోయేడు. ఇప్పుడు మరెవరో గేదెల మనిషితో దెబ్బలాట పెట్టుకొని ఆస్పత్రిలో అడ్మిట్ అయి కూర్చున్నాడు. ఎటువంటి మనిషి బాబూ, ఇతను ? ? ఏదీ సెటిల్ కాకుండా అందరికీ తెలిసిపోయింది కూడాను ! గుడ్‌గాడ్ ఇప్పుడేం చెయ్యడం ?

తన ప్రణయ రహస్యం అందరికీ తెలిసిపోయిందని తెలియగానే మిస్ ప్రేమ చాలా బెంగ పడిపోయింది. కొంపతీసి, ఇది పేపర్లలోకి ఎక్కిపోదు కదా ! స్టేటంతా తెలిసిపోతుందే ! చప్రాసీ దగ్గిర్నించి ఛీఫ్ మినిస్టర్‌దాకా డాడీని తెలియనివాళ్ళు లేరు ! మరింక అందరికీ తెలిసిపోతే ఏమవుతుందో ఏమిటో ? అఫ్‌కోర్స్ ! నన్ను మారీచ్చేసుకున్నాక అతను హైసొసైటీలోనే మువ్ అవుతాడు. ఫరవాలేదు. మంచి డ్రెస్‌లో బ్యూటీ ఫుల్ హాండ్సమ్ ప్రిన్స్‌లా ఉంటాడు ! అను హినోస్ హౌటు కారీ హిమ్‌సెల్ఫ్ ఇన్ ఎనీ సొసైటీ ! మంచి స్పోర్ట్సుమన్ పరవాలేదు ! వెళ్లి చూస్తాను ! పరవాలేదు ! ఇంతకీ ఆ చక్రాలకళ్ళ పిల్లెవరు ? నాకెప్పుడూ చెప్పలేదు. వెళ్లి చూస్తానుకాదా ? అమ్మో ! మగవాళ్ళు హైలీడేంజరస్ పీపుల్ నమ్మకూడదు ! అబ్బా నేనక్కడికి వెళ్ళానని డాడికి తెలుస్తుం దేమో ? ఎలాగ ? రేపు వెళ్ళకూడదా ?

"ఏంటి ? ఇంకా ఆలోచిస్తున్నావు ?"

"ప్రమాదమైన దెబ్బలేమైనా తగిలేయా ?" అని దీనంగా అడిగింది మంగని పద్మజ.

"ఎక్స్‌రే తీసేరంట ఎవికలేవీ ఇరగలేదంట" అంది మంగ. అందుచేత నువ్వక్కడికి వెళ్లక్కర్లేదు అని మంగ అంటుందేమోనని ఆశగా చూసింది మిస్ ప్రేమ.

"ఏం ? వెళ్ళడానికి బయల్దేరి, మళ్ళీ వెయిటింగ్‌లో పడిపోయేవేం ? నిజంగా ఆ కుర్రాణ్ణి లవ్ చేస్తున్నావా ? లేకపోతే నీ లవ్వు మా నర్సులమీద డాక్టర్లు చూపించే లవ్వులాంటిదేనా ?", అని మిస్ ప్రేమని ఎగాదిగా చూస్తూ అడిగింది మంగ.

ఆ ప్రశ్నకీ మిస్ ప్రేమకి కోపమూ వచ్చింది, మరింక అక్కడికి వెళ్ళకపోతే బాగుండదనీ అనిపించింది. ఆమె కుర్చీలోంచిలేచి అక్కడ ఓ అరనిమిషం నిలబడిపోయింది.

"నర్స్ !"

"నా పేరు మంగ !"

"మంగా !"

"ఏం పద్మా ?"

"డాడీతో చెప్పకూ !

మంగ ఎంతో హాపీగా నవ్వి మిస్ పద్మజ రెండు బుగ్గలూ మళ్ళా ముద్దులాడి, ఆమెని రెండు చేతుల్తో పట్టుకొని దూరంగా ఉంచి వెనక్కి వంచి మళ్ళా దగ్గరగా తెచ్చుకొని గుండెల కత్తుకొని చెంపాచెంపా అన్చి:

"చెప్పన్లే ! మరింక వెళ్ళు ! ఎవరూ చూడకుండా మీవోణ్ణి గట్టిగా ముద్దెట్టేసుకో ! వెళ్ళు వెళ్ళు వెళ్లు !" అంటూ పద్మజని సాగనంపింది.

మంగలోంచి పొంగిపొర్లే ఆడతనానికి సిగ్గుపడుతూ సర్జికల్ వార్డు వైపు నడిచింది పద్మజ.

మధ్యాహ్నం పన్నెండు దాటింది.

సర్జికల్ వార్డులో మూడోనెంబరు మంచంమీద ఎత్తుగా పేర్చిన తలగడాలకి జేర్లబడి కూర్చున్నాడు భవానీ శంకరప్రసాద్.

అతని మంచానికి ఓ ప్రక్కగా ఓ చిన్న బల్లమీద ఓ ఇరవయ్యేళ్ళ అమ్మాయి కూర్చొని అతనివైపు చల్లని వెన్నెల్లా చూస్తోంది. పద్మజ రాగానే ఆమె తలెత్తి చూసి ఎంతో సంతోషంగా నవ్వి లేచి నిలబడింది,

"ఏం పద్మా ? ఇలా ఒచ్చావేం ?" అంది పైట సరిగా సర్దుకు వేసుకొంటూ గిరిజ.

గిరిజ వేసిన ప్రశ్నకు మరెందుకో పద్మజ ముఖం ఎర్రగా కంది పోయింది.

రంగులరాత్రీ చల్లనిగాలీ కమ్మని పాటా వెచ్చని యవ్వనమూ ఇచ్చే ఉత్సాహంలో అద్దాల గూడు తెరిచి అందాల కలలు కళ్ళారా చూడా లని ఉవ్విళ్ళూరే అమ్మాయికి, అర్ధరాత్రి సమయంలో తలమీద నెలవంకవాలి సాక్షాత్కారం- తలుపు తెరవగానే దొంగచాటుగా అనంగుని ప్రవేశం --చిన్నదాని జాలి చూపులు.

# 12

ప్రసాద్‌కి దెబ్బలు తగిలి "ఆస్పత్రిలో అడ్మిట్‌అయేడని ఆరోజు సాయంత్రమే తెలిసింది గిరిజకి. ఆమె వెంటనే ఆస్పత్రికి పరిగెట్టింది. మర్నాడు కాలేజికి వెళ్ళడం మానేసి ఆస్పత్రిలోనే కూర్చుంది.

కొంతమంది ఆడవాళ్ళు చాలా గమ్మత్తుగా ఉంటారు (కొంతమంది మగవాళ్ళుకూడా చాలా గమ్మత్తుగా ఉంటారు.) ఫలానా స్త్రీ ఫలానా పురుషుణ్ని ప్రేమిస్తోందంటే ఆ విషయం ఊరందరికీ తెలిసినప్పటికీ ఆమెకి మాత్రం తెలియదు.

భవానీ శంకరానికీ గిరిజకీ పరిచయం అవడం చాలా గమ్మత్తుగా అయింది. బస్సుల్లోనూ ట్రెయిన్స్‌లోనూ, కాలేజీ వరాండాల్లోనూ, సారా అమ్మడంలోనూ, సినిమాహాల్స్‌లోనూ, లాడ్జింగు హవుసులలోనూ,

ఆస్పత్రి వార్డులోనూ, డిన్నరు పార్టీల్లోనూ—ఇలాటి అనేక సమయాల్లో జాగాల్లో పరిస్థితుల్లో పరిచయాలూ ప్రేమలూ ఏర్పడవచ్చు. గిరిజకీ శంక రానికీ మరోమనిషి చావుబతుకులమధ్య పరిచయం అయింది.

పేదింటి పిల్లాకాదు, పెద్దింటి పిల్లాకాదు గిరిజ. ఆమె తండ్రి డిప్యూటీ తాశీల్దార్ పని చేస్తూ చనిపోయేడు. ఆయన వెళ్లిపోతూ, వాళ్ళ ఊళ్ళో ఓ చిన్న ఇల్లూ అక్కడ అయిదెకరాల పొలమూ, పదివేల రూపాయల ఇన్సూరెన్సు పాలసీ, భార్యా, ఇద్దరు కొడుకులూ, ఓ కూతురూ—అదంతా వారందర్నీ విడిచిపెట్టేసేడు. పెద్దవాడు ఆర్మీలో జమేదార్‌గా ఉంటున్నాడు. రెండోవాడు గిరిజకంటే చిన్న. ఎసెస్సెల్సీ పరీక్షకి ఓసారివెళ్ళి తప్పి మళ్ళీ చదువుతున్నాడు. గిరిజ ఫస్ట్‌బియ్యే చదువు తోంది. వాళ్ళ చదువులకోసమే పట్నం వచ్చి ఉంటున్నారు వాళ్ళు.

చదువు అవుతూండగానే, కూతురికి పెళ్ళి చేసేయాలనుంది తల్లికి. గిరిజకి అప్పటికప్పుడే ఇరవయ్యేళ్ళొచ్చేయి. బెండకాయలు ముదరకూడదు, బ్రహ్మచారులు ఆ విధంగా ఉండకూడదు, గుర్రాల్లా ఎదిగిన ఆడపిల్లలు కళ్లాలు లేకుండా అట్టేకాలం మిగలకూడదు, అనే భావన గిరిజ తల్లిది.

పెళ్ళిగురించి ఎప్పుడూ ఏమంత పెద్దగా ఆలోచించలేదు గిరిజ. మల్లెలూ, మందారాలూ గులాబీలూ, సంపెంగలూ అన్నీ కలిసి కుప్ప పోసినట్టుగా అందంగా మధురంగా ఉంటుందామె. తనకీ జీవితంలో ఏం కావాలో ఆమెకి ఇంకా తెలియలేదు. చదువుతోందేకాని ఆ చదువు తన కెందుకు, ఆమె అంతవరకూ ఆలోచించలేదు. ఏదో చదవాలి కాబట్టి చదువుతోందేతప్ప అంతకిమించి ఆమెకేం తెలియదు. ఆమధ్య ఉన్నట్టుండి ఓరోజున ఆమెకి వంట్లో బద్ధకం ఎక్కువయిపోయింది. పాటలువింటూనూ, సముద్రపు కెరటాలు చూస్తూనూ, మబ్బుల్లో మార్పులు గమనిస్తూనూ, ఆకాశపు టంచులు వెతుకుతూనూ, పూల మనసులు పులకరిస్తూనూ, చిన్న పిల్లల్తో ఆడుకొంటూనూ ఉండిపోడం ఆమెకి ఎక్కువ ఇష్టం కాజొ చ్చింది. కిటికీ పక్క చల్లగాలిలో వాలు కుర్చీలో కూర్చుని ఆమెకి ఏవేవో కలలు కనాలనే కాంక్ష ఎందుకోగాని ఎక్కువ కాసాగింది.

సుమారు రెండు నెలల్రకితం ఓ రోజు రాత్రి పది గంటలకి మేజామీద దీపం పెట్టుకొని కుర్చీలో కూర్చొని రోమియో అండ్ జూలియట్ ఇంగ్లీషు డ్రామా చదువుకుంటోంది. గిరిజ గదంతా చాలా నిశ్శబ్దంగా ఉంది. పడమటివైపు కిటికీలోంచి - దగ్గర్లో ఎవరింట్లోనో నైట్‌క్వీన్ వున్నట్టుంది. చల్లగాలి పూలవాసనా కలిసి చిలిపిగా గదిలోకి వస్తున్నాయి. తూర్పువైపు వీధి గుమ్మంపక్క కిటికీలోంచి వెన్నెల ఉంటే - రెండువాకల ఇళ్ళ మధ్యనుంచి పోయే రోడ్డుకొనని సముద్రపు భాగం కొంత కనిపించును. కాని చంద్రుడింకా కనిపించలేదు. వీధిలో దీపాలు లేవు. రాత్రంతా చంద్రోదయానికి ఉవ్విళ్ళూరుతూ నిరీక్షిస్తున్న ట్లుగా ఉంది. ఆ చల్లనయ్య మరో గంటకి వస్తాడు.

"రోమియో అండ్ జూలియట్" చదవడంకంటె వారిని ఊహించు కొంటూ బద్ధకంగా కూర్చోడం గిరిజకి ఇష్టం వేయడంతో ఆమె దీపం ఆర్పేసి వాలుకుర్చీలో అలా కూర్చుండిపోయింది. సుఖమైన బద్ధకపు పులకరింతలు ఆమె వంటినిండా నిండుకున్నాయి. అంతవరకూ ఆమె సరిగా వినని సముద్రపుహోరు, దీపం ఆర్పేసి ఆమె కూర్చోగానే, భూమాత నెమ్మదిగా పాడుకొంటోందా అన్నట్టు - ఆమెకి మెత్తగా గంభీ రంగా వినిపించసాగింది. అంతలో ఎక్కడో ఎవరింట్లోంచో కొంచెం దూరంలోంచి రేడియోలోంచి చక్కని కంఠం పాడే పాతకాలపు శాస్త్రీయ హిందూస్థానీ గానం గిరిజని ఏవేవో లోకాల్లోకి తీసుకు పోయింది. ఆ రాగం అదేమి రాగమోగాని, గత కాలపు శోకాలన్నీ కాలం మార్పుతో మధురంగా మారినట్టు హృదయాన్ని తియ్యటి శోకంలో ముంచెత్తుతోంది. ఆ రాగం ఏక్కడ జన్మించిందో ఏమిటో తెలుసుకొందికి (అది వినే వారికి) సముద్రాలు దాటాలనిపిస్తుంది. ఆకాశాలు వెతకాలనిపిస్తుంది అన్యాయాలకింద అణిగి చచ్చిన ఆర్తులంతా ఆ రాగంలో బతికివచ్చి అందర్నీ జాలిగా జోకొడుతూన్నట్టుంటుంది ఆ పాట వింటే:

ఆ పాటకి శ్రుతిలా సముద్ర స్థాయిలో పాడుతోంది. ఆ పాట అలా వింటూంటే గిరిజకి తలుపు తీసుకొని వెళ్ళి సముద్ర పొడ్డున

కూర్చోవాలనిపించింది. అక్కడి ఆ కెరటాల తుంపర్లలో తడవాలని పించింది. జాకెట్టు వదులు చేసుకొని వాలుకుర్చీలో సరిగా సర్దుకొని కూర్చొని హాయిగా ఏవో ఆలోచిస్తూ కళ్ళు మూసుకొంది గిరిజ.

జీవితం సముద్రంలాంటిది. మనోహరంగానూ ఉంటుంది. భయం కరంగానూ ఉంటుంది. అందులో రత్నాలూ ఉంటాయి, చిల్లర గవ్వలూ ఉంటాయి, రకరకాల జీవాలెన్నో ఉంటాయి, సముద్రం మనల్ని దూర తీరాలకి తీసుకు వెళ్తుంది. మధ్యలో ఒక్కోప్పుడు బోల్తా కొట్టించి ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. చల్లగామెరుస్తుంది, ఉప్పెనగా ముంచేస్తుంది. ఎండకి మెరుస్తుంది, వెన్నెలకి ప్రియురాలి వక్షంలా పొంగుతుంది. ఏదారీ కనిపించని పేదవార్ని తనలోకి రమ్మంటుంది; ప్రేయసీ ప్రియుల్ని వడ్డున కూర్చోమంటుంది - అని ఆలోచిస్తూ,

ఆహాయ్! నే నెంత చక్కగా ఆలోచిస్తున్నాను! ఎంతో అందంగా బ్యూటిఫుల్‌గా ఆలోచిస్తున్నాను కదూ?!

అనుకొంది గిరిజ.

అలా ఆలోచిస్తూ ఏ మేమో ఊహస్తూ కూర్చుందేకాని తన జీవితం మరో జీవితంతో కలియడానికి తహతహలాడుతోందని తెలుసుకో లేకపోయింది గిరిజ. రంగుల రాత్రీ, చల్లని గాలీ, కమ్మని పాటా కలయికకి ఆమె వివశురాలయి, మగతగా కన్ను మూసింది.

అలా ఎంతసేపు నిద్రపోయిందో తెలియదు, కొంతసేపటికి, ఆ నిద్రలోంచి, మరో లోకంలోకి లేచినట్టుగా తుళ్ళిపడి లేచింది గిరిజ.

కిటికిలోంచిచూస్తే వెన్నెల వెలుగులో ఆ రాత్రికి ప్రాణంవచ్చిందా అనిపిస్తోంది. గదంతా ఎంతో నిశ్శబ్దంగా అతిపల్చని వెన్నెల వెలుగులో అదొక కలలోని గదిలా కన్పిస్తోంది. పెళ్లిచూపులకి సిద్ధంగా ఉన్న పెళ్ళి కూతుర్లా ఆ గది ఎంతో మౌనంగా ఎంతో మెలకువగా ఉంది.

తనకి తెలివి రావడానికి కారణం ఏమిటా అని గిరిజ ఆలోచిస్తూన్న క్షణంలోనే వీధి తలుపు మళ్లా చప్పుడయింది.

ఆ తలుపు చప్పుడు చాలా వింతగా ఉంది.

ఆ తలుపులు పూల తలుపులేమో అన్నట్టు గట్టిగా తడితే రేకులు రాలిపోతాయేమో అన్నట్టు, లేతగుండెలు అదురుతాయేమో అన్నట్టు కోమలమైన మనసులు చెదురునో, నిదురించే కనుపాపలు బెదురునో అన్నట్టు ఎవరోకాని అతి సున్నితంగా అతి మధురంగా తలుపు తడుతున్నారు ?

ఆ శబ్దం వినగానే గిరిజ గుండెలు తొందర తొందరగా కొట్టుకున్నాయి. "ఇదిగో నీవాడు ! నీకోసం వచ్చేడు !" అని వెలుగు వెన్నెల కాయితంమీద నల్లని రేతిరి సిరాతో రాసిన మెరుపు వార్తతో విధిపంపిన మనిషెవరో తన గుండెలు మరెవరికి తెలియకుండా మరెవరికీ కనిపించకుండా రహస్యంగా రమణీయంగా తట్టినట్టుగా (అటు తరువాత కొన్నాళ్ళకి ఆలోచించి తెలుసుకోగా) అనిపించింది గిరిజకి.

"ఈ అద్దాల గూడు తెరిస్తే ఏ అందాల కలలు కనిపిస్తాయి ? ఈ రంగుల కిటికీలు తెరిస్తే ఏ పూల సముద్రాలు కనిపిస్తాయి ? ఏ పూలబాసలు వినిపిస్తాయి ? ఈ చల్లని గాలులు ఏ కమ్మని గంధర్వ గానాల నెక్కణ్ణించి తెస్తాయి ? ఆ చల్లని మెత్తని మబ్బుల దూది పింజలు ఏ బంగారు వర్షాలు ఏ అమృతాల జల్లులు కురిపిస్తాయి, వెద జల్లుతాయి ? నిగనిగలాడే ఆ నీలాకాశానికి వెనక్కి వెళ్ళి చూస్తే ఏ సుందర దృశ్యాలు అగుపిస్తాయి ? ఏ స్వర్ణలోకాలు సాక్షాత్కరిస్తాయి. ఎంతో మంచివాడు ఎంతెంతో అందగాడు నావాడు నా విభుడు ఎప్పుడు ఏ క్షణంలో ఎప్పుడొస్తాడు, నన్ను ఎక్కడికి తీసుకు వెళ్తాడు ? ఏ చల్లని పూదోట ఏ మెత్తని పూలశయ్యమీద పవళింపజేస్తాడు ? ఏ వలపుల సెలయేటి నీటిలో తేలి యాడిస్తాడు ? ఏ అమర హర్మ్యాలు ఏ మధుర లోకాలు ఏమిచూపిస్తాడు?"

అని ఆడపిల్లలు సాధారణంగా తమ భవిష్యత్తు గురించి కలలు కనే వయసు గిరిజది. ఆ రాత్రి ఆ తలుపు చప్పుడికి ఆమె గుండెలు జలదరించేయి. వింత వింతగా కొట్టుకున్నాయి. ఆమె కుర్చీలోంచి తత్తరపాటుతో లేచి నిల్చుంది.

అంతలో, మళ్ళీ, తలుపు చప్పుడయింది.

దీపం వెయ్యాలనే సంగతి మర్చిపోయి తొట్రుపాటు పడుతూ వెళ్ళి, వీధి తలుపు తెరిచి, రెండడుగులు వెనక్కివేసి నిల్చుంది గిరిజ.

గదిలో మిలమిల మెరిసే చీకట్లో నిల్చున్న గిరిజ, గది బైట నిల్చున్న వాణ్ని చూసి నివ్వెర పోయింది.

ఇదేమి కలా లేక నిజమేనా ?

గిరిజ నివ్వెరపోయింది. నోరు కొంచెం తెరుచుకొని, కళ్ళు బాగా పెద్దవి చేసుకొని నిశ్చలంగా రాతిబొమ్మలా నిలబడిపోయింది. కాని,

ఇదేం కలా ! లేక, నిజవాఁ ?

అనుకొంటూ, భయంతో వణకిపోయిన గిరిజ,

ఆనందంతో కంపించిపోయింది !

గదిబైట ఆమె ఎదుట

నిల్చున్నవాడు

తలుపు తట్టినవాడు

తెలతెల్లనివాడు

తలమీద నెలవంకవాడు ? !

గిరిజ గజ గజ వణికిపోయింది.

ఏ మధుర మంజుల గానానికో! ఏ ప్రణయ నృత్యానికో లయగా ఎవరికోసమో ఎందుకోసమో ఎన్నాళ్ళనుంచో లయగా లయగా కొట్టు కొంటోన్న ఆమె గుండెలు అతను కనిపించేసరికి ఆగిపోయినంత పన యింది.

తలమీది నెలవంకవాడు తనకోసమే వచ్చేడు !

అంతలో ఆమె తెప్పరిల్లి తేరుకొని, పైట సర్దుకొని, చిరునవ్వు నవ్వుకొంది.

కలా ! లేక నిజమా !

అది కలా కాదు. నిజం కాకనూ పోలేదు.

చంద్రవంక అతని తలమీదే ఉందికాని. అతని వెనక ఆకాశంలో

ఉంది. అతను గుమ్మం దగ్గరికి వచ్చేసరికి చంద్రుడతనికి భూషణంగా అమరేడంతే. గిరిజ నిద్రకళ్ళకి అదోలా అమిరిందా దృశ్యం.

గిరిజ నవ్వుకుంది.

"ఏం వండీ! వర్ధనమ్మగారు ఇక్కడేకదండీ ఉన్నారు?"

అని అతను చాలా వినయంగా అడిగేడు.

"ఆఁ, ఉన్నారండీ: ఉండండి, దీపం దీపం వేస్తాను అంటూ వెళ్ళి దీపంవేసి వెంటనే గుమ్మంవైపు చూసింది గిరిజ. చంద్రుణ్ని తెచ్చిన వాడు ఏ వెలుగులోనైనా అందంగా కనిపించాలని ఆమె ఎందుకోగాని ఆశపడింది.

ఆమె ఆశే అతని కళ్ళల్లో ప్రతిబింబించిందో ఏమోగాని, అతని కళ్ళల్లోని వింతవెలుగు అతన్లో ఆ నమయంలో కలిగిన ఆశల వెలుగు కాదని చెప్పలేదు.

అతను తెల్లగా పొడవుగా సన్నంగా చల్లగా ఉన్నాడు. గది లోంచి వచ్చే దీపపు వెలుగులో అతని కళ్ళు జిగేల్మని ముడుచుకొని ఆ వెంటనే పెద్దవిగా విప్పారేయి. అతని కనుబొమలు ఎత్తుగా ఆశ్చర్య పోతున్నాయి. అతని ముక్కు ముందుకి దూకడం చూసి అతని పెదవులు నవ్వుతున్నాయి. అతను కట్టుకున్న తెల్లని పంచ తెల్లని జుబ్బా రెండు కూడా గిరిజ కంటికి పల్చని మంచురేకుతోనో, సన్నని పాలరేకులతోనో, తెల్లని పూల పుప్పొడితోనో చేసినట్టుగా మనోహరంగా ఉన్నాయి! అతను చాలా శాంతంగా ఉన్నాడు; చాలా గంభీరంగా ఉండగలిగిన వాళ్ళా ఉన్నాడు; ఎంతో సౌమ్యంగా చిరు నగవుతో ఉన్నాడు.

వీధి తలుపులు రెండూ బార్లా తెరిచింది గిరిజ. ఎదురుగా తిన్నగా సముద్రం వరకూ రోడ్డుంది....ఆ వచ్చినతను, లోనికి రాడానికి సందేహిస్తూ ఇంకా గుమ్మం అవతలే నిల్చుండి పోయాడు. గదిలోంచిచూస్తే ఆ గుమ్మం అతనికి పటం కట్టినట్లుగా అమరింది. గదిలోంచి పడే విద్యుత్కాంతిలో "అబ్బ అతను ఎంత మెరుస్తున్నాడు!" అతని వెనక వీధికి అటూ ఇటూ ఉన్న మేడలు ఆ వెన్నెల్లో మంచు మేడల్లా కవి

పిస్తున్నాయి. దూరాన కనిపించే సముద్రపు భాగం వెన్నెల పొంగినట్లు పాములు ఆడినట్లు మెరుస్తోంది. అతని మెడలోని నల్లని సన్నని మప్లరు గిరిజ కంటికి కదుల్తూన్నట్టుగా అనిపించింది. పైనుంచి చంద్రుడు వెన్నెల వెదజల్లుతూ అమృతం కురిపిస్తున్నాడు. అతణ్ని ఇంకా అలా చూడాలని ఎంతగానో అనిపించింది గిరిజకి.

"వర్ధనమ్మగారు - మీ అమ్మగారే. అనుకుంటాను - ఉన్నారాండీ?"

అని తిరిగి అడిగేడతను. అతను చాలా మృదువుగా అడిగేడు. అప్పుడు గిరిజ తను జవాబు చెప్పవలసిన అవసరం ఉన్నదని బోధపడి,

"ఆ( ఆ(! వర్ధనమ్మగారు - మా అమ్మ - ఉన్నదండీ!" అంది, అనడం చాలా ఆత్రంగా అంది. ఉన్నారనే సంగతి వేగిరం చెప్పకపోతే అతను ఎక్కడికి వెళిపోతాడోనని భయపడినట్టు.

"నిద్రపోతున్నారా....లేక...." అని ఊరుకున్నాడు తను. అంత రాత్రి సమయంలో వర్ధనమ్మగారు ఇంకా మేలుకొనే ఉన్నారా అని అడగడం చాలా అసందర్భం అని అతనికి తోచినట్టుగా ఉంది.

అమ్మ మేలుకొనే ఉంటే 'ఎంత బాగుండునో కదా!' అనిపించింది గిరిజకి. "అమ్మపడుకుంది, లేవడానికి వీల్లేద"ని తను ఎక్కడ అంటానో అని అతను సందేహిస్తున్నాడేమోనని ఆమె భయపడింది. అతనికి అటువంటి సందేహాలేవీ రాకుండా.

"నిద్రపోతోంది కాని, మరేం భయంలేదండీ, లేపుతాను" అని తొందరగా అతనికి తెలియ జేసింది.

"ఆవిడకి శ్రమగా ఉంటుందని మీకుతోస్తే మాత్రం లేపకండి. రేపొద్దున్నే వస్తాను. నా పనిమీదొచ్చేను కాని ఆవిడ పనిమీద కాదు," అన్నాడతనూ, కాని అతను వెళ్ళిపోడానికి ప్రయత్నమూ చెయ్యలేదు. వర్ధనమ్మగార్ని లేపనక్కరలేదని గట్టిగా చెప్పనూ లేదు. "ఏమోమరి! నేను మాత్రం నిజం చెప్పేశాను. మరింక ఆవిడకి నిద్ర చెడగొడతారో

మాన్తారో - అదంతా మీ ఇష్టం" అని గిరిజమీదే పూచి పెట్టిన వాళ్ళా నిలబడి పోయేడతను.

గిరిజకి అతనెవరో తెలుసుకోవాలనీ అతని పేరు తెలుసుకోవాలనీ చాలా కుతూహలంగాఉంది. ఆ సమయంలో అమ్మ కాశీలో నిద్రపోతున్నా వెళ్ళి లేపి తీసుకువచ్చే తీపులో ఉందామె.

"నా పూర్తిపేరు చెప్పాలంటే పెద్దపేరండీ భవానీశంకర ప్రసాద్ అంటారు నన్ను. టూకీగా పిలవాలంటే ప్రసాద్ అనొచ్చు. కమ్మలకుటీరంలో ఉంటున్నానని నన్ను కమ్మలింటి రాజంటారు కొంతమంది...."

"కమ్మలింట్లో అంటే మీరు...." అతనెవరో తెలుస్తూంది గిరిజకి.

"....శంకరం అంటే మీ అమ్మగారికి తెలుసుందనుకుంటాను. లేకపోతే శాంతమ్మ కొడుకొచ్చేడని చెప్పండి; తప్పకుండా తెలుస్తుంది. అయితే, మిమ్మల్ని నే నెప్పుడూ చూళ్లేదండీ. మా అమ్మ మీ గురించి చెప్పగా విన్నానంతే. మీ అమ్మగారికి నన్ను తెలుసు. ఆవిడా మా అమ్మా చిన్నప్పట్నుంచీ స్నేహితులు. మీక్కూడా మా అమ్మని తెలిసే ఉంటుంది" అన్నాడతను గుమ్మానికి కొంచెం దగ్గరగా వచ్చి.

శాంతమ్మ కొడుకా!

అతను శాంతమ్మ కొడుకని తెలియగానే ఆమెకి ఆశ్చర్యం వేసింది. శాంతమ్మని గిరిజ చాలాసార్లు చూసింది. ఆమె కుచేలుడికి తల్లిగా ఉండ గలిగిన వ్యక్తిలా గిరిజకి కనిపించిందే కాని ఇంత చక్కని కొడుక్కి ఇంత దర్జాగా ఉన్నవానికి తల్లిగా ఉండగలిగిన వ్యక్తిలా అంతకుముందెప్పుడూ తోచలేదు గిరిజకి. కాని, అతను శాంతమ్మ కొడుకనగానే ఆమెకి ఎంతో సంతోషమూ, అతని యెడల ఎంతో ఆప్యాయతా కలిగేయి. అర్జునుడు తనకి ఎంతో దగ్గరవాడు" మా మేనత్త కొడుకే!" అని సుభద్ర గర్వించి నట్టు, అంత అందంగా "మంచిగా కనిపించేవాడు తనకి బాగా తెలిసిన వాడే అవడం గిరిజకి ఎంతో సంతృప్తినిచ్చింది. అన్నట్లు నిజంగా అత నెంతో మంచివాడు కూడాను?" శాంతమ్మెంత మంచిదో దాని కొడు క్కూడా అంతమంచివాడేనే! అని అమ్మ చాలాసార్లు చెప్పింది. అంత

మంచివాడు అంత అందంగా ఉండడమూ అంత అందమైనవాడు ఎంతో మంచివాడవడమూకూడా గిరిజకి సంతృప్తి నిచ్చింది.

"అలా నిలబడి పోయేరు. లోపలకొచ్చి కూర్చోండి. మీ అమ్మ గార్ని తెలియక పోడం ఏఁవిఁటండీ! బాగా తెలుసు. అయితే మిమ్మల్నెప్పుడూ చూళ్లేదు, అయితే మా అమ్మ మీ గురించి చాలా సార్లు చెప్పింది. రండి, కూర్చోండి. ప్లీజ్," అంటూ అతణ్ని ఆహ్వానించింది గిరిజ.

అతను జోళ్ళు బైటవిడిచి లోనికి వచ్చి గిరిజ చూపించిన వాలు కుర్చీలో కాకుండా మామూలు కుర్చీలో కూర్చున్నాడు. అతను దూరం నుంచి చూస్తే ఉన్నంత సన్నంగా లేడనీ, పల్చగా ఉన్నా వెడల్పుగా ఉన్నాడనీ, అతని చేతులు బలంగా మోటుగా, అతని చెంపలు నున్నగా మెరుస్తూ ఉన్నాయనీ గిరిజ గమనించింది. అతను గదిలోకి రాగానే ఆమె చాలా తబ్బిబ్బయింది" అనవసరంగా, వాలుకుర్చీ గుడ్డని రెండు మూడు సార్లు చేత్తో శుభ్రంచేసింది. అతనికి కాఫీ కాని మరేదైనా డ్రింక్‌గాని ఇవ్వాలని పించిందామెకి, బాగా రాత్రయింది. ఇంట్లో మంచి నీళ్ళు తప్ప ఇంకేవీ ఇవ్వడానికిలేవు. రోజూ తను ఫ్లాస్కులో టీ వేసుకొని ఉంచేది. ఇవాళ ఎందుచేతనో, చదవడానికి, ముందుగానే బద్ధకం వేయడంచేత 'టీ' చేయడం మానేసింది. అందుగురించి ఆమెకి కొంచెం "అయ్యో" అని పించింది.

ఆమె అలా చింతిస్తూ నిలబడి పోయింది. అతను గొంతుక సవరించుకొని,

"అంటే, మరేం లేదండీ. నేను ఎందుకు ఇంతరాత్రి....అదికాదు .... నాకు అర్జంటుగా....చల్లకివచ్చి ముంత దాచడం ఎందుకు? కొంచెం ...." అని చెప్తూ చెప్తూ చెప్పడానికి సిగ్గుపడ్డాడు.

డబ్బు!

అతనికి డబ్బు కావలసి ఉన్నదని ఎలా గ్రహించిందోకాని టక్కుమని గ్రహించ గలిగింది గిరిజ.

"డబ్బేమైనా కావాల్సుందా?" అని అడిగి, "అయ్యో! నేనలా అడ

క్కాడదు కాపోలే! అడిగేసేను! ఇప్పుడెలాగ?" అని గిజగిజలాడి పోయింది గిరిజ.

అలా అడగ్గానే అతని ముఖం ఎర్రగా గులాబిరేకులా అయి పోయింది. అతని ముఖం సిగ్గుతో దించుకుపోయింది. అతనికంత సిగ్గు కలిగించినందుకు ఎంతగానో సిగ్గుపడిపోయింది గిరిజ.

గిరిజకి అతను ఎంతో అసహాయంగా ఉన్నట్టు కనిపించేడు. అందు గురించి ఆమె విల విల లాడిపోయింది. గులాబీని పురుగు కొరికినట్టు, తాజ్‌మహల్ మీదికి రాళ్ళు రువ్వినట్టు, చంద్రకాంతిలో విషందూరినట్టు, చంద్రమతి కొడుకుని పంతానికి రుషి పీడించినట్టు, సీతని కాకి పొడిచి నట్టు, విడీవిడని మల్లెమొగ్గ ఆకలాకలని అరిచి శోషపోయినట్టు, మతకల హాల్లో పసిపిల్లల్ని నిలువునా చీరినట్టు -

అతను అసహాయంగా బాధపడ్డం చూసి సహించ లేకపోయింది గిరిజ.

"నేనూ చెప్తున్నాను. మీరూ అన్నారు. అంటే మరేం లేదండీ! పరిస్థితి చాలా ప్రమాదంగా ఉంది. ఎవర్నడుగుదామన్నా చాలా రాత్రయి పోయింది. నెలాఖరు కాబట్టి మా ఆఫీసులో పని చేసేవారు నాలాగే ఉంటారు. అప్పటికీ, ఇండాల్లో వెళ్ళి ఇద్దరు ముగ్గుర్ని నిద్రలోంచి లేవ గొట్టేను. వాళ్ళు రెండు మూడు రోజుల్లో ఇస్తాం అన్నారు. రెండుమూడు రోజుల్లో అయితే నా జీతమే అందుతుంది. అప్పుడు ఫరవాలేదు. ఫరవా అంతా ఇప్పుడే! అంచేత అమ్మ అంది. ఇంకెక్కడా దొరక్కపోతే వర్ధ నమ్మని నే నడిగేనని అడగరా; ఉంటే ఇస్తారు' అంది.

చాలా ఆలస్యం అయిపోయింది. ఏమనుకుంటారో అని భయ పడుతూ ఒచ్చేను కాని తప్పలేదు....ఒక్క పాతిక మాత్రం కావలసివుంది. అదుంటే చాలు. గండం గడిచినట్టే! అందుచేత ఒక ఇరవై అయిదు సర్దు బాటు చేయడానికి వీలుంటుందంటారా? వీలవుతుందో లేదో మీకు తెలు స్తుందికదా? వీలుంటుందంటే మీ అమ్మగార్ని లేపొచ్చు. లేదంటే ఆవి డకి శ్రమ కలిగించడం అనవసరం అనుకుంటాను. ఏమంటారు?

అని చెప్పి ప్రశ్నార్థకంగా గిరిజవైపు చూసేడతను.

అతన్ని కళ్ళు తన అందాన్ని తణిఖీ చేస్తున్నాయేమోననుకొంది గిరిజ. అంతలోనే "ఛా! తప్పు! అలా అనుకోకూడదు అనుకుంది. పాపం! అతనెంతో మర్యాదాగా ఉన్నాడు! అన్నట్టు అమ్మదగ్గిర సొమ్ముంది కూడాను!

"ఫరవాలేదండి! ఆ పాటి సొమ్ము అమ్మదగ్గిర ఉంది" అని అతనితోచెప్పి ఇంట్లో అంతే ఉన్నదంటే అతను పుచ్చుకోడేమోనని సందేహించి, "అంతకంటే ఎక్కువే ఉంది. సాయంకాలం నేను చూసేను. అమ్మని లేపుతానుండండి" అంటూ - అతను సిగ్గుపడకుండా ఉండడం కోసం - చనువుగా నవ్వింది గిరిజ.

"హమ్మయ్య!" అనుకున్నట్టుగా, ఒక్కసారి కళ్ళు మూసుకొని తెరచి, అతను, "చాలా థాంక్సండీ! ఇటు మానవ ప్రయత్నంచేస్తో, అటు భగవంతుణ్ని ప్రార్థించాలంటారు కదండీ! నేను అలా ప్రయత్నంచేస్తూ దేవుణ్ని ధ్యానిస్తూ ఆఖర్న ఇక్కడకి వచ్చేముందు చరమధ్యానం చేసేననుకోండి! పాతిక రూపాయలకోసం ఇంత ప్రయత్నవూ, అంత ప్రార్థనా చరిత్రలో ఎవరైనా చేసేరో లేదో తెలియదుగాని, నా మట్టుకు నాకు - నిజం చెప్పేస్తున్నాను క్షమించండి. ఈ రోజుల్లో నిజం చెపితే ఎవరూ క్షమించర్లెండి - నిజంగా నాకు కళ్ళంట నీళ్ళు తిరిగేయండీ. "ఛీ! ఎందుకీ దిక్కుమాలిన జీవితం? అనిపించేసిందండి. పాతిక రూపాయలు కూడా న్యాయానికే అడిగేను కాని అన్యాయానికి అడగలేదు. నాకు విస్కీ బాటిల్ కావాలి దేవుడా అని ప్రార్థించలేదు. పేకాటకి నా కాపాటి సొమ్ము కావాలి దేవుడా అనీ ప్రార్థించలేదు. ఓ ప్రాణాన్ని రక్షించాలి. అందుకోసం ఓ పాతిక పుట్టించు దేవుడా అని ప్రార్థించేను. ఒక్కొక్కప్పుడు, ఏఁవండీ, దేవుడంటే చెడ్డ విసుగేస్తుందండీ! అయామ్‌సారీ! మిమ్మల్ని అలా నిలబెట్టేసేను, నా గోలే నాది వచ్చిన పని అప్పుడే మర్చిపోయేను, చూసేరా?!" అంటూ నవ్వేడతను.

అతను గుమ్మానికి అవతల ఉన్నప్పుడుకూడా చిరునవ్వు నవ్వేడు

కాని అది మబ్బుల్లో చిక్కుకున్న చంద్రుడి నవ్వు, సీరియస్‌గా ఉంటూ మర్యాదకి నవ్విన నవ్వది. ఈసారి అతను నవ్వినవ్వు అమ్మ కనిపించక బెంగపెట్టుకున్న పిల్లడు అమ్మని చూడగానే నవ్వినట్టుంది. అతనంత హాయిగా నవ్వటం చూస్తే గిరిజకి ఎంతో హాయనిపించింది.

"నే నెప్పుడూ ఇంతేనండీ! ఏ వెర్రి పట్టుకుంటే ఆ వెర్రి! అందుకే మా అమ్మ నన్ను కోప్పడుతూంటుంది!" అన్నాడతను.

"మా అమ్మ మీ అమ్మగార్ని ఎంతగానో పొగుడుతూంటుం దండీ ఎప్పుడూను" అంది గిరిజ.

"మా అమ్మ చాలా కష్టాలు పడిందండీ. అబ్బ! ఎన్ని కష్టాలు పడ్డాదో చెప్పలేనండీ. నేనైతే ఆ కష్టాల కీపాటికి ఏనాడో ఆత్మహత్య చేసేసి కొనుందునేమో అనిపిస్తూంటుంది. పెద్దవాళ్లు కాబట్టి - పాత కాలపు మనిషి కాబట్టి అలా నిలబడగలిగింది అంతేనండి! చెప్పలేం, ఏ మనిషికి ఏ శక్తి ఏ భక్తి ఏ విశ్వాసం ఏ ఆశ ఏ నమ్మకం ఏ ముంటుందో చెప్పలేం కదండీ! కాని, ఏ శక్తో ఏ భక్తో ఏ ఆశో ఏ విశ్వాసమో ఏదో ఒక టుంటేనేగాని ఏ మనిషీకూడా బాధల వేదన భరించలేడండీ!"

అతని మాటలు చాలా వింతగా తోచేయి గిరిజకి. అసలు, అటు వంటి విషయాల గురించి ఏదైనా సరే మాట్లాడ్డం ఆమె అంత వరకూ వినలేదు. పడవలో హాయిగా తేల్తూన్న మనిషితో పక్కనే నీట్లో ఈత్తూన్న మనిషి మాట్లాడుతూన్నట్లుగా అతను తనతో మాట్లాడుతున్నా డని ఆమె తెలుసుకోలేక పోయింది. అయితే, అతను గమ్మత్తుగా ఉన్నా డనిపించింది. ఆమెకి కాని, ఆ గమ్మత్తేదో కనుక్కోలేక ఆమె అతన్ని అలా చూస్తూ నిలబడిపోయింది.

"ఏఁవండీ నేనేఁవైఁనా తప్పు మాట్లాడేనా?" అని అతను చిరు నవ్వు ఆపి అడిగేడు.

"తప్పా! ఏం తప్పండీ? అబ్బే. ఏం లేదు. మీరు తమాషాగా మాటాడుతున్నారనిపించిం దంతే" అంది గిరిజ.

తమాషాగా మాట్లాడ్డం చాలా తప్పయిపోయినట్టు. "అయామ్ సారీ అండీ? క్షమించండి" అన్నాడతను.

"అయ్యో ? అందులో క్షమించడాని కేఁవుందండీ ? బలేవారే. మీరు !"

"అన్నా ! మనకిది పన్నిన పద్మవ్యూహం' అని గేయం ఒక టుందండీ. అనిసెట్టో ఎవరో రాసేరు."

"సినీమా పాట కదండి అది ?"

"సినీమాలో పాటకూడా అయుండొచ్చు లెండి, అలాగే, 'చేదు విషం జీవఫలం" అని 'చేదుపాట' కాబోలు శ్రీశ్రీగారు రాసేరు. మీ రెప్పుడైనా చదివేరా ?"

'శ్రీ శ్రీ గారి గురించి విన్నానండి. ఆయన రాసినవి కొన్నేవో చదివే ననుకుంటాను. ఆయన బాగా రాస్తారుట కదండి ?"

'"శ్రీ శ్రీగారు బాగా రాస్తారా ?' అని అడగడం బావుందండి !" అంటూ అతను నవ్వి, "మా అమ్మ జీవితం తల్చుకుంటే నాకు పెసిమిస్టిక్ పాటలూ గేయాలూ దృశ్యాలే జ్ఞాపకం వస్తాయండి. జీవితంలో బాధ లెక్కువై పోయి ఆశ తక్కువై పోతే పెసిమిజమ్ పుటుకొస్తుం దనుకుంటాను, ఏఁవంటారు !"

అతనలా మాట్లాడుతుంటే అప్పుడు గిరిజకి అతన్లోనిగమ్మత్తేమిటో తెలిసివచ్చివుండవచ్చు.

అతనికి దగ్గర దగ్గర పాతికేళ్ళుండవచ్చు. ఆ వయసుకి తగినట్లుగా బలంగా ఆరోగ్యంగా వున్నప్పటికీ అతను ఇంకా బాగా లేతగా అమాయకంగా కనిపిస్తున్నాడు. అతని మాటలు వింటూంటే ఎసెల్సీ కుర్రాడు బియ్యే పరీక్షకి కూర్చొని రాస్తున్నట్టుగా అనిపించింది గిరిజకి. బాల్యం అంతా అడుగున్నర ఇరుకు పంజరంలో గడిపిన లేత చిలుక, మామిడి తోటల్లోని రామచిలకలకి బతుకుబాధ గురించి ఉపన్యసిస్తూన్నట్టనిపించిందామెకి. లేత గులాబి మొగ్గల్లాంటి పెదవుల్తో రంగు చేపల్లాంటి కళ్ళతో, చేతిలో కమండలంతోతిరిగే పద్నాలుగేళ్ళ ఆదిశంకరుడు ప్రజలకీ - కావి రంగు బట్టలతో, పురుషులకీ పరమసత్యా లుపదేశించినట్టు, పదమూడోయేట పెళ్ళయి పధ్నాలుగోయేట బిడ్డను కని, వెంటనే మళ్ళీ గర్భంతో వున్న చిన్నపిల్ల కోడంగ్రికపు బాధలు పడిపడి ఇంకా పడుతూ పొద్దున్నే పెరటి గోడమీంచి పక్కింటి బంగారు ముత్తయిదువుకి

భగవత్సృష్టిలోని బాధల గురించి చెప్పినట్లు, అతను గమ్మత్తుగానూ, అసహాయంగానూ కనిపించేడు గిరిజకి.

అతణ్ని చూసి ఆమె జాలిపడింది! పురుషుణ్ని, అందులోనూ యువకుణ్ని చూసి ఆడపిల్లలు జాలిపడడం చాలా ప్రమాదాలకి దారితీస్తుందని ఆ అమ్మాయికి తెలియలేదు.

"ఏమంటారు ?" అని అతను మళ్ళీ ప్రశ్నించాడు.

"దేనిగురించి ?" అని ఆశ్చర్యపోతూ అడిగింది గిరిజ.

అతను నవ్వేడు.

"నిద్రపోయేవార్ని లేవగొట్టి వారికి పెసిమిజం గురించి ఉపన్యాసం ఇవ్వడం నాదే తప్పు. నేను నిజంగా ఓ పిచ్చివాణ్నని అనుకుంటాను" అని నవ్వుతూనే అన్నాడతను. తన మాటలు ఆమె సరిగా విననందుకు అతను కించపడినట్టుగా లేదు.

"ఆశ తక్కువా బాధ ఎక్కువా అయినప్పుడు పెసిమిజం పుడుతుందన్నారు మీరు. విన్నాను. దాని గురించే ఆలోచిస్తున్నాను. మీ మాటలు నాకు వింతగా ఉన్నాయి!" అంది గిరిజ.

"ఏఁవంటీ! చూసేరా! అవతల కొంపలు మునుగుతూంటే నేను వింతగా ఎలా మాట్లాడేస్తూ కూర్చున్నానో ?" అంటూ అతను కుర్చీలోంచి అకస్మాత్తుగా లేచిపోయేడు. అతని ముఖం చాలా సీరియస్‌గా మారిపోయింది. అతని ముఖంలో తొందరా, భయమూ, ఆందోళనా కనిపిస్తున్నాయి.

"ఇప్పుడు మీ అమ్మగారు డబ్బివ్వగలిగితే, అది పట్టుకువెళ్ళి నే నో మందులషాపు షావుకార్ని లేపాలి. లేపి, మందొకటి కొనుక్కొని అర్జంటుగావెళ్ళి ఓ మనిషిని రక్షించగలిగితే రక్షించగలగాలి. ఏఁవండి, నన్ను చూస్తే నాకే ఒక్కొక్కప్పుడు అసహ్యం వేస్తుందండి! ఛీ!" అంటూ అతను తను మరెవరో అయినట్టూ, ఆ మరెవరినో చూసి ఎంతో అసహ్యించుకున్నట్టూ ముఖం పెట్టేడు.

అతడు తనని తను అసహ్యించుకోడంకూడా వింతగా కనిపించింది గిరిజకి.

అతను మళ్ళీ చెప్పేడు.

"ఏఁవండి. నేనెంతో బరువు నెత్తిన పెట్టుకుని మీతో ఇంత తేలిగ్గా హస్కు కొడుతూ ఎలా ఉండిపోయేనో చూసేరా? ఎండా కాలంలో నీడలోనూ, చలికాలంలో ఎండలోనూ కూర్చోవాలని ఉన్నట్టు దుఃఖాలకి దూరంగా పోవడం మానవసహజం అనుకుంటాను: ఏఁవంటారు?"

అందుకు సమాధానంగా.

"మీరు అసలు విషయం మళ్ళీ మర్చిపోతున్నారంటాను!" అని నవ్వింది గిరిజ.

అతను సిగునవ్వు నవ్వేడు.

"ఇప్పుడే ఒస్తానుండండి" అని పైట నిండుగా కప్పుకొని పక్క గదిలోకి వెళ్ళింది గిరిజ.

అతను గడియారంవైపు చూసేడు. నిశ్శబ్దంగా చలనంలేకుండా పదకొండు గంటలు చూపెడుతోంది గడియారం.

అర్ధరాత్రివేళ వర్ధనమ్మగారి ప్రవేశము - కరాతు రితో ఆమెకి వచ్చిన పేచీ - సాక్షిగా సులభంగా జీవితయాత్ర సాగించేందుకు వీలుగా (అందరూ అనుసరింపదగ్గ) వర్ధనమ్మగారి రూల్సు:

# 13

నిద్రపోయేవారిని లేపాలంటే -

కొందర్ని పిలిచి లేపాలి; కొందర్ని తట్టిలేపాలి. కొందర్ని కొట్టి లేపాలి; కొందర్ని గిల్లి లేపాలి: చెవిలో నీరుపోసి, లేదా, ముఖంమీద నీళ్ళు జల్లి కొందర్ని లేపాలి; ఇంకొందర్ని మనం చచ్చిలేపాలి.

ఆ రకపు ఇంకొందరి జాతి వర్ధనమ్మగారి జాతి.

(మనం) చచ్చినా లేవకపోదం ఆవిడవొక లక్షణం. అయితే, అకస్మాత్తుగా లేచినప్పుడు కేకలేస్తూ లేవడం ఆవిడది ఇంకో లక్షణం. అందులోనూ ఆవిడ లేలాండ్ లారీలా ఉంటుందేమో - ఆఁ ఆఁ అంటూ ఆవిడ లేచేసరికి - పడుక్కున్న పాత ఇంజను పిడుగు చప్పుళ్ళతో స్టార్టయినట్టుంటుంది. ఆ లేవడం ఇవతల వాళ్ళకి ప్రాణాలు ఆ పాటికి ఇంకా పోకపోయి నట్లయితే ఆ కేకలకి పూర్తిగా పోయి తీరుతాయి.

"అమ్మా! అమ్మా!" అంటూ గిరిజవేసిన గావుకేకలు విని అవి మరెవరి కేకలో అనుకున్నాడు ముందు గదిలో కూర్చున్న భవానీశంకరం.

అలా అరవగా అరవగా గిరిజ గొంతుక బొంగురు పోయినట్టుగా అయింది. మరికొంత సేపటికి పిడుగు ధ్వనులతో వర్ధనమ్మగారు నిద్రలేచింది.

వర్ధనమ్మగార్లో మరోగుణం ఉంది. (ప్రతి మనిషిలోనూ అటు వంటివి చాలా వుంటాయి.) ఆవిశ లేస్తూనే తూలుతూ నడుస్తుంది.

"శాంతమ్మగారి అబ్బాయిట! ఒచ్చి ముందు గదిలో కూర్చున్నాడు. పక్కనే కూర్చున్నారు" అని అర్ధరాత్రి వింతగురించి గిరిజ చెప్పేలోపున, వెనగ్గదిలోంచి ముందుగదిలోకి వర్ధనమ్మ తూలిపోయింది, అక్కడొక కుర్చీలో కూలిపోయింది. ఆ కుర్చీది గట్టిప్రాణం కాబట్టి అది ప్రాణాలు బిగబెట్టుకొని విరిగిపోకుండా నిలబడ గలిగింది.

వర్ధనమ్మగారు ఆయాసపడుతూ కూర్చొంది. నిద్రలేవగానే విద్యు ద్దీపపు వెలుగు హితవుకాక ఆమె కళ్ళు చిరాకుపడి కుంచించుకుపోయి, కొంత సేపటికి శాంతించేయి. నే నెవరు, ఎక్కడున్నాను. ఏం చేస్తున్నాను అని ఆలోచించ నారంభించిందావిడ.

గదిలోకి వర్ధనమ్మగారు రాగానే ఆమెకి నమస్కారంచేసి మళ్ళీ కుర్చీలో కూర్చున్న భవానీ శంకరుడు చిరునవ్వు నవ్వేడు. ఆవిణ్ని ఎప్పుడు చూసినా అతనికి నవ్వూ ఆశ్చర్యమూ కలుగుతూంటాయి.

వర్ధనమ్మగారు ఏనుగులా వుండదు, ఒంటెలా ఉండదు, కంగా రూలా ఉండదు, జిరాఫీలా ఉండదు, కాకీ కోయిలా కొంగా హంసా వేటి లా గా ఉండదు. అచ్చంగా ఖడ్గమృగంలాగే వుంటుంది. ముక్కున ఖడ్గం లేకపోయినా, ఆమె ముక్కు మంచి ఖడ్గంలా వుంటుంది. ఆవిడకి యాభ యేళ్ళయినా లేకపోయినప్పటికి ఆవిడ పళ్ళన్నీ ఊడిపోయాయి. పగటి వేళ ఆ నోరు, కట్టుడు పళ్ళతో, మంచినోర్లా బాగానే కనిపిస్తుంది. కట్టుడుపళ్ళు తీసేయడంతో రాత్రివేళ ఆ నోరు గాలిపోయిన రబ్బరు మూతిలా లొత్తపోయి దొంగనోర్లా కనిపిస్తుంది. టన్నున్నర బిందెలా ఆవిడ నిండుగా ఉంటుందేగాని ఆ బిందెమాత్రం మూతీ బిగించిన కాశీ చెంబులాంటి బిందె. "అరె! పళ్ళన్నీ మా కంటి ముందు ఊడిపోయేయ్!" అనే ఉద్దేశంతో కాబోలు ఆమె జుట్టంతా గబ

గసా మిగలపండిపోయింది. జుట్టుకి నూనె చాలకపోతే అది ముందుగా గంపలా తయారయి ఆ తరవాత గాలికి రేగిన గడ్డికుప్పలా మారి ఆ తరవాత కొన్నాళ్ళకి పిడచ కట్టుకుపోతుంది. ఆవిడ జుట్టు అప్పటికప్పుడే పిడచ కట్టుకు స్టేజికి వచ్చేసింది. ఆమె కట్టుకొన్న చీర తెల్లగానూ, తొడు క్కున్న రవికూ్కడా తెల్లగానూ ఉన్నాయి. పిండిబస్తాకి పురికొసదారంతో మూతి బిగించినట్టుగా వుందామె.

ఆమె కొంతసేపు అలా యోగినిలా కూర్చొని దీర్ఘాలోచనలో పడి పోయింది.

నేనెవర్ని? వర్ధనమ్మని. డిప్యూటీ తాశిల్దార్ సుబ్బారావుగారి భార్యని. ఇప్పుడు వెధవముండని, నేనిప్పుడు ఎక్కడున్నాను? కూతురికీ కొడుక్కీ చదువు చెప్పించడానికని చెప్పి బోలెడుఖర్చుతో పట్నంవచ్చి ఉన్నాను. పట్నంలో ఎలా ఉన్నాను? పీనుగ్గుమాస్తా ఇంట్లో ఓ వాటాలో అద్దెకుంటూ వాడు తీనేస్తూవుంటే తినబడకుండా ఇలా మిగిలున్నాను. ఇప్పుడేం చేస్తు న్నాను? నిద్రలేచి కుర్చీలో కూర్చున్నాను. ఎందుకు నిద్రలేచేను? ఏమో తెలీదు. ఇప్పుడు టైమెంతయింది? పదకొండయింది. అంతేనా! కాదు. గడియారం ఆగిపోయింది.

'టైమెంతయిందే?' అంటూ ఆవలిస్తూ అడిగింది వర్ధనమ్మ. అలా తెరుచుకొని తెరుచుకుని ఆ నోరు ముల్లోకాలనీ మింగేస్తుందా అనే భయం కలుగుతుంది చూసేవారికి. శత్రువులెవరైనా ఉంటే వారిని ఆవలింతతో అదరగొట్టిన పిమ్మట!

"టైమెంతయిందే?" అని అడిగింది వర్ధనమ్మ.

"పదకొండయిందమ్మా!" అంది గిరిజ.

"నీ మొహం" అంది వర్ధనమ్మ.

"పన్నెండవుతుందండీ!" అన్నాడు భవానీ శంకరుడు.

ఇతనెవరు?

శాంతమ్మ కొడుకులా ఉన్నాడు

అవును. శాంతమ్మ కొడుకే.

ఎంతసేపయి వచ్చేడు? ఎందుకొచ్చేడు?

ఇంతరాత్రివేళ వచ్చేడూ అంటే - పిల్లని ఎత్తుకు పోవడానికికాదు. కుర్రాడు మంచివాడే. మంచివాడయినా కాకపోయినా, ఇంతవరకూ అతని గురించి చెడ్డగా ఎక్కడా వినలేదు - అందుచేత ఇంతరాత్రివేళ వచ్చేడూ అంటే డబ్బుకోసం అయియుండాలి. లేపోతే, శాంతమ్మకి ఏదో వంటి మీదికి వచ్చుండాలి, అలాగైతే, ఇతను తప్పకుండా డబ్బుకోసమే వచ్చుండాలి.

"ఏం శంకరం? నువ్వా వచ్చేవు?!"

"ఆఁ నేనేనండీ."

"ఎవరో అనుకున్నాను."

"కాదు, నేనే."

వచ్చినవారెవరో ఆవిడా అతనూ కూడా ఆ విధంగా ఖచ్చితంగా తేల్చుకున్నాక, సంభాషణ కొంతసేపు ఆగింది.

"మీ అమ్మ ఒంట్లో కులాసాగా వుందా?"

"బాగానే ఉందండి మీదయవల్ల."

"భగవంతుడి దయుండాలి కాని మనిషి దయెందుకు శంకరం?"

"మనిషి దయుంటే భగవంతుడి దయఉన్నట్టే లెక్కేసుకోవాలండి. దేవుడి దయవున్నా మనిషి దయ లేకపోతే చచ్చిచావేకదా!"

'ఎవరయినా ఎందుకు చావాలి శంకరం!'

ఆ మాటకి కొసని ఉన్నది ప్రశ్నార్థకం కాదు ఆశ్చర్యార్థక మని శంకరానికి అర్థమయ్యే లోపున -

'ఎవరి టైమొస్తే వారెలానూ చావాలీ,' అనే రెండుమాటలతో ముగించింది వర్ధనమ్మ.

ఆమె సూత్రాన్ని శాంతమ్మ కొడుకు ఆమోదించేసుకుని షరతు పెట్టేడు.

"కాని, చూడండి! ఆ టైము ఎప్పటికప్పుడు ఇదికాదు ఇదికాదని మనం తంటాలు పడాలి కదండి!'

'ఏఁవిఁవో? మానవుడెంత _ యత్నంచేసినా చావుని ఆపగలడా! జయించగలడా? వెఱ్రిగాని!'

అంటూ మానవప్రయత్నంలోని ప్రయోజనాన్నంతా పెదవి తో చప్పరించేసింది వర్ధనమ్మ.

"ఇప్పుడు అటువంటి ప్రయత్నమంటే, చావుని ఆపే ప్రయత్నం లోనే ఇలా వచ్చానండీ!" అన్నాడు శంకరం.

'ఆపలేం నాయనా ఆపలేం!' అని ధైర్యముగా చేప్పేసింది వర్ధనమ్మ. దేవుడూ యముడూ కూడా అంత నిబ్బరంగా చెప్పగలిగి వుండరు ఏ విషయం గురించైనాసరే.

'ఇప్పుడూ....మరేం లేదండీ....' అని నసిగేడు శంకరం.

అతని మొహమాటంచూసి అతనికి సహాయంగా వచ్చింది గిరిజ.

"అది కాదమ్మా! ఆయనకి ఒక్క పాతిక కావాలిట. ఫస్టు తారీక్కి ఇచ్చేస్తాం అన్నారు, అర్జంటుగా కావాట్ట. అర్జంటు కాకపోతే ఇలాంటప్పుడు ఒస్తారా?"

వర్ధనమ్మగారు మళ్ళీ పెదవులు చప్పరించింది. మొదటిసారి మృత్యువుని జయించగలం అనే ఆశని చప్పరించేసింది. డబ్బుపుట్టగలదనే ఆశని ఈ సారి చప్పరించేసింది.

"నా యందుండే అభిమానంతో ఒచ్చేవుకాని, శంకరం, నా దగ్గర డబ్బెక్కడుంటుదోయ్! మగదక్షత లేకుండా దినదినగండంగా గడుపు కొస్తున్నాను. ఇవాలుంటే, రేపుంటుందా ఉండదా? రేపుంటే వుండొచ్చు. కాని ఎల్లుండి గడవడం ఎలాగ? ఫస్టుతారీకొస్తే ఆ పీనుగ్గుమాస్తాకి ఇంటద్దె ఇవ్వడం ఎలాగ? ఇవ్వకపోతే నన్నింత మనిషినీకూడా కూరొండుకు తినే స్తాడు కద! అసలు ఫస్టు తారీఖు వారం రోజులుందనగానే వాడు కత్తు ల్నూరుకొని సిద్ధంగా ఉంటాడే! ఏంచెయ్యడం! ఎలా చావడం! ఆ తర వాత, పిల్లలకి జీతాలు, పాలవాళ్ళు, పెరుగువాళ్ళు, పనివాళ్ళు, చాకలివాళ్ళు- ఇలా నన్ను తినేస్తారనుకో! నేను చస్తే చావుబాజాల వాళ్ళుకూడా నన్నే

తినేస్తారనుకో! మగదక్షత లేకుండా ఇలా దినదినగండంగా రోజులు గడుపుకొస్తున్నాను!"

అంది వర్ధనమ్మ.

'మగవారు దక్షతగా ఉంటే వారే తినబడుదురుకదా!' అనే భావన ఆవిడ మాటల్లో ధ్వనించకపోలేదు.

అతనికి సందేహాలూ సంశయాలూ ఇంకా ఏమైన మిగులుంటే ఆ కా స్తమిగులు తుడిచిపెట్టే విధంగా,

'పాతిక రూపాయలే! నా దగ్గిరే! ఉండడమే! ప్చ్! నిలువంతా చీరినాలేదు. ఇల్లంతా దోచినాలేదు!'

అని అతిసులభంగా అనగలిగింది వర్ధనమ్మ.

గిరిజకి వళ్ళంతా సిగ్గుతో చచ్చిపోయింది. గడియారం ఆగిపోవడం కాదుగాని ఆమెకి కాలమే ఆగిపోయి నట్టనిపించింది. 'అమ్మేనా ఇలా మాట్లాడుతోంది!" అనిపించిదామెకి. భవానీశంకరం ముఖం చూడలేక పోయిందామె. ఆమెకి ఏం చెయ్యాలో ఏం మాట్లాడాలో తోచదు.

"అది కాదమ్మా!" అంది గిరిజ.

'ఏ(వి(టికాదే?' అని అడిగింది వర్ధనమ్మ.

"సాయంకాలం నీ దగ్గిర డబ్బు చూసేనుకాదా! పెట్లోఉంది. మర్చి పోయేవు కాబోలు!" అనేసింది గిరిజ తన తొందర్లో గాబరాలో.

డామేజీ కరమైన కూతురి మాటల్ని ఖండించడానికి నాందిగా,

"నీ మొహం!" అంది వర్ధనమ్మ.

అలా అన్నాక కొంతసేపు పెదవులు చప్పరించింది. అలా చప్పరించగా అందులోంచి ఐడియాలు పుట్టేయి, మాటలువచ్చాయి.

"పెట్లో డబ్బింకా కూచుందనుకున్నావుటే! అయ్యో రాత!" (పెద వుల చప్పరింపు) 'పీనుగ్గుమాస్తా ఒచ్చి ఇంటద్దె పట్టుకు పోలేదూ! (పెద వుల చప్పరింపు) 'హ త్తెరి దిత్తెరి, ఇవ్వకపోతే చస్తాను' అంటూ తధిగి ణతై తధిగిణతైమని గెంతి మరీపట్టుకు పోయేడు! (పెదవుల చప్పరింత)

శంకరం! వాడు ఇంటివాడు కాదోయ్! యములాడనుకో!" (చప్పరింత చప్పరింత)

యములింటివాణ్ని తల్చుకుంటూ ఉసూరుమని కూర్చుంది వర్ధనమ్మ.

గిరిజకి ఏం చెయ్యడానికీ పాలుపోలేదు. మూడో మనిషి ముందు తన తల్లి అబద్ధాల పుట్టని నిరూపణ జరిగి పోయినందుకు ఆమె సిగ్గుపడి పోయింది. గులాబిరంగులో ఉన్న ఆమె ముఖం మందారపు రంగులోకి మారిపోయింది. ఆమె గిరుక్కున వెనక్కి తిరిగి వెనక గదిలోకి వెళ్ళి,

"అమ్మా ఇలా రా అమ్మా!" అని తల్లిని అర్జంటుగా ఆతృతగా పిల్చింది.

ఆతృతా అర్జెన్సీ వర్ధనమ్మలో కనిపించలేదు. కుర్చీలో కూర్చొని అటు చూడనైనా చూడకుండా,

"ఎందుకే?" అని ప్రశ్నించింది.

"ఇలా రా చెప్తాను" అంది గిరిజ.

"నీ మొహం!" అంది వర్ధనమ్మ

భవానీశంకరం లేచి నిలుచున్నాడు.

"నిన్ను కాదోయ్, శంకరం?" అంది వర్ధనమ్మ.

"అబ్బే! నన్ను అన్నారనికాదు" భవనీశంకరప్రసాద్ నవ్వేడు. నవ్వేక,

"మరైతే నేనొస్తానండీ! ఇంత రాత్రప్పుడు నిద్రలేపి శ్రమ కల్పించాను. క్షమించండి. మరెక్కడైనా ప్రయత్నిస్తాన్లెండి. మీ అమ్మాయిగారితో కూడా చెప్పండి" అని చెప్పేసి అతను తొందరగా వీధి గుమ్మం దాటి తొందరగా జోడు తొడుక్కొని వెళ్లిపోయి వెన్నెల్లో కలిసిపోయేడు.

గిరిజ చటుక్కున అప్పుడు ముందుగదిలోకి వచ్చింది.

శంకరం వెళ్తానంటే 'వెళ్ళు నాయనా' అని అతణ్ని పంపివేసిన వర్ధనమ్మ నీరసంగా నిస్సహాయంగా ఆ కుర్చీలో అలా కూలబడిపోయే కూర్చుంది.

"అమ్మా! ఏం అమ్మా! ఎందుకలా పేసేవు?" అంటూ చేతులు జోడిస్తూ చిన్నపిల్లలా అడిగింది గిరిజ.

'అవును కాని, గిరిజా నీక్కాని మతిపోయిందేవిఁటే?' అని చుర చుర ప్రశ్నించింది కూతుర్ని తల్లి. చప్పబడ్డ అగ్నిపర్వతం ఒక్కసారి రవ్వలు చిమ్మినట్టు.

'అబ్బ! నువ్వెందుకలా అబద్ధా లాడేవమ్మా?' అని మారాం చేసినట్టుగా అడిగింది గిరిజ.

'ఆడితే ఆడతాను. ఆడితేమాత్రం ఆ కుర్రాడిముందు నా పరువు తీసేస్తావా?'

"నువ్వే తీసేసుకున్నావు. నేను తీసేయలేదు."

'డబ్బులేదు అని నేనంటే ఉంది అని నువ్వంటే, అదేఁవన్న మాట?'

'నువ్వలా అబద్ధాలాడితే నాకు చిన్నతనం వేసింది. ఇప్పుడు మళ్ళీ అతని మొహం చూడగలనా?'

'వాడి మొహం చూడవలసిన అవసరం నీ కేముంటుంది?!'

'అబ్బ! ఏంటమ్మా?!'

'వాడు శాంతమ్మ కొడుక్కాబట్టి సరిపోయింది. అదే ఏ పెద్దింటి వాళ్లో ఎవరో అనుకో. నువ్వలాచేస్తే మళ్ళీ వాళ్ళముందు నేను తలెత్తుకు తిరగ్గల్నా? తిరిగేస్తాను. ఫరవాలేదనుకో. కాని మన కవసరం ఒచ్చినప్పుడు వాళ్ళు మనకి సాయం చేస్తారా?'

'అదే నేనంటున్నదీను.'

'ఛీ? నోర్మయ్! వేలెల్లేవు. నాకు నీతులు చెప్తున్నావు! మన అవసరా లొచ్చినప్పుడు మనం చూసుకుంటాం కాని - అలా అన్చెప్పి - ఊరివాళ్ళందరి అవసరాలకీ మనం సాయపడగలమా?! శాంతమ్మ మంచిదే. మన క్కావలసిన మనిషే అయితే, అలా ఎంతమందిలేరు? అడిగినవాడికల్లా మనం అప్పులిస్తూ కూర్చోగలవాఁ? ఇచ్చుకుని వాళ్ళ వెనకాల తిరగ్గలవాఁ? బతకాలీ అంటే ఇదిగో ఇలా ఉండాలి ఇలా

చెయ్యాలి అని రూల్సు పెట్టుకుని బతకాలిగాని లేకపోతే ఈ రోజుల్లో మనం బతగ్గలవా? శాంతమ్మట, కొడుకుట, మంచివాళ్ళుట! కావన్లేదే నను! అయితే అంత మంచివాళ్ళనీ సాయం చెయ్యమను మనకి! నీ పెళ్ళికి పదివేలు కావాలి! శాంతమ్మ మంచికొడుకు మనకి ఇస్తాడేమో అడుగు చూదాం!'

'నా పెళ్ళికి డబ్బు ఖర్చయిపోతుందని అంత భయపడిపో అక్కర్లేదులే! నాకు పెళ్ళే అక్కర్లేదు! నే నిలాగే ఉండిపోతాను.'

"నాకు పెళ్ళే అక్కర్లేదు. నే నిల్లాగే ఉండిపోతాను" అని కూతుర్ని కోపంతో వెక్కిరించి, "దరిద్రమ్మాటలు దరిద్రమ్మాటలా అని!"అంటూ కుర్చీలోంచి లేచి, పైటచెంగు నేలని ఈడ్చుకొంటూ షెడ్డులోకి లారీ వెళ్ళినట్టు నెమ్మదిగా వెనగ్గదిలోకి వెళ్ళింది వర్ధనమ్మ.

వీధి గుమ్మందగ్గర నిలబడి, అలా కొంతసేపు వీధిలోకి చూస్తూ నిలబడి, ఆ తరవాత తలుపులువేసి, దీపం ఆర్పేసి, వాలు కుర్చీలో కూలబడింది గిరిజ.

రాత్రి ఒంటిగంట దగ్గరవుతోంది.

నిష్కల్మషమైన మనసుతో నిశ్చింతగా నిద్రపోతోంది వర్ధనమ్మ. కూతురి మాటల్లో ముఖ్యమైన దొకటి ఆమెని కొంతసేపు బాధపెట్టింది. ఆ రాత్రి కూతురి ప్రవర్తనే ఆమెకి అసలుకి నచ్చలేదు. వేగిరం పెళ్ళి చేసీకపోతే దీనికి పూర్తిగా మతిపోతుంది. పెళ్లి చేసెయ్యాలి. చేసెయ్యాలి, డబ్బు కూడబెట్టాలి కూడబెట్టాలి. డబ్బు....అప్పు లివ్వకూడదివ్వకూడ దివ్వకూడ దివ్వకూ....అనుకుంటూ నిద్రపోయింది వర్ధనమ్మ.

జీవితంలో అప్పుల సమస్య ఏనాడో వచ్చింది వర్ధనమ్మకి. 'పిన్నిగారూ! ఓ అయిదిస్తారా? మళ్ళా సాయంత్రం ఇచ్చేస్తాను' 'ఒదినా! ఓ పదియ్యి. రేపు మా ఆయన రాగానే ఇస్తాను' 'అత్తయ్యగారూ ఓ నాలుగు సర్దుదురూ! ఫస్టుతారీక్కి చూసి ఇచ్చేస్తాను' అని అందరూ అడుగుతుంటే ఎవరికివ్వడం? ఎవరికివ్వక పోడం? ఇచ్చిన తరవాత మళ్ళా ఎలా వసూలు చేసుకోడం! అయితే ఆ సమస్య చాలా సింపు

లుగా పరిష్కారం చేసుకోవచ్చుని ఆమెకి ఓనాడు తట్టింది. హరిమీద గిరి పడ్డా గిరిమీద హరిపడ్డా 'అప్పు ఇవ్వరాదు' అని రూలు పెట్టేసుకుంటే సరిపోతుందికదా అనిపించిందావిడకి! కమలమ్మ అడిగినా కోమలమ్మ అడిగినా శ్యామలమ్మకాదు శాంతమ్మ అడిగినా, ఎవరడిగినా అంతే! అలా అలా రూలు పెట్టేసుకొంటే చిక్కంతా టక్ టకా విడిపోతుంది! బాగుంది భగవంతుడా ఇది చాలా బాగుంది—

అని - ఆ విధంగా ఓ రూలు పెట్టుకున్నాక అటువంటి రూల్సు జీవితంలో మరికొన్ని కూడా ఏర్పాటు చేసేసుకొంటే జీవితం సాఫీగా సాగుతుందనిపించింది వర్ధనమ్మకి.

డబ్బు అప్పుగా ఎవరికివ్వాలి?

ఎవరికీ ఇవ్వకూడదు.

అలాగే! ఓటు ఎవరి కివ్వాలి?

దిక్కుమాలెన వెధవలంతా ఓటుఓటంటూ ఒచ్చి తినేస్తారు ఎవరి కివ్వడం? పూర్వం అదొక పెద్ద సమస్యగా వుండేది కాదు వర్ధనమ్మకి. భర్త వున్నపుడు భయంలేకపోయేది. ఆయన ఎవరికని చెపితే వారికే ఓటు వేసేసేదావిడ. ఆయన పోయాక ఆమెకి అది సమస్యయి పోయింది. అయితే - ఆవిడ రూల్సు పెట్టుకోడంలో లాభం గ్రహించిన పిమ్మట ఆ సమస్యని టూకీగా తెగ్గొట్టుకుంది. ఇప్పుడు ఆమెకది పెద్ద సమస్యేం కాదు. కాంగ్రెసు పార్టీవారు పోటీచేస్తే అడిగినా అడక్కపోయినా వారికే ఓటు. వాళ్ళు పోటీ చెయ్యనప్పుడు ఎవరు ముందుగా అడిగితే వారికే ఓటు!.....షో! దాన్తో చిక్కు తీరిపోయింది.

పాపం! వీడు కుంటివాడు! పాపం! వాడు గూనివాడు! పాపం! వాడు గుడ్డివాడు! పాపం! వీడు వాడికంటె గుడ్డివాడు! — వీరిలో ఎవరికి ముష్టి వెయ్యడం. ఎవరికి వెయ్యకపోడం. ఎవరికీ వెయ్యకపోడమా? అందరికీ ఎలానూ వెయ్యలేం! మరైతే ఏంచెయ్యడం? ఎవరికి వెయ్యక పోతే పాపం చుట్టుకొంటుందేమో?!

ఆ సమస్యకూడా సులభంగా సెటిల్ చేసేసుకొంది వర్ధనమ్మ.

అడిగిన ముష్టివాడికల్లా నయాపైస గొప్పున నెలకి నూరుపైసలు మాత్రం ముష్టి ఖర్చుకింద కేటాయింపు: ఆ నూరు పైసలూ అయి పోయాక? ముష్టీలేదు, గిష్టీలేదు. వెళ్ళండి బాబూ వెళ్ళండి వెర్రా ఆర్చీ వెళ్ళు వెళ్ళు, పొండిపొండి అంతా పొండి మళ్ళీ వచ్చేనెలే, మరింక రాకండి.

మంగమ్మ శపథం, ఓ సినిమా, మరిడమ్మ ఉపవాసం మరో సినిమా - ఇలాగ నెలకి ఎన్ని సినీమాలని చూడ్డం? అమ్మాయిని ఎన్ని సినీమాలకి పంపించడం? అబ్బాయిని ఎన్నింటికి పంపించడం?

అమ్మాయీ చిన్నబ్బాయీ ఇద్దరూ కలిసి నెలకు రెండు సినీమాల కంటె ఎక్కువ డకూడదు అంతే. ఈ నెల రెండు సినీమాలూ చూసే సేరా? మరైతే మళ్ళీ నెలే.

అదే విధంగా—— .

ఎవరింటికి పేరంటానికి వెళ్ళినా సరే. రవికల గుడ్డలు ఇచ్చే పద్ధతిలేదు.

ఇంటికి చుట్టాలు ఎవరొచ్చినా భోజనానికి ఉండమనిచెప్పే పద్ధతి లేదు.

పప్పులు ఉప్పులు కాఫీగుండలు – ఎవరేది అప్పడగడానికివచ్చినా లేదులేదనే అనవలెను.

ఎంత చెడ్డవారినయినాసరే చెడ్డవారని పైకి చెప్పకూడదు.

ఇరుగిళ్ళకి పొరుగిళ్ళకి బాతాఖానీకి వెళ్ళకూడదు.

బట్టలకింద ఏడాదికి ఇంతకుమించి ఖర్చుచేయరాదు.

అన్నయ్య చెప్పనిదే ఏ కోర్టు కాయితం మీదా సంతకము చేయ రాదు.

పత్రికలూ పేపర్లూ కొని చదవరాదు.

ఆ విధంగా అనేకమైన రూల్సు ఎక్కడికి కక్కడ ఏర్పాటు చేసు కొని, జీవన భారాన్ని తగ్గించుకొని, జీవితయాత్రని ఆ మేరకి సులభం చేసుకొంది వర్ధనమ్మ. రూలు ప్రకారం సమస్యని పరిష్కరించుకొని చాలా

మట్టుకు నిశ్చింతగా ఉంటోందావిడ. ముక్కుసూటిగా పోతుంది కాబట్టి భగవంతుడయినాసరే ఆమెయందు ఏ తప్పూ చూపించజాలడు. ఆవిడ తప్పేమీ చెయ్యడం లేదు కాబట్టి ఆవిడకి అంతరాత్మ బాధేంలేదు. రూలు నిలబెట్టు కొందికే కాబట్టి అదేం పాపం కాదు!

వర్ధనమ్మగారి రూల్సు బతుకుబాటలోంచి ముళ్ళని ఏరిపారేసుకో డానికి పనికొచ్చే రూల్సు.

రాత్రి రెండుగంటలయింది.

వర్ధనమ్మ హాయిగా నిద్రపోతోంది.

గిరిజ మాత్రం మేల్కొనే వుంది.

తల్లి అబద్ధం ఆడిందని సిగ్గుపడి దొంగతనం చేసిన కూతురు - (మానవ సమాజంలో చెడ్డ కారణాలకి చెడ్డవే ఫలితాలుంటాయి కాని మంచి వుంటాయా?!) - కళ్లాపు నీళ్ళు జల్లే గుండెల డాక్టరు-తండ్రిని భరించలేక తలుపులు మూసుకొన్న తనయుడు - చచ్చిన వీధిలో మూర్ఛపోయిన మందగమన —

# 14

ఆ రోడ్డంట తిన్నగా వెళ్తే....

ఆ రోడ్డంట తిన్నగా వెళ్ళడానికి వీలుండదు. రాజమ్మ గేదెలు మాటిమాటికీ అడ్డొస్తాయి. వాటి కొమ్ముల్నీ తోకల్నీ తప్పించుకొని కొంత దూరం వెళ్ళగా, రోడ్డుకి పశ్చిమంగా ఓ పావు ఎకరం ఖాళీ జాగా కనిపిస్తుంది.

ఆ ఖాళీ జాగాలో పూర్వం పెద్ద మేడొకటి ఉండేదిట. అది చాలా భారీగా చాలా దర్జాగా మొగల్ భోగంలాగా బ్రిటిష్ వైభవంలాగా ఉండేదని ఊళ్ళో ముసలివారంతా చెప్తారు. ఆ భోగమూ వైభవమూ ఇప్పుడు లేవు. కాలానికి కూలిపోయిందది. గుమ్మాలూ కిటికీలతో సహా పెంకులు, ఇటికలు, రాళ్ళు పునాదులతో సహా దాన్ని తవ్వుకుపోయేరు జనం.

ఆ జాగాలో కొన్నాళ్ళ కిందట ఓ రాత్రికి రాత్రి ఓ కమ్మలపాకొ కటి లేచింది. వీధిలో జనం అదిచూసి కొంత ఆశ్చర్యపోయేరు.

పాకకి చుట్టు గోడలులేవు. వీధిలోంచి లోపలంతా బారుగా కని పిస్తుంది. ఆ పాకలో ఓ కుర్చీ వేసుకు కూర్చొని ఓ పాతికేళ్ళ యువకుడు ఆ పాకని పరీక్షగా చూస్తున్నాడు. రోడ్డుమీద జనం ఆగి అతణ్ని పరీక్షగా చూసి వెళుతున్నారు. ఉదయం ఏడుగంటలయింది.

గళ్ళ గుండారు కట్టుకొని బనియను మాత్రం తొడుక్కొని ఓ టర్కీ తువాలు భుజాన వేసుకొని మందుల భీముడు తిన్నగా ఆ పాకలోకి వెళ్ళి నిల్చున్నాడు.

కుర్చీలో కూర్చున్న యువకుడు అతణ్ని కళ్ళతో "ఏం గావాలి?" అని ప్రశ్నించేడు.

తను ఎవరో తనకి ఏం కావాలో చెప్పకుండా,

"మీరెవరు?", అని అడిగేడు మందుల భీముడు.

"నేను భవానీశంకర ప్రసాద్‌ని," అని సమాధానం చెప్పి, చిరు నవ్వు నవ్వి, కుర్చీలోంచి లేచి నిల్చొని, "రండి, కూర్చోండి!" అని మందుల భీముణ్ని ఆహ్వానించేడు ఆ యువకుడు.

మందుల భీముడు కుర్చీలో కూర్చోలేదు. "సడెన్ చెకింగు" చేసే ఆఫీసరు తను నిల్చొనేఉండి గుమాస్తాని 'నిలదీసి' నట్టుగా చాలా హడా విడిగా నిలబడ్డాడు మందుల భీముడు.

"ఈ జాగాలో పాకెలాకట్టేరూ?"

"పాకలెలా కడతారో అలానే కట్టేను." అని నవ్వుతూ అన్నాడు భవానీశంకరప్రసాదు.

సమాధానంబట్టి అవతల మనిషిని అంచనా కట్టిన మందుల భీముడు కొంచెం తగ్గి,

"ఎవరు మీరసలు?" అని అడిగేడు.

సోనాప్యాకి కంపెనీలో ఉద్యోగినని తెలియజేసేడు యువకుడు.

"మావాడు కూడా అందులోనే ఉన్నాడే?" అన్నాడు మందుల భీముడు.

"అప్పుడు - రంగారావు - తెలుసును" అన్నాడు యువకుడు.

"అయితే నన్నుకూడా మీకు తెలుసునన్నమాట!!" అన్నాడు మందుల భీముడు. అని కొంచెం సంతోషించేడు. అతని గర్వం అనే దీపానికి కొంచెం చమురు పోసినట్టయింది. ఇంకా గీసుకోని అతని గడ్డపు వెంట్రుకలమధ్య మల్లెపువ్వులా ఓ చిన్న నవ్వు పుట్టింది. అతను వెళ్ళి, ప్రసాద్ ఖాళీ చేసిన కుర్చీలో అప్పుడు కూర్చున్నాడు. కాఫీతాగిన ఆఫీసర్లా అతను కొంచెం శాంతించేడు.

"మీరు కౌన్సిలర్ భీమసేన్రావుగారు కదా! నా కెందుకు తెలీదూ?" అన్నాడు భవానీశంకరం.

కాఫీతాగి కిళ్లీ బిగించి సిగరెట్ ముట్టించిన ఆఫీసర్లా సుఖంగా సర్దుకు కూర్చున్నాడు మందుల భీముడు. అయితే అతనా సమయంలో సిగరెట్ ముట్టించలేదు. చుట్ట ముట్టించేడు.

"ఏవూరు మీది?" అని అడిగి ఆ యువకుని ఊరేదో తెలుసుకున్నాడు మందుల భీముడు. అలాగే "ఏమిట్లు మీరు?" అని అడిగి అతని కులం ఏదో తెలుసుకున్నాడు. అతనికి తండ్రిలేడనికూడా తెలుసుకున్నాడు. ఎన్నాళ్ళ సర్వీసో తెలుసుకున్నాడు. పెళ్ళవలేదని తెలుసుకున్నాడు.

"అయితే, జీతం మావాడి కెక్కువా నీ కెక్కువా?" అని ప్రశ్నించి తన కొడుక్కికంటె అతనికే ఎక్కువ జీతం అని తెలుసుకొని కొంచెంసేపు ఊరుకున్నాడు. అయితే, అతని మౌనంలో శాంతంలేదు. లంచ్ ముందు జట్టీ బెంచ్ మీంచి కొరకొరలాడినట్టు కొరకొరలాడే వతను.

షెరాయిమీద షర్టు తొడుక్కొని పొడవుగా ఉన్నప్పటికీ పల్చగా ఉండి, కుర్రవాళ్ళా కనిపిస్తున్నాడు భవానీశంకరం. సంభాషణలో ఆ కుర్రవాణ్ని "మీరు"గా ఎత్తడంకంటె "నువ్వు"గా దించటమే మంచిదనుకున్నాడు మందుల భీముడు. అందుచేత చిరునవ్వు నవ్వుతూ, "ఈ జాగాలో ఎవర్నడిగి ఏసేవయ్యా పాకా?" అని అడిగేడు.

"జాగా గలవార్ని అడిగి వేసేను," అన్నాడు భవానీశంకరం.

"అంటే, మున్నిపాల్టీనా?"

"కాదు"

"మరైతే ఎవరు?"

"జాగా గలవారు"

"ఈ జాగా మున్నిపాల్టీది."

"మున్నిపాల్టీవారిదో మరెవరిదో - వాళ్ళూ వాళ్ళూ తేల్చుకుంటా ర్లెండీ."

"అదెలా వీలవుద్ది?"

"ఏది ఎలా వీలవదు?"

అందుకు మందుల భీముడు సమాధానం చెప్పలేదు. కొంచెంసేపు ఊరుకోని——

"ఈ జాగా ఊరంతా ఓడుకొంటున్నారే!" అన్నాడు.

అందుకు భవానీశంకరం నవ్వేడు. పెంకెతనంగా నవ్వేడేమోనని అతణ్ని పరీక్షగా చూసేడు మందుల భీమసేనుడు. శంకరుళ్ళో వెటకారం లేకపోయినా భీముళ్ళో అనుమానం మాత్రం పోలేదు.

"ఊరంతా వాడుకుంటే నేనూ వాడుకుంటాను. ఇందాట్లా ఎవరో ఆడమనిషి వచ్చింది. రాజమ్మట పేరు. ఆ గేదెలన్నీ ఆవిడవేనట. ఆవిడకి ఇదే సమాధానం చెప్పేను. జాగాగల వారిదగ్గర్నించి నాకు పర్మిషన్ ఉంది. అద్దెచీటీ ఉంది కాదన్నవార్ని కోర్టెక్కమనండి. కాశీదాకా దేకరమనండి, ఏంచేసుకోమనండి నా పాకలో నేనుంటాను"

కుర్రవాణ్ని ఆపాదమస్తకం ఓ సారి చూసేడు భీమసేనుడు, చూసేక,

"మున్నిపాల్టీలో పాకలెయ్యడానికి ఈల్లేదే" అని శాంతంగా, చాలా సత్యాహింసల మనిషిలా చెప్పేడు

"మ్యునిసిపాల్టీవాళ్ళు తాఖీదిస్తే జవాబుకీ సాయానికీ మీ దగ్గరకే

ఒస్తాను. మీ ఇంటి కెదురుగా పాక ఏ పూలు ప్రకారం వేసేరో ఇదీ ఆ ప్రకారవే వేసేం అని చెబ్దాం", అన్నాడు భీముడితో శంకరుడు.

"అది పాత పాక." అన్నాడు భీముడు తన నోట్లో చుట్టకొనవైపు సూటిగా చూస్తూ.

"ఏదేవై నా, మీరుండగా నాకు భయం ఏం వుందండీ గురువు గారూ!" అని కొంచెం చనువుగానూ నవ్వుతూనూ అన్నాడు శంకరం. ఆ చనువులోనూ నవ్వులోనూ కొంచెం వినయంకూడా కలిపి చూపించే డతను.

పెంపరకీగానే అయినప్పటికీ ఆ వినయానికి కొంచెం లొంగినట్టు కనిపించేడు మందుల భీముడు. "సర్లే! ఏదో చూద్దాం! అప్పుడప్పుడు అపుపిస్తూ మాత్రం ఉండు!" అంటూ లేచి వెళ్ళేడతను.

"నే నుంటానై తే" అన్నాడు భవానీ శంకరం.

నోనాప్యారీలో భవానీశంకరానికి రామారావనే స్టెనో ద్వారా అయింది. ఉద్యోగంలోచేరి నాలుగైదేళ్ళవుతుందేమో, మూడు నాలుగేళ్ళ పాటు అతను అద్దె యిళ్ళల్లో ఉండి చివరికి విసుగెత్తి ఈ పాక ఏర్పాటు చేసుకొని అదంతా అందంగా తయారు చేసుకొని పాకముందు ఖాళీ జాగా చుట్టూ ఫెన్సింగుకట్టి అక్కడ మొక్కలూ తీగెలూ పెంచుకొంటూ "హాయిగానే ఉన్నా"డని చెప్పాలి ఇప్పుడు. ఆ జాగాలు అతని పాకకి వెనకపక్కా, చుట్టుపక్కలంతాకూడా రాజమ్మ తన గేదెల్ని ఎన్నాళ్ళనుంచో కడుతూంది. అతనిపాక అక్కడ వచ్చేకే అతనికీ ఆవిడకీ మధ్య లిటి గేషను లేచి పెరిగింది.

భవానీశంకరం పాతిక రూపాయల అప్పుకోసం వర్ధనమ్మగారింటికి వెళ్ళిన రాత్రి తెల్లవారుతూందనగా—

ఓ డెబ్బయేళ్ళ ముసలమ్మ ఆ పాకముందు కళ్ళాపునీళ్లు జల్లు తోంది. సూర్యోదయం అవడానికి ఇంకా వ్యవధిఉంది. కొంచెం చలిగా ఉంది. పాక చుట్టూ గేదెల పటాలం కొంతగా కనిపిస్తోంది. ఆ పటాలం ఉన్న జాగాలోంచి అదొకవిధమయిన రొచ్చువాసన వస్తోంది. ఆ పాక

ముందునుంచి జనం కొంతమంది సముద్రంవైపు చెంబులు పట్టుకొని (కొంతమంది పట్టుకోకుండానూ) వెళ్తున్నారు, వస్తున్నారు. పాకకి ఎదురుగా కొళాయొకటుంది. అక్కడనుంచి బిందెలచప్పుళ్ళూ, ఆడవారి కేకలు వినవస్తున్నాయి.

చీకటి సముద్రంలోంచి మసక వెన్నెల్లాంటి వెలుగులోకి ఊరంతా నెమ్మదిగా తేల్తోంది. ఆ వెలుగు మరి కాసేపట్లో ఎండగా మారుతుం దనగా, ఆ కమ్మలపాక ముందున్న ఫెన్సింగ్ వున్న గేటుతెరిచి (వయస్సు) ఇరవయ్యేళ్ళ వయస్సుగల అమ్మాయి తొందరగా లోనికి నడిచింది. ముసలి గేదె మెడెత్తి చూసినట్టు కళ్ళాపు జల్లే ముసలమ్మ వంగొనే తలెత్తి చూసింది ఆ వచ్చిన పిల్లని.

తొట్రుపాటు పడుతూ అడిగినట్టుగా, "శాంతమ్మగారి ఇల్లు ఇదేనా ?" అని ముసలమ్మని అడిగింది గిరిజ.

"ఎవరిల్లమ్మా ? చాంతమ్మగోరిదా ?"

"అవును."

"చాంతమ్మగోరిల్లి దేనమ్మా, ఏం ? ఆ యమ్మ కావాలా ?"

"ఆవిణ్నొకక్కసారి ఇలా రమ్మందూ !" అని తొందర తొందరగా చెప్పింది.

"ఆయమ్మ నేదమ్మా," అంది ముసలమ్మ చాలా జాలిగా.

ఆ జాలి ఆ ముసలమ్మకి శాంతమ్మగారియెడలా ఉన్నట్టనిపించింది. శాంతమ్మకోసం వచ్చినవారియెడలా ఉన్నట్టనిపించింది. మంచివారెవరో చనిపోయారన్న వార్త ఆ మంచివాళ్ళ చుట్టాలతో చెప్పినట్టుగా చెప్పింది ముసలమ్మ.

"ఏం ? ఏఁవిఁటయింది ? ఎక్కడకైనా వెళ్ళేరా ? లేకపోతే...." అంటూ ఆగిపోయింది గిరిజ. ఆమె కెందుకోగాని, శాంతమ్మ కేదో ప్రమాదం సంభవించిం దనిపించింది.

"రేత్తిరే ఎళిపోనారమ్మా ?" అంది ముసలమ్మ చాలా దీనంగా.

కాంతమ్మ చనిపోయిం దనుకున్న గిరిజకి మూర్ఛ వాపో వచ్చే లోపున,

"ఆళ్ళ సుట్టాల కెవరికో సుస్తీగుందంట. రేత్రే ఎల్లిపోనారు కాంతమ్మగోరు ఆళ్ళని సూడ్డానికి" అని వివరంగా చెప్పింది ముసలమ్మ.

ఆ వార్త వినగానే కలిగిన రిలీఫ్ వల్ల మూర్ఛవచ్చినట్టయింది గిరిజకి. కాని, తమాయించుకు నిల్చుంది.

"పోనీ....(ఛీ : సిగ్గెందుకు ?")

"పోనీ....(ఛ : సిగ్గేమిటి అసహ్యంగా :) పోనీ, వారబ్బాయిని ఓసారి పిలవగలవా ?"

అని అడుగుతూన్నప్పుడు గిరిజ గుండెలు ఎందుకోగాని గాబరాపడి అల్లరి చేసేయి. ఆమె వళ్ళంతా చాలా నీరసం అయిపోయింది.

"రాజుబాబుకూడా నేరమ్మా" అంది ముసలమ్మ సీతమ్మ లేదని రాముడితో జటాయువు చెప్పినట్టు.

"రాజుబాబుకాదు భవానీశంకరం బాబు. (పేరు పలకడానికి సిగ్గెందుకు ? కాని ఆ పేరులో అంత తీపెందుకు ?....ఛీ: నేను సిల్లీఫూల్ని?)" అని తన మనిషెవరో సరిగా తెలియజెప్పింది గిరిజ.

"కాంతమ్మగో రబ్బాయేనా ?" అని ఎదురడిగింది ముసలమ్మ.

అవునంది గిరిజ.

"ఆ బాబునే రాజుబాబంటారు. ఊరోళ్ళెట్టిన పేరది :" అనే పరమసత్యాన్ని గిరిజకి గర్వపడుతూ తెలియజేసింది ముసలమ్మ. హరిహరు లిద్దరూ ఒకరేనని పామరులకి పండితులు చెప్పినట్టు.

"ఆ బాబేకావాలి నాకు. (నేను సిల్లీఫూల్ని కాబట్టి సిగ్గు పడుతున్నాను.)"

"రాజుబాబు నీకు కావలసినోడా ?" అని అమాయకంగా అడిగినట్టుగానే అడిగింది ముసలమ్మ. ఓ అడుగు ముందుకొచ్చి ఆమె గిరిజని కొంచెం పరీక్షగాకూడా చూసింది.

ఆ చూపుకి గిరిజ ఎంతో సిగ్గుపడింది.

గుండెల డాక్టర్లా వుంది కాని ఈ ముసల్ది మామూలు ముస లమ్మలా లేదు,

"ఆ బాబుతో మాట్లాడవలసిన పనుంది"

ఏటామాటలు ? ఏటాపని అని అడక్కుండా,

"నీకు పెళ్ళయిందా ? లేక సదువుకొంటున్నావా ?" అని ప్రశ్నించింది ముసలమ్మ. ఆడదానికి పెళ్ళయిపోతే చదువక్కర్లేదన్నట్టు.

సమాధానంగా గిరిజ నవ్వి. "శాంతమ్మగా రబ్బాయి ఉన్నారా లేరమ్మా ?" అని - నా ప్రశ్నకి ముందు జవాబు చెప్పు స్వరంతో అడిగింది.

"చాంతమ్మగోరూ అబ్బాయిగోరూ కూడా ఆళ్ళ సుట్టాలింటికే ఎల్లేరమ్మా ! అబ్బాయిగోరు నిన్న పొద్దుపేలే ఎలిపోనారు. బోజినాని క్కూడా రాలేదు. చాయింకాలందాకా కొడుక్కోసరం సూస్సాసి రేతిరి కింటికాడ నన్ను కాపెట్టి ఆయమ్మకూడా రేతిరి బయలెల్లింది. ఇంకా రాలేదు. మరక్కడ ఏటయిందో ఏటో ?" అంది ముసలమ్మ.

"అక్కడెవరికైనా ప్రమాదంగా ఉందా ?" అని ఆందోళనపడుతూ అడిగింది గిరిజ.

"మూడోరాల్నించీ జొరం అమ్మా ! మరి పెమాదంగాదా ?"అంది ముసలమ్మ.

"ఎలాఉందో ఏమిటో రాత్రి మరి ఏ కబురూ రాలేదా ?"

"చూది మందంట, అదేదో కొంటానికి ఆళ్ళకి డబ్బునేదంట, అదుంటే మాత్తరం పేనం దక్కుద్దీ అంటాడు మనబాబు. డబ్బుకోసరం మనబాబు ఎన్ని పుర్రాకులు పడతున్నాడో ఆ సత్తెంనారాయణమూర్తికే ఎరికగాని మరోల కెరికనేదు. పరుల పేనాలకోసం కష్టం పడమని నొసలుమీద రాసింతరాత మరింక ఆ బాబుకి తిప్పట తప్పుద్దా ?" తప్పదంతే ! ఏటిజేస్తాం ? మనసు ఎన్నలాటిదైతే సుట్టానికి కష్టమొచ్చినా కరుగుద్ది ! స్నేహితుడొంటికి కష్టమొచ్చినా కరుగుద్ది, ఊరుకానూరోడికి

కష్టం వొచ్చినా కరుగుద్ది! మన బాబుది వెన్నలాటి మనసు, కరగొద్దంటే మాత్తరం కరగడం మానుద్దా?! ఏటోలోకం! విచిత్రమైనలోకం ఈలోకం!" అంటూ ముసలమ్మ మళ్ళీ కళ్లాపు నీళ్ళు చల్లడానికి ఉపక్రమించింది.

కళ్లాపునీళ్ళు తనమీద పడకుండా ముసలమ్మకి వెనకవైపుకి వెళ్లి నిలబడి,

"అయితే, శాంతమ్మగారూ వారబ్బాయీ ఇప్పుడు వాళ్ళ చుట్టాలింటివగ్గరే ఉంటారా?" అని అడిగింది గిరిజ.

"అక్కడికే ఎల్లేరు మరి" అంది ముసలమ్మ.

"ఆ ఇల్లెక్కడో తెలుసా?"

"సూడమ్మా, ఆంజనేయి సోంవులోరి గుడింది ఎరికా?"

"అవును ఉంది. తెలుసు"

"దాని కెదురుగ్గుంది ఆళ్ళ యిల్లు"

"వాళ్ళ చుట్టంపేరు తెలుసా?"

"ఎరికె నేదమ్మా"

"ఆయన కేం పని?

"ఏంపనో ఏటో?! జబ్బుతో కాలూ సెయ్యీ పడిపోయినోడికి మరింక పనేటుంటది?!"

"మరైతే, నే నక్కడికి వెళ్లొస్తాను" అని చెప్పి గేటువైపుకి నడిచింది గిరిజ.

ముసలమ్మ, కళ్లాపునీళ్ళు జల్లడం ఆపి, "అమ్మా, అమ్మా!" అని కేకలేసింది.

ఆగి, వెనక్కి తిరిగింది గిరిజ.

"మాట మాట" అంటూ ముసలమ్మ చెయ్యూపుతూ, చిన్న నవ్వు నవ్వుతూ పిల్చింది.

గిరిజ ఆమెకి దగ్గరగా వెళ్లింది.

"మాట" అంది ముసలమ్మ.

"చెప్పు" అంది గిరిజ.

"బాబు నిన్ను డబ్బడిగినాదేటి ?" అని రహస్యంగా అడిగింది ముసలమ్మ.

ఏం చెప్పడానికి మొహమాట పడింది గిరిజ. కాని సమాధానం గ్రహించిన ముసలమ్మ మాత్రం గిరిజ చేతిలోఉన్న చిన్నపర్సు చూపిస్తూ.

"డబ్బు తెచ్చినావేటి ?" అని ఇంకా రహస్యంగా అడిగింది.

మొదటి ప్రశ్నకి మొహమాటపడ్డ గిరిజ ఆ రెండో ప్రశ్నకి సిగ్గు పడింది. ఆ మొహమాటంలోంచీ ఈ సిగ్గులోంచీ కూడా సమాధానాలు లాగ్గలిగిన ముసలమ్మమాత్రం గిరిజ జవాబుకి ఎదురు చూడకుండా ఇంకా రహస్యంగా మాట్లాడసాగింది.

"నీ యమ్మకడుపు సల్లగ నిన్ను సత్తింనారాయనమూర్తి సల్లగ సూస్తాడమ్మా ! ఎల్లు ! బేగెల్లి ఆ డబ్బు ఒట్టికెల్లి బాబుసేతికియ్యి ! ఆ సుట్టంబాబు పేనం నిలబడ్డదా ఆ పేరంతా నీకే ! ఆ పున్యఁవంతా నీకే ! ఎల్లెల్లు బేగెల్లు" అంటూ ముసలమ్మ గిరిజ పనికి మెచ్చుకొని, తొందర చేసింది.

ఆ సమయంలో ఎలా ముఖం పెట్టాలో తెలియక తికమకపడింది గిరిజ. అంచేత, "ఒస్తాను" అని చెప్పి వెళ్ళిపోబోతూంటే ఆమెని మళ్ళీ పిల్చింది.

"ఏంకావాలి ముసలమ్మా ?" అని విసుక్కొని, విసుక్కున్నందుకు నవ్వుకొంది గిరిజ.

"ఏటక్కర్నేదు. ఒక్కసుట్టు ఇలారా !" అంది ముసలమ్మ. చెయ్యెత్తి చూపుడువేలితో పిలుస్తూ. ఆ పిలుపులో టక్కరితనం కనిపిస్తోంది.

మళ్ళీ వెనక్కి వెళ్ళింది గిరిజ.

"సూడూ" అంది ముసలమ్మ అత్తవారింటికి వెళ్ళే ఆడకూతురితో తల్లి మాటాడినట్టు.

గిరిజ ఆ ముసలమ్మ ముఖంలోకి చూసింది.

"సూడూ, రాజువాబున్నాడే! కానా మంచోడు! కిట్టన్ ముసిపలం సెప్పినా ఇనమోక! ఆ బాబు కానా మంచోడు. ఆ బాబు ఒపుతూ ఒగ్గక! ఒప్పుడు సెప్పినా ఒగ్గమోక! ఆ బాబు ని [illegible] మందు! నీయమ్మ కడుపుసల్లగా మరింక ఎల్లిరా!" అని అతి రహస్యంగా గిరిజకి బోధనచేసి మరింక వెళ్ళమని ఆమెకి సెలవిచ్చింది ముసలమ్మ.

ఆ బోధనకి ఏమనాలో చెప్పాలో తెలియని వెఱ్ఱిముఖం వేసుకొని, ఓ వెఱ్ఱినవ్వు నవ్వి 'సరేలే ఈసారి వెళ్ళమంటావా లేక మళ్ళీపిలుస్తావా?" అని నవ్వుతూ బైటకి వచ్చింది.

ఓ రిక్షా ముసలివాడు రిక్షా ఆపేడు. అందులో కూర్చొని "ఆంజనేయస్వామి గుడికి!" అని చెప్పింది గిరిజ. రిక్షా కదిలింది.

అలనాడు సత్యవంతుణ్ని చూడగానే సావిత్రికి వెఱ్ఱెత్తిందిట. మైనర్ స్కేల్లో తనుకూడా అలానే వ్యవహరిస్తున్నానని తెలుసుకోలేదు గిరిజ. కాని ఏనుగులంతవాళ్ళు ఏనుగంత వెఱ్ఱిగా ఉంటే, చీమలంతవాళ్ల చీమంత వెఱ్ఱిగా ఉంటారు. రాత్రంతా మేలుకుర్చున్న గిరిజకి తెల్లవారేసరికి చిన్న చీమంత వెఱ్ఱి పట్టుకొంది. "ఏం? ఎందుక్కూడదు" అనుకొంది. శాంతమ్మ కొడుకుని తన తల్లి అవమానించడం ఆమెని చాలా బాధించింది. నెహ్రూగారు అర్జంటుగా నడుచుకువచ్చి నాలుగు రూపాయిలు అప్పుగా అడుగుతే తన తల్లి లేదు పొమ్మంటే తను ఆ అవమానానికి ఎంతగా బాధపడుతుందో అదేవిధంగా ఆమె బాధ పడసాగింది. అందులోనూ "అబద్ధం ఆడి, అమ్మ దొరికిపోయింది కూడాను!" కుంతిచేసిన పాడుపనికి కర్ణుడు సిగ్గుపడ్డట్టు సిగ్గుపడింది గిరిజ. 'అయ్యో పాపం శాంతమ్మ కొడుకు ఎంత బాధపడ్డాడోకదా' అనుకొంది గిరిజ. అతను మంచివాడు కాబట్టి చిరునవ్వు నవ్వి తన తల్లి అబద్ధాన్ని క్షమించ గలిగేడు. తను అల్పమైనది కాబట్టి తన తల్లి తప్పుని క్షమించలేకపోతూంది. అయినా పాపం. అమ్మని మట్టుకు అనేం లాభం? పాపం అమ్మ ఎన్నెన్నో కష్టాలు పడింది. డబ్బు చాలక. పెనిమిటిలేక, పిల్లల్ని

పెంచడానికి సరైన ఆధారం కనిపించక, చుట్టాలుకాని స్నేహితులుకాని ఇరుపంచల చేరక, ఎన్ని దురవస్థలు పడిపడి ఇంత రాక్షసంగా తయారయిందో అమ్మ! ఎడారిలో ఒంటెలమీద నీళ్ళ సంచులు వేసుకు వెళుతున్నవాళ్ళు పదిమంది పిల్లల్తో ఓ తల్లి వచ్చినప్పుడు ఆమెకి నాలుగు చుక్కలైనా నీళ్ళు రాల్చినప్పుడు ఆ తల్లి ఏం చేస్తుంది? దోసెడు నీళ్ళు దొరికినప్పుడు అవి భద్రంగా దాచుకొంటుందె కాని ఇంద్రుడొచ్చి అడిగినా ఇస్తుందా? ఇవ్వకపోతే ఆమెది తప్పందా? పాపం అమ్మ మంచిదే. ఎంతో మంచిది. రాళ్ళు మోసేవాళ్ళ చేతులు మొద్దుబారిపోయినట్టు కష్టాలు పడిపడి అమ్మ మనసు బండబారిపోయింది. అమ్మ చాలా మంచిది. కొంచెం ఆలోచించడానికి వ్యవధుంటే తనే స్వయంగా అతనికి ఆ డబ్బు ఇచ్చిఉండును. అర్ధరాత్రివేళ అకస్మాత్తుగా అడిగితే లేదనే అలవాటుమీద 'లేదు పో'మ్మంది. పొద్దున్న అతను వచ్చి సంగతంతా సరిగా చెప్తేఅమ్మ అతనికి పాతికేకాదు యాభై రూపాయలు కూడా ఇచ్చేదే. నిద్రమత్తున అమ్మకి మైండు సరిగా పని చెయ్యలేదు. అమ్మదేం పొరపాటు లేదు. కాని పాపం ఆ డబ్బేకాని అతనికి ఇస్తే అతనెంత సంతోషించి ఉండునో! అన్నిచోట్లా నిరాశై పోగా ఆఖర్న మనింటికి వచ్చేడు. 'సొమ్మొంది! ఇస్తారు' అని చెప్పి ఎంతో ఆశపడ్డాడు. చివరకి మళ్ళీ నిరాశతో వెళిపోయేడు. అమ్మ అలా అబద్ధం ఆడినందుకు తను సిగ్గు పడవలసింది పోయి, అతనెంతో సిగ్గు పడ్డాడు పాపం మంచివాడు! ఎంత అర్జంటుగ అవసరం కాకపోతే అర్ధ రాత్రి తలుపుతట్టి వస్తాడు?

అంతవరకు ఆ రాత్రి నిశ్చలంగా కూర్చొన్న గిరిజ ఆ రాత్రి ఆ చీకట్లో తుళ్ళిపడింది. ఆమె గుండెలు గబగబ కొట్టుకున్నాయి. డెబ్భై బోగీల మాంగనీసు బరువుతో మెయిలు స్పీడుతో ఓ గూడ్సుబండి గుండెలమీంచి వెళ్ళిపోయినట్టు ఆమె ఉక్కిరి బిక్కిరయి పోయింది. ఎవరో చావు బతుకులమధ్య ఉన్నారట! ఎవరది? వారికి ఈ క్షణంలో ఎలా ఉంది? ఇప్పుడు డబ్బు ఇస్తే దాన్తో మందుకొంటే, ఆ మందు ఆ జబ్బుమనిషికి ఇస్తె ఆ మనిషి ప్రాణం నిలబడుతుందట! ఇవ్వకపోతే

...వారెవరో చచ్చిపోతే అతనెవరో చచ్చిపోతే ఎవరికి ఎవరికెవరికి ఎవరిదా పాపం?!

గిరిజ గడగడ వణికిపోయింది.

అందుచేతనే ఆమె రిక్షాలో కూర్చొని అంత తొందరగా తనకి తెలియని ఎవరో జబ్బుమనిషి ఎక్కడున్నాడని వెతుక్కుంటూ వెళ్తోంది. జరిగినదీ జరుగుతున్నదీ కలో లేక నిజమో తెలియకుండా ఆమె వెళ్తోంది.

తనేనా? తనేనా, తనేనా. తల్లి మెడలోంచి తాళాలులాగి, పెట్టె తెరిచి, డబ్బు తీసి, తాళంవేసి, తాళాలు తలగడాకిందపెట్టి. అమ్మకి ఓ చీటీకూడా రాసిఉంచి, తొందరగా బయల్దేరి తనేనా ఇలా వెళ్తున్నది? తనేనా దొంగపని చేసినది! తనేనా? అవున్నేనే చేసేను! ప్రాణాన్ని కాపాడాలనే తహతహా? తలుపు తట్టిన పాతంటే జాలా? నిందలపాలు కాకుండా తల్లిని రక్షించాలనే అభిమానమా? ఏమీ తోచకపోతే ఇలా చేసి అడ్వెన్చరస్‌గా ఉందామనా? ఒట్టి గొప్పగా? నేను కూడా మానవసేవ చేయగలననే మెహర్బానీకా? ఎందుకోసం గిరిజా, ఎందుకోసం ఇలా చేసేవు?'

అని తనని తను ప్రశ్నించుకొంది గిరిజ. అందుకు సమాధానం చెప్పుకొనేలోపున.

"అమ్మా! గుడికాడ కొచ్చినాం" అన్నాదు రిక్షావాడు.

గిరిజ అటూ ఇటూ చూసింది.

అప్పటికప్పుడే ఉదయం అరయింది. ఆకాశం మసక మబ్బుల్తో మూసుకుపోవడంచేత, ఉదయించిన సూర్యుడు ఉదయించగానే చచ్చేడు. పక్కనున్న ఆంజనేయుడి గుడితలుపు లెందుచేతనో గాని మూసిఉన్నాయి. రాయీ, రప్పా, దుమ్మూధూళీ, చెత్తా చెదారం మలం మూత్రం, కొంపి రొచ్చు. అన్నింటితోనూ రోడ్డంతా చాలా అసహ్యంగా ఉంది. జబ్బులు పడి, చావులుచూసి, శవాలుమోసి, నెత్తుటితో తడిసి, మహాఘోరాలెన్నో చూసి యమబాధ లెన్నెన్నో భరించి, మరింత మహా ప్రళయం వస్తేనే గాని ముక్తిలేదని నిరాశచేసుకొని నీరసంగా నిస్సత్తువుగా ఛస్తూన్నట్టుగా

ఉంది ఆ రోడ్డు. ఆ రోడ్డు కిరుప్రక్కలావున్న ఇరుకుటిళ్ళన్నీ ఏనాడో చచ్చినట్టున్నాయి. అవి నిలబెట్టిన పీనుగుల్లా సరిగా నిలబడలేకుండా ఉన్నాయి. వాటి తలుపులన్నీ మూసి ఉన్నాయి. ఆ ఇళ్ళు ఆ తెల్లవారు ఝామున ఆ పాలిపోయిన చచ్చువెలుగులో "పంచభూతాల్లోనూ మేం కలిసి పోతాం! దయచేసి, ఓ పుణ్యాత్ములారా, మాకు నిప్పెట్టండి లేదా మమ్మల్ని కప్పెట్టండి!"అంటూ బిగుసుకుపోయిన మాతులు తెరవలేక మూగసంజ్ఞలు చేస్తూ, కప్పుకుపోయిన చచ్చుకళ్ళు విప్పలేక ఏడుస్తున్నట్టుగా ఉన్నాయి. రోడ్డుమీద ఒక ఎలక చచ్చింది. ఒక పందికొక్కు చచ్చింది. ఒక జత పందులు చావు చప్పుళ్ళు చేసుకొంటూ వెళ్తున్నాయి. చావలేని కుక్కొకటి మూడు కాళ్ళమీద కుంటుతూ చూపు గుడ్డివల్లా వంటి జబ్బువల్లా అటూ ఇటూ తూల్తూ ముసిరే ఈగల్ని తోలుకోలేకచస్తూ, చావునివెతుక్కొంటూ వెళ్తోంది. చచ్చిన ఎలకా, పందికొక్కులకోసం వచ్చిన ఒకానొక ఒంటి కాలి కునుకురెక్కల కుంటికాకి, పందుల్ని చూసి భయపడి, కునుకు కుక్కనిచూసి బెదిరిపోయి, సరిగా ఎగరాలేకా సరిగా నడవాలేక కాలు జారి మురుగు కాలవలో మునిగిపోయింది. దానికోసం కాకిలోకం యావత్తూ శవాలుకూడా చెవులుమూసుకొనేటంత కావుకేకలు వేస్తున్నాయి, ఆ సమయంలో ఆ సందులోని కుళ్ళుకి ఉక్కిరిబిక్కిరయిపోయి గాలి కూడా చచ్చిపోయి శవంకంపు కొడుతూన్నట్టుగా ఉంది. పూజార్ల లిటిగేషన్లో పడిపోయిన వాయునందనుడు ఆ దుర్గంధం భరించలేక 'అయ్యో తండ్రీ అని తలుపులు మూసుకొని ఇంట్లోకూర్చుని ఏడుస్తున్నట్టుగాఉంది. ఆ సమయంలో ఆ కుళ్ళుకంపు ఉచ్చకంపు రొచ్చుకంపు చచ్చుకంపు ఇరుకిరుకు మెలికల మెలికల సందంతాకూడా "ఇంకెక్కడాలేదు. ఈ భూమ్మీద ఇంకోటి లేదు, ఇదే నరకం ఇదే ఇదే ఇదేకదా నరకం," అన్నట్టుగా యమ భయంకరంగా ఉంది.

రిక్షాకి ఎదురుగా కొంచెం దూరంలో ఇద్దరు కుష్టురోగులు నొట్టగా నడుస్తూ చేతుల్లోని డొక్కులతో కాకుల్ని తోలుకొంటూ వస్తున్నారు.

గిరిజ రిక్షా దిగింది. దిగి, రిక్షావాడికి డబ్బు లివ్వబోతూ, ఆంజనేయ స్వామివారి గుడికి ఎదురుగాఉన్న ఇంటివైపు చూసింది అంతే.

కుష్ఠురోగు లిద్దరూ "అ(రె" అంటూ ఆగిపోయేరు. "అమ్మోవరో పడిపోనాపిరా!" అన్నాడు ఓ రోగి ఇంకో రోగితో.

రిక్షా దిగిన తెల్లచీరమ్మాయి జోగిజోగి రిక్షా తొట్టిలోకి దబ్బున పడిపోయింది. ముసలి రిక్షావాడు "ఆఁ ఆఁ" అని అరుస్తూ బొమ్మలా నిలబడిపోయేడు. ఎదురుగా ఇంటిలోంచి భవానీ శంకరుడు పరిగెట్టుకొంటూ వచ్చేడు.

పిల్ల చీటీ చదువుకున్న కన్నతల్లి—బొద్దెంకల మేడలో కర్పూరపు బొమ్మ పసుపుకున్న నిప్పుల పసుపు—కొన్ని పేరాలపాటు వర్ధనమ్మగారి వగపు — అందుతోపాటు ఆమె చిన్న కుమారుని ప్రవేశము—

# 15

కూతురు కనిపించకపోవడంతో వర్ధనమ్మకసలు మతిపోయింది. తెల్లవారే లేస్తూ తాళాలకోసం చూసుకొనేసరికి కూతురు రాసిన చీటీ కని పించిందామెకి. సంగతేమిటో అదేమిటో ముందు ఆమెకి అర్థంకాలేదు. అర్థం అయేక ఆమెకి ఎర్రటి చింతనిప్పుల్లాంటి కోపం వచ్చింది: అంత లోనే కోపం అంతాకూడా జావ జావగా భయంకింద మారిపోయింది. కూతురు రాసిన చీటీ మరోసారి చదువుకొంది.

చీటీ చాలా క్లుప్తంగా ఉంది :

"రాత్రి అతన్తో నువ్వు అబద్ధం చెప్పేవు పెట్లో నిజంగా డబ్బుంది. ఈ అవమానం నేను భరించలేను. పాతిక రూపాయలూ పట్టుకువెళ్ళి తనికి ఇస్తున్నాను."

అని వంకర టింకరగా రాయకపోయినా తొందర తొందరగా రాసి వెళ్ళింది గిరిజ.

"ఆ చీటీ చదువుకోగానే కలిగిన కోపపు స్థితిలో గిరిజా? దొంగ ముండా!!" అని కేకలు వేసింది వర్ధనమ్మ. ఆ తిట్టు వినడానికి కూతురు అక్కడ లేకపోవడంతో ఆమెకి కోపం ఇంకా ఎక్కువయింది. "ఇంటికి రానీరా నీ సంగతి చెప్తాను!!" అని మరో కేకవేసి "దొంగముండా" అని కూతుర్ని ఉద్దేశించి మళ్ళీ గట్టిగా తిట్టుకొంది వర్ధనమ్మ.

గిరిజకి ఊహ వొచ్చేక ఆమెని వర్ధనమ్మ తిట్టడం మానేసింది. ఎనిమిదేళ్ళ తరవాత పరోక్షంగా తిట్టినప్పటికీ మళ్ళీ తిట్టడం ఇదే మొదటిసారి. తిట్టిన తరవాత ఆ తిట్టు తనకే వింతగానూ అసహ్యంగానూ వినిపించింది వర్ధనమ్మకి.

గిరిజ చిన్నపిల్ల కాదు. ఇరవయ్యేళ్ళు వెళ్ళేయి. ఆ వయసుకి తనకి పెళ్ళయింది. పిల్లలు కలిగేరు. గిరిజకి ఇంకా పెళ్ళే కాలేదు.

పిల్లని చూస్తేమాత్రం—

గుర్రంలా ఎదిగి కూర్చుంది.

కొంపతీసి పిల్ల కి....

గజగజ వణికిపోయింది వర్ధనమ్మ.

అంతవరకూ నిండుగా గంభీరంగా బియ్యపు బస్తాలా కూర్చున్న మనిషి భయంవల్ల నీటి మూటగా మారిపోయింది. ఆమెకి వళ్ళంతా చెమట పట్టేసింది. ఎందుచేత ఆవిడ అలా నీరు కారిపోయిందంటే—

ఆవిడకి తన పెత్తండ్రి కూతురు, సరస, జ్ఞాపకం వచ్చింది.

సరస!

దగ్గిర దగ్గిర పాతిక సంవత్సరాల కిందటి మాట—

వర్ధనమ్మకి ఇరవయ్యేళ్ళు. సరసకి ఇరవై నాలుగేళ్ళు. వర్ధనమ్మ తన కొడుకుని వళ్ళో కూర్చోబెట్టుకొని ఎదురుగా కూర్చున్న సరసతో ఏదో మాట్లాడుతోంది. సాయంకాలం అరయింది. కొంచెం చీకటిగా ఉంది. అది నాలుగిళ్ళ వాకిలి, వరండామీద ఓ స్తంభానికి ఆనుకొని వర్ధనమ్మ కూర్చుంది, ఎదురు స్తంభానికి ఆనుకొని సరస కూర్చుంది.

వర్ధనమ్మ తన కొడుకు చేసే కొంటె చేష్టల గురించి సరసతో సరదాగా చెప్తోంది, సరసకూడా ఆ మాటలు సరదాగావింటూ మధ్య మధ్య ఆ చంటిపిల్లణ్ని పలకరిస్తూ తనుకూడా ఏమేమో మాట్లాడుతోంది.

కొంత సేపయేకమాత్రం మాట్లాడ్డం మానేసింది సరస! మాట్లాడ్డం మానేసి వర్ధనమ్మ ముఖంలోకి తీక్షంగా చూస్తూ ఉండి పోయింది. తన మాటల ధోరణిలో తను ఉన్న వర్ధనమ్మ నాలుగైదు నిమిషాలసేపు సరస చూపు చూసి ఏమీ అనుకోలేదు. అయిదు నిమిషాలు కాదు పది నిమిషాలైనప్పటికీ మాటా మంతీ లేకుండా సరస అలా ఉండిపోడంతో వర్ధనమ్మ గతుక్కుమంది. "అమ్మవారు కూర్చున్నట్టు అలా కూర్చున్నావేంటే సరసా? అని అందా మనుకొని,

"బొమ్మలా ఆలోచిస్తున్నావేంటే సరసా?"అని అడిగింది వర్ధనమ్మ.

ఆ మాటకి సరస నవ్వింది!

ఆమాటకి సరస నవ్విందంతే! నవ్వుతూ అలాఉండిపోయిందంతే!

ఆ నవ్వుచూసిన వర్ధనమ్మ "అమ్మో!!"అని కేకవేసి, కొడుకుతో సహా మెరుపులా లేచి ప్రక్కనేఉన్న గదిలోకి పారిపోయి, తలుపులు బిడాయించుకొని, కొడుకును గుండెల కత్తుకొని, అక్కడొక మంచం ఉంటే అందుమీద కూలబడి గడగడ వణకుతూ కూర్చుంది వర్ధనమ్మ.

అది లంకంతమేడ. ఆ సమయంలో ఇంట్లో వర్ధనమ్మా సరసా తప్ప ఇంకెవరూ లేరు. అది విద్యుద్దీపాలు లేని ఇల్లు. ఇల్లంతా చిట్ట చీకటిగా ఉంది. వంటగదిలో బుడ్డిదీపం ఉందేమో? ఇంకెక్కడా దీపం లేదు.

"బొమ్మలా అలా చూస్తున్నావేంటే సరసా?" అని వర్ధనమ్మ అడిగేసరికి సరస నవ్విన నవ్వు చప్పుడవలేదు. ఆమె పెదిమెలు సాగేయి. పళ్ళు మెరిసేయి. చప్పుడుమాత్రం కాలేదు. ఆమె కళ్ళుమాత్రం పూర్తిగా విప్పారి టార్చిలైటు వెలుగులో పులికళ్ళు మెరిసినట్టు భయంకర రౌద్రంతో మెరుస్తున్నాయి. ఆమె వర్ధనమ్మవైపు చూసి నవ్వలేదు. కొడుకు నెత్తుకున్న వర్ధనమ్మలో సరస తనని తను చూసుకొంటోందని

వర్ధనమ్మ గ్రహించ లేకపోయింది. తన బతుకునీత తనకి చాలా అసహ్యంగా కనిపించడంతో సరసకి ఒక్కసారిగా శోకం వచ్చి అది రోషంగా వెంటనే మారి అది నిరాశగా ఘనీభవించి అది ఆ వికృతమైన నవ్వుగా నిలబడి పోయిందని తెలుసుకోలేకపోయింది వర్ధనమ్మ.

అన్న పుట్టలేదు, అక్క చెల్లెళ్ళులేరు. తలిదండ్రులకి సరస ఒక్కర్తే సంతానం. ఆమె తండ్రి తన యవ్వనం అంతా తొలి భార్యకి ఇచ్చేడు. ఆ తరవాత చాలామంది వారవనితలకి ధారపోసేడు; తన మాన్యాలన్నీ విస్కీ సీసాలకింద పంటపెట్టేడు. ఆఖరికి బూడిద బొమ్మగా మిగిలేడు సరసతల్లి అతనికి రెండోభార్య, ఆవిడ తన తొలి యవ్వనపు వెలుగులో దేవకన్యవంటి సరసని కన్నతరువాత, తన ప్రౌఢ త్వపు చిచ్చుని అనేకానేక దుర్మార్గుల ఇనుప కౌగిలింతల్లో చల్లార్చుకొని చివరికొక బూడిదరంగు బెండులా మిగిలిపోయింది. ఆ బూడిదరంగు పాతకాలపు (చీకటి) మేడలో ఆ పాపపుటింటిలో సరసమాత్రం దీప శిఖలా నిలబడింది.

తాతలు సంపాదించిన మడిమాన్యాలకి కాళ్ళొచ్చి వెళ్ళిపోయాయి. ఇంటిలో మిగిలిన చమురుకి ఊపిరి వచ్చి అదంతా ఆరిపోయింది. తల్లి ప్రతిష్ఠా తండ్రి ప్రతిష్ఠా వేర్వేరుగా వెళ్ళి పిట్లోనే కలిసేయి. ఆ ఇంటికి అన్ని రంగులూ పోయి ఆఖరికి బూడిదరంగే మిగిలింది. సరసకి పెళ్ళి కాలేదు. ఇరవై నాలుగేళ్ళ యవ్వనంతో పచ్చగా అందంగా నిప్పులా పవిత్రంగా కొండలా గంభీరంగా నిలబడింది సరస. సృష్టిలోని వెచ్చని ఎండలో చల్లని వెన్నెల్లో మలయమారుతంలో అందరితోపాటు ఆనందం పంచుకొని బతుకులో భాగంగా ఉండాలని ఆమె ఉవ్విళ్ళూరింది. కాని ఆమెకి ఆ మేడ చీకటే మిగిలింది.

తలిదండ్రులంటే కలిగిన ఘోరమైన అసహ్యంవల్ల కలిగిన పట్టు దలవల్ల కూడా నిప్పులా నిలబడింది సరస. కాని ఈ నిప్పు ఆఖరికి నుసిగా మారడమేతప్ప ఎప్పుడూ కూడా వెచ్చని వెలుగు వెదజల్లదా?

ఆ రోజు సాయంకాలం - తనకి మరింక ముక్తి లేదనే నిశ్చయం

కలిగిపోయింది సరసకి. కొన్ని మూఢభావాలూ, కొన్ని మూర్ఖపు పట్టు దలలూ ఆమెకి లేకుండా ఉంటే ఆమె జీవితం మరోలా ఉండేదేమో? ఏమో! కాని ఆమె జీవితానికి రాత్రి ఏడుగంటలవవలసి ఉంది.

రాత్రి ఏడు గంటలయింది.

వర్ధనమ్మ ఆ వాకిలిపక్క గది తలుపులు బిడాయించుకొని అక్కడ పాత మంచంమీద కూర్చొని భగవన్నామస్మరణ చేసుకొంటోంది. మంచం పట్టిన జొన్నెంకలకీ "దెయ్యం పట్టిన" సరసకీ భయపడుతూ ఆ చీకట్లో కూర్చుని ఆంజనేయ దండకం చదువుకొంటోన్న వర్ధనమ్మ ఏడు గంట అయేసరికి కెవ్వున కేకవేసింది! ఇదేమిటిది?? ఏమిటి ఈ ఎర్రని వెలుగు! తలుపు సందుల్లోంచి సర్రున ప్రవేశించి గోడలమీద నీడలతో చెలగాటా లాడుతున్న ఈ వెలుగు ఎక్కణ్నుంచి వస్తోంది? అమ్మో! అమ్మో!

రాత్రి ఏడు గంట లయింది.

అ వీధిలో ఉన్నవన్నీ పాతమేడలే. వీధిలో ఎక్కడా దీపాలు లేవు. ఇళ్ళల్లో అయినా కొన్నింటిలోనే ఉన్నాయి దీపాలు. అవైనా కాలిపోయిన ముత్యాల మతాబాల కొసల్లా క్షీణించిన ఎరుపుతో కునుకు తున్నాయేకాని చల్లని తెల్లని వెలుగుతో వర్ధిల్లడం లేదు. అవి గతకాలపు స్మృతుల్లా ఉన్నాయేకాని జ్యోతుల్లా లేవు. ఆ దీపాల్లేని మేడ లన్నీ ఆకల్తో ఉన్న భూతాల్లా ఉన్నాయి. వీధంతా చీకటిగా నిర్మాను ష్యంగా ఉంది. అంతలో

రాత్రి ఏడు గంట లయింది.

చీకటిలో ఆకలితో ఏడుస్తూ చస్తూన్న ఆ మేడల గుంపుల్లో ఆక స్మాత్తుగా ఒక్కసారిగా ఒక్క మేడలోంచి మాత్రం భగభగమని వెలు గొచ్చింది. ఆ వెలుగు ఆ ఇంటి కెదురుగా ఉన్న పాడుమేడ గోడల మీదపడి అడుగునించి మీదికి పాములు చరచరమని పాకినట్టు పరిగెడు తోంది.

రాత్రి ఏడు గంట అయింది.

విడివిడిగా గుడికి వెళ్ళిన సరస తలిదండ్రులు గుడినుంచి వీధి మలుపు దగ్గరికి కలిసి వచ్చేసరికి సరిగ్గా రాత్రి ఏడుగంట అయింది. దూరంనించి కనిపించే ఆ ఎర్రని వెలుగు చూసి తొందర తొందరగా పరిగెట్టుకు వచ్చిన తలిదండ్రులు గుమ్మందాకా వచ్చి ఇంట్లోకిచూసి పెద్ద కేకవేసి పరిగెట్టి మెట్లెక్కి నడవలోకి తూలిపోయి కూలిపోయేరు.

రాత్రి ఏడు గంట అయింది.

వీధి గుమ్మానికి ఎదురుగా వాకిట నడిమధ్య నిటారుగా నిల్చింది సరస. చిమ్మెట్లతో జొద్దెంకలతో నిండిన ఆ చీకటి మేడలో కరగని కర్పూరంలా కాలం గడిపిన సరస ఆ రోజు రాత్రి ఏడు గంటలకి అయిదడుగుల అయిదున్నరంగుళాల ఎత్తు కర్పూరపు బొమ్మలా నిలువునా నిలబడి, ఇంట్లో మిగిలిన చమురంతా నెత్తిని పోసుకొని నిప్పంటించుకొని నిశ్చలంగా నిర్మలంగా నిర్భాని భగ భగ మండి రాలిపోయింది.

రాత్రి ఏడు గంటలయింది. ఏడు గంటలు దాటుకొని ఆ రాత్రి కాలగర్భంలోకి రాలిపోయింది. అందులోనే కలిసిపోయిన సరసమాత్రం కమ్మని వాసనగా కొందరి కెవరికో గుర్తుంది. మరి కొందరికి ఆమె.

"పాపం! పిల్ల! మదపిచ్చతో మండిపోయింది సుమా!" అనిపించిందంతే; ఆనాటి మంటలోని నైర్మల్యత నిశ్చలత్వం, అందులోని రోషం రౌద్రం అందులోని దైన్యం నైరాశ్యం అందులోని కన్నీరు కావు చీకటి, అందులోని భయం భీభత్సం అన్నీ కాలి గాలికెగిరిపోయి అంతా కూడా ఆఖరికి 'మదపిచ్చి' అనే బూడిదకింద మిగిలిపోయింది.

ఆనాడు ఆ విధంగా "పిచ్చెత్తి చచ్చిపోయిన" పెత్తంద్రి కూతురు, సరస, జ్ఞప్తికి రావడంతో గడగడ వణికిపోయింది వర్ధనమ్మ.

ఏమో?! ఎవడు చెప్పగలడు?

పిల్ల (గిరిజ)కి ఇరవయ్యేళ్ళు వెళ్ళేయి. చదువూ చట్టుబండలూ అంటూ తను (వర్ధనమ్మ) ఏదో కాలక్షేపం చేసేస్తోంది. అయ్యో

అయ్యో! కానుకున్నానుకాను! ఇప్పుడేంకాను? కొంపతీసి ఇదికూడా ఆ సరసలా పిచ్చెత్తిపోయి కాల్చుకు చస్తుందా, లేక వీధులంట తిరుగుతుందా? అర్ధరాత్రివేళ గుమ్మాలు గుద్దుకొంటూ వాడు రావడం ఏఁవిఁటి?! ఇది తలుపులు తియ్యడం ఏఁవిఁటి? వాడు డబ్బడగడం ఏఁవిఁటి? అడగ్గానే ఇది ఉత్తరాలాసి తాళాల్తీసి పెట్టెలు తెరిచి మూలలన్నీ వెతికి డబ్బు తీసి పట్టుకొని పిట్టమనిషికి చెప్పకుండా చీకట్లో ఎక్కడికో వాడి దగ్గరకి వెళిపోవడం ఏఁవిఁటి?! వీధితలుపు గడియలేకుఁడా చేరవేసి మరీ వెళిపోయిందిగదా! ఈ లోపున ఇంట్లో కెవడైనా జొరబడిపోయి దొరికిన సమస్తం దోచుకుపోతే ఏమైపోను!! సర్వనాశనం అయిపోనే! అయ్యో అయ్యో పిల్లకి మతిపోయిందర్రా మతిపోయింది! ఆయన చెప్పనే చెప్పేరు! "ఒసే ధనం! మా సవితప్ప కొడుక్కి దాన్నిచ్చి పెళ్ళి చేసీవే!" అని చెప్పి మరీ వెళిపోయేరాయన. అలాగైనా చేసేనుకాను! దానికి చదువు చెప్పించి ఉద్యోగాల్చేయించి జీతాల్సంపాదిద్దాఁవఁనే దురాశ కొద్దీ దిక్కుమాలిన్దాన్ని నేనే — వాడి మొహాన్ని దీన్ని పారేకుండా-ఇలా ఈవూళ్లో తగలబడిపోయి కూర్చుండిపోయేను! అయ్యో! ఏఁవండీ! మీరు చెప్పినట్టూ చేసేను కానండీ! చేజేతులా పిల్లకి గొంతుక కోయిస్సేనండీ! ఇప్పుడ్నేనేం చెయ్యాన్దేవుఁడా? ఒరే చిట్టీఁ జెష్ఠ వెధవా, లేరా! లేరా, కొంప మునిగిందిరా, మొద్దు వెధవా లేరా! నిన్ను ముద్దు చేసీసేన్రా! ఇంక ముందుకి నువ్వు ఏ వెర్రిలోకి దిగుతావో ఏం చేస్తావో ఎలా ఏం తగలెడతావోన్రా?! నా కర్మరా తండ్రీ నా కర్మ! లేరా, బాబూ, లే! లేమ్మా! మా నాయనవి కదూ నా చిట్టితండ్రివి కదూ! లేరా! అక్క వెళిపోయిందిరా! అక్కెక్కడికో వెళిపోయిందిరా!

అంటూ చిన్న కొడుకుని నిద్రలేపి వెక్కి వెక్కి ఏడ్చేసింది వర్ధనమ్మ.

ఆ చిన్న కొడుక్కి పదిహేనేళ్ళే కాని అతనికి నూరేళ్ళ బద్ధకం ఉంది. తల్లి నిద్రలేపిన ముప్పావుగంటకి కుర్రవాడు నిద్రలేచి, తల్లిని బరువు కళ్ళతో కొంతసేపు చూసి, తల్లి ఏడుపంతా శ్రద్ధగా విని,

ఆ తరవాత భద్రంగా లేచి, నడవలోంచి సైకిలు తీసి, దాని బెల్లూ బ్రేకులూ చక్రాలూ పెడల్సూ సరిచూసుకొని, దాన్ని వీథిలో పెట్టి స్టాండు వేసి వెనక చక్రాన్నొకసారి గిర్రున తిప్పి దాని గిర్రుచప్పుడంతా శ్రద్ధగా సంతృప్తిగా విన్నాక, సైకిలు స్టాండెత్తేసి దానిమీద జాగ్రత్తగా ఎక్కి, అక్క గురించి కనుక్కొండికి శాంతమ్మగారింటికి వెళ్ళేడు. తల్లి తన నిద్రకి భంగం కలిగించిందన్న దుఃఖమే కాని అక్క ఏమయిపోయిందో ఏమిటో అనే బాధ ఏమీ కాదా ఆ కుర్రవాడికీ ఉన్నట్టు లేదు. అతనికి బొజ్జా బూరెబుగ్గలూ ఉన్నాయి. తల్లికి చిన్న సైజు మొగకాపీలా ఉంటాడా కుర్రవాడు.

శాంతమ్మ ఇంటినించి మరో అరగంటకి తిరిగివచ్చేడు కుర్రవాడు. సైకిల్ మీంచి భద్రంగా దిగి ఆ సైకిల్ని అతి భద్రంగా నడవలో పెట్టి స్టాండు వేసి, వెనక చక్రాన్నొకసారి గిర్రున తిప్పి దాని గిర్రుచప్పుడు శ్రద్ధగా సంతృప్తిగా విన్నాక కాని ఆ కుర్రవాడు మాట్లాడలేదు. "ఏమైందిరా, ఏఁవఁయిందిరా ?" అని తల్లి వేసే కేకల్ని అతను విననేలేదు.

"నే చచ్చేకొని మాటాడవేఁవిఁ ట్రా చచ్చినాడా ?!" అని వర్ధనమ్మ గావుకేక వేసిన తరవాత

"అక్కడ లేదు" అని చాలా శాంతంగా జవాబు చెప్పేడు చిన్నాడు.

"ఏఁవిఁట్రా ఆ మాటా ?!" అని కేక వేసింది వర్ధనమ్మ.

కొడుకు జవాబు చాలా సింపులు" అక్కలేదే అక్కడ !"

"శాంతమ్మ నడగలేక పోయేవా ?"

"శాంతమ్మ కనిపించలేదు"

"మామూలు కళ్ళతో చూసేవా, లేక గుడ్డి వెధవ కళ్ళు పెట్టుకు చూసేవా ?"

"భూతద్దంతో చూళ్ళేదు కాని మామూలుగా చూసేను. ఆవిడ లేదక్కడ."

"పోనీ దాని కొడుకో ?! పాంకోడ్డొక్కలా మొహం వాడూనూ! వాడైనా తగలడి చావలేదా అక్కడ?

"వాడు కూడా లేడక్కడ"

"ఇంటిల్లిపాది కట్ట కట్టుకుని చచ్చేరా ఏఁవిఁటి ?"

"ఏమో తెలీదు"

"ఏఁవిఁట్రా డిబ్బ వెధవా !"

"నేను శవాల్ని వేట్నీ చూళ్ళేదు"

"నీకు పోయీకాలంట్రా ?"

"కాదు"

"ఏఁవిఁటి కాదురా, నీ వల్ల కాదు"

"అబ్బ ! అక్కడెవరూ లేరు, ఇంటికి తలుపులు మూసేసి తాళాలు వేసేసి ఉన్నాయి. చెప్తూంటే, ఎందుకలా గింజుకుపోతావు?" అని 'తల్లిమీద విసుక్కున్నాడు' ఆమె చిన్నప్పటి ఫొటోలాఉన్న కొడుకు.

మరైతే ఏం చేయడం ? ఇది ఎక్కడికి వెళిపోనట్టు ? ఆ శాంతమ్మా దాని కొడుకు వెధవా ఎక్కడ తగలడి చచ్చినట్టు ? నా కూతురు పాళా బంగారంలా ఉంది. పరువు కొచ్చిన మామిడిపండులా ఉంది ! దీన్ని వల్లో వేసుకొని ఆ శాంతమ్మ కొడుకు వెధవ ఎక్కడకీ ఉడాయించలేదుకదా ! పెద్దవాడికి టెలిగ్రాం ఇవ్వనా ? ఏం చేయడం ఏందారి ? ఏద్దారి ? టెలిగ్రాం ఇచ్చినా ఆ మిలిట్రీవాళ్ళు వాణ్ని రానిస్తారా? అయ్యో అయ్యో, ఏం చేయడం పిల్ల ఒంటిమీద అయిత్తులాల బంగారం కూడా ఉంది. కాకిబంగారం కాదు, మాయబంగారం కాదు, నకిలీ బంగారంకాదు, దొంగ బంగారంకాదు, ఎల్డీసీగా, యూడీసీగా, డిప్టీతాశీల్దారుగా కష్టపడి చెమటోడ్చి దమ్మిడీ దమ్మిడీ, కాణీకాణీ అణాఅణా చొప్పున ఏళ్ళ తరబడి డబ్బు కూడబెట్టికొన్న అసలుబంగారం. అయ్యో అయ్యో, బంగారంతోసహా బంగారంలాంటి పిల్లని ఎత్తుకుపోయారట్రో ఎత్తుకు పోయారూ ! పిల్లకి జీతాలకీ పుస్తకాలకే పదివేలయిందట్రో పదివేలయిందీ ! ఇంత సొమ్ము ఖర్చుపెట్టి గుర్రంలా పిల్లని పెంచి పాంకోడ్డాక్కు వెధవ మొహాన్ని కొట్టేనట్రో కొట్టేనూ ! నీకు తెలియకుండా నీ కొడుకింతపని చెయ్యలేదే. శాంతమ్మ ! అయ్యో, శాంతమ్మ,

నా కొంప       నా కొంప       మేకలా కనిపించావే? గొర్రెలా వెర్రిమొహం వేసేవే? గేదెలా మురికిలో పడుకున్నావే: కాని, ఎన్నడూ కూడా నువ్వింత అపుబ్ర పులివనుకోలేదే శాంతమ్మా! నువ్వింత కొంప త్రీసే కొరివనుకోలేదే శాంతమ్మా! నీ కొడుకు, ఎర్రగా బుర్రగా ఉన్నాడే శాంతమ్మా, శాంతమ్మా నా కూతుర్ని వల్లో వేసుకున్నాడే. నాలిముచ్చులా ఉన్నాడే నీ కొడుకు. శాంతమ్మా నా కూతుర్ని వల్లో వేసేసుకున్నాడే శాంతమ్మా! ఇప్పుడేం చెయ్యడంర్రా చెపుదా? ఇప్పుడేం చెయ్యడంర్రా తండ్రీ!

ఇప్పుడేంర్రా! తండ్రే?....ఒరే చిట్టి నా చిట్టి తండ్రీ! అర్జంటుగా వెళ్లి అన్నయ్యకి టెలిగ్రాం ఇయ్యి! మీఅమ్మ చచ్చిందని వాడికి టెలిగ్రాం ఇయ్యి. నిల్చునపాట్న బయల్దేరమ్మను! .... నా మిలిట్రీ కొడుకొస్తాడె శాంతమ్మా! కలెక్టరుతో మాట్లాడి వాడు నీ పిలక పట్టుకుంటాడే శాంతమ్మా! పోలీసుల్తో మాట్లాడి వాడు నీ రింగులజుట్టు కొడుకు వెధవని కొట్లో వేయించేస్తాడే శాంతమ్మా! అయ్యో, గిరిజా, అమ్మడూ! ఎక్కడ కెళిపోయావే: ఇదేంపనే! నీకు మతిపోయిందటే! అయ్యో నా చిన్నారీ! సరసలా ఎటుపోయేవే! అన్నాయ్యొస్తాడే చిన్నారీ! చెల్లె లేదే అమ్మా అంటే వాడికి నేనేం జవాబు చెప్పనే చిన్నారీ! అయిత్తులాల బంగారం పదివేల రూపాయల చదువు. చిన్నప్పణ్నించి పరికిణీలు. వోణీలు, లంగాలు, బాడీలు, చీరెలు - బట్టలకే ఖర్చు పెట్టేనే పదివేలు, చిన్నారీ! అయ్యో వాణ్నికేదో మందు పెట్టేసుండాలే చిన్నారీ! అయ్యో! విగ్గినేశ్వరుడి గుడికి నే లేకుండా వెళ్ళలేకపోయేదానివే చిన్నారీ! అయ్యో! ఆ దొంగ వెధవ్వెనకాల ఎలా వెళిపోయావే చిన్నారీ!

అంటూ ఏడ్చిన వర్ధనమ్మ టక్కున ఆగింది. డబ్బంతా వృధాగా ఖర్చయిందన్న బాధ ఆమె ఏడుపుని ఆపింది. కూతుర్ని వాడెవడో ఆ వెధవ మోసం చేసేడన్న బాధకూడా ఆమె ఏడుపుని ఆపింది.

"ఒరే చిట్టీ: వేగిరం వెళ్ళి అన్నయ్యకి టెలిగ్రాం ఇయ్యి!"

"నే నివ్వలేను"

"ఏం ఎందుకివ్వలేవూ ? చేతులు పడిపోయాయా ఏఁవిఁటి ?"

"నాకు టెలిగ్రాం ఇవ్వడం రాదు"

"హోరి వెధవా! మరైతే రోజూ బడికి వెళ్ళి ఏం నేర్చుకుంటున్నావు ?"

"ఇంగ్లీషూ లెక్కలూ తెలుగూ సైన్సూ అన్నీ చెప్తారు. టెలిగ్రాం ఇవ్వడం ఎలాగోమాత్రం అక్కడ చెప్పరు !"

"నీ చదువుకోసం ఎన్నివేలు తగిలెట్టేన్రా, దిబ్బ వెధవా !"

"నన్ను తిట్టొద్దు"

"ముద్దించ మంటావా ?"

"తిడితే నేను పారిపోతాను"

"ఇప్పుడు పారిపోకు ! మరో పాతికవేలు నా చేత తగలెట్టించేక అప్పుడు పారిపో! అలా చెయ్యరా వెధవా అలాచెయ్యి....అయ్యో అయ్యో: నేనేం చెయ్యిడం ? నాకేద్దారి భగవంతుడా ! ఒరే, చిట్టి తండ్రీ ! నాయనా నువ్వు టెలిగ్రాం ఇవ్వలేపోతే పోయిరి, మన ఇంటి వెధవ ఆఫీసు పీనుగ్గుమాస్తా ఉన్నాడేమో ఓసారి వెళ్లి చూడు."

"ఉన్నాడు ! వాడి పెళ్లాంకూడా ఉంది."

"దాని మొహం తగలెట్టా! అదెందుకు ? వాణ్ణోసారి ఇలా రమ్మను !"

"పాల మనిషితో ఇద్దరూ దెబ్బలాడుతున్నారు."

"పాల ముండతో రేపొద్దున్న యుద్ధం చెయ్యొచ్చని చెప్పి వాణ్ణోసారి వేగిర విలా రమ్మను. అక్క సంగతిమాత్రం ఆ వెధవతో చెప్పకు స్మా !"

"నేను వాణ్ణి పిలవను. నాకు ఆకలేస్తోంది"

"ఇప్పుడు కాఫీ టిఫిన్లూ నేనేం చెయ్యలేను. కావఁలిస్తే అణా పట్టుకుపోయి ఏఁవైఁనా కొనుక్కో !"

"నాకు పావలా కావాలి."

"ఫస్తే ఇవ్వను"

"అయితే పీనుగు వెధవను నేను పిలవను"

"ఇంద, పది పైసలిందం."

"నాకు పావలా కావాలి."

"ఉహోసుకు చావు. నే నివ్వను."

ఈ విధంగా తల్లికీ కొడుక్కీ సంభాషణ సాగుతుంటగా వీధి తలుపు తోసుకొని గిరిజ లోనికి వచ్చింది.

"అమ్మా అక్కొచ్చింది!" అన్నాడు వర్ధనమ్మగారి చిన్నకొడుకు.

"అక్కొచ్చిందా?! నీకు నయాపైసా ఇవ్వను! ఫో వెధవా! హమ్మయ్య! అక్కొచ్చిందిరా!" అంటూ వెనగ్గదిలో ఉన్న మంచం మీంచి లేచి వీధి గదిలోకి నడిచింది వర్ధనమ్మ.

వీధి గుమ్మం దగ్గర కూతురూ, వెనగ్గది గుమ్మం ముందు తల్లీ ఒకర్నొకరు చూసుకుంటూ కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దంగా నిల్చుండి పోయేరు.

"ఏఁవిఁటి తల్లీ ఇదీ?" అని అడిగింది వర్ధనమ్మ.

గిరిజ నెమ్మదిగా నడిచివెళ్లి అక్కడున్న వాలుకుర్చీలో కూలబడింది. తనికి మళ్ళీ మూర్ఛవస్తే బావుండు ననిపించిందామెకి.

కూతుర్ని అలా చూస్తూ నిలబడిపోయింది వర్ధనమ్మ.

వంటిమీది బంగారం వంటిమీదే ఉంది! మరేం ఫరవాలేదు. మరైతే డబ్బు? డబ్బేం చేసింది? ఆ వెధవకి ఇచ్చేసిందా? ఇచ్చేసింది కాబోలు! అయ్యో! అయ్యో! ఒకటి రెండూ కాదు. పాతిక రూపాయలు. ఒక రూపాయంటే శేరు నెత్తురన్నమాట! ఇచ్చేసింది కాబోలు! ఇవ్వకుండా ఉంటే దేవుడు నా పాలిట ఉన్నాడన్నమాటే!

"ఏఁవేఁ గిరిజా! డబ్బేదే?

వాలుకుర్చీలో కూర్చున్న గిరిజ కళ్ళు మూసుకొంది.

"మాటాడవేఁవేఁ? డబ్బేదే?"

ఇలాటి పిల్లల్ని చింతబరికతో చితగ్గొడితేకాని లాభంలేదు!

"ఏఁవేఁ! ముంగిలా మాటాడవు?"

కళ్ళు మూసుకునే ఉండి, కుడిచేతి పిడికిలి నెమ్మదిగా విప్పింది గిరిజ. ఆ చేతిలోంచి, నాలుగు మడతలు పెట్టిన అయిదు నోట్లు నేల మీదికి జారేయి.

డబ్బుంది!! భడవకానా డబ్బు తెచ్చేసింది.

"ఒరే చిట్టీ! ఆ డబ్బు తియ్యమ్మా! ఉండు! నేనే తీస్తాను!"

అంటూ తపతపమని నడిచివెళ్ళి (ఎలా వంగుందోకాని) వంగొని ఆ డబ్బు తీసి పాతికా సరిచూసుకొని, నోట్లు మడతపెట్టి మొలలో దోప్పుకుంది వర్ధనమ్మ. ఆ పనులన్నీకూడా ఆవిడ తృటికాలంలో చేసింది. తృటికాలంలో అవన్నీ చేసినందుకు ఆవిడకి ప్రయిజివ్వవచ్చు. రెండు వందల పౌన్ల బరువుకాయాన్ని వంగదీసినందుకు ఆవిడకి రెండు ప్రయిజులే కాదు ఎన్ని ప్రయిజులైనా ఇవ్వవచ్చు.

డబ్బు భద్రంగా దాచిన తరవాత వర్ధనమ్మ వెళ్ళి కిటికీవార కర్ర కుర్చీలో కూర్చొని నిట్టూర్చి, కళ్ళు మూసుకొని కొంతసేపు విశ్రాంతి తీసుకొంది. ఆవిడ అపాటి విశ్రాంతి తీసుకోడం చాలా న్యాయం. అందులో అన్యాయం ఏమీ లేదు.

కళ్ళు మూసుకున్న వర్ధనమ్మకి తన పెళ్ళీ తన భర్తా, తనపిల్లలూ, తన కష్టాలూ, తన ఖర్చులూ అన్నీ జ్ఞాపకం వచ్చాయి. జ్ఞాపకాల బాధలకి మూసుకున్న ఆమె కళ్ళంట మూత పెట్టిన గిన్నెలోంచి ఉడుకు నీరు చిమ్మినట్టుగా కన్నీరు చిమ్మింది. చిన్నారి గిరిజ గురించి తల్చుకొనేసరికి ఆమె యెడల ఆవిడకి ఆ సమయంలో విపరీతమైన జాలి కలిగింది.

బంగారం పోనివ్వలేదు. డబ్బు పోనివ్వలేదు. ఎలా వెళ్ళిన పిల్ల అలా భద్రంగా వచ్చేసింది. ఇన్నాళ్ళూ పిల్లకి చదువ్వొసే కాని పెళ్ళాసు లేదు. అర్ధరాత్రిపూట అందమైన కుర్రాణ్ణి చూసేసరికి — పాంకోడ్డొక్కులా మొహం వాడూనూ! ఆ వెధవకి అందంకూడానా!—. వయసులోఉన్నకుర్రాణ్ణి చూసేసరికి మతి అదేఁవిటో అయిపోయుంటుంది

పిల్లకి చిన్న వికారం చూపెట్టిందంతే! మట్టుకు మళ్ళీ పిల్ల తనమట్టుకి తనే సంబాళించుకొంది. మరేం భయంలేదు. మరింక ఇంటివెధవ ఆఫీసు గుమాస్తాగాణ్ని అడగాలి. ఫకీరు వెధవైతే ఆయేడుగాని ఆ పీనుగు మొహానికి ఎవరోకాని మంచి తావీజులు కట్టేవాణ్ని తెలుసునట. కాణో పరకో వాడి మొహాన్ని కొట్టి ఓ తావీజు కట్టించేస్తే పిల్ల మనసు సద్దుకుంటుంది. మరింక ఆ శాంతమ్మ ముండతో స్నేహానికి శ్రాద్ధం పెట్టేసి. దాని కొడుకు వెధవని మనింటి గుమ్మం తొక్కకుండా ఇరుపంచల చేర కుండా కట్టుదిట్టంచేయించి పిల్లప్రవర్తన ఓకంట జాగ్రత్తగా కనిపెడుతూ పరీక్ష అయేదాకా కాలక్షేపం చేసేస్తే ఆ తరువాతా? ఆ తరువాచ్చూసుకో వచ్చు. ఈలోగా ఆవిడగారు ఆ సవితప్పగారితో మంతనాలు జరిపించాలి. తప్పదు. ఏంచేస్తాం?

ఈవిధంగా అనుకొంటూ కొంతసేపు కూర్చొని, ఆ తరవాత కళ్ళు కాస్త వత్తుకొని.

"ఒరే చిట్టి, స్టవ్ కొంచెం ముట్టించరా, నాయనా!" అని కేక వేసింది వర్ధనమ్మ.

"నేను ముట్టించను" అన్నాడు చిట్టితండ్రి.

"పోనీ, నా మొహం ముట్టించు!" అంటూ ఏడుపు మూడ్‌లోంచి అకస్మాత్తుగా కోపంలోకి మారిపోయి కుర్చీలోంచి లేచింది వర్ధనమ్మ.

గిరిజకి కాఫీచేసి ఇచ్చే ప్రయత్నంలో వర్ధనమ్మ ఉండగా, గిరిజ అక్కడ వాలుకుర్చీలో కూర్చొని. ఆ తెల్లవారుఝామున జరిగిన విష యాల గురించి ఆలోచిస్తోంది.

తెల్లవారుఝామున ఆంజనేయస్వామి గుడి ఆనవాలు చూసుకొని, రిక్షా దిగి, ఆ యింటివైపు చూసేసరికి గిరిజకి 'షాక్' తగిలినట్టయింది. అలా చూస్తూ ఆమె కొయ్యబారిపోయింది.

అక్కడ పరిస్థితి దౌర్భాగ్యంగానేకాదు, ఘోరంగానేకాదు, విప రీతంగానే కాదు, షాకిం(గ్)గానే కాదు, ఎంతో చాలా ప్రమాదంగా ఉంది, దారుణంగా ఉంది.

అక్కడికి వెళ్లేవరకూ ఆ పరిస్థితిలోని ప్రమాదం గురించి గిరిజ ఏమంత ఆలోచించనేలేదు. తన తల్లి చేసిన తప్పు తను ఒప్పుగా చేస్తోన్నందుకు ఆమె కొంత సంతోషిస్తూ వెళ్ళింది. తను డబ్బిస్తుంది. శాంతమ్మ కొడుకు ఆశ్చర్యపోతాడు. తనని వేనోళ్ళ పొగుడుతాడు. కృతజ్ఞతా పూర్వకంగా తనవైపుచూసి, కళ్లొకసారి తుడుచుకొని, సుందరంగా ఓ నవ్వు నవ్వి, "ప్లీజ్ ఎక్స్క్యూజ్ మి! నే నిపుడు అర్జంటుగా వెళ్లి మందు కొనుక్కొని వస్తాను" అని వెళ్లి మందు కొనివచ్చి, ఆ జబ్బు మనిషికి ఆ మందిస్తాడు. దానితో ఆ జబ్బు మనిషికి నయం అవుతుంది. అతనూ అతని భార్యా పిల్లలూ అంతా కూడా తన "ఔదార్యానికి దాతృత్వానికీ" కరిగిపోయి, "మానవుల్లో గిరిజలాంటి మంచివారు" ఉన్నందుకు పొంగిపోయి ఆనందాశ్రువులు "కన్నీరు పన్నీరుగా" రాలుస్తారు. వాళ్ళంతా కూడా కొంతసేపు అలా ఉక్కిరిబిక్కిరయిపోయి, ఆ తరవాత తనని "వేనోళ్ళ"తో (వెయ్యేసి నోళ్ళు కాబోలు-ఆనోళ్ళతో) పొగుడుతారు. వాళ్ళలా తననిపొగిడినందుకు తను ఉబ్బి తబ్బిబ్బయిపోదు. "మాడెస్టు"గా "మందస్మితం" చేస్తుంది. చేసి, "పైట నిండుగా కప్పుకొని" (నాకు అతని దగ్గిర సిగ్గేస్తుంది)" ఛ! ప్లీజ్! అలా అనకండీ! మీకు భగవంతుడే సాయం చేసేసు! నేనేం చెయ్యలేదు!" అని వాళ్ళ పొగడ్తలు వారిస్తూ "ముగ్ధ మనోహరంగా" నవ్వుతుంది. అప్పుడొక కోయిల కలకంఠిగా పాడుతుంది. "చీరచాటున నూతన వధువు చందమున" ఆకుల చాటున దాగొన్న ఆ కోకిలమ్మని వెతుక్కొంటూ ఆకులూ పూవులూ అన్నింటినీ తన "శతకోటి మృదుహస్తాలతో" తడుముతూ నిమురుతూ ఉదయభానుడు యువరాజులా వస్తాడు. తనా విధంగా శాంతంగా నవ్వుతూ నిల్చొని ఉంటేగా తన కెదురుగా శాంతమ్మ కొడుకు (పేరు బాగులేదు)- భవానిబాబు తనని అశ్రుజలపూరిత నయనాలతో చూస్తూ తీపిచూపుల జాలి వెల్లువలా? — లేక సోనలా? — నీవో అని —— వాటిలో ముంచేస్తాడు. తను ఉక్కిరి బిక్కిరయిపోతుంది. అంతలో అతను దోసిల పడతాడు. దోసిట్లో తెల్లని మల్లియలూ కెంపుల రోజాలూ ఉంటాయి," మల్లియ నా మనసు! రోజా నా అనురాగం! తీసుకోండి!" అంటూ అతను తనకి

దగ్గరగా వస్తాడు. సిగ్గుతో తను పైట బిగించినకొద్దీ సిగ్గంతా వెల్లువే అయిపోతుంది.

అలా ఆలోచిస్తూ ఊహిస్తూ అక్కడికి సుఖంగా రిక్షాలో కూర్చుని వెళ్ళింది గిరిజ.

దానం చెయ్యడంలోను, అవతలవారికి సాయం చెయ్యడంలోనూ ఓ సుఖం ఉంది. ఆ సుఖం అంతా పూర్తిగా అనుభవిస్తూ వెళ్ళింది గిరిజ. అవతలవారికి ఉచితంగా సాయం చెయ్యడంలో ఓ చిన్న పిసరు గొప్పా గర్వంకూడా వున్నాయి. ఆ విధంగా కొంచెం గొప్ప పడిపోతూ గర్విస్తూ కూడా వెళ్ళింది గిరిజ. లోకంలోని దుర్భర దారిద్ర్యాలూ రాక్షస రోగాలూ దారుణ దురవస్థలూ అన్నీకూడా తన బొన్సు గ్లాసుడు దానాలకీ చెమ్చాడు నీళ్ళ సాయానికీ సమసిపోవని తెలుసుకోకుండా అక్కడికి - మానవసేవా మాధవసేవా చేసేస్తున్నా ననుకొంటూ వెళ్ళిన గిరిజ దెబ్బతింది. నిజజీవితంలో - చచ్చిన లోహితాస్యులు బతకరనీ, చావబోయే చంద్రమతుల్ని ఎవ్వరూ రక్షించరనీ సత్యహరిశ్చంద్రులు నెత్తిన కొంగేసుకు పోతారనీ తెలియకపోవడంచేత కూడా ఆమె దెబ్బతింది. జీవితం ఆమెకి - చాలా మట్టుకు చంద్రుణ్ని చూసిన కలువలాగే వెళ్ళింది. కాని పులిని చూసిన పిల్లి మేకలా వెళ్ళలేదు.

కప్పని మింగిన పాముని చూసిన కప్పలా ఆమె మూర్ఛపోయింది అక్కడ ఎదురుగా.

కొప్పు కుంగిపోయి ఇటికలు ఎక్కొచ్చిన కొంపొకటుంది. ఆ కొంపకి వీధివైపున అరుగొకటుంది. అది విరిగి ఉంది, ఆ విరిగిన అరుగుమీద ఓ చిరిగిన చాపమీద ఓ ముప్పయ్యేళ్ళ మనిషి పీనుగుంది. ఆ పీనుక్కి పళ్ళు ఎక్కొచ్చాయి. దవడలు బొచ్చుకుపోయేయి. ఆ పీనుగ కళ్ళు విప్పుకు మరీ చచ్చేయి. ఆ పీనుగు తలమీది వెంట్రుకలు దానికంటే ముందే ఏనాడో చచ్చినట్టున్నాయి. నూరేళ్ళు నిండిన మనిషిలా కాకుండా వెయ్యేళ్ళు నిండిన పీనుగులా ఉందా పీనుగు. ఏనాడో యే యుగంలోనో యే ఎడారిలోనో ఎండి చచ్చి ఉండిపోయిన పీనుగులా అది చాలా వికృతంగా వుంది ! ఆ పీనుగు కాళ్ళదగ్గిర మరొకటి - ఆడపీనుగు - కూర్చొ

నుంచి ఆవిడ కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోంది. ఆ ఏడ్చే ఆవిణ్ని ఓ సీడవంటి ముసలావిడి ఓదార్చబోతోంది. అరుగుపక్క మెట్టుమీద కూర్చొని ఓ పన్నెండేళ్ళ ఆడపిల్ల వెక్కి-వెక్కి ఏడుస్తోంది. ఎంతో అందంగా వున్నప్పటికి ఆ పిల్ల చాలా నిర్భాగ్యంగా దెయ్యాలు పెంచే దేవుడు పిల్లలా, చాలా దీనంగా అసహాయంగా కనిపిస్తోంది. పులి చంపిన మేక పక్క కోపంతో దుఃఖంతో తిరిగే కోడె చూడలా అక్కడ భవానీశంకరం అటూ ఇటూ పచారు చేస్తున్నాడు. అతని దుస్తులన్నీ మురికిపట్టిన మల్లెపువ్వుల్లా ఉన్నాయి.

చచ్చిన వీధీ, చచ్చిన ఇళ్ళూ, చచ్చిన కాకీ, చచ్చిన పెంటచెత్తా చచ్చిన మనుష్యుల్లాంటి కుష్టురోగులూ, యుగాలనాటి పీనుగూ, దాని పక్క కూర్చొని కుమిలే పీనుగూ, మెట్టుమీది దెయ్యపు పెంపుడుపిల్లా.

ఆ దృశ్యం అంతా కూడా గిరిజ మెదళ్ళో ఓ ఘోరమైన ఫొటోలా తృటిలో అచ్చయింది. అది ఆమెకి గుండె దెబ్బలా తగిలింది.

నావల్ల నా ఆలస్యంవల్ల ఓ నిండుప్రాణం చచ్చింది.

అనే షాక్‌కి ఆమె తట్టుకోలేకపోయింది.

ఆమెకి పూర్తిగా తెలివొచ్చేసరికి అతని కళ్లు తన కళ్ళల్లోకి చూడ్డం ఆమె కళ్లు గమనించేయి. తనతల అతని వళ్లో ఉన్నదని ఆమె మెదళ్లో ఎక్కడో చిన్న అరలో రిజిస్టరయింది. అలా ఉండడం ఆమెకి సిగ్గని పించలేదు; చాలా సుఖమనిపించింది. ఏం జరిగిందో ఆమెకి గుర్తు రాలేదు. తన ముఖాన్ని అతను రుమాల్తో తుడుస్తున్నాడని ఆమె గ్రహించ గలిగింది. అతను ఓ చెంప తుడిచేక, రెండో చెంప కూడా తను అతనికి అందివ్వడం ఆమెకి గుర్తుంది. ఆమె కళ్ళు మూసుకొంది. వాటిని అతను వేళ్ళతో మెల్లగా నొక్కుతూ రాసేడు. అతని వళ్ళో ఆమె కలా మత్తుగా పడుకోవా లనిపించింది!

అంతలో ఆమె తుళ్లిపడి లేచింది.

"ఏం?" అన్నాడు భవానీశంకరం.

"ఒంట్లో ఇప్పుడు బావుందా గిరిజా" అని జాలిగా అడిగింది సీత వంటి శాంతమ్మ.

మెట్లుమీదే చిన్నపిల్ల వెక్కి-వెక్కి చూసింది.

అరుగుమీది ఆడమనిషి నెత్తి మొత్తుకొంటూనే ఉంది.

జాకెట్లోంచి పర్సుతీసి అందులోనుండి అయిదుయిదులు తీసి చూపిస్తూ.

"డబ్బు తెచ్చేను?"

అంది గిరిజ.

తను అమాయకపు చిన్నపిల్లలా నటిస్తున్నానేమోనని ఆమెకి చిన్నని సన్నని అనుమానం కలిగింది కాని, ఆ అనుమానాన్ని ఆమె అణిచేసుకుంది.

ఆ డబ్బువైపు భవానీశంకరం నిశ్చలంగా చూసేడు. నిద్రలేని అతని కళ్ళు చాలా ఎఱ్ఱగ వున్నాయి. అతనికి కోపం వచ్చిందేమోనని భయపడింది గిరిజ, అతి అమాయకంగా తను కనిపించడానికి ఆమె విశ్వప్రయత్నం చేసింది.

భవానీశంకరం అటుపక్క అరుగువైపు ముఖం తిప్పుతున్నాడు.

"ఆలస్యంగా తెచ్చినందుకు క్షమించండి" అంటూ ఒక్కసారిగా దుఃఖంలోకి దిగిపోయింది గిరిజ.

"పిచ్చితల్లీ! నువ్వేం చేసేవు? నువ్వేం తప్పు చెయ్యలేదు!" అంటూ గిరిజ కళ్ళు వత్తుతూ ఓదార్చింది శాంతమ్మ.

"చూడండి గిరిజగారూ!" అన్నాడు భవానీశంకరం. అతని మాట చాలా జాలిగా వినిపించింది గిరిజకి. అయితే, ఇతనికి నామీద కోపంలేదు అని అనుకోడంతో ఆమెకి దుఃఖం కొంత తగ్గింది.

"చూడండి గిరిజగారూ! అతను...." అని చెప్పి ఆగి తల దించుకున్నాడు భవానీశంకరం. అతను చాలా విచార భారంతో ఉన్నప్పటికీ "ఎంతో అందంగా ఉన్నాడు!" అనుకొంది గిరిజ. అంతలోనే ఆమెకి దుఃఖం వచ్చింది. అవతల అతనెవరో చనిపోతే తను ఇవతల "ఇతని

అందం గురించి" ఆలోచిస్తూన్నందుకు ఆమె సిగ్గుపడింది. తనొక పాపాత్మురాలి ననుకొంది.

"భవానీబాబుగారూ! నేను పాపాత్మురాల్ని!" అంటూ, మళ్ళీ కళ్ళంట నీళ్ళు పెట్టుకొంది గిరిజ.

కొంచెం ఆశ్చర్యం పోయినట్టుగా తలెత్తి చూసేడు భవానీశంకరం. చూసి, అమె చేతిలోని అయిదునోట్లూ ఆమె చేతిలో నొక్కి- ఆమె వేళ్ళు పిడికిలిగా నొక్కి-.

"మీరేవీఁ పాపం చెయ్యలేదండీ గిరిజగారూ! నేను మీయింటికి వచ్చేసరికే అతను చనిపోయేట్ట. నా కా సంగతి తెలియలేదు. మరింక మీ తప్పూ నా తప్పూ ఇందులో ఏంలేదు. తప్పంటూ ఉంటే భగవంతుడి దవాలికాని మనదికాదు."

అని నెమ్మదిగా స్పష్టంగా చెప్పేడు భవానీశంకరం.

దయామయుడైన దైవం ఆ దౌర్భాగ్యుణ్ని చంపినప్పటికీ అందు లోని దోషం తనకి అంటకుండా చేసినందుకు కొంతగా శాంతించింది గిరిజ.

కుష్టురోగులు శవాన్నీ, గిరిజనీ శంకరాన్నీ కొంతసేపు చూసి రిక్షావాణ్ని అడిగి రెండు అగ్గిపుల్లలు తీసుకొని కుంటుకొంటూ పోయేరు. కాకుల హాహాకారాలు వీథంతటినీ లేపుతున్నాయి. నీళ్ళబిందెలు చంకన వేసుకొని ఆడంగులు నీళ్ళకి బయల్దేరుతూ శవంవైపు వస్తున్నారు. రిక్షా వాడుమంచివాడేకాని, అవతల చావూ ఇవతల మూర్ఛా-వీటిమధ్య తనకి డబ్బు లివ్వడం మర్చిపోతారేమోనని కొంచెం ఆందోళన పడుతున్నాడు.

శంకరం లేచి నిల్చుడి,

"మరింక గిరిజగారూ, మీరు ఇంటికి వెళ్ళండి! ఓయ్ రిక్షా, ఈ అమ్మగార్ని వారింటికి తీసుకువెళ్ళవోయ్!" అన్నాడు.

గిరిజకి అదంతా ఏదో కలలో జరిగినట్టుగా అనిపిస్తోంది. కాని అదంతా ఆమెకి బాగా గుర్తుంది. అదంతా ఆమెకి ఎల్లప్పుడూ గుర్తుం టుంది. తన మనసు లగ్నమయిందని ఆమెకి తెలియదు. కాని అదంతా

ఆమెకి గుర్తుంది. రిక్షా ఎక్కుతూ తను సిగ్గుపడ్డంకూడా ఆమెకి గుర్తుంది. అక్కడ దుస్థితితో పౌర్భాగ్యంతో సంబంధం లేకుండా తను రిక్షా ఎక్కి ఇంటికి వెళ్ళిపోవడం ఆమెని ఆశ్చర్యచకితురాల్ని చేసింది. తనొకసారి హైదరాబాద్ వెళ్తూ ట్రెయిన్‌లోంచి రాజమండ్రి రోడ్డుమీద ఓ చావు చూసింది. ఆ చావుని ట్రెయిన్‌లోంచి అంతా చూసేరు. ఆ చావు అక్కడి శ్మశానానికి పోయింది. తన ట్రెయిను హైద్రాబాద్ చేరింది. లోకంలో దుఃఖానికీ తనకీ అంతేనా సంబంధం ?

ఇంటికి వచ్చి పీఫి గదిలో వాలుకుర్చీలో కూర్చున్న గిరిజ కళ్ళు మూసుకొంది. వర్ధనమ్మ ఆమెకి కాఫీ పట్టుకు వచ్చేసరికి ఆమె నిద్ర పోతోంది.

గిరిజ ప్రేమ ఆ విధంగా ఆరంభమయిందని గిరిజకి తెలియదు. మిస్ ప్రేమకి తెలియదు. అందుకే ఆరోజున ఆస్పత్రిలో భవానీశంకరం బెడ్‌పక్క గిరిజని చూసి నిర్ఘాంతపోయింది మిస్ ప్రేమ.

ముదుసు ప్లీడరు ముకుందరావుగారి ప్రవేశము— "ప్లీడరంటే ముకుందుడే ప్లీడరు" అని చెప్పడానికిగల కారణాల వివరణ – ఆయనగారి మరదలమ్మ "పువ్వూ కాదు, పండూకాదు" – అర్థరాత్రివేళ – ఇద్దరు పాతపాత్రల పునఃప్రవేశం "కేసులు ఎటుల తయారగును ?" అనే ప్రశ్నకి ముసుగులేని లోసుగు లేని జవాబు.

# 16

ముకుందరావుగారు మాంసం తినడం మానేసి చాలాకాలం అయింది.

నలభయ్యేళ్ళ వయసు వచ్చేదాకా ముకుందరావుగారికి జీవితపు విలువల గురించి ఆలోచన పుట్టలేదు. ఆ విలువలన్నీ రూపాయణా పైసల్లోనే ఉంటాయని ఆ తరవాత ఆయన తెలుసుకున్నారు.

అంతేకాదు మరొక విషయంకూడా ఆయన తెలుసుకున్నారు.

బతికినన్నాళ్ళు బతుకు శాశ్వతం. ఆ బతుకులో స్వార్థాపేక్షే శాశ్వతం. తలిదండ్రులూ, తోబుట్టువులూ, చుట్టాలు, బంధువులూ స్నేహి

తుటా - అంతా పోతారు. ఇవాళున్నవాళ్ళు రేపు ఉండరు. ఎవరుపోయినా తనకి మిగిలేది తనేకదా!

ముకుందరావుగారు మాంసం తినడంమానేసి చాలాకాలంఅయింది. ముకుందరావుగారు నిన్నకాక మొన్నరాత్రి హైలాండ్ హోటేల్లో జిల్లా జడ్జీగారతో కలిసి కూర్చొని పచ్చి (పంది) మాంసం తిన్నారు. ఏ భోగట్టా నిజం? రెండు భోగట్టాలూ నిజమే! అలాగే మద్యం విషయంలో కూడాను. ఆయన మధ్యం సేవించరు. కాదు - వారు మద్యం సేవిస్తారు. అదీ నిజమే, ఇదీ నిజమే! ఒక విధంగా చూస్తే బ్రహ్మ పదార్థం సగుణమే మరొక విధంగా చూస్తే అది నిర్గుణమైనదే. అలాగే - మధ్య మాంస విసర్జన పర్మినెంటువిషయం. అప్పుడప్పుడు తింటూ తాగడం చాలా తాత్కాలికమైన విషయాలు.

తాత్కాలికమైన వికారాలు శాశ్వతమైన స్వార్థాన్ని మార్చకూడదని ముకుందరావుగారు నిశ్చయం చేసుకున్నారు....తమరు ఈ తప్పుపనిచేస్తే, ఆ సత్యకాలపు మనిషి చనిపోవలసి వస్తుందే!——ఏం చేస్తాం?....తమరు ఆ బంజరుభూమి కలుపుకొంటే కొన్ని వందల బికార్లు ఫకీర్లుగానే ఉండిపోతారే! - ప్చ్! ఏం చేస్తాం? .... తమరు తమ పుత్రుడికి ఫస్టు మార్కులు వేయించేస్తే, మరొకడు మన్ను కొట్టుకు పోతాడే! - అయ్యా? అందుకు మనం చేసేదేంలేదు....తమరు ఈ నొక్కునొక్కితే ఆ పీక ఉక్కిరి బిక్కిరయిపోతుందే!- ఇలాటి నీతులు నాదగ్గిర చెప్పకండి.

అందుకే ముకుందరావుగారు బాగుపడ్డారు.

జడ్జీల అల్లుళ్లో, గవర్నమెంటు ప్లీడర్ల కొడుకులో, ప్రాసిక్యూటర్ల జూనియర్లో, పెద్దింటి బిడ్డలో అయితే తప్ప, ప్రాక్టీసు పెట్టిన తొలిరోజుల్లో ప్లీడర్లంతా బక్కగా డొక్కగా బయల్దేరుతారు. ఆ తరవాత "అదృష్టం" బట్టి - అంటే సంపాదన స్థాయినిబట్టి - ఎదుగుతారు, పెరుగుతారు ముదురుతారు, బలుస్తారు. బలిసినరోజు లొచ్చేసరికి వారికి మూలవ్యాధి చూపవచ్చు. అది వారు దాటుతారు. అతిమూత్రం కొందరికి కనిపించవచ్చు. అది వారు శ్రద్ధగా తగ్గించుకుంటారు. కాయాన్ని

బట్టి కొందరికి కార్డియాక్ ట్రబుల్ పొడచూపవచ్చు. దాని వార్నింగ్ బెల్ వినగానేవారు సిగరెట్టు, మందూ, మాంసం వగైరాలు విసర్జించి, కొంచెం దైవభక్తిలోనో వేదాంత చర్చల్లోనో పడి, పూర్వంకంటె ఎక్కువ దీక్షతో ధనార్జన చేస్తారు.

ముకుందరావుగారు ఆ స్టేజీలో ఉన్నారు. ఆయనకి యాభై య్యేళ్ళ వయస్సు దాటిందిగాని అతిమాత్రంలేదు. మూలశంకలేదు! గుండెపోటు వస్తుందేమోననే భయంమాత్రం ఉంది. బరువైన కాయం ఉంది. గాంభీర్యం ఉంది. కంఠంలో అరుపుంది, మెదళ్ళో తీర్పు లున్నాయి. నాలిక్కి మెలికలూ విరుపులూ చీలికలూ ఉన్నాయి. చూపులో ఇంకా తళుకుంది. తొక్క (త్వక్)కి మంచి తెలుపుంది. ఇంట్లో మంచి పెళ్ళాం ఉంది. మేడమీద మంచి కొడుకూ, కొత్త కోడలూ ఉన్నారు. పెరటిగదిలో మంచి చిలకుంది. (ఆవిడ ముండమోసిన మరదలే అయి నప్పటికీ మంచి బంగారంలాంటి భూములు కలిగిన మరదలు,) షెడ్డులో పియట్‌కార్ షోకుంది. జడ్జీల ఇళ్ళకి (ముకుందరావుగారికి) హాపీవిజి ట్సున్నాయి. అక్కడ వారికి మంచి పలుకుబడుంది. అన్ని కోర్టుల్లోనూ మంచి వర్కుంది. మూడు బ్యాంకులలో మూలధనం ఉంది. వారికి మంత్రులతో స్నేహం ఉంది. సమితి ప్రెసిడెంట్లచేత సేవచేయించుకో గల తాహతుంది. జిల్లా అధికార్లతో చక్కటి చెలిముంది. బ్రిడ్జి ఆటలో నేర్పుంది. ఒక అమెరికన్ కంపెనీకీ రెండు బ్రిటిష్ ఫర్మ్సుకీ లీగల్ అడ్వయిజర్ గిరీ ఉంది. పెద్ద క్లబ్బుల్లో మెంబర్‌షిప్ ఉంది. ఇద్దరు హైకోర్టు జడ్జీలతో స్నేహం ఉంది. మరొకరితో బంధుత్వం ఉంది. పర్వనాలిటీకి తగ్గట్టు వారికి మంచి వేషంవేసే అలవాటుంది. ఊరవతల మంచి మేడేకాక ఊరిమధ్య మంచి ఆఫీసుంది.

శాబాష్ బేటా!
ప్లీడరంటే ముకుందుడే ప్లీడరు!
అందర్లోకీ ఆడే గడుసు!"

అని ముకుందరావుగారి గురించి మందుల భీముడుకూడా మెచ్చు

కుంటూంటాడు. మందుల భీముడి మెప్పు సంపాదించినవాడు "నిజంగా ఘనుడే!" అయుండాలని భీముణ్ణి తెలిసినవాళ్ళు తప్పకుండా అనుకుం టారు.

ఘనుడు ముకుందుడికి గుండె సరిగా లేదేమోనన్న అనుమానం వల్ల ఆయన అలవాట్లన్నీ సరైనదార్లో పడ్డాయి. పనీ డబ్బూ రెస్టూ, పని డబ్బూ రెస్టూ, డబ్బు డబ్బూ రెస్టూ—అలా వెళ్ళిపోతోంది ఆయన జీవితం. దుబారా అలవాట్లన్నీ ఆయన తన జబ్బు సాకు చూపించి మానుకున్నాడు. "స్నేహితుల"కీ అధికారికీ ఆ విధంగా ఖర్చు పెట్టా ల్సిన అవసరం ఇప్పుడాయనకి బాగా తప్పింది. అదికూడా ఇప్పుడాయనకి మిగులే!

సాయంకాలం కోర్టునుంచి రాగానే ఆయన కాఫీతాగి ఓ ఘడియ రెస్టుతీసుకొని, శుభ్రంగా గోరువెచ్చని నీటితో స్నానంచేసి, విష్ణుసహస్ర నామాలు జపించి, ఆ తరవాత ఈజీ ఈవెనింగ్ డ్రస్సులోకి మారి, క్లబ్బుకి కార్ డ్రైవ్‌చేసుకుపోయి. అక్కడ బ్రిడ్జి కాస్సేపు (జిల్లాజడ్జీ ఇన్‌కమ్‌టాక్స్ అసిస్టెంట్ కమీషనర్. పోలీసూపరెండెంట్ లేదా పబ్లిక్ ప్రాసిక్యూటర్లతో కూర్చొని) ఆడి. రాత్రి ఎనిమి దయేసరికల్లా ఇంటికి వచ్చేసి. కాస్త చపాతీ, కొంచెం ఫ్రూట్సూ, కొంచెం స్కీమ్డ్‌మిల్కు లేదా స్కిమ్డ్ బటర్‌మిల్క్ తీసుకొని, మర్నాటి పనేమిటో చదువుకొని, ఠంచన్‌గా పదకొండున్నరయేసరికల్లా పడక్కి రిటైరవుతారు. ఆ తరవాత తెల్లవారుఝామున అయిదు గంటలకి తప్ప, ఈలోపున బ్రహ్మరుద్రు లొచ్చినాసరే ఆయన లేవరు.

ఓరోజు రాత్రి పన్నెండు గంటలకి ఆయన ఇంటికి ఎవరో ఇద్దరు వచ్చేరు. ముకుందరావుగారు నిద్రలేచారు. మామూలుగా అయితే లేవరు. కాని వారికి అన్ని రూల్సుకి మినహాయింపు లున్నట్టే ఆ నియమానికి కూడా సడలింపు ఉంది.

రాత్రి పన్నెండయింది. అప్పుడు ముకుందరావుగారి మరదలు నిద్ర లేచింది. ఆవిడ ముకుందరావుగారి గదికి పక్కగా ఉండే గదిలో

నిద్రపోతుంది. ఆవిడ చాలా బరువైనమనిషి. పూర్వం ఆవిడ అందం గానే ఉండేది. కాని ఇప్పుడు ఆవిడ ముఖం అంతా ముదిరిపోయి కణు పెక్కి పోయింది. వేషం విప్పేసిన ముసలితార ముఖంలా ఉంటుందావిడ ముఖం. పొట్టిగానూ 'వలం' గానూ ఉండడంచేత. పిప్పళ్ళబస్తాకి చీర కట్టినట్టుగా ఆవిడ కొంచెం వికృతంగా కనిపిస్తుంది. ఆవిడ కంఠం ఖణే ల్మంటుంది. ఆవిడ చూపు క్రూరంగా ఉంటుంది.

ఓనాడు రాత్రి పన్నెండు గంటలకి ముకుందరావుగారి యింట్లో "కాల్‌బెల్" మోగింది. కాల్‌బెల్ మోతలు రకరకాలుగా ఉంటాయి కొన్నిసార్లు భయం భయంగా ఉంటాయవి ఆ చప్పుడుబట్టి ఆ బెల్ నొక్కినవారు తక్కువ్వారని గ్రహిస్తుంది ముకుందరావుగారి మరదలు. బుర్ బుర్‌మని మోగకుండా గర్రుమని కొంతసేపు గర్రాగా మోగుతుంది ఆ కాల్‌బెల్లు. దాన్నిబట్టి ఆ వచ్చినవారి స్టాటస్ గ్రహిస్తుంది ముకుంద రావుగారి మరదలు. ఆరోజు రాత్రి ఆ కాల్‌బెల్లు గర్రాగానూ అర్జంటుగానూ మోగింది.

మామూలుగా అయితే నౌఖరు వెంకన్న తలుపు తెరిచి ఎవరో ఏమిటో కనుక్కొని "మరదలమ్మకి" చెప్తాడు. అతను వెంటనే నిద్ర లేవకపోతే ముకుందరావుగారి మరదలమ్మ "ఒరే వెంకా, నీ మొహం తగలెట్టా! ఎవరో ఒచ్చేరు చూడ్రా!" అని అతణ్ని లేపుతుంది. ఆ రోజున ఆ గంట మోతలోని తొందర గ్రహించిన మీదట ఆవిడే వెళ్ళి వీధి తలుపు తెరిచింది. వీధి వరాండాలో లైటు వెలిగించే స్విచ్ గదిలోనే వుంది. వరండా లైటు వెలిగించాకే ఆవిడ వీధి తలుపు తెరిచింది.

వరండాలో ఒక ఆడదీ ఒక మగవాడూ నిల్చున్నారు. గుమ్మంలో నిల్చున్న మరదలమ్మ వాళ్ళని నిదానంగానూ నిశ్చలంగానూ చూసింది. ఆడమనిషి అంతకుముందెపుడూ ఆవిడ చూసినదికాదు. ఆ మగవాడెవరో మాత్రం ఆవిడ గుర్తుపట్టింది. నిద్రలేచి, బట్టలు సర్దుకోకుండా నిలబడ్డ ఆడవాళ్ళు ఎలా నిల్చుంటారో అలానే నిల్చుంది మరదలమ్మ. ఆవిడ జుట్టంతా రేగిపోయింది. చీరంతా చెదిరిపోయింది అయితే—స్త్రీత్వం

సూచించే తన మధురాంగాలమీద ఆవిడకి ఆశా మమకారాలు పోనాడో పోయేయి. పైట ఉన్నా లేకపోయినా ఆవిడ కొకటే. ఎంత పెద్ద మగవాడొచ్చినాసరే అతని కెదురుగా ఎలావున్నావిడ అలానే నిలబడగలదావిడ. కొవ్వు బలిసినకొద్దీ తోలు ముదిరినకొద్దీ ఆవిడ సిగ్గు సన్నగిల నారంభించింది, లజ్జ దిగజార నారంభించింది. ఆవిడకి తెలిసిన మగవాళ్ళు కొద్దిమందే కాని, ఎందరో మగవాళ్ళి తెలిసినమీదట "అందరు మగ వారూ ఒక్కటే (ప్చ)" అని తెలుసుకున్న ఆడ మనిషిలా చెక్కు చెదర కుండా కొబ్బరి కురిడీలా నిలబడుతుందావిడ. ఆవిడ పువ్వూకాదు, పండూ కాదు. అసలైన కురిడీ, అంతే.

కురిడీల సొగసులకికూడా మురిసిపోయేవాళ్ళు ఉన్నారు. ఆ అర్ధ రాత్రివేళ ఆడ మనిషిని వెంట వేసుకువచ్చిన మగవాడు, గొడ్డుటావుని చూసిన ముసలి ఆబోతులా అతనావిణ్ని ఆనందిస్తూ చూసేడు.

"బావకోసం ఒచ్చేం అరిజెంటు యవారం. అలాటిలాటిదికాదు. బావని బేగి లేపాల!" అన్నాడతను.

"బావ లేవడు." అంది మరిదలమ్మ.

"లేపాల!" అన్నాడతను.

అంతలో అతని పక్కనున్న ఆడమనిషి ఓ అడుగు ముందుకొచ్చి,

"అమ్మా, ఆ బాబుని ఎలాగైనా లెగ్గొట్టాల! ఉన్నట్టుంచి ఉపద్రుం ఒచ్చిపడ్డాది, బాబుని లెగ్గొట్టకపోతే నా కొంప కూలిపోద్ది. నా బతుకు ఏట్లో పడిపోద్ది. రచ్చిస్తే ఆ బాబే నన్ను రచ్చించాలి. ఉప్పుడు ఆ బాబే దేవుడు నాకు!" అని దీనంగా చెప్పింది.

ఆ ఆడమనిషి బరువుగా పొట్టిగా దుక్కలాఉంది. కొత్తగా మీసం తీయించిన వాడి ముఖం కళకాంతులు తప్పినట్టు నగలన్నీ తీసేయడంచేత కాబోలు ఆవిడ ముఖం కళ తప్పింది. ఫర్నిచర్ తీసేసిన గది ఎక్కువ విశాలంగా కనిపించినట్టు, అలంకారాలు తీసేసిన ఆవిడ ముఖం ఉన్న కంటే పెద్దదిగా జేవురించి కనిపిస్తోంది. ఆవిడ తన ఎడమచేతి మణి కట్టు గుడ్డతో చుట్టుకొని ఆ చేతిని కుడిచేత్తో పట్టుకొని నిల్చుంది.

మరదలమ్మ కొంతసేపు తటపటాయించింది. పార్టీల కష్టాల గురించి ఆవిడ పట్టించుకోడం మానేసి చాలాకాలం అయింది. ఇతరుల బాధల గురించి ఆవిడ అసలు ఎన్నడూ అంతగా పట్టించుకోలేదు. కాని అవతలివారి కష్టాలు ఎంత ఎక్కువగా ఉంటే తన బావకి అంత "ఎక్కువ ఫీజు వస్తుందికదా" అనే తొందర ఆవిడకి లోగడ ఉండేది. బావగారు పెద్ద వకీలయేసరికి ఆవిడకి ఆ తొందరకూడా పోయింది. సినీమాల్లో పేదల కష్టాల్ని పెద్దింటి ప్రేక్షకులు ఆవలిస్తూ చూసినట్టు ఇప్పుడావిడ కష్టాల్లోవున్న పార్టీలని ఎంతో దూరంనుంచి చూస్తుంది' మానవుడు పుడతాడు, చస్తాడు. ఏముంది వింత? అలాగే మానవుడు కేసులలో పడతాడు, డబ్బులు ఖర్చుపెట్టుకుంటాడు. చివరకి ఎక్కడకో పోతాడు, ఏముంది వింత?

"రేపొద్దున్నే రండి ఇప్పుడు ఆయన్ని లేపడానికి వీలుండదు."

అని అనేద్దాం అనుకుంది మరదలమ్మ. అందులోనూ అపాటి ఈపాటి ఆడమనిషి ఎవరైనా ఆపదలో ఉన్నాదంటే 'దానికి' ఏ సాయం కూడా చెయ్యాలని మరదలమ్మకి అనిపించదు. అయితే తన యెడల వినయంగా ఉండే మగవారు తన సాయంకోసం బతిమలాడుకుంటే బండ రాయిలోంచి నీరు కొంచెం చిమ్మినట్టు ఆవిడకి అతి కొంచెం కనికరం కలుగుతుంది.

అందుచేత ఆవిడకి ఆ అర్ధరాత్రి వచ్చిన రాజమ్మని (అవును, రాజమ్మె ఆ వచ్చినది. ఆవిణ్ని) చూస్తే జాలి కలక్కపోయినా, మందుల భీముణ్ని (అతను మందుల భీముడు కాక మరెవరు?! అతణ్ని) చూస్తేమాత్రం అతి కొంచెం—అంటే ఒక చెమ్చాడు కనికరం కలిగింది.

అందుచేత మరదలమ్మ—ఎడమభుజంమీంచి జారి జీరాడే పైటని కుడిచేత్తో జెండాలా ఎత్తి—ఒక్కసారి పెద్దగా ఆవలించి

"ఇక్కడుండండి. లేస్తాడేమో చూసొస్తాను" అని ఇంట్లోకి వెళ్ళింది.

వీధి వరాండాలో నాలుగు బెత్తు కుర్చీ లున్నాయి. అందులో

ఓ కుర్చీలో కూలబడుతూ, ఆ ఇంట్లోకి వెళ్లిన మరదలమ్మ గురించి మందుల భీముడు రాజమ్మతో,

"నోరు లెరిస్తే అమ్మకి ఎంతకో వస్తుందో చూసేవా?" అన్నాడు.

"అయమ్మ వల్లు ఎలాగుంచేనేటి? ఇంకేటో ఎలాగుంచేనేటి? అయి సూద్దానికేటి మనం ఒచ్చినావుఁ?" అంది రాజమ్మ.

"అరుస్తావేటి? అరక!" అని రాజమ్మని నెమ్మదిగా మాట్లాడమని హెచ్చరించేడు మందుల భీముడు.

"అరడానికి ఓపికుందా నాకు!" అని రాజమ్మ ఆశ్చర్యపోయింది. "ఆముండ సచ్చినోడికి నా ఉసురు ఒప్పుడు తగుల్తాదో యేటో?! ఆడి పెల్లంతాడు ఒప్పుడు తెగుద్దో యేటో? ఆడి రోగం ఒప్పుడు సల్లారుద్దో యేటో?" అంటూ భవానీశంకరం గురించి తిట్టడం ప్రారంభించింది రాజమ్మ

"ఒస్ ఒల్లకోయే! ఆడిమీద నీకేటుంది కోపం? నాకుంది కోపం! ఎట్టుకుని ఎట్టుకుని తగవు నాతో ఎట్టుకున్నాడు. కౌంసిలర్ భీమ సేన్రావంటే ఆడిమట్టుకు ఆడు ఏటో అనుకొంటున్నాడు! పగబట్టకే పోవాలి కాని పట్టేనంటేమాత్తరం - మానవుడయినాదీ దేవుడయినాదీ- ఆణ్ని మర్చిపోను, మట్లో కలిపేదాకా ఆణ్ని మరింక ఒగ్గను; ఇక్కడ కొచ్చి నావాఁ? ముకుందబాబుని అద్ధరాత్తిరైనా సరే లెగ్గొడుతున్నావాఁ? కాసుకో మరింక! నేనేగాని తల్సుకున్నానంటే ఎలకతోకతో ఏనుగుని బంధించీగల్ను! మేక తోకతో పులిబుర్ర పొడిసీగల్ను! కప్పని జూపించి నాగుబావుని బెదిరించీగల్ను! అంతెందుకు? మనూరి సాకలోణ్ని లెగ్గొట్టి లేపి ఆడి సాయంతో సేర్మేన్‌గాణ్ని సీట్లోంచి లెగ్గొట్టించీగల్ను! తెల్దు కాబోసు నీకింకా మన తడాకా!" అంటూ చుట్ట తీసేడు మందుల భీముడు.

"అందర్నీ అన్నీ సెయ్యగలవుగాని కమ్మలింటి రాజుగాడి ఎంట్రుకే తెంపలేవు!" అని మందుల భీముడి మగతనం గురించి నిరస నగా మాట్లాడింది రాజమ్మ.

ఆమె మాటల్లోని ఈసడింపు గుర్తించకుండా.

"అలాటిది, ముకుందబాబులాటి ఒకీలు మన చెప్పుచేతల్లోఉంటే మన చెక్కరానికి అడ్డేటుండే ఒలె రాజమ్మా" అన్నాడు మందుల భీముడు. ఆ తరవాత చుట్ట ముట్టించి రాజమ్మవైపు విజయగర్వంతో చూసేడు.

"సేస్తే! సేసి సూపిచ్చాలగాని ఆడారి ఊసులు మాత్తరం నాకాడ సెప్పకు!"

అని భీముణ్ని కసిరింది రాజమ్మ. ఆమె కోపానికి మందుల భీముడు చిరునవ్వు నవ్వేడు? ఆ తరవాత చుట్టపొగ బాగా - దవడలు లొత్తచేసి - లాగేడు! లాగి విడిచేడు. ఆ తరవాత చెప్పేడు.

"రాజమ్మా! ఆసికానికైనాసరే నాదగ్గిర అలాటి మాటలెపుడూ ఆడబోక. కమ్మలింటి రాజుగాడితో నీకు ఇరోధం ఉంటే నాక్కూడా ఇరోధం ఉన్నట్టే లెక్క అనుకో! కాదన్డంలేదు నేను. కాని ఆడికీ నీకూ ఇరోధం ఉందనా నే నిందల కలగజేసుకొంటున్నాననుకొంటున్నావు? ఎర్రి మొకవా! ఎర్రిమొకవా!" అని వికవిక నవ్వేడు భీముడు.

"ఎద్దుపుండు కాక్కిరుసి! సెయ్యిరిగిపోయి నానేడుస్తుంటే కుర్చీలో కూకుడోసీ నువ్వు కులుకుతుండు. నా జట్టీలోకి నువ్వెందుకు దిగుతావు!! ఒట్టినే దిగవని నా కెరికే! ఎంకయ్యసెట్టి ఏ లాబవూ లేకుండ ఏట కెల్తాడా? అలాగ్గే నువ్వూను. ఆణ్ని దెబ్బతీస్తే. పైవేటుగా చీకిరేట్గా నీకెదో లాబంఉంది, ఉంది నా కెరిక! అందుసేత నా సెయ్యేట్టి ఆణ్ని కొట్టించడానికి పయనమైనావు గాని లేక పోతే పయనమోతావా! ఆడికి దెబ్బ దగల్టవేఁ నీక్కావాలిగాని మద్దెల, నా సెయ్యి నెప్పెడితే నీ సొమ్మేం పోయింది? దెబ్బ దగిత్తె ఆడు పోతాడు. సెయ్యి నెప్పెడితే నాను పోతాను. నువ్వు మాత్తరం కురిసీలో కూకుడుంటావు. అరువు సుట్ట కాలుస్తూ, సుక్కలెక్కెడతా మరీ కూకు డుంటావు. 'ఇయాళ రాజమ్మసేత రాజుగాడికి దెబ్బ దీయించేసినానుగదా! ఆడు ఆస్పత్రికి పోనాడు. గంగరాజు కొట్లోకి పోనాడు. రేపు రాజమ్మ

బుర్ర రాళ్లోకి పోద్ది! మరింక రేపు మరెవుడికిసేత మరెవుడికి దెబ్బ దీయిద్దారా?' అని ప్లాపేస్తా కూకుడుంటావు. అమ్మో! నీ బుర్రసంగతి నాకు తెల్దా? కుచ్చితం బుర్ర!" అని దుఃఖపడుతూ భీముణ్ని తిట్టింది రాజమ్మ.

"ఊరంతటికీ అగ్గెట్టేసి కమ్మలింటి రాజుగాడిబుర్ర శితకదొక్కేసి అణ్ని మూల్ని కూకుడోబెట్టాల్సిన" బాధ్యత ఊరందరిమీదా ఉన్నప్పటికీ, ఆపని వారెవరూ చెయ్యకుండా. ఆ పరువంతా ఆడకూతురైన తన నెత్తిమీదా గోవులాంటి గంగరాజు బుర్రమీదా పెట్టేసి, ఊరివారంతా (అందులోనూ ముఖ్యంగా మందుల భీముడు) హాయిగా కూర్చోగలగడం రాజమ్మకి చాలా కష్టమనిపించింది.

"నానో ఎర్రిముండకూతుర్ని, నా మొగుడో ఎర్రిముండకొడుకు. మమ్మల్నిద్దర్నీ గంగల దింపేసి ఊరంతా కులుకుతా కూకుడున్నారు" అని రాజమ్మ కళ్ళొత్తుకుండికూడాను.

"ఎర్రిముండకి తిక్కమొగుడని సామెజ్జెప్పినట్టు ఒకరుకిద్దరు తోడైనారు గదా! పట్టపగటిపూట తాలూకా కసేరీకాడ బంగాళ్లంజ కొట్టు ఎదురుగ్గ దొరికేడుగదా అజ్జెప్పి అణ్ని శితగ్గొట్టేసినపుడు ఈ బయాలన్నీ ఏటయేయో? ఎవుణ్నయినా అడిగి జేసేవా ఆపని? కొండంత మనిషి - సింవాశెలం కొండంత మనిషి - కౌంసిలర్ భీవుణ్ని నేనున్నాను. పోనీ నన్నయినా సలాజేసేవా? ఆఁ ఆఁ! నీ మొగుడో పెద్ద నాయికుడు. నువ్వో పెద్ద నాయిరాలివి! శీకట్లో నడిసప్పుళ్లేకండ ఆ కమ్మలింటరాజుగాడికి ఎప్పుడెలాటిపని సల్లగ జేయిద్దునో నన్నేకాని నువ్వు సలా అడిగితే, మలింక ఇప్పుడు ఏఁటి అనుకొని ఏఁటిలాబం - అయినా, సంగతెలగానే ఒచ్చేను. సాయానికి రంగంలోకి దిగేను. అణ్ని దెబ్బ తియ్యడానికి నాకు సీక్రేట్ కారణా లున్నాయ్ అనుకో, వుంటే ఉంటాయి. ఆటితో నీకు సంబందవేఁటి?- సాయం జేస్తున్నందుకు సంతోసించక! అందులోనూ. రంగంలోకి దిగడం ఎలా దిగేను? ఇలాగ్గలాగ్గనా?! కీచకుడిమీదికి భీఁవఁసేనుడు దిగినట్టు, పోలండుడిమీదికి యిట్లరుగాడు దిగినట్టు దిగేను!

కాస్కోక మరిక! అర్ధరాత్రి రైనాసరే ముకుందబాబు లెగుస్తున్నాడు? నా కోసరం! గాంధీ నేరా లొచ్చి లేపితే లెగడు. పెశిడెంట్ ఆప్పిండియా ఒచ్చి లేపితే లెగడు. అలాటి బాబు మనం లేపితే లెగుస్తాడు. లెక్క పోతే లెగిసేదాకా ఒగ్గను. అందులో ఆ బాబు ఎలాటోడో నీకు తెల్సా? తెల్దు! నీకేటి తెల్సు!? నీళ్ళోసి పాలమ్మడం తెల్సు, పేడెత్తి పిడక లెట్టడం తెల్సు. నోరెట్టుకు ఊరోళ్ళందరమందిర్నీ అశిరెమ్మలా తిట్టడం తెల్సు! నీకేటె తెల్సు? ఊరికే మాటమీదమాట జారిడిసేస్తున్నావు? నీకేటి తెల్సు?"

అని రాజమ్మని గద్దించేడు మందుల భీముడు.

తనకేమీ తెలియిదనీ తనొక మూర్ఖురాలిననీ రాజమ్మ వప్పేసు కుంది. అంతలో మరదలమ్మ మళ్ళీ వచ్చి అయ్యగా రొస్తారు ఉండండి" అని చెప్పి మళ్ళీ లోనికి వెళ్ళిపోయి, లోపల్నించి అటుపక్కనే ఉన్న ఆఫీసుగది తలుపు తెరిచింది. అందులో లైటువేసి,

ఆఫీసు గది విశాలంగా నీలంగా, పాలరాతి గచ్చుతో మెరుస్తూ సొంపుగా ఉంది. 'లా' పుస్తకాలతో నిండిపోయిన బీరువాలు కనీసం పదైనా ఉన్నాయి. అవన్నీ అద్దాల బీరువాలు. మొండెంలేని పిశాచాల ముఖాల్లా అవి కొంచెం భయంకరంగాకూడా ఉన్నాయి. గదిలో ఉన్న కుర్చీలుకూడా, ముక్కూ కళ్ళూ నోళ్ళూ లేని వింత ముఖాల్లా కొంచెం భయంకరంగా ఉన్నాయి. ఎక్కడో మీట నొక్కితే అవి మనుష్యులుగా మారి పిశాచపు టల్లరి చేస్తాయేమోననే భయం కలుగుతుంది వాటినిచూస్తే! వకీల్‌గారి బల్లకి - ఆయన కుర్చీలో కూర్చుంటే అందుకుందికి వీలుగా - ఇరుపక్కలా రెండు తిరుగుడు బీర్వా లున్నాయి. కడుపులో దాచిన పాపపుటాలోచనల్లా వాటిలో కరడుగట్టిన పుస్తకాలున్నాయి. గదిలో ప్రవే శించేవారి కెదురుగా, వకీల్‌గారి కుర్చీకి వెనగ్గా గోడని ఓపెద్ద పటంవుంది. ఆ పటానికి కాయితపు పూలదండొకటి చచ్చిపోయినదాన్లా వేళాడుతోంది ఆ పటంలో గుండొకటి కనిపిస్తోంది, గోచీ ఒకటి కనిపిస్తోంది, ఒక వర మతం కనిపిస్తోంది. ఆ గుండుకీ ఆమతానికీ మధ్య ఓ స్వామివారి

పీఠ విగ్రహం చిదానందంగా కనిపిస్తోంది. ఆ స్వామివారి కాయం చాలా పెరగా ఒక వ్యక్తి మరంలోంచి మరొకరి కాయం లేచినట్టుగా గమ్మత్తుగా ఉంది. ఆ విగ్రహం సన్నంగా లేదు. ఇరవయ్యేళ్ళకింద తపస్సు చేసి, ఇరవయ్యేళ్ళనించీ ఆ పటంలోని ఫొటో తీసేవరకూ డాక్టర్లు చెప్పిన బెస్టు డయిట్ మీద బలిసినవాళ్లా ఉన్నారతను. ఆయన ముఖం శాంతంగాలేదు, గంభీరంగా ఉంది, ఆ గాంభీర్యానికి తగ్గట్టు శరీరం అతి పుష్టిగా కనిపిస్తోంది. ఆయన గామా తమ్ముళ్ళా కనిపిస్తున్నారే కాని స్వామివార్లా కనిపించడంలేదు. ఆయన పేరు స్వామీ ఏవో ఏవో ఆనందుడు. ఆయన ముకుందరావుగారి లేటెస్టు గురువు.

మరదలమ్మ లేపినప్పుడు ముకుందరావు మూడోనిద్రలో ఉన్నాడు. ఆయినకి చింతలూ, చిరాకులూ లేవు, అంతరాత్మ బాధలూ లేవు. డబ్బు చిక్కులూ కావు, (కావలసిన రెట్టు తీసుకొంటున్నారు కాబట్టి) దేహ బాధలూ లేవు. గాంధీగారుకూడా గాఢరాలేవీ లేకుండా అంతటి గాఢనిద్ర ఎప్పుడూ తీసుకొని ఉండరు.

అర్ధరాత్రివేళ మరదలమ్మ ముఖం చూసినందుకు ఇదివరకైతే ఆయన ఆశ్చర్యపడకపోయి ఉండురు. ఆ టైంకే ఆవిడ లోగడ వారిని లేపుతూ ఉండేది. ఆవిణ్ని ఒక డ్యూటీకింద వారు భరిస్తూండేవారు. భగవదేచ్ఛ ఎలాఉంటే అలా జరక్క తప్పదని వారు నిశ్చయం ఏనాడో చేసేసుకున్నారు. దాన్తో వారికి మరదలువల్ల చాలా సౌభాగ్యం చేకూరింది. అది భగవదేచ్ఛ కాబట్టి చాలా చిత్తశాంతికూడా చేకూరింది.

"ఎవరొచ్చేరు?" అని ఆరాత్రి మళ్ళీ అడిగేడు ముకుందరావుగారు

మరదలమ్మకి ఇటీవల, బావ ముకుందుడు భక్తి బోధించి రక్తి తగ్గిద్దామని తాపత్రయపడి కొంత కృతకృత్యు డయేడు. అందుచేత ఆవిడ గారి "అర్ధరాత్రి విజిటు"కి ఆయన కొంచెం అదిరేడు. ఆ తరవాత ఆమె రాకకి కారణం తెలుసుకొని కొంచె సర్దుకున్నాడు. తన నిద్రాభంగానికి శృంగారపు కారణాలేవీ లేవని తెలుసుకోగానే ఆయన చాలా శాంతించేడు.

"మందుల భీ(వు(డొచ్చేడు. నీతో ఏవో అర్జెంటు పనుందిట. వెంట ఎవర్తో లంకిణీకూడా ఉంది. నగలన్నీ ఊడబీక్కుని మరీ

ఒచ్చింది. మొగుడికి విషం పెటేసి దహనం దగ్గిర దొంగ ఏడుపు లేడ్చే దాన్లా మొహం అదీను."

ముకుందరావుగారు లేచి కూర్చున్నారు ఆయన సిల్కు లుంగీ చుట్టుకొని తెల్ల బనియను తొడుక్కొని ఉన్నారు. ఆయన దండలూ ముఖమూ కూడా తెల్లగా - దీపకాంతిలో వికృతంగా - కనిపిస్తున్నాయి, మైదాతో బొమ్మచేసి దానికి మైనపురంగు వేసినట్టు ఆ తెలుపు చాలా వికృతంగా ఉంది. అందులో రంగు ఉందికాని జీవంలేదు. ఆయన లావుగా ఉన్నాడు. కూర్చున్నప్పటికీ కూడా పొడవుగా కనిపిస్తున్నాడు తలమీది వెంట్రుకలు తెల తెల్లగా కొంచెం ఎర్రగా ఉన్నాయి. ఆయన ముఖం నున్నగా, షేవింగ్ అవసరంలేనిదాన్లా ఉంది. నుదురు చాలా ఎత్తుగానూ, నోరు చాలా పెద్దదిగానూ, ముక్కు చాలా పొట్టిగానూ — ఉండడంచేత ఆయన వికారంగానే కనిపించినప్పటికీ "అబ్బ ఎంత వికారంగా ఉన్నాడు!" అని అందరూ నోటీసు చేసేవాళ్లా ఉన్నాడు. మరదలు చెప్పిన మాటలు విన్నాక మందుల భీముణ్ని అప్పుడే చూడ్డమా లేకపోతే మర్నాడు పొద్దున్నే రమ్మనడమా అని ఆయన కొంతసేపు ఆలోచించేడు.

మందులషాపు తగాయిదాలో భీముణ్ని క్రిమినల్ కేసుల్లోంచి, సివిల్ తగవుల్లోంచీ కూడా ముకుందుడే తప్పించాడు. అది జరిగి చాలా కాలం అయింది. కాని ఆ కేసుతోనే ముకుందుడికి మంచి పేరొచ్చింది. మందుల భీముడు దొంగేకాని తనకి లక్కీ క్లయంటు. తనకి అప్పణ్నించీ చాలా విశ్వాసంగాకూడా ఉంటూ వచ్చేడు. ఓసారి మరో ప్లీడర్ని పాతీయవలసి వచ్చినప్పుడు ఆ ప్లీడరుగారి గుమాస్తాదగ్గిర్నించి అవతల పార్టీవారి కాయితాలన్నీ మందుల భీముడే సంగ్రహింపజేసి పట్టుకువచ్చి ఇచ్చేడు ("ఈ పాపం నీదేకాని నాదుకాదు ముకుందబాబూ," అంటూ వచ్చేయి ఆ కాగితాలు.) ఆ తరవాత మరదలమ్మ - ఆ రోజుల్లోనే - ముండమోసిన కొన్నాళ్ళకి ఓ స్టూడెంటు కుర్రాడితో లేచి వెళ్ళిపోయినప్పుడు మందుల భీముడు స్వయంగా వెళ్ళి ఆ కుర్రవాడి తలిదండ్రుల్తో

మాట్లాడి ఆ కుర్రవాడు ఆ మదనలమ్మని విడిచిపెట్టేట్టుచేసి, ముకుంద రావుగారి అత్తవారి మర్యాదా కాపాడేడు. మదనలమ్మ ఆస్తి ముకుంద రావుగారికోసం కాపాడేడు.

మందులభీముడు చెప్ప వొంగేకాని మనకి కావలసిన మనిషి. మనం వాణ్ని కాపాడిన విశ్వాసం వాడికుంది. అందుచేత,

"ఏంటయ్యా ఇంత రాత్రొచ్చేవు? ఎవరు ఈ మనిషెవరు?" అంటూ ఆఫీసు గదిలోకి వచ్చేడు ముకుందుడు.

ముకుందుడి "బుర్రకి" ఎప్పుడూ మెడల్సు ఇస్తుంటాడు మందుల భీముడు. తను పెంచిన పిల్లిపిల్ల పులిపిల్లగా మారితే సంతోషించినట్టు అతను ముకుందుణ్ని చూసి సంతోషిస్తూంటాడు. "అప్పుడు గెడ్డలా ఉండేవోడు! ఇప్పుడు ఎగస్పార్టీలమీదికి గరుత్మంతు డెగిరినట్టు ఎగురు తాడు మనోడు! ఒక్క తీర్పు తీసిచ్చినాడంటే. అవతల పక్క హైకోర్టు పకీలొచ్చినా వాజోపే అన్నమాట! ఆడు తీర్పులు తిని బతుకుతాడు గానీ, నీలాగా నాలాగా పులుసన్నం తిని బతకడు! జొబ్బిలోళ్ళ కేసు తెల్సా నీకు? ముకుంద బాబే జేసేడు. అది సుప్రీంకోర్టు కెల్తే అక్కడ పెద్ద జడ్జీకేసంతా సదివి హాశ్చర్యపోయి ముకుందబాబు నోసారి సూస్తా నన్నాట్ట. ముకుందబాబు ఓడించిన తొలి కోర్టు వాదన్నే డిల్లీ జడ్జీకూడా ఖాయపరిశేశేడన్నమాట. అలాటి బుర్ర ముకుందబాబుది! శ్రీకృష్ణుణ్ని తీసుకొచ్చి నిలబెడితే ఈడు యాదవుడేగాని దేవకీనందనుడుగాడని ఓడించ గల్డు మనోడు! ఓడించడవేఁగాదు - ఓడించి నెగ్గగల్డు!" అని ప్రచారం చేస్తూంటాడు మందుల భీముడు ముకుందుడి ఘనత గురించి.

ముకుందుడు ఆఫీసు గదిలోకి రాగానే అక్కడ బల్లమీద కూర్చున్న రాజమ్మ లేచి నిలబడింది. కుర్చీలో కూర్చున్న మందుల భీముడు లేచి నిలబడబోయేడు కాని నిలబడనక్కర్లేదని ముకుందు డతణ్ని వారించేడు.

"ఎవరీ మనిషి?" అని కుర్చీలో కూర్చొంటూ రాజమ్మగురించి మళ్ళీ అడిగేడు ముకుందుడు.

"ఎప్పుడూ లేదు, ఇలాగ అడిగినావేంటి ముకుందబాబూ ?" అని ఆశ్చర్యపోయేడు మండుల భీముడు. "మన రాజమ్మనే మర్చిపోయేవా ? గంగరాజు పెళ్ళం రాజమ్మ" అని రాజమ్మగురించి జ్ఞాపకం చేసేడు.

"రాజమ్మా ! ఏంవిటిలా ఒచ్చేవు ? నగా నట్రా లేకుండా అలా ముసుగేసుకొచ్చేవేంవిటి ? ఏం ? ఏంవయింది ?" అని అడిగేడు ముకుంద రావుగారు. వెంటనే ఆమె చేతివైపు చూసి, "చేతికి కట్టుకట్టేవేం ? ఏదైనా తగువా ?" అని అంటూ భీముడివైపు తిరిగి "క్రిమినల్ తగువా?" అని సూటిగా అడిగేడు ముకుందుడు.

"నువ్వు కూర్చో రాజమ్మా," అని రాజమ్మతో చెప్పాడు భీముడు.

ఆమెని కూర్చోమని ముకుందుడు కూడా చెప్పేడు.

చేతిమీది దెబ్బగురించి నొప్పి అభినయిస్తూ రాజమ్మ అక్కడ బల్లమీద కూర్చొని ఆ వెంటనే నొప్పిగురించి మర్చిపోయింది.

"ఏంవిటి కథ ?" అని ప్రశ్నించేరు ముకుందులవారు.

"కొంపలంటుకున్నయి" అన్నాడు భీమసేనుడు.

"నువ్వే రచ్చించాలి బాబూ ! ఎంత పెద్ద కేసైనా మిట్టకాయలో తెగ్గొట్టేస్తాడు ముకుందబాబు; పీడరంటే ఆ బాబే పీడరన్జెప్పి ఊరంతా కంచువోగినట్టు వోగిపోతంది నీ పేరు ? నా బతుకు బారంవంతా నీ సేతులో ఎట్టేస్తన్నాను ! ముంచుతావో తేలగొట్టేస్తావో నియ్యిష్టవేం మరింక" అని బెంచీ అంచున కూర్చొని ప్రాధేయ పూర్వకంగా చెప్పింది రాజమ్మ.

"క్రిమినల్ కోర్టుకి ఎపుడో కాని వెళ్ళడంలేదోయ్ భీంవుండూ," అని, కుడిచేత్తో తలవెనక నిమురుకొంటూ చెప్పేడు ముకుందుడు. ఆ కోర్టుకీ తనకీ సంబంధం తెగిపోయిందని సూచించడానికా అన్నట్టు- "ఆ ఆ ఆ" అంటూ చాలాసేపు ఆవలించేడు కూడాను.

"అణాపరక అల్లరి కేసులైతే దిగవుకాని, ఖూనీకేసైతే రాడాని కేంటి ?" అని చెప్పి "అందులోనూ, కేసు మరోడిదీ మరొాడిదీ కాదు

మన గంరాజు మాఁవఁడి! ఆడు లేకపోతే నేను లేను. నేను లేకపోతే శేర్మేన్ లేడు. శేర్మేన్ లేకపోతే మున్సిపాల్టీ లేదు." అని వక్కాణించేడు కౌన్సిలరు.

మ్యునిసిపాలిటీకి అంత ప్రమాదం రానున్నందుకు ముకుందులవారు మందహాసం చేసేరు. ఆ తరవాత "ఏఁవిఁటి కేసు అసలు?" అని సూటిగా ప్రశ్నించేరు.

"అలా అడిగేవు బావుంది" అని అసలు కథలోకి దిగేడు మందుల భీముడు.

కమ్మలింటి రాజుకీ, రాజమ్మా గంగరాజులకీ మధ్య రాజుకున్న తగువంతా వివరంగా చెప్పి, ఈరోజు మధ్యాహ్నం బంగారి కొట్టుదగ్గిర జరిగిన యుద్ధంగురించి కూడా వివరంగా తెలియజేసేడు ముకుందుల వారికి మందుల భీముడు.

"ఆ తరవాత ఇప్పుడేంటయిందంటే కిళ్లీకొట్టు బంగారప్పా, అమ్మలని ఓ కుర్రలంజా కలిసి ఆ కమ్మలింటి రాజుగాణ్ని ఆస్పత్రికి మోసుకెళ్ళితే; ఆస్పత్రోళ్లు అక్కణ్ణించి ఫోన్‌జేస్తే ఒన్‌టాన్ యేద్దు అక్కడకెళ్ళి ఇప్పుడు మనకొంప ముంచినాడు."

"ఆ కమ్మలింటి రాజు ఎవరో—బతికే ఉన్నాడా?"

'ఉన్నాడు. ఇంతబేగెక్కడ చస్తాడు'

"చచ్చిపోయే ప్రమాదం ఉందా?"

"అదే కొశ్చను"

"ఇంతకీ ఆ హెడ్‌కానిస్టేబుల్ ఒచ్చి ఏంచేశాడు?"

"ఆడు ఒచ్చి ఎంటనే మేస్ట్రేట్‌కి రెక్విసన్ ఇచ్చేసి డయ్యింగ్ డిక్లరేసన్ రికార్డ్ శెయ్యించేసి ఆ కమ్మలింటిరాజుగాణ్ని గంగరాజునూ రాజమ్మా కలిసి సంపడానికి ప్రయత్నం చేసినట్టు కేసు పెట్టేసి, కోర్టుకి ఎప్పయ్యార్ పమ్మించేసి అయ్యార్ అతారిటీస్‌కి కాపీలు గుద్దేశాడు. గుద్దేసి, తిన్నగ రాజమ్మింటికి పారొచ్చేడు. ఫుల్‌డోసుమీద ఉన్నాడేమో - గంగ రాజు మాఁవఁ. కమ్మలింటి రాజుగాడిని పేలించేసిన తర్వాత, ఇంటికెళ్ళి

హాయిమని బిళాణా ఎయిస్సేడన్నమాట- మన రాజమ్మ మా త్తరం సాయిం కాలివేళ నాయింటికి నన్ను సలా జెయ్యడానికి పారొచ్చింది."

"అయితే ఆ హెడ్డొచ్చి గంగరాజుని అరెస్టుచేసి తీసుకుపోయే డంటావు."

"ఇది నన్ను సలాజెయ్యడానికొ స్తే, దీని దురద్దురుష్టంజూడు నేను లేను. జల్పూరు సమితి పెశిడెంటు సాయింకాలం అయిజ్జెసొచ్చి ఆళ్ళ ఊళ్ళో రా త్తిరికి డాన్సు పోగ్రాం ఉందన్జెప్పి జీపుమీద నన్నేసుకు తీసుకుపోయేడు. ప్లీడర్ సాయం లేకపోతే మేం కేసు ల్జెసుకోలేనట్టు, ఆ సమితి పెశిడెంటు నా సాయం లేకపోతే సర్దా జెయ్యలేడు. సరే సొమ్ము మరోడి దైనప్పుడు సోకు మనం జెయ్యడానికి అబ్బెంతర వేం ఉంటది? అంచేత ఎల్లేను. తీరామోసి అక్కడకె త్తె అసలు సరుకు- కాకినాడ శిలక, కోక ముట్టుకొందికి ఒంద. ఇప్పదానికి రొండొందల - అది దిగిందికాదు. 'బస్సు మిస్సుడు రేపు కమ్మింగు' అని ఒయిరు గుద్దీసింది."

"ఆడ ఊసొస్తే అసలు ఊసులన్నీ మర్చిపోతాడు బాబూ ఈబాబు ఇంత వయిసొచ్చినా ఏటో ఆ బ్రెమ?" అని మందుల భీముడిగురించి ముకుందుడితో ఫిర్యాదు చేసింది రాజమ్మ.

ముకుందుడు చిరునవ్వు నవ్వేడు. అతనికి చారెడు నోరుండడంచేత అతని చిరునవ్వయినా సరే మూరెడు పొడవుకి తక్కువుండదు.

రాజమ్మ మాటకి భీముడికి కోపం వచ్చింది!

"గంగరాజు నాకంటె శిన్నోడేటి? ముసిలోడైనా అడికింకా సీమీప ఉందా లేదా బెమ? అలాటి మాటలు నా దగ్గిర తీసిపెట్టుసామ్మ, ఓ లత్త! బ్రెమే లేకపోతే ప్రేమే లేదు! అందుకోసరవే అన్ని ప్రేమలూను! రారా సయ్యామోరే అని గల్లుమని గజ్జెకట్టి మేనకమ్మ మోసీ బొమ్మలా దిగేసరికి ఇశ్వామిత్రు డేంజేసేడు? ఎయ్యేళ్ళ తపస్సుకి నీళ్ళదారొగ్గేసి కు స్తీలోకి దిగిపోయేడు! దిగిపోయాడా లేదా? మళ్ళ

సూస్తే. పిక్కమీద ఎంత్రుక కొస్మేతం పండిపోయేయి - అంత ముసిలోడు ఆడు !" అన భ్రమని సమర్థించుకున్నాడు మందుల భీముడు.

"నీ ఊసుకెప్పుడేంవేంనా. నా ఊసు జెప్పడం ఏదైనా ఉందా ?" అని రాజమ్మ గట్టిగా అడిగింది.

"సరి ఇంతకీ ఏంటయిందంటే, అక్కడ డాన్సుప్రోగ్రాం కాన్సిల్ అయిపోగానే శిన్న మందుపార్టీతో సరిపెట్టేసుకొని మళ్ళా జీపెక్కిద రంయ్యేంమని కొట్టుకొచ్చేసరికి పదకొండయింది. ఇంటి కొచ్చేను ; గేదిలా సోపామీద ముసుగేసుకు తొంగుడుంది మన రాజమ్మ : 'ఏటే సంగతి ? అంటే ఇదీ సంగతి : గంగరాజుని మోయిస్సేరంది. ఏం జెయ్యడం ? తిన్నగ టేశన్ కెళ్ళేను, ఎత్తె అక్కడ ఎస్సయ్ లేడు. ఇదుగో, పొంగముండాకొడుకు, ఈ ఎడ్డుగా డున్నాడు :"

"ఆడే బాబూ, నా కొంప ముంచినోడు ఆడే బాబూ :" అని గోల పెట్టేసింది రాజమ్మ.

"ఆడు ఏనాడో ఎస్సయి అయిపోయి ఈపాటికి సర్కిల్‌కూడా అవ్వాలసింది. కాని బాబుశేసే పన్లన్నీ పందికొక్కు పన్లేకదా : కండెమ్ అయిపోయి కూచ్చున్నాడు. ఎస్సయ్ సెలవలో ఉన్నాట్ట. ఈడే ఇన్చార్జి. రాజమ్మకీ ఆడికీ ఒయిరం ఈనాటిదికాదు. అంచేత ఆడు ఈళ్ళిద్దరిఅంతూ జూస్తానని కూర్చున్నాడు. నే వెళ్ళి జెప్తే ఇన్లేదు. ఇది మర్డర్‌కేసు పాస్పీస్ అన్నాడు.

"ఆ కమ్మలింటి రాజుగాడు బతికుండగానే మర్డర్‌కేసు కట్టేస్తా వేంటి ?' అనడిగేను. నేనూరుకోలేదు. అడిగేను. ఎస్సైకే కాతర్ జెయ్యను. ఎడ్డుగాడో లెక్కా నాకు ?

"ఎప్పుడూ కబురేసెప్తాడుగాని పనిమాత్తరం సేసి సూపిచ్చేడు బాబూ ఈ బీంవుండుబాబు" అని ముకుందుడికి కంప్లేన్ చేసింది రాజమ్మ.

"దేనికైనా సమయంవ్వూం శాన్సూ రావాలే రాజమ్మ : పేశీ ఏసి పోలీసోణ్ణి లొంగదియ్యడం అంటే గేదలకి గడ్డెట్టడం అనుకొంటున్నావేటి?"

"అదైనా కుశింత ఎడుమ్మా, సూద్దాం" అంది రాజమ్మ.

"శీ, నోర్ముయ్ ! పేశన్‌కి ఒక్కసుట్టు నువెళ్ళిజూడు ! సర్దా తీరిపోద్ది" అని రాజమ్మని కసిరి, ముకుందుడివైపు తిరిగి "ఆ ఎడ్డు గాడు ఇదంటే మంచి కచ్చమీ దున్నాడు ముకుందబాబూ !" అన్నాడు భీముడు.

"ఎందుచేత ?" అని అడిగేడు ముకుందుడు.

"పెద్ద ఇస్ట్రీ ! ఈయమ్మేం తక్కువది కాదుకదూ ! జెగజ్జెనని ! దండం పెట్టాల" అని రాజమ్మవైపు ఒ దొంగ దండంపెట్టి "ఈ యమ్మ కుంతీదేవైతే గంగరాజుమాఁవఁ పాండురాజన్నమాట. తొలిబేరం ఎంకోజీ పాలెంగద్ది అయెనక డోలుమీద దెబ్బగాడని ఓ జవాను ఆడుకూడా కండెమే అయిపోయి ఎక్కడో ఉన్నాడు. ఆడితో మనమ్మ ఉండగా...." అని భీముడు చెప్తూండగా,

"ఆ డూసులన్నీ ఇప్పుడెందుకు ?" అని రాజమ్మ అడ్డువచ్చింది.

ప్లీడర్‌కాడా డాట్టర్‌కాడా సంగతు లేయీ దాసకూడదు. దాస్తే ప్రమాదం" అని రాజమ్మతో చెప్పి ఆ తరవాత ఆమె గురించి చెప్ప నారంభించాడు మందుల భీముడు.

"ఆ జవాన్‌గాడికి మనమ్మ అంటే మంచి రోకుండేది. ఆడితో ఉండగా ఈ యెడ్డుగాడు అమ్మతో సఁయాఁట లారంబించేడు."

"శిన్నాయను. ఏటి తెలుస్థి ?" అని మూతి ముడుచుకుంది రాజమ్మ.

"శిన్నాయను. శిలకాలా ఉండేది. ఈ ఎడ్డుగాడు ఆ దినాల్లో పిక్కలా ఉండేవోడు. మిల్ట్రీమీసం ఎట్టుకుని శిలకల్తో సరసాల్జెయ్యడం తప్ప ఏరే పన్లుండేవుగావు ఆడికి. షిప్పుదొరలకోసరం కలకత్తానించి ఐక్లాస్ దొరసానొస్తే దాన్తో సరసానిక్కూడా ఓసారి ఈడు మేదెక్కితే ఆ దొరసానమ్మ డియస్పీ దొరకి పోన్ జేయిస్సింది. అప్పుడే తొలిసారి కండెమ్ అయిపోయేడు. ఆ తరవాత ఆడు మనమ్మకి ఏంలబ్బు కొట్టాడో

పింబోగాని మనమ్మని ఓ ఊపు ఊపి జోల్తా కొట్టించేడు. దోలుమీద్దెబ్బ గామ దెబ్బ తినేసి అమ్మనీ ఎద్దునీ అల్లరిపాల్జేయిస్నేడు. తగువంతా ఈడిని పడిపోయేసరికి మాత్తరం ఈ దొంగయెద్దుగాడు నాకేటీ తెల్దు పొమ్మన్నాడు. శివరికి మనమ్మ ఆడికీ చెడిపోయింది. ఈడికీ చెడిపో యింది; ఎటుకీ కాకుండా ఈడినీ పడిపోయింది."

ఆనాటి కష్టాలన్నీ గుర్తుకి వచ్చేసరికి రాజమ్మముఖం ఎరుపయింది. ఆమె కళ్ళు కెంపులుగా మారేయి, వాటిలోంచి ముత్యాల్లా నీరు జారింది. తన నల్లచీర కొంగుతో కళ్ళొత్తుకొని, శూన్యంలోకి ఆమె చూస్తూ కూర్చుండిపోయింది. ఆమె ఆ సమయంలో చాలా అసహాయంగా కనిపిం చింది.

"ఈడిని పడిపోయి. కడుపు మండి ఈ యెద్దుగాడి ఇంటికెళ్ళి మూర్రోజులాణ్ని తిట్టింది మనమ్మ. ఏడ్పుకి తిట్టినకొద్దీ ఆడు మరి బిగిసిపోయేడు. అదిగో అప్పణ్ణుంచీ ఉంది ఒయిరం. ఆయెనక ఆదు రుష్టం జాతం కాబట్టి అమ్మ బాగుపడింది. తెద్దెక్కడికెళ్ళినా, ఏగానే అన్నట్టు యెద్దుగాడు యెద్దుగాళ్ళాగే ఉన్నాడు. అంచేత ఆడికి ఇదంటే మరీ తెగులుగుంది. కసిమీదున్నాడేమో-దొరికేడుగదా అన్జెప్పి రాజమ్మ త్తనీ గంగరాజు మాఁవఁనీ కూడా జోడించి దెబ్బ దియ్యడానికి దిట్టంగా డిట ర్మిసన్‌మి దున్నాడు. అంచేత ఏంటంటే; ఇది మడ్డర్‌కేసు కాదట. సంపడానికి ప్రయత్నంట. రాజమ్మా గంగరాజా ఇద్దరూ ముద్దాయీలట. ఆణ్ని అరెస్టు జేసేట్ట. దీన్నికూడా అరెస్టుచేసి కొట్లో ఏస్తాట్ట. నేనేం రికమెండిసన్ జెయ్యడానికి ఈల్లేదుట. ఇప్పుడేం చెయ్యడం?"

"మాఁవఁ బాగుంటే సూశ్శేక సూసేవా బాబూ ఆడు ఎంత పన్జేసేడో?" అని తల వంచుకొని, బలబలమని కళ్ళంట నీరు కార్చింది రాజమ్మ.

"ఇప్పుడు గంగరాజు మాఁవఁని మనం ఎలాగైనా కేసులోంచి తప్పించాలి. ఆ బారవంతా మరి నీ మీదుంది" అని మందుల భీముడు కుర్చీలో వెనక్కి జరిగి కూర్చున్నాడు. ఆ భారం ఆ క్షణంవరకూ తన మీద ఉండినట్టు.

ముకుందుడు కొంచెంసేపు ఆలోచించేడు.

"నీన్లో వీళ్ళిద్దరూ లేనే లేరనడానికి కుదరదా ?"

"ఏమో మరి అది నీ యిష్టం."

"సాక్షు లెవరు ?"

"శానామందున్నారు బాబూ" అంది రాజమ్మ.

"వాళ్ళని మనం తిప్పుకోలేఁవాఁ ?"

"ఎవరు తిరిగినా ఆ బంగార్లంజమాత్రం తిరగదు బాబూ" అని విచారిస్తూ చెప్పింది రాజమ్మ.

"అయినా పట్టపగలు ఒంటిగంట చిల్లర కదూ అంతా జరిగింది ?"

"నన్ను ముందుగా అడిగితే, ఏ రాత్తిరో జరిపించేనూ? అటొంటిది ఇప్పుడు పీకలమీదికి తెచ్చుకున్నారు." అని చాలా చిరాకుపడుతూ అన్నాడు మందుల భీముడు.

"గంగరాజుకి వంటిమీద దెబ్బలేఁవీఁ లేవనుకుంటాను లేక — ఉన్నాయా ?

"ఏమో బాబూ" అనిముందుచెప్పి ఆ తరవాత "ఉండవు బాబూ దెబ్బ లుండవు" అంది రాజమ్మ. అతని వంటిమీద దెబ్బలేవీ లేకపోడం చాలా తప్పయిపోయినట్టుగా చెప్పింది రాజమ్మ.

"నీ చేతికది దెబ్బేనా ?

"అవును బాబూ"

"ఎలా తగిలింది ?"

"ఎలా తగిలింది ?" అని ఆలోచించి "అదే ఆ కమ్మలింటి రాజు గాడే కొట్టుండాలి" అంది రాజమ్మ.

"కొట్టేడో లేదో నీకు జ్ఞాపకం లేదేవిటి ?"

"ఆడే కొట్టుండాలి బాబూ"

"దేన్తో కొట్టేడు ?"

"కఱ్ఱతో కొట్టుండాల"

"వాడికి కఱ్ఱ ఎక్కణ్ణుంచి వచ్చింది ?"

రాజమ్మ ఊరుకొంది.

"ఒలే ! ఏ ఇష్యంకూడా దాసడానిక్లేదు తెలుసా ? ఆమెనక సేతులు కాల్నాయంటే అకులంటుకుందికి ఈటుండదు." అని ఆమెని హెచ్చరించేసు మందుల భీముడు.

రాజమ్మ ఓక్షణం ఆలోచించింది.

"బంగారప్పా నానూ తొత్త మాటా మాటా అనుకున్నా బాబు. అనుకుంటే ఆ అమ్మల్లంజ - ఏలెళ్ళేదు- అది మద్దెకొచ్చి నన్ను తిట్టింది. అదలా నోరు ఒడేసుకుంటుంటే, నాను దాని పిలకుచ్చుకున్నాను. ఉచ్చుకుంటే 'దాన్నెందు కొడతావూ' అని బావే సేతిమీద ఓ దెబ్బ ఏసేడు బాబూ" అని చెప్పింది రాజమ్మ.

"ఏదీ దెబ్బ చూపించు"

కట్టు విప్పి దెబ్బ చూపించింది రాజమ్మ. కుర్చీలో కూర్చున్న ముకుందరావుకి కనిపించడానికి అతని టేబిల్‌దగ్గరకివెళ్ళి మరీ చూపించింది.

"దెబ్బ గట్టిగానే తగిలింది."

"ఏదీ ?" అని భీముడుకూడ ఆ దెబ్బచూసి "నెత్తిమీద పడితే బుఱ్ఱ ఇడిపోను" అని దెబ్బని మెచ్చుకున్నాడు.

"బాగా వాచినట్టుగాకూడా ఉంది. ఎముక కాని విరగలేదుకద ?" అన్నారు ముకుందరావుగారు.

"ఇరిగే ఉంటది బాబూ" అని వప్పేసుకొంది రాజమ్మ.

"ఆస్పత్రికి వెళ్లేవా ?"

"లేదు"

"ఈ అమ్మలెవరు ?"

"కుఱ్ఱలంజ" అన్నాడు మందుల భీముడు.

"గిరువానం లంజ" అంది రాజమ్మ.

"ఎవరదసలు ? దానికీ ఆ కమ్మలింటి రాజుగాడికి సంబంధం ఏమిటి ?"

"హమ్మా! ఆళ్ళిద్దరికీ సంబంధం వుందేటి?" అని ఆశ్చర్యపోతూ అడిగేడు మందుల భీముడు.

"ఎవరది? ఏంపని చేస్తోంది?"

"ఆడింట్లో అంట్లముండా" అని జవాబు చెప్పింది రాజమ్మ.

"ఎన్నేళ్ళుంటాయి?"

"పెద్ద పిల్లే. నాఅంత ఎత్తుంటుంది" అంది రాజమ్మ.

"పెళ్ళయుంటే ఈపాటికి ఇద్దరు పిల్లల్ని లాగేసుండును."

"ఆ రాజుగాణ్ని...."

"ఆడి అసలు పేరు భవానీశెంకరరం. లంబా చౌడా ప్రెసాద్ అని కూడా అంటాడు" అని అందించేడు భీముడు.

"ఆ భవానీశంకరరంతో - రాజమ్మా - నువ్వు దెబ్బలాడుతూంటే ఆ అమ్మలు మధ్యకొచ్చి ఎందుకు కలగజేసుకొంది?"

"పోయీకాలం!" అని జవాబిచ్చింది రాజమ్మ.

"నువ్వూరుకెస్!" అని రాజమ్మని ఊరుకోమని చెప్పి మందుల భీముడు ముకుందులవారితో "ఐడియా అందుకున్నాను ముకుందబాబూ! దానికీ ఆడికీ మనం ఇపుడు లంకెట్టాల! ఇద్దరికీ లఫింగ్ ఎట్టేస్తే సరిపోద్ది. బలే బావుంది. అప్పుడేంటవుద్దంటే - అమ్మలూ రాజమ్మా తిట్టుకొంటూవుంటే, అమ్మల్లవరుగాడు ఒచ్చి రాజమ్మని కొట్టాడు. ఆణ్ని ఇడిపించడంలో కుమ్ములాట జరిగింది. అందలో ఆడికి కొన్ని దెబ్బ ల్తగిలేయి. ఆకర్న గంగరాజొచ్చేడు. అంతేకాని ఆడికేం తెలీదు. కాయేషంకొద్దీ కమ్మలింటి రాజుగాడు అప్పుడు స్టేట్‌మెంట్ ఇచ్చేడు, ఆడమనిషి శెయ్యి ఇరిసేస్నందుకు ఆడిమీద కేసుఎట్టకుండా పచ్చగున్నారుగాబట్టి పిండుకున్దాంగదా అన్జెప్పి పోలీసోళ్ళు రాజమ్మనీ మొగుణ్నీ కలిపి కేసెట్టేరు. బావుంది ముకుందుబాబూ డిపెన్స్‌కి ఒకటోరకం స్టోరీ" అని మెచ్చుకొంటూ అన్నాడు.

రాజమ్మకి అదేమంత సరిగా బోధపడలేదుకాని ముకుందుడివైపు ఆమె ఆశగా చూసింది.

ముకుందుడు కొంతసేపు ఆలోచించేడు.

"మనం అక్కడ లేనేలేవు. కమ్మలింటిరాజు చెప్పింది పూర్తిగా అబద్ధం అనేస్తే అనేయొచ్చుకాని వాడి దెబ్బలుకూడా అబద్ధం అని మనం అనలేంకద? అటువంటప్పుడు, మనం అక్కడ లేనే లేం అని పూర్తిగా అంతా డినై చేసినప్పటికీ, అక్కడ ఆ టైంలో ఉన్నాం అని వచ్చిన సాక్ష్యం కోర్టువారు ఏమాత్రం నమ్మినప్పటికీ, ఆ దెబ్బలు కూడా మనవే కొట్టేం అని నమ్మేయడానికి అవకాశం ఉంటుంది. మనకూ—కనీసం మనలో ఒకరికైనా— పెద్ద దెబ్బొకటి తగిలింది కాబట్టి, వాడే ముందు మనని- అందులోనూ ఆడమనిషిని - కొట్టేడు కాబట్టి మనం డిఫెన్సుగా ఏదో చేసేం అని చెప్పడానికి వీలుంటుంది. అదీకాక రేపు ఈవిణ్ని అరెస్టు చేసినప్పుడు ఈవిడ చేతికి గాయం ఎలా తగిలిందో ప్రాసిక్యూషన్ వాళ్ళు కారణం చెప్పవలసి ఉంటుంది. గాయం చూస్తే ఆవిడకి ఎదురుగా నిల్చోని ఎవరో కొట్టినట్టుగా కనిపిస్తుంది. అందుచేత ఆ దెబ్బ ఈవిడే తనకి తను కొట్టుకుందని అనడానికి అవకాశంలేదు అయితే-"

"బలేబలే" అన్నాడు మందుల భీముడు.

"అంత బలమైన గాయం తగిలిందికదా - ఈవిడ వెంటనే ఆస్పత్రికి ఎందుకు వెళ్ళలేదు? పోలీసువారికి రిపోర్టు ఎందుకు చెయ్యలేదు? అనే ప్రశ్న వస్తుంది."

"చచ్చేం'' అన్నాడు మందుల భీముడు.

"ఇప్పుడు ఆస్పత్రి కెళ్తేనో?" అంది రాజమ్మ.

"ఇంత లేటెందుకయింది? మొగుణ్ణి అరెస్టు చేసేవరకూ ఎందుకు కదిలేవు కావు?-అనే ప్రశ్న వస్తుంది, అందుచేత ఈ మధ్యాహ్నమే, మీ ఇంటికి-ఆస్పత్రికంటె-దగ్గరగా ఉన్న డాక్టర్ దగ్గిరికి వెళ్ళి వాడితో సంగతంతాచెప్పి దెబ్బకి కట్టుకట్టించుకున్నట్టు మనం సాక్ష్యం సంపాదించాలి" అన్నాడు ముకుందుడు.

ఆ బాధ్యత అంతా భీముడిదే అన్నట్టు అతనివైపు చూసింది రాజమ్మ.

"ఈ మద్దె దొంగసటిఫికేట్లివ్వడానికీ డాక్టర్లు జడుసుకొంట్నారు. అయినా, పెయత్నం జెయ్యాలి అన్నాడు మందుల భీముడు. అలా అన్నాక ఎడమచేతి వేళ్ళమీద కుడిచేతి వేళ్ళతో లయగాకొడుతూ చూరు వైపు చూసేడు, దొంగ డాక్టర్ల లిస్టేదో అక్కడున్నట్టు.

"లేని గాయం వుందనిచెప్పి సర్టిఫికేట్ ఇమ్మనడం లేదుగా! రేపొద్దున్నే ఇచ్చే సర్టిఫికేటు ఇవాళ మధ్యాహ్నం ఇచ్చినట్టుగా చూపించ మంటున్నాం. అంతే!" అన్నాడు ముకుందుడు.

"రైటే" అన్నాడు భీముడు.

"అయితే బాబూ, తెలకడుగుతాను-పిడతల డాట్రు మనకి పని కొస్తాడా?" అని అడిగింది రాజమ్మ.

"అదిసంగతే ఆలోచిస్తున్నాను" అన్నాడు మందుల భీముడు.

"పీడరుబాబుని సెప్పనీ" అంది రాజమ్మ.

"ఊఁ, ఎవడో ఒహడు! వాడుకూడా ఏమ్చీబియస్సే? పని కొస్తాడు! ఫరవాలేదు- ఇవాళ మధ్యానం నువ్వొచ్చినట్టూ నీకు కట్టుకట్టి నట్టూ, ఆ తరవాత ఎక్స్‌రే ఫొటో తీయించుకుందికి ఆస్పత్రికి చిన్న వెళ్ళ మన్నట్టూ వాడు చెప్తేచాలు. వాడితో ఈరాత్రో రేపు చీకటితోనో మాట్లా దేసుకొని రేపొద్దున్నే గవర్నమెంటు ఆస్పత్రికి వెళ్ళు. అక్కడ ఎలాగా ఫొటోతీస్తారు. చేతి ఎఁవిఁక కొంచెఁమైఁనా విరిగిందా, మనం చాలా లకీవే" అన్నాడు ముకుందులవారు.

"ఏమో బాబూ, అంతా ఆ నూకాల్తల్లి దయ!" అంది రాజమ్మ.

"పిడతల డాట్రు గీరముండాకొడుకు. ఇంటే ఇంటాడు లేకపోతే లేదు" అని అనుమానం వెలిబుచ్చేడు మందుల భీముడు.

"అళ్ళ! ఆ బాబు అలాటిబాబుకాదు బీఁవుఁడు బాబూ!" అని ముక్కుమీద వేలువేసుకొని చెప్పింది రాజమ్మ. "నాకు అ బాబుకాడ నెలవే: ఎంతో మంచోడు, గవుర్నమెంటునౌకరోళ్ళుంటారు సూడు ఆళ్ళకి జబ్బులు నయం జేస్తే డాట్రు ఫీజులు గవుర్నమెంటే ఇస్తదట.

మరింక ఉప్పుడు జీతాలు సాలని రోజులుగదా. అంసేత, నౌకరీవోళ్ళంతా, లేని జబ్బులికి పిడతల బాబు కాడ కాయితాల్రాయించుకుని గవుర్నమెంటుకాడ డబ్బుట్టుకుంటారు. ఒచ్చిందాంట్లో ఆళ్ళకి సకం, బాబుకి సకం. అలాగ్గ ఎందరమందిరికో వుపుకారం జేసేడు బాబు. మా యింట్లో పెరటి ఏపు శీకటి కొట్లో టెలిఫోన్ ఆపీసు గుమాస్త ఉండేవోడుగదా ఆ బాబు సెప్పేడు. ఆ గుమాస్త కోసుట్లు ఇలాగ్గే నలపై రూపాయలొస్తే అద్దెబాకీ నా కిచ్చేసి- చంగతంతా జెప్పినాడు. పిడతల దాక్టరు బాబు శానా మంచోడు భీవుడు బాబూ" అని చెప్పింది రాజమ్మ. ఆమె మాటల్లో ఆనందమూ ఆవేశమూ కూడా తొణికిస లాడేయి.

"—యింటిపక్క పేష్టరిమ్మకాడకి పిడతల డాక్టరే కమా ఒస్తుంటాడు ?" అన్నాడు మందుల భీముడు.

"అయ్యాసులన్నీ మనకెందుకు ?" అంది రాజమ్మ.

"సర్లె కాని, సర్టిఫికేటి మాత్రం చూసుకో. ఆ తరవాత సంగతి నేను చూస్తాను" అని హామీగా అన్నారు ముకుందులవారు.

"అలాగే బాబూ, నీదయుండాలి" అంది రాజమ్మ.

సంభాషణలో తనకి తక్కువపాత్ర అయిపోతూండడం గ్రహించి, "మరైతే గంగరాజు మాటేటి" అని ముఖ్యమైన ప్రశ్న వేసేడు భీముడు.

"ఆతనికి రేపు బెయిలు పిటీషను పెడదాం. కాని ఈ లోపున ఈవిణ్ని అరెస్టు చేస్తాడేమో !" అని సందేహం వెలిబుచ్చి "అందుచేత ఈ రాత్రికి రాజమ్మా ! నువ్వు భీముడి ఇంట్లో వుండిపో. రేపు సర్టిఫికేటూ అన్నీ తీసుకొన్నాక తిన్నగా ఇక్కడికి వచ్చేయండి ఈ లోగా ఏదైనా గడబిడ జరిగితే నాకు ఫోన్ చెయ్యండి," అని సలహా చెప్పేడు ముకుందుడు.

"రైట్ ! కాని, మరి రేపు గంగరాజు మామని బైటకి లాగాల ఎలాగైనా" అన్నాడు మందుల భీముడు.

"రేపు నా జూనియర్ని పంపిస్తాను బెయిలుకి" అన్నాడు ముకుం దుడు.

"అలాగనీకు, బాబ్బాబు! నువ్వేరావాలి"అన్నాడు మందులభీముడు పెనుప్రమాదం పెద్దప్లీడరు రాకపోతే సంభవించేట్టు.

"నువ్వేరావాలా బాబూ! నువ్వొస్తేనే నాకు దయిర్యం! బాబ్బాబు ఈ పూసీ నీది! మరోళమీద ఎట్టేకు. నువ్వే రావాల తండ్రి తండ్రి!" అంది రాజమ్మ.

"మనకిది పెష్టిజ్ కేసు ముకుందు బాబ్జీ!" అని బల్లగుద్ది పెద్దగా చెప్పి, "నువ్వే సొయంగ నిలబడి ఓడించాల! గంగరాజుని కొట్లోంచి బైటకి లాగాల, రాజమ్మ కొట్లోకి ఎళ్ళకుండ సూడాల! పూశీ అంతా నీదె మరి" అని ప్రత్యేకంగా ముకుందుడితో చెప్పి, "ఏది రాజమ్మా! ఇంకా సూస్తావేంటి, తియ్ డబ్బు తియ్!" అని రాజమ్మకి హుషారిచ్చేడు మందుల భీముడు.

ముకుందుడు లేవడానికి ఉపక్రమించేడు.

"ఉండు బాబూ" అని రాజమ్మ ఓవారకి వెళ్ళి రెండు పెద్ద కాయితాలు తీసి, బల్ల దగ్గరకి వచ్చి భీముడి చేతికిచ్చింది.

"సాలవు" అన్నాడు భీముడు.

మరొకాయితం తీసి తెచ్చింది రాజమ్మ.

"ఉంచు ముకుందు బాబూ" అని మూడువందలూ బల్లమీదపెట్టేడు భీముడు.

వాటిని తీసుకోలేదు ముకుందుడు, "సరేలే తరవాత చూసుకుందాం ఇంకా ముందుకి బోలెడు పనుందికదా! అందులోనూ, మేజిస్ట్రేట్ కోర్టు లాంటి చిన్న కోర్టుసకి రావడం మానేసి చాలాకాలం అయింది. ఆ కమ్మ లింటి రాజుమీద మనం ఇంకా కౌంటర్ కేసుకూడా పెట్టాలి. ఇంకా చాలా వుంది తతంగం" అని సీరియస్‌గా అన్నాడు ముకుందుడు. ఆ తరవాత యధాప్రకారం మూరెడు చిరునవ్వునవ్వి "అసలు ఇంటువంటి కేసులు

'షేకప్' చెయ్యడం మానీసేను. సరే గంగరాజు ఒన ఓల్డ్లక్లయింటు, అందులోనూ నువ్వుకూడా ఒచ్చేవు కాబట్టి రావాలంటే కాని మహాకరిస్తై తే రాను." అన్నాడు ముకుందుడు.

"రైట్! అంతే రాజమ్మా! ముకుందు బాబూ కరెక్ట్గా చెప్పేడు" అని రాజమ్మతో చెప్పి- ఆమెని వారకి తీసుకు వెళ్ళి మాట్లాడి మరొక రెండువందలు పట్టుకువచ్చి ముకుందుడిముందు పెట్టి,

"అందాకా ఇదుంచు ముకుందు బాబూ, కేస్సంగతి ఆతరాత ఏరే జూసుకుందాం. మరి పనిమాత్తరం పకడ్బందీగా ఉండాల! అది నీదగ్గర ఉంటుంది నాకు తెలుసు" అని గట్టిగా చెప్పేడు భీముడు.

రాజమ్మ కూడా ముందుకువచ్చి,

ముకుంద బాబూ! బీద్దాన్ని, రాజమ్మ కాడ మూలదనం మూలుగు తుందని జనం అనుకోడమేగాని నిజానికి సత్తె ప్రమానంగా నాకాడ ఏట్లేదు. ఉన్నదంతా ఊరోళ్ళకిచ్చీసినాను. పాలమ్మకం సాగడంలేదు. శాంత్రీ ఇనిస్పెక్టర్లు నెత్తురు తాగీసి సంపేస్తున్నారు. ఒటేలోళ్ళు అరువు లేయించుకొని ఇచ్చినకాడికి ఇస్తున్నారు. లేనికాడికి లేదు. పిండిమిల్లు జూస్తే, రోజుకోసుట్టు రిపేర్ల మీద నడుస్తుంది. ఉన్నకాడికి పిండీ, డబ్బులూ మిల్లూ అంతా అక్కడి గుమాస్తే తినేస్తున్నాడు. ఒద్దురా అంటే మాబావ లాడిజింగ్ ఎట్టించేడు. ఎట్టినకాణ్నించి పోలీసోళ్ళతో గొడవ గొడవ సచ్చినాం. ఆళ్ళబాద పళ్లేక, అది అద్దెకిచ్చేస్తే, ఆడు మూణ్నెల్లకాణ్నించి అద్దె బాకెట్టినాడు. మరి అది కోర్టుకెక్కాలగాని ఆడు ఇచ్చేట్టు అవుపించడు. కోర్టు కొస్తే ఆ తగూకూడా నువ్వే సూడాలి. ఇదిగో ఇలా సస్తన్నాను. అయితే సూడు నీ కష్టం నామీద ఇడుకోను, అందాకా అయిదొందలూ ఉంచు. ఆయెనక నాను ఏటిస్తానో, నిన్ను ఏ యిదంగ సంతోసం ఎడతానో నువ్వే సూద్దూ గాని!" అని మెత్తగా మాట్లాడింది.

ముకుందరావుగారు మూరెడు నవ్వు మరోసారి నవ్వేరు.

రాజమ్మకి ఆ క్షణంలో తనకన్న తెలివైనవాళ్ళ ఉచ్చులో తను చిక్కుకున్న ట్టనిపించి, చాలా దుఃఖం వచ్చింది.

రాజమ్మా గంగరాజులు గేదెల్ని పెంచుకొంటూ, పాల వ్యాపారం చేసుకొంటూ హాయిగా అన్యోన్యంగా జీవిస్తూండగా, కమ్మలింటిరాజు అని పిలువ బడే యువకుడువచ్చి, వారిగేదెలు ఊరంతా కంగాళీ చేస్తున్నందుకు అధికార్లకి అర్జీలు పెట్టడం మొదలెట్టేడు. రాజమ్మా గంగరాజులు ఓ మధ్యాహ్నం ఎండలో బంగారి కిల్లీకొట్టుముందు కమ్మలింటి రాజుని పట్టుకొని చితక్కొట్టేసేరు. పోలీసులు వెళ్ళి గంగరాజుని అరెస్ట్ చేసేరు. (రాజమ్మ వాళ్ళకి, దొరకలేదు) గంగరాజుకి జామీనుకోసం ముకుంద రావుగారనే సీనియర్ లాయరుగారు తన జూని యర్ని కోర్టుకి ఇక పంపించనున్నారు.

• • •

మానవుల్లో పెద్దలు – వారిలో పాత కొత్తలు- మానవులంతా కోతినించి దిగుబడ్డవారే అయిన ట్లయితే కోర్టుకి తీసుకు రాబడే దొంగల్లాగే కోర్టుకి వచ్చే పోలీసులూ ప్లీడర్లూ జడ్జీలూకూడా కోతి సంతతే కాగలరా అనే ప్రశ్న – మానవు లంతా ఎవరి సంతతి అయితేనేం, ఆ సంతతిలో ఓ చిన్న మేజిస్ట్రేటుగారి అవతరణ – అధ్యాయం ఆఖర్న ముకుందుబాబు నిప్పుతొక్కిన కోతిగా మారుట – అధ్యాయం మధ్యలో అలనాటి అభ్యుదయ వాది చిట్టిబాబుగారి ప్రవేశము – సంజ కెంజాయపార్టీరంగులు మార్చక దిక్కుమార్చుట!

# 17

"మానవు డెవడు?" అని ఓ వేదాంతి ప్రశ్నించి, "మానవు డంటే జంతువుల్ని వేటాడేవాడు, తనలోని జంతువుని వేటాడని వాడు" అని సమాధానం చెప్పుకున్నాట్ట.

మానవుడు,

క్రిమిగా పుట్టేడు. కీటకంగా మారేడు. చేపలా ఈదేడు. పక్షిలా ఎగిరేడు. పాములా పారేడు. వికృతమైనవీ క్రూరమైనవీ పనులెన్నో చేసేడు. చివరకి కోతిగా ఎదిగేడు, ఆ తరవాత అందులోంచి మనిషిగా పెరిగేడు. హిస్టరీషీటు చాలా కంగాళీగా ఉందనే చెప్పాలి. పోతే, ఈ విధంగా చూస్తే మానవుడు ఎవరికంటేకూడా ఎక్కువ్వాడు కాడు. అన్ని జంతువులూ ఉన్నాయి వాళ్ళో.

మరింక—

వేదాంతపు ఆఖరి మెట్టెక్కిచూస్తే, మానవుడు భగవంతుడి కంటె భిన్నమైనవాడు కాడు.

అందుచేత—

ఏ దృష్టితో చూసినప్పటికీ, మానవుడు క్రిమికంటె ఎక్కువ్వాడూ కాడు, భగవంతుడికంటె తక్కువ్వాడూ కాడు, అటువంటప్పుడు ఒక మానవుడు మరొకడికంటె ఎక్కువ్వాడు ఎలా కాగలడు? కూలివాడూ కంట్రాక్టరూ ఏకరక్తబంధువులే. రైతూ బుగతా ఒక్క గోతిలోనిమన్నే. దొంగలూ, పోలీసులూ, ప్లీడర్లూ, జడ్జీలూ, అంతాకూడా ఒక పేడపిడకలే.

కాని—

చిక్కెక్కడ వస్తుందంటే, కూలివాడు కష్టపడాలి, ఆ కష్టంలోంచి కంట్రాక్టరు లాభం లాగాలి. రైతు చెమటోడ్చాలి. బుగత సుఖించాలి.

పోలీసులు చిన్న దొంగల్ని పట్టాలి, పెద్ద దొంగల్ని కాపాడాలి. జడ్జీలు న్యాయం చెయ్యాలి. అంటే చట్టం ప్రకారం తీర్పులు చెప్పాలి. చట్టాలు న్యాయంగా కనిపించాలి, ప్రజల్ని హింసించాలి.

అందుచేత—

వేదాంతులు ఏమన్నారూ అంటే: పారమార్థిక దృష్టితో చూస్తే మానవులంతా సమానులే, కాని వ్యావహారికదృష్టితో చూస్తే సమానులు కారు - అన్నారు.

దానాదీనా !

పెద్దలంతా ఏకకంఠంతో చెప్పే విషయం - మానవుల్లో పెద్దలూ, పిన్నలూ, పాలకులూ పాలితులూ ఉన్నారు(ట). ముకుందుబాబు కూడా అదే అంటాడు.

"సృష్టిలోనే లేదు సమానత్వం, ఓ తల్లి బిడ్డలే ఒక్కలా ఉండరు. మరింక ఎక్కణ్ణించి వస్తుంది సమానత్వం ?"

ఓ తల్లి బిడ్డలు సమానంగా లేకపోయినా, వాళ్ళు కష్టాన్ని పంచుకోవాలికదా ! లాభాన్ని సర్దుకోవాలికదా - అంటే మాత్రం వినడు మన ముకుందుడు.

ముకుందుడు పాతకాలపు పెద్దలకోవకి చెందినవాడు. అదృష్ట వశాత్తు ఆయన ఇప్పుడుకూడా పెద్దల కోవలోనే ఉంటూ వస్తున్నాడు.

అయితే పాత పెద్దలు అలా అలా ఉంటూ ఉండగానే కొత్త పెద్దలు కొంతకొంతమంది వారిలో చేరుతుంటారు. గుమాస్తా చిన్నవాడే అయినా వాడి కొడుకు గవర్నరయితే అటు తరవాత వారంతా పెద్దల్లో చేరుతారు. కూలివాడు చిన్నవాడే అయినా వాని కొడుకు కంట్రాక్టరయితే అతను పెద్దల్లో చేరుతాడు. ఎకరం రైతు వందెకరాలు ఎన్ని అన్యాయాలు చేసి సంపాదించినా, సంపాదించేక మాత్రం అతను పెద్దల లిస్టు దాఖలాలోనే ఉంటాడు. జేబుకేటుగాడు కంపెనీ కేటుగా మారితే అతను పెద్దకిందే లెక్క.

అయితే—

పాత పెద్దలు ఈ కొత్త పెద్దల్ని తమలో ఒకరుగా పరిగణించ డానికి కొంత టైం పడుతుంది. అక్బర్‌ని అల్లుడిగా స్వీకరించడానికి రస పుత్రులకి కొంతటైం పట్టింది. అమీర్లూ అమరఖాపాలురూ కూడా ఒక సారి తిరుగుబాటు చేసేక కాని తెల్లదొరసానికి సలాం కొట్టడం నేర్చుకో లేదు. వారలా తిరుగుబాటు చేసేక కాని, "ఓహో వీరు మనతో కొంత కొంత సమానమే: వీరందర్నీ మనం కాపాడి నిలబెట్టాలి!" అని తెల్లవారు గుర్తించలేదు.

మేజస్ట్రేటుగారు పాతపెద్దల్లో పుట్టేరు. అన్ని కులాల్లోకీ ఎక్కు వగా చెప్పుకునే కులంలో పుట్టేరు. ఆయన పూర్వీకులు అడ్డబొట్టే పెట్టే వారో నిలువుబొట్టే పెట్టేవారో లేక బెండకాయబొట్టే పెట్టేవారో తెలి యదు కాని, ఏదో బొట్టుమాత్రం పెట్టుకునేవారు. మేజిస్ట్రేటుగారు బొట్టు పెట్టరు కాని, తను బొట్టుగాణ్ణనే భోగట్టామాత్రం వారు మర్చి పోలేదు.

మేజిస్ట్రేటుగారు తనతో సమానుడనే విషయం చెప్పడానికి కాబోలు భగవంతుడతనికి మేధాశక్తి ప్రసాదించేడు. నువ్వు వానరుడికంటే ఎక్కువ్వాడివి కావని చెప్పడానికి కాబోలు భగవంతుడతనికి అటువంటి రూపం ఇచ్చి లోకంలోకి వదిలేడు.

ఎర్రగా పొట్టిగా పండుకోతిలా కనిపిస్తారే కాని ముసలివారు కారు మేజిస్ట్రేటుగారు. మహా ఉంటే ఓ నలభయ్యేళ్ళ కోతికంటే ఎక్కువ వయసు ఉండదాయనకి. అతని నుదురు మెట్టగా ఉండడంచేత కాబోలు కళ్ళు లోతుకి పోయేయి. బుర్ర జారుడుగా ఉండడంచేత కాబోలు జుట్టు వెనక్కి జరిగింది. కిందికి దిగితే పారపళ్ళు కరుస్తాయనే భయంవల్ల కాబోలు వారి ముక్కు కురచగా కూర్చుంది. ఆకలి ఎక్కువ అవడం వల్లనో, లేక ఎల్లప్పుడూ వెటకారంగా నవ్వడం వల్లనోగాని వారి నోరు ఈ చెవినించి ఆ చెవిదాకా సాగింది. ప్లీడర్ల గురించీ సాటి ఉద్యోగుల గురించీ వారికి స్కాండల్స్ వినాలనే కోరిక ఎక్కువన్న సంగతి వారి

గుమాస్తాలకి బాగా తెలుసు. ఎంత చిన్న శబ్ద(?) తరంగాలయినా పట్టి గ్రహించడానికి వీలుగా మంచి పెద్ద రాడార్లున్నట్టు, ఎంత చిన్న స్కాండలు ఎంత నెమ్మదిగా చెప్పినా వినడానికి వీలుగా కాబోలు మేజిస్ట్రేటుగార్కి పెద్ద పెద్ద చెవులున్నాయి. పెద్దపెద్ద చెవులంటే నాలుగు జతల చెవులు కావు. జత చెవులే, కాని పెద్దవి.

మేజస్ట్రేటుగారికి వారి రూపం గురించి గర్వించడానికి కారణాలేమీ లేవు. గర్వానికి కారణం అంతా జాతిలోనే ఉంది. వారి తాత ముత్తాతలంతా మహా మేధావులుట. వారి పితామహులు తాహశీల్దారులే కాని వారి మాతామహులు డిప్యూటీ కలెక్టర్లు, వారి పెదతండ్రి అలనాడెప్పుడోగాని జిల్లా మునసబుగిరీ చలాయించేరు. వారి మేనమామగారు ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరుగా రిటైరయేరు. ఆయన సోదరు లొకరు అసిస్టెంట్ సర్జన్‌గా ఉన్నారు: త్వరలో సివిల్ సర్జన్ కాగలరు. బ్రిటిష్ హయాంలో వారందరికీ ఎంతో పలుకుబడి ఉండేది. సంఘంలో ఎక్కడికి వెళ్ళినా వారికి మెండుగా సలాములు లభించేవి, వారిలో కొందరికి దండిగా లంచాలు లభించేవి. లంచాల గురించి ఆ రోజుల్లో ఏ అల్లరీ లేకుండా హాయిగా సాఫీగా అదొక మామూళ్ళ వ్యవహారంకింద సాగిపోయింది. మేజిస్ట్రేటుగారి కులం అంటే చాలామందికి కిట్టకపోయినప్పటికీ, వారిలో బ్రిటీషు భక్తులకి మాత్రం రోజులు బాగానే ఉండేవి. మేజిస్ట్రేటుగారి కుటుంబీకులు బ్రిటిషు భక్తుల్లో మొదటి వరస భక్తులు. భక్తులందరికి బాడ్జీలు ఇచ్చినట్లయితే కవుంటర్ దగ్గిర 'క్యూలో' వారినే ముందు నిలబెట్టవలసి ఉండేదన్నమాట. అంత మంచి భక్తులు.

బ్రిటిష్ పరిపాలన భగవంతుడి దయవలన రాజీగా సాఫీగా అల్లరి లేకుండా అహింసాత్మకంగా పెద్దలందరికి సుఖంగా మర్యాదగా ముగిసిందే కాని మేజిస్ట్రేటుగారి కుటుంబీకులవంటి కొంతమంది పెద్దలకి మాత్రం ఓ మాదిరిగా దెబ్బతగలక తప్పలేదు. వెనకబడిన పాతకులాల్లోంచి కొత్త పెద్ద లొచ్చేరు. వారి సంఖ్యాబలం ఎక్కువయింది. సాహసాలు చేసి వారు డబ్బుకూడా గడించేరు. అధికారాల్లోని కీలకస్థానాలు చాలా ఆక్ర

మించేరు. మేజిస్ట్రేటుగారి కుటుంబీకులకి ఆర్థికంగా పెద్ద లోటేమీ రాలేదు కాని వారికి కావలసినన్ని అధికారాలూ లభించలేదు. అసిస్టెంట్ సర్జన్‌కి ఇంకా ప్రమోషన్ దొరకలేదు. ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసరు అసిస్టెంట్ కమీషనరు కాకుండానే రిటైరవవలసి వచ్చింది. ఓ డిప్యూటీ కలెక్టరు కలెక్టరు కాకుండా మిగిలిపోయేడు. ఓ లెక్చరర్ ప్రిన్సిపాల్ కాలేకపోయాడు. ఒకరికి మెడికల్ కాలేజీలోసీటులభించక వారుపశువైద్యం చేయవలసి వచ్చింది. ఈ విధంగా కొన్ని అడ్డూ ఆటంకాలూ వచ్చేయి మేజిస్ట్రేటుగారి కుటుంబీకులకి.

అడ్డొచ్చినవార్ని క్షమించలేక పోతున్నారు మేజిస్ట్రేటుగారు. అనవసరంగా పాపం - వారు కక్షలు పెంచుకొంటున్నారు, పాత పెద్దలూ కొత్త పెద్దలూ కక్షలు పెంచుకుంటే చివరకి అది పేదప్రజల పెత్తనానికే దారితీస్తుంది కాని పెద్దలకది క్షేమకరంకాదు; కాబట్టి "ఓ మన పెద్దల్లారా! మా మాట వినండి. మనం అంతాకూడా కులభేదాలూ మతభేదాలూ లేకుండా ఉంటేనే మనకి మనుగడ ఉంటుంది; కాబట్టి అందరం అలా ఉందాం రండి" అని కొంతమంది తెలివైనవారు చెప్పినప్పటికీ కొంతమందికి తెలివి సరిగా రావడంలేదు.

అటువంటి తెలివి సరిగా రానివారిలో మేజిస్ట్రేటుగా రొకరు.

ఆ రోజున——

మేజిస్ట్రేటుగారికీ భోగట్టా అంతా ముందే తెలిసింది.

కర్రలు కొట్టుకునే వాడొకడూ, గేదెల్ని కడుక్కునే దొకర్తీ ఇద్దరూ కలిసి కనీసం మూణ్నాలుగు లక్షలు గణించేరుట. ఇళ్ళూ మిల్లూ కాకుండా నగదు సార్ నగదు!

"గణించరా గణించరా?!"

ఆ తరవాత వాళ్ళకి పొగరెక్కిందట.

"ఎక్కదా మరి ఎక్కదా?!"

పొగరెక్కి, వాళ్ళు ఓ కుర్రాణ్ణెవణ్ణో పట్టుకొని పులుసులోకి

ఏమికల్లేకుండా పట్టపగలే పబ్లిగ్గా తాలూకా ఆఫీసు కెదురుగా చితగ్గొట్టి విడిచిపెట్టేరుట.

"ఆఁ!!"

వాడిప్పుడు చచ్చేస్థితిలో ఉన్నాట్ట.

"ఎవడువాడు?"

ఎక్కడో ఏదో ఉద్యోగం చేస్తున్నాట్ట.

"ఎవడువాడు?"

ఏవూరివాడో తెలియదుట.

"ఎవడువాడు?"

కుఱ్ఱాడే. పాతికేళ్ళుండొచ్చున్ట.

"ఎవడువాడు? వాళ్ళవాడేనా?"

'వాళ్ళవాడు కాట్ట'

"మనవాడా?"

మనవాడు కాకపోవచ్చు.

"అయినా నాలుగుడబ్బులుచేరేసరికి వీళ్ళకి బుఱ్ఱ గిఱ్ఱుమంటుంది. నాకు తెలుసు. అల్పబుద్ధి అల్పబుద్ధే! ఆఁ! అయితే కొట్టేరన్నమాట! పోలీసు లేంచేసేరు? ఏం చెయ్యార్లే! నాకు తెలుసు!"

కాదుసార్. ఎస్సయ్ ఉంటే ఏం చెయ్యకపోను. కాని గీర హెడ్డు స్టేషన్ ఇన్‌చార్జిగా ఉన్నాట్ట. తిన్నగా వెళ్ళి మొగాణ్ని తీసుకొచ్చి కొట్లో వేసీసేట్ట.

"గీర హెడ్డు దండుకుంటాడేకాని........"

దండడం దండేసుకునే అరెస్టు మానాన్న అరెస్టు చేసీసేడు.

"బలే! గీర హెడ్డు గట్టివాడే అన్నమాట....ఇందాట్లో ఎక్స్‌ప్రెస్ ఎప్పయ్యారొచ్చింది. ఈకేసేనా! ఐసీ! మరైతే ఆడదాన్నేంచేసేడు గీరహెడ్డు?"

అది రాత్రేక్కడో దాగుందిట సార్ !

"హమ్మ రాస్కెలూ !"

ఇప్పుడు ఏదో కవుంటరుకేసు తయారు చేస్తోందిట సార్.

"కోర్టుకొచ్చిందా ?"

ఆస్పత్రిలో అడ్మిట్ అయిందని విన్నానార్ ఇప్పుడిప్పుడే !

"మరైతే కేసెవరు దాఖలు చేస్తున్నారు ?"

దాని తరఫున ఎవరో దాఖల్చేస్తున్నాట్ట సార్.

"అది వెళ్ళి ఆస్పత్రిలో పడుకుందా ? ! ఇదేదో ప్లీడరు సలహా మీదయి ఉంటుంది. అవునా ?"

ముకుందుడుగారు, సార్, దాని ప్లీడరు.

"మన కోర్టు కెప్పుడైనా ఒచ్చేడా ?"

పూర్వం మంచి క్రిమినల్లాయర్ కాని ఇప్పుడు పెద్ద సివిల్లాయర్సార్. గొప్ప పేచీగాడు.

"నేను పేచీగాళ్ళకి పెదబాబుని !"

[నవ్వు : (త్రైరునవ్వు)]

"ఆ మొగాణ్ని రిమాండుకి తెస్తున్నారా ?"

తెస్తార్ట సార్.

"వాడి పేరేవిటి ?"

గంగరాజు సార్.

"లక్షలు గణించేడన్నావు కదూ ?"

అవున్సార్.

"వాడికి అ ఆ లొచ్చునా ?"

ఒచ్చే జన్మలో ఒస్తాయి సార్.

"బాగా చెప్పేవు. వాడికి అఆలు రావు. అయితేనేం ? లక్షలున్నాయి. దానిమీదట వాడిక్కూడా ఓ ఓటుంటుంది. వాడే రేప్పొద్దున్న మనకి మహామంత్రి కాగలడు !"

రోజులలా ఉన్నాయి సార్‌! ఏం చేస్తాం?

"నువ్వేం చెయ్యకు. నేన్చేస్తాను."

(వెర్రి నవ్వు)

"నా చేతిలో పడితే ఈ కొత్త పెద్దకి - వాడి పేరేఁవిఁటన్నావు?"

గంగరాజు, సార్‌!

"గంగరాజుగాడికి పాతరోజులు మళ్ళా జ్ఞాపకం రావాలి, నా చేతిలో పడ్డాక"

వాడికి ముకుందుడిప్పుడు బెయిలు పెడతాట్ట సార్‌.

"ప్లీడరయిన తరవాత పెట్టడామరి! కాని, డబ్బులు బాగా గుంజ గలడా? ఇలాంటి కొత్తపెద్దలకి గుంజీవాడే గురువు!"

గుంజడానికి ముకుందుడు పరమగురుడు సార్‌! కొమ్ము త్తిరిగిన కాబూలీవాళ్ళు అతని క్లయంట్లయేక ఐ. పీ. లు పెట్టుకున్నార్సార్‌! చెప్తే నమ్మరు!

"అయితే మంచిదే. ఎవడీ ముకుందుడు?"

మనవాడే కాని మరోశాఖ సార్‌.

"ఏశాఖ?"

(చెప్పినవాడు శాఖపేరు నెమ్మదిగా చెప్పేడు. మేజిస్ట్రేటుగారికి మాత్రం వినిపించింది)

"ఆ శాఖా?! మరింక చెప్పేదేంఉంది? అక్కచేత ఐ. పీ. పెట్టించగలడు, తల్లికి చిప్పచేతి కివ్వగలడు! బెయిలు పెట్టమను పెట్ట మను!"

మేజిస్ట్రేటుగారు పగలు పదకొండు గంటలకి తన ఛాంబర్స్‌లో కూర్చుని తన కులంవాడైన కోర్టు గుమాస్తాతో పైవిధంగా మాట్లా డుతూ ఉండగా కోర్టు హాల్లో పీడర్లు కొంతమంది కూర్చుని హస్కు కొడుతున్నారు.

కుర్చీల్లో ఓ సైడు మొదటి కుర్చీలో కూర్చొని ఓ ప్లీడరుగారు మిగతా ప్లీడర్లతో ఏదో నవ్వుతూ మాట్లాడుతున్నారు. ఓ నడిగారు నల్ల ప్లీడరు ఆ మొదటి కుర్చీలో కూర్చున్న ప్లీడర్ని ఉద్దేసించి,

"అయితే ఒరే చిట్టిబాబూ, గంగరాజుగాడు గోతిలో పడ్డం కాదుగాని నీకు మంచి ఛాన్సు తగిలిందన్నమాట!" అన్నాడు.

చిట్టిబాబు పెదిమ విరిచి,

"నీకు తెలియన్దేఁఉందిరా గురూ! ఛాన్సులన్నీ ముకుందుడికీ, చాకిరీ అంతా మనకీ!" అన్నాడు.

"ఎప్పుడూ ఇలాంటి వెధవేడుపే ఏడ్చేవు"

"లేదు గురూ! నిజం చెప్తున్నాను. మనకి చాకిరే మిగులు. ఆ తరవాత ఏడుపే మిగులు"

"ఓ రెండు వందలైనా రాల్చలేదా నీకు?"

"అంతే రాల్చేడు."

"మరేం? తెగులా నీకు?"

"కేసంతటికీ అదేన్ట"

"నువ్వు చెయ్యగలిగే పనికి చాల్లే" అన్నాడు నల్ల ప్లీడరు.

"ఒరే గురూ!!" అంటూ క్రుత్రిమ కోపం అభినయించేరు చిట్టిబాప్లీడరు.

"ఆ రాజమ్మ నెప్పుడైనా చూసేవా?" అని ప్రశ్నించేడు నల్ల ప్లీడరు, ఓ పొడుం పట్టు పీల్చి,

"దాన్ని చూడని వాడెవడు?" అన్నాడు చిట్టిబాబు నవ్వుతూను.

"నా మాటవిని ముకుందుణ్ణొదిలీసి::దాన్ని మెల్లిగా మచ్చిక చేసుకో, చేసుకున్నావా, నీకు మరింక తిరుగులేదు. ముకుందుడైతే ముండ భత్యం తప్ప నీకు ఇంకేం ఇవ్వడు. అదైతే కనకవర్షం కురిపించ గలదు" అన్నాడు నల ప్లీడరు.

ఆ మాటలకి చిట్టిబాబూ మిగతా ప్లీడరూ కూడా గొల్లుమని నవ్వేరు.

"అవున్రా చిట్టీ! రాజమ్మకు నచ్చిందంటే నీకు వేరే లైఫ్ ఇన్సూరెన్సు అక్కర్లేదు" అని ఎంతో అమాయకంగా అన్నట్టుగా అన్నాడు నల్ల ప్లీడరు.

ప్లీడర్లంతా నల్లప్లీడరు హాస్యానికి నవ్వుకొంటూ కూర్చున్నారు. మధ్యలో చిట్టిబాబు అక్కడ ఉన్న కోర్టు బంట్రోతుని పిల్చి మేజిస్ట్రేటు గారి రాకకి ఎంత టైం పడుతుందని అడిగేడు.

"బాబు సంగతి మీకు తెలీదా? ఆడిష్టవేఁ!" అన్నాడు బంట్రోతు.

చిట్టిబాబు మిగతా ప్లీడర్లతో

"మనకి శవజాగరం తప్పదా?" అన్నాడు.

మేజిస్ట్రేటుగారు బెంచీకి ఆలస్యంగా రావడం గురించి చిట్టిబాబుకీ మిగతా వారికీ మధ్య సంభాషణ సాగుతోంది. కాలం జరుగుతోంది. చిట్టిబాబు నిస్పృహ అభినయించి తన కాయితాల కట్టల్ని బల్లమీంచి తీసి బల్లకివేసి కొట్టి ఈడిగిలబడి కూర్చున్నాడు.

చిట్టిబాబు ప్లీడరు పొట్టిగా ఉండడు. సన్నగానూ ఉండడు. టిప్ టాప్‌గా ఉంటాడు. హడావిడిగా ఉంటాడు. తొందర తొందరగా ఉంటాడు. పెళ్ళి భోజనానికి ఆలస్యంగా వచ్చిన పేదవాళ్ళా మొదట్లో చాలా చీరాగ్గా ఉండేవాడు, కాని, ఇప్పుడు మాత్రం అలా కాదు. చిట్టిబాబు గొప్ప పొలిటీషియనే — కాని "బొంకుల్దిబ్బ పొలిటీషియన్ గాడండీ", అంటారు చాలామంది.

అందంగానే ఉంటాడు చిట్టిబాబు, కళ్ళు దొంగకళ్ళు, నవ్వు దొంగనవ్వు. కాని, అందంగానే ఉంటాడు. సినీమాల్లో చేరితే సైడు హీరోగా అయినా ఉండగలిగిన పాటి అందం ఉందతనికి. వయసులో ఉన్నప్పుడు అతనికి సినీమా ఆశలుకూడా ఉండేవి కాని అవి సీరియస్ ఆశలు కావు. ఇప్పుడతనికి నలభయ్యేళ్ళ ప్రాయం వచ్చేసింది. ఇప్పుడు

మరింక డబ్బాశతప్ప మరో పెద్దాశ ఏదీకూడా అతనికి ఉన్నట్లు లేదు. డబ్బుకోసం ఇప్పుడతను ఎవరిసైడునైనా నిలబడి ఏ వాదనైనా వాదిస్తాడు. ఆశ్చర్యం ఏమిటంటే; అత నొకప్పుడు మంచి అభ్యుదయవాది.

"ఇంగితజ్ఞానం ఉన్న పేదవాళ్లు తమ కష్టాన్ని పెద్దలు దోచుకుంటున్నారని గ్రహించి ఆ దోపిడీకి వ్యతిరేకంగా" ఏదో విధంగా పోరాటం సాగించడానికి ఏదో ఒక పార్టీ పెట్టుకుంటారు. వాళ్ళ పార్టీల్లో ఆరోజుల్లో ముఖ్యమైనది సంజకెంజాయపార్టీ.

ధర్మంకోసం దెబ్బలాడ్డంలో ఓ మోజుంది. పేదవాడయినా కాకపోయినా, ధర్మంకోసం దెబ్బలాడ్డం అంటే వయసులో ఉన్న కుర్రవాళ్ళకి ఓ మోజుంటుంది. ధర్మంకోసం దెబ్బలాడ్డం పేదింటి పిల్లలకి అవసరం. పెద్దింటి పిల్లలకి అదొక మోజూ, అదొక సరదా.

వయసులో ఉన్నప్పుడు చిట్టిబాబు మంచి అందంగా ఉండేవాడనే చెప్పాలి. మంచి వయసూ కొంత చదువూ, చక్కటి అందమూ ఉండేవే కాని డబ్బు చాలకపోవడంచేత చిట్టిబాబుగాడి అందం రాణించవలసినంతగా రాణించలేదు. అందులోనూ అతను చలంగారి పుస్తకాలు చదివి చాలా ఆశలు పెట్టేసుకున్నాడు కూడాను, డబ్బుతో సంపాదించగలిగే సౌఖ్యాన్ని అతను ప్యూర్‌గా అందంతోనే సంపాదించేద్దాం అనుకున్నాడు. ఒకటి రెండు లక్కీ సెక్సు ఛాన్సు లతనికి తగిలేయి. కాని ఏ యువతీ కూడా వజ్రాల నగలతో అతణ్ణి వలచి వచ్చేయలేదు. ఒక పెద్దింటి యువతి అతణ్ణి వాడుకొని వాడుకొని ఆశపెట్టి ఆశపెట్టి ఆఖరికి అవతలకి పొమ్మంది. అప్పటి కతను బియ్యే మొదటి సంవత్సరం చదువుతున్నాడు.

కాలేజీ జీతం కట్టడానికి తప్ప చిట్టిబాబుకి ఆ రోజుల్లో చేతిలో చిల్లిగవ్వుండేది కాదు. అందాన్ని ఆడవాళ్ళకి చూపించవచ్చు. అద్దంలో చూసుకోవచ్చు. అంగట్లో ఏమైనా కొనుక్కొందికి మాత్రం అది ఉపయోగించదు. డబ్బు లేకపోవడం బాధొకటి. తన పూర్వీకులు డబ్బుకలవారే అయినప్పటికీ తన తండ్రీ తనూ ఇలా అయిపోయామే అనే బాధొకటి

అన్ని తెలివితేటలూ ఉండి. అందం ఎంతో ఉండికూడా తను ఇలా ఉండి పోయేనే అనే బాధొకటి - ఇలా చాలా బాధలు చుట్టు ముట్టేయి చిట్టిబాబుని. తీవ్రమైన కామ వాంఛలుకూడా అతణ్ని బాధిస్తూండడం వలన అతను చలంగారి కథలు తప్ప ఇంకేమీ చదవలేక పోయేవాడు. బెల్లపు ఆవకాయలా అవి బాగానే ఉండేవికాని అవిచదివేక అంతకంటె అగ్గిలాంటి పుస్తకాలు అతనికి కావలసి వచ్చేయి. వాటికోసం వెతకడంలో అతను బియ్యే పరీక్ష తప్పేడు.

దాన్తో చిట్టిబాబుకి నిస్పృహ మరీ హెచ్చింది. పుస్తకాలు చదవగా చదవగా, ఒక డొక్కు-ఆడమనిషితో సంబంధం పెట్టుకోగా పెట్టుకోగా అతనికి కామవాంఛకూడా తగ్గింది. బతుకంటే ఏహ్యంకూడా పుట్టుకు రాసాగింది. కాని అతన్లో యవ్వనపు బలిమి మాత్రం పోలేదు. అంతలోనే అతనికి సంజకెంజాయ పార్టీ మనిషొకరితో స్నేహం ఏర్పడింది.

ఆ సంజకెంజాయపార్టీ మనిషి పేదపార్టీవాడే కాని అగ్రవర్ణంవాడు. అగ్రవర్ణంవాడే కాని ఎంతో మంచివాడని పేరుండేదతనికి. చిట్టిబాబు కంటికి అతను ఎంతో అద్భుతమైన వ్యక్తిలా కనిపించేడు. తను ఈర్ష్యతోనూ ద్వేషంతోనూ భయంతోనూ చూసే పెద్దవారందర్నీ ఆ సంజకెంజాయపార్టీ మనిషి పశువుల్లాగా, పురుగుల్లాగా తల వెంట్రుకల్లాగా చూడ్డం చిట్టిబాబుకి ఆనందమూ ఆశ్చర్యమూ కలిగించింది. సంజకెంజాయపార్టీ ఆ రోజుల్లో ప్రభుత్వంతో తీవ్రమైన పోరాటం సాగిస్తుండేది. "వందలాది పేదలు చిత్రవధ చేయబడ్డారు. వారి కుటుంబీకులు వేటాడబడ్డారు. వారి స్త్రీలుచెరచబడ్డారు. చిత్ర విచిత్రమైన హింసలకీ ఘోరాలకీ పేద లెందరో పాల్జేయబడ్డారు." అయినా వారంతా తెగించి సాహసోపేతంగా పోరాడ్డంతో ప్రజల్లో చాలామందికి వారంటే అభిమానం ఏర్పడింది. గౌరవం పెరిగింది.

వీరుల వార్తలన్నీ విని చిట్టిబాబు పరవశుడై పోయేడు. సంజకెంజాయపార్టీ మనిషి ఎప్పుడూ చిత్రహింసలకి గురికాలేదుకాని చిత్రంగా పోలీసుల్ని మాత్రం తప్పించుకొంటూ వచ్చేడు. అలా తప్పించుకోడంలో

ఓ గగుర్పాటుంది. ఆ గగుర్పాటుగురించి వింటుంటే చిట్టిబాబు వళ్ళు పులకరించింది. వీరుడితో స్నేహం చేసినందుకు వింతగా అతను గర్వించ నారంభించేడు. తను పుట్‌బాల్ ఆట ఆడకపోయినా పుట్‌బాల్ ఛాంపి యన్స్‌తో స్నేహం చేసినవాళ్ళా అతను ఉప్పొంగి తిరగడం ప్రారం భించేడు. అంతకుముందు తను ఎక్కువ్వారనుకున్న దొంగపెద్దల్ని చూసి అతను అసహ్యించుకొని వారికంటె తను అధికుణ్నని అనుకో నారంభించేడు. పెద్దింటి పిల్ల లెవరైనా కనిపిస్తే అతను వారితో గర్రాగా మాట్లాడ నారంభించేడు.

పేదలకి జ్ఞానం ప్రసాదించి వారిని వీరులుగామార్చే సైన్సో ఫిలాస ఫీవో ఏదో ఒకటి ఉందని తెలుసుకొని ఆ విషయాలు గురించి పుస్తకాలు చదవ నారంభించేడు చిట్టిబాబు. అవి చదివితే కొండెక్కి ఊరు చూసి నట్టుగా అంతా స్పష్టంగా కనిపించ నారంభించిందతనికి.

చిట్టిబాబుకి కొత్త ఉత్సాహం వచ్చింది. పోరాటపు ధోరణీ, ప్రజల అలజడీ అంతా చూస్తూ, సంజకెంజాయపార్టీ మనిషి చెప్పే కబుర్లు వింటూంటే, విప్లవం విజయం పొంది అనతికాలంలోనే పేదల రాజ్యం స్థాపించబడుతుందనే నమ్మకం కలిగిపోయింది చిట్టిబాబుకి, త్వరలోనే తనొక నాయకుణ్ని కాబోతున్నాననే నమ్మకంకూడా అతనికి గట్టిగా కుదిరి పోయింది.

అయితే—

చిట్టిబాబు స్నేహంచేసిన సంజకెంజాయ పార్టీ మనిషి పోరాటపు అంచుల్లో ఉన్నాడేకాని పోరాటం మధ్యలో లేడు. అతనుకూడా చిట్టి బాబులా చెడిపోయిన పెద్దింటివాడేకాని ఆదినించీ కష్టించి పనిచేసే మను ష్యుల్లో వాడు కాడు. అతను ఉండి ఉండి ఒకనాడు చిట్టిబాబుకి కని పించడం మానీసేడు. అతణ్ని పోలీసులు తీసుకు పోయేరని చిట్టిబాబుకి తెలిసింది.

దాన్తో, చిట్టిబాబుకి గుండెలు కొట్టుకో నారంభించేయి. అది భయం వల్లనో ఉత్సాహం వల్లనో అతనికి తెలియలేదు.

అతనప్పటికి కొందిరు పార్టీ మనుష్యులతో తిరిగేదేకాని పార్టీ మెంబరు అవలేదు. అతణ్ణి పార్టీలో చేర్చుకొందికి జిల్లా నాయకు డొకాయన అభ్యంతరం తెలిపేడు.

"అతను శ్రామిక వర్గంవాడు కాడు. పోనీ, నిజాయితీ అయిన వాడా, అంటే అందు గురించికూడా నాకు నమ్మకంలేదు" అన్నాడాయన. చదువులేని కొంతమంది మాత్రం "పోనీ౼ ఓ చదువుకున్నవాడు వచ్చేడు కదా" అన్నారు. కాని జిల్లా నాయకుడు వినలేదు. "చిట్టిబాబుని ఇంకా టెస్ట్ చెయ్యవలసి ఉంది" అన్నాడు అతను.

ఈ లోగా చిట్టిబాబు స్నేహితుణ్ణి పోలీసువారు లాక్కుపోయేరు. ఆ తరవాత ఓ రాత్రి పదిగంటలకి చిట్టిబాబు ఇంటికి వెళ్ళేసరికి అతని తండ్రితో ఎవరో పెద్దమనిషి కూర్చొని మాట్లాడుతున్నాడు.

ఆ పెద్దమనిషి సైజులోకూడా పెద్దమనిషే. అతని చేతులు కండలు తిరిగి ఉన్నాయి. పంజా పులిపంజాలా ఉంది. ఖాకీ పంట్లాంమీద తెల్లటి బుష్‌కోటు తొడుక్కొని ఉన్నాడతను. అతని మోచేతులమీది వెంట్రుకలు దట్టంగా ఇనపరింగుల్లా ఉన్నాయి. అతని తలమీద మాత్రం జుట్టు తక్కువ. ముఖం ఎర్రగా దళసరిగా గొడ్డుమాంసంతో చేసినట్టుగా ఉంది. కళ్ళు పిల్లికళ్ళు, ముక్కు బొర్ర ముక్కు. మీసం ఎర్రమీసం. పెదవులు తుట్టపెదవులు, అతను కాలిమీద కాలు వేసుకూర్చొని కుర్చీవీపుని ఓ చేత్తో కావిలించుకొని కుర్చీలో అడ్డుగా కూర్చొని చిట్టిబాబు తండ్రితో మాట్లాడుతున్నాడు. మంచి అధికారిముందు వినయంగా కూర్చున్న గుమాస్తాలా అతని పక్క ఓ చిన్న బల్ల వేసుకొని కూర్చున్నాడు చిట్టిబాబు తండ్రి. గదిలో దీపం కళా విహీనంగా వెలుగుతోంది. గదిలో సామాన్లు చిందర వందరగా పడున్నాయి. గదికి అటూ ఇటూ రెండు గుమ్మాలే తప్ప కిటికీల్లేవు. అందుచేత, చలికాలమే అయినప్పటికి గది చాలా వేడిగా ఉంది. గుహలోకి నక్క దూరినట్టు లోనికి వచ్చేడు చిట్టిబాబు. లోపల పెద్దపులిలా కూర్చొని ఉన్నాడు ఆ పెద్దమనిషి.

చిట్టిబాబు లోనికి వచ్చీ రాగానే, అక్కడ అంతసేపూ మాట్లాడు

తూన్నవాళ్ళు మాట్లాడ్డం మానేసి అతనివైపు చూసేరు. ఆ కొత్తమనిషి గురించి "ఎవరు చెప్మా, ఎక్కడో చూసినట్టుందే" అని చిట్టిబాబు అను కొంటూ ఉండగానే అతని తండ్రి - యాభయ్యేళ్ళవాడు, పండు జుట్టు వాడు, పొడుం ముక్కువాడు, పాత లాల్చీ పంచె ధరించినవాడు అనారోగ్యంగా అమాయకంగా కనుపిస్తున్నవాడు — లేచి ముందుకివచ్చి, గుమ్మంలోనే చిట్టిబాబుని ఆపి,

"ఒరే చిట్టీ! ఆయ నెవరో తెలుసా? నా చిన్నప్పటి క్లాస్‌మేటు రంగడి తమ్ముడు, పోలీస్ స్పెషల్ బ్రాంచిలో ఎస్సయ్‌గా ఉన్నారు, నువ్వు కొంపముంచకుండా ఉండడానికి వార్నింగ్ ఇవ్వడానికి వచ్చేరు. రా, ఇలా, రా?" అని చెప్పి చిట్టిబాబుని రెక్క పట్టుకొని తీసుకువెళ్ళి, "బాబూ, సుకుమార్రావుగారూ, ఇదిగో వీడే మావాడు, మనిషి ఎదిగేడే కాని మనసుమాత్రం ఎదగలేదు. వీణ్ని శిక్షించకుండా రక్షించేపూచీ మీది. వీడు నా కొడుక్కాడు మీ కొడుకే అనుకొని ఎలా కాపాడతారో కాని మరి మీరే కాపాడాలి" అంటూ ఆ పెద్దమనిషి పక్కని ఉన్న బల్లమీద చిట్టిబాబుని కూర్చోబెట్టేడు, బక్కప్రాణిని ముసలిభటుడు చిత్రగుప్తుడి ముందు కొంచెం జాలిగా పడవేసినట్టు, క్లాసులు ఎగ్గొట్టిన అల్లరి పిల్లణ్ని తీసుకువెళ్ళి హెడ్మాస్టర్‌ముందు పెట్టినట్టు చిట్టిబాబుని ఆ సుకుమార్రావు ముందు కూర్చోపెట్టేడు చిట్టిబాబు తండ్రి. ఆ యాభయ్యేళ్ళ ముసలాయనకి చిట్టిబాబే మొదటి కొడుకు, జోగులుబాబే ఆరేళ్ళ ఆఖరి (రెండో) కొడుకు; ఈ ఇద్దరి కొడుకులమధ్యా అతనికి, దొండకాయ, బెండకాయ, చింతకాయ, మిరపకాయ (అని వీధిలో పిల్లలంతా వెటకారంగా పిల్చే) నలుగురు కూతుళ్ళున్నారు. అతనికి నెలకి రెండువందలే జీతం ఉంది; మొత్తం మూడువేలే అప్పుంది; వడ్డీ బాకీవే బోలెడుంది. అతను ఆరోజున ఆ సమయంలో కళ్ళంట నీళ్ళు పెట్టుకొని కొడుకుపక్క దీనంగా నిలబడ్డాడు.

సుకుమార్రావుముందు చిట్టిబాబు కూర్చొని ఆ ఎర్రటి ముఖంలోని నవ్వు చూసేసరికి చిట్టిబాబు గుండెలు గడగడ దడదడమంటూ చెడిపోయిన టేబిల్‌ఫాన్‌లా చప్పుడు చేసేయి. భయం వల్లనా, లేక, ఉత్సాహం

వల్లనా? నుదుటిమీద చెమట తుడుచుకొని ఆ ప్రశ్నకి ఈసారి మాత్రం సరైన సమాధానం తెలుసుకున్నాడు చిట్టిబాబు. అతనికి ఆ క్షణంలో తను అరెస్ట్ అయిపోతానేమో ననే తీవ్రమైన భయమూ కంపరమూ పుట్టుకొచ్చేయి. అందులోనూ, మరింక రేపో ఎల్లుండో తను అందుకోబోయే స్వర్గం చేజారిపోయి తను నరకకూపంలోకి లాక్కుపోబడుతున్నానని అనుకొనే సరికి సముద్రంలోంచి పొగలా హాలాహలం లేచినట్టు- అతనికి గుండెల్లోంచి గడ్డలా దుఃఖం లేచి గొంతుకలో అడ్డుగా ఉండిపోయింది.

అతను అందుకో దల్చుకున్న స్వర్గానికి ముప్పయ్యేళ్ళుండవచ్చు. తెల్లచీరకట్టుకొని తెల్ల రవిక వేసునేది. నుదుట బొట్టులేదు. వంటినిండా వయసుంది, ముఖంలో అట్టే అందం లేదు కాని కళ్ళనిండా చాంచల్యం ఉంది, పెదవులనిండా తృష్ణుంది. ఆవిడ నలుపుగానూలేదు, తెలుపుగానూ లేదు, కాని చాలా నునుపుగా ఉంది. ఆవిడ చిట్టిబాబు ఉండే వెనక వీధిలో ఉన్న బంగారం షాపువాళ్ళ బంధువట, కాకినాడనించి వచ్చిందట, బాల వితంతువట. బ్రహ్మాండంగా డబ్బుందిట. ఈ సంగతులన్నీ ఆమె బంధువుల ఇంటికి ఎదటింట్లో ఉండే స్నేహితుడి ద్వారా తెలుసుకున్నాడు చిట్టిబాబు. ఆవిణ్ని చూసిన వెంటనే అతన్లో చెప్పరాని నీచమైన వాంఛలు బుసలు కొడుతూ లేచేయి. ఆవిణ్ని అతనికి పదేపదే చూడాలనిపించింది. బెల్లపు కథలూ ఆవకాయ రచనలూ అగ్గిలాంటి నవలలూ చదివిన తరవాత, ఇన్నాళ్ళకి ఇన్నాళ్ళకి తనకి సరైన లక్కీఛాన్సు దొరికిం దనిపించిం దతనికి.

ఎందుచేతనంటే, ఆవిడ అతణ్ని రెండుసార్లు తిరిగి తిరిగి చూసింది, మూడోసారి అదేపనిగా చూసింది. నాలుగోసారి అతను రావడం కిటికీలోంచి చూచి వెంటనే గుమ్మం దగ్గిరకు వచ్చి నిలబడి చూసింది. అయిదోసారి గుమ్మందగ్గిర నిలబడి ఉన్న మనిషి లోనికి వెళ్ళి కిటికీ దగ్గరకి వచ్చి అక్కడనించి అలాచూస్తూ నిలబడిపోయింది.

ఆరోసారి ఆ రోజే సాయంకాలం। చిట్టిబాబు తన స్నేహితుడి ఇంటికి వెళ్ళేడు. స్నేహితుడు లేడు. ఆవిడ ఎదటింటి గుమ్మంలో ఉంటుందేమో అనుకున్నాడు, కాని లేదు. చిట్టిబాబు అతని స్నేహితుడి ఇంటి ఎదురుగుమ్మంలో తనకోసం ఆవిడ తప్పక వెయిట్ చేస్తుందను

కున్నాడు కాని లేక పోగానే కొంచెం నిరుత్సాహ పడిపోయేడు. ఎందు కైనా మంచిదని చెప్పి తన స్నేహితుడి పన్నెండేళ్ళ చెల్లెల్ని "మీ అన్న ఎక్కడికి వెళ్ళేడు? ఎంత సేపట్లో వస్తాడు?" అని అనవసరంగా ఏమేమో అడుగుతూ వెనక్కి మాటిమాటికీ చూస్తూ అక్కడే రెండు నిమిషాలు నిల్చున్నాడో లేదో,

అంతలో....

ఆవిడ లోనుంచి పరిగెట్టు కొంటూ వచ్చినట్టుగా వచ్చింది, జుట్టంతా భుజంమీంచి ముందుకి తీసుకువచ్చి పన్నెతో చిక్కు తీసు కొంటూ పరిగెట్టి వచ్చి గుమ్మంలో నవ్వుతూ నిలబడింది. చిట్టిబాబు రక్తం సుళ్లు తిరగ నారంభించింది ఆవిడ వచ్చీరాగానే! ఏదో జరగబోతోంది జరగబోతోందని పించిందతనికి. పొయ్యిబాగా మండేముందు పొగలెక్కువ చిమ్మినట్టు ఆనందపు టుత్సాహానికి ముందుగా అతను ఉద్రేకంతో ఉక్కిరి బిక్కిరయేడు. ఏం జరుగుతుందేం జరుగుతుందని అతను మరమనిషిలా నిలబడిపోయుండగా ఆవిడ గొంతు సవరించి పిలుపు పిలిచింది. ఎవర్ని ఎవర్ని? చిట్టిబాబు స్నేహితుడి పన్నెండేళ్ళ చెల్లెల్ని పిలిచిందావిడ.

"ఏఁమ్మాయ్! నరుసూ! నరుసేకదూ నీ పేరు?" అందావిడ.

పన్నెండేళ్ళ నరుసు తనపేరు నరుసేనని తలూపింది,

" 'మరో పెళ్ళి' సినిమాకి ఆరుగంట లాటకి వెళ్తున్నాం. మీ అమ్మగా రొస్తారేమో అడుగు" అందావిడ.

నరుసు కొంచెం ఆశ్చర్య పడ్డట్టయింది. ఆ తరవాత సంతోష పడ్డట్టయింది. వెంటనే ఇంట్లోకి పరిగెట్టింది!

ఆవిడ నవ్వుతూ నిల్చొంది.

తన కోసమే ఆ విధంగా ఆవిడ ఆ సినీమా విషయం తెలియ జేసిందని తెలిసిపోయింది చిట్టిబాబుకి. అంత మధురమైన సంఘటన నిజంగా తన జీవితంలో తన విషయంలోనే జరుగుతోందా అనిపించిం దతనికి. సెంటు సముద్రంలో తేలియాడుతున్నట్టూ, గంధపు గాలిలో ఎగురుతూన్నట్టూ అతను పరవశుడై పోయేడు.

సాభిప్రాయంగా అతణ్ని చూసి, నవ్వి, ఆవిడ లోనికి వెళ్ళింది. దారంతో గాలిపడగని లాగినట్టు ఆవిడ తనిని లాగగలుగుతోందని అతను తెలుసుకో లేకపోయేడు. ఆవిడ జాణతనాన్ని అతను గు ర్తించ లేక పోయేడు - తనే వేటాడబడుతూన్నప్పటికీ తనే ఒక వేటగాళ్ళా అతను సగర్వంగా నవ్వుకో నారంభించేడు.

సాయంకాలం ఆరుగంటలకి ముందుగానే వెళ్ళి సినీమాహాల్ దగ్గిర అతను కాసేడు. ఇంకా రిక్షా దిగకుండానే ఆవిడ కళ్ళు తనకోసం వెతకడం అతను గమనించి, ఆమె తనని చూసీ చూడగానే నవ్వడం కూడా గమనించి - ఉప్పూ పప్పూ అమ్ముకొనేవాడు ఊర్వశి పలకరింపు నవ్వుకి చిత్తు అయిపోయినట్టు - చిత్తు అయిపోయి నీరసించి పోయేడు. ధన్యోస్మి ధన్యోస్మి అనో, లేక, హతోస్మి హతోస్మి అనో అతను అనుకు న్నాడు. తెల్లచీరావిడతో మరొక పాతికేళ్ళ నల్లచీర మనిషికూడా ఉంది. ఆనల్లచీరావిడ చేతిలో ఓ ఆర్నెల్ల పిల్లడున్నాడు. ఆమె కొంగు పట్టుకొని ఓ నాలుగేళ్ళ పిల్లడున్నాడు. వాళ్ళు బాల్కనీ టిక్కెట్టు కొనుక్కొని మేడెక్కేరు. వారి సీట్ల వెనకనే చిట్టిబాబు కూడా కూర్చున్నాడు.

సినీమా ప్రారంభించకముందు ఆ నాలుగేళ్ళ పిల్లడు చాలా అల్లరి చేసేడు. ఆ పిల్లణ్ని చిట్టిబాబు పలకరిస్తే ఆ పిల్లడు కోపంగా చిట్టి బాబుని కొట్టబోయేడు. అందుకు తెల్లచీర మనిషి చాలా సరసంగా నవ్వి చిట్టిబాబుని "ఏమీ అనుకోకండీ" అంది. చిట్టిబాబు వెర్రిగా ఓ నవ్వు నవ్వేడు. ఆ సమయంలో తన నరాలు తెగిపోయాయనుకున్నాడతను, అంతలో సినీమా ప్రారంభం అయింది. ఆవిడ సినీమాలో ఏదో చూసి నవ్వడం, అలా నవ్వుతూ వెనక్కి తిరిగి చిట్టిబాబుని చూడ్డం - అలా చాలాసార్లు చేసింది. చిట్టిబాబు తన కాలు ఆమె కుర్చీకిందికి పెట్టేడు. ఆమె తన పాదంతో అతని కాలు నొక్కింది. ఆ సమయంలో సంతో షంతో తను చచ్చిపోతానేమో అనుకున్నాడు చిట్టిబాబు.

ఇంటర్వెల్లో ఆ నాలుగేళ్ళ చట్టపు పిల్లణ్ని తీసుకొని ఆమె బైటకి వచ్చింది. చిట్టిబాబుకూడా బైటకి వచ్చి నాలుగు బిళ్ళలు కొని

ఆ పిల్లడి చేతికి ఇవ్వబోయేడు. ఆవిడ అతని చేతిలోంచి వాటిని మెత్తగా తీసికొంటూ, "మీ రెవరు?" అని మెల్లిగా అడిగింది. మల్లెపువ్వుకి మాటలొస్తే అలాగే మధురంగా మాట్లాడగలదనిపించింది చిట్టిబాబుకి. "మీరే నేను" అని చల్లగా ఆమెకి చెప్పేడు చిట్టిబాబు. "అమ్మో! "మీ రెవరు" అని ఆవిడ అడగ్గానే నెమ్మదిగా నవ్వుతూ అమాయకు లనుకున్నాను" అందావిడ (పెంకెగాకాదు) పోకిరీగా నవ్వుతూను. ఆ మాటలోని చిన్న పిసరు చమత్కారానికి చిట్టిబాబు సంతోషంతో కిరకిర చుట్టుకు పోయేడు.

రాగా పోగా ఆవిడ - తను మర్నాడే కాకినాడ వెళ్ళిపోతున్నాననీ, వచ్చే సోమవారం సాయంకాలం ఆరు గంటలకి కాకినాడలో ఫలానా సినీమాహాల్ వద్దకి వచ్చి అతను ఉండవలసిందనీ - అతణ్ణి తొందర తొందరగా కోరింది. నాలుగేళ్ళ చుట్టపు పిల్లణ్ణి అతనికి ఇచ్చి పుచ్చు కోడం సందర్భంలో అతని చేతిని ఆవిడ మెత్తగా గిల్లింది. ఆ గిల్లు మల్లె ముద్దులా తోచింది చిట్టిబాబుకి. అతను సంతోషంతో నలిగిపోయి చిచ్చుబుడ్డీగా వెలిగిపోతానేమో అనుకున్నాడు ఆ సమయంలో. ఆవిడ మళ్ళీ అడిగింది: "ఈ ఊర్నించి ఆ ఊరు అంత దూరం నా కోసం రాగలరా?" అని అడిగింది. "మీ ప్రేమకోసం ఏమైనా చేస్తాను. నా ప్రేమసంగతి మీ కింకా తెలీదు!" అన్నాడు చిట్టిబాబు.

ఇంటర్వల్ అయిపోయింది. సినీమా అయిపోయింది. ఇంటికి వచ్చేస్తూ ఆమె గురించే ఆలోచిస్తూ నడిచేడు - కాదు - తేలేడు చిట్టిబాబు. ఆమె తెల్లచీరకింద తెల్ల జాకెట్టుకింద తెల్ల బాడీకింద బిగువు గురించి తల్చుకొంటూంటే అతని గుండెలు హౌరా మెయిల్ డీజెల్ఇంజన్లా పరుగు లిడ నారంభించేయి. ఒకటోరకం ప్రేమఛాన్సు తనకి దొరికి నందుకు అతను హౌరాకి బదులు స్వర్గానికి డీలక్స్ ట్రెయినెక్కినవాళ్లా ఉత్సా హంతో ఉప్పొంగి వరదలై పోయేడు. జీవితంలో తనకి ఇవి మధురాతి మధుర క్షణా లనిపించే యతనికి. తను ఇంటికి వచ్చేనన్న సంగతికూడా గుర్తించుకోలేదతను. ఇంటికి వచ్చేనని గుర్తించేసరికి ఎదురుగా పోలీసు వాడు!

ఆ రాత్రి చిట్టిబాబుకి పోలీసువాడు హితబోధ చేసేడు చాలాసేపు. ఆ బోధనంతా భగవద్గీత విన్నట్టు విన్నాడు చిట్టిబాబు. అప్పటినించీకూడా పూర్తిగా అసలు రూపంలోకి అతను మారిపోయేడనే చెప్పాలి.

అసలతను ఆ భగవద్గీత విననవసరం లేకుండానే - భగవంతుడు యమ భయంకరంగా దిగినట్టు ఆ పోలీసువాడు మఫ్టీలో దిగగానే చాలా మట్టుకు మారిపోయేడు. ఆ సుకుమారుడు తనని అరెస్ట్ చేయడానికే వచ్చే డనుకున్నాడతను. బంగారపు కాకినాడ పిచిక గురించి అతను కనిన కలలన్నీ కూడా పోలీసువాణ్ని చూడగానే భగ్గుమని మండిపోయేయి. వళ్ళంతా ధారలు ధారలుగా చెమటలు పోసేయడంతో అతను జావజావగా కూర్చుండి పోయేడు. పెళ్ళుమని పెళ్ళిలో వెలిగే దీపాలన్నీ కూడా, ఎక్కడో ఎరక్కచేసిన పొరపాటువల్ల గప్పుమని ఆరిపోయి ఊరుకున్న ట్టుగా తన జీవితం చీకట్లోకి వెళిపోతున్నట్టుగా అనిపించిందతనికి. పెద్దరోగపు వాడని ఎరక్క, వాడితో స్నేహంచేసి ఆ రోగం తెచ్చు కున్నానని తెలిసిన వాళ్ళా అతను సడెన్‌గా వెక్కివెక్కి ఏడవ నారం భించేడు ? సంజకెంజాయపార్టీ మనిషిని తల్చుకొని ! తన స్నేహితు డైన ఆ సంజకెంజాయపార్టీ మనిషి - "వాడిపేరు వైకుంఠరావు, కాదు - వల్లకాటిరావు !- ఆ మనిషి తనని కలుసుకోకముందే "అరెస్టయి చచ్చుంటే" ఎంత బావుండునో కదా అనిపించిందతనికి. కాని, ఏం లాభం ? తన స్వర్గంలో చిచ్చుపెట్టి వెళ్ళిపోయేడు ! తన బతుకంతా వల్ల కాడుగా మార్చి వెళ్ళిపోయేడు ! కాని, తనింకా స్వర్గంలో ఉండడానికి అవకాశం ఉందనీ, ఆ వైకుంఠరావుగాడు పెట్టిన చిచ్చుని తను ఆర్ప డానికి సిద్ధంగా ఉన్నాననీ సుకుమారుడు తెలియజేసేడు.

నమ్మలేక పోయేడు చిట్టిబాబు.

కాని—

సుకుమార్రావుని నమ్మకుండా ఉండలేక పోయాడు చిట్టిబాబు.

"ఆ సంజకెంజాయ పార్టీలో నువ్వింకా చేరలేదుకదూ ? !"

"చేరలేదని మీ కెలా తెలుసు?" అని ఆశ్చర్యపోయేడు చిట్టిబాబు.

"పార్టీ మెంబరువి కావు, కాని వాళ్ళతో కలిసి తిరుగుతున్నావు కదూ?"

అందుచేత,

"మరిప్పుడు మించిపోయిందేమీ లేదు. నే చెప్పినట్టు చెయ్, బాగు పడతావు!" అని బోధించేడు సుకుమారుడు.

కాకినాడ వెళ్ళగలగడానికీ అక్కడ ఉండే బంగారు పిచికని కలుసుకొని బాగుపడ్డానికి సుకుమారుడేం చెప్పినా చెయ్యడానికి సిద్ధపడే ఉన్నాడు చిట్టిబాబు.

చిట్టిబాబుకి సుకుమారరావు ఏం చెప్పేడో చెప్పడం కష్టం. చెప్పినదేదో అతను చాలా రహస్యంగా చెప్పేడు. కాని, ఆ రహస్య బోధ అయిన వెంటనే చిట్టిబాబు ఏడు కొండల వాడికి ఎన్ని వందల దండాలు పెట్టుకున్నాడో చెప్పడం కష్టం. సుకుమారరావంతటి మంచి వాళ్ళు పోలీసుల్లో ఉన్నందు కతను ఆనందబాష్పాలు రాల్చేడు. పోలీసు భక్తితో అతను పరవశించి పోయేడు.

ఆ తరవాత కొద్ది రోజుల్లోనే సంజకెంజాయపార్టీ మనిషి ఒకతను షూట్‌చేయబడ్డాడు. అతను అలా షూట్‌చేయబడ్డ తరవాత ఆ పార్టీ జిల్లా నాయకుడు తనకి "అనుమానంగా ఉందన్నాడు." "ఎవరి మీద నీ అనుమానం?" అని అతని స్నేహితుడు అడిగేడు. "చిట్టిబాబు పోలీసు మనిషేమోనని నా అనుమానం" అన్నాడు జిల్లా నాయకుడు.

"పోలీసువాళ్ళు అతణ్ని తిప్పడానికి ప్రయత్నం చేసేరట. మన వాడు వాళ్ళతో...."

"ఏఁవఁన్నాట?" అని గాభరాగా ప్రశ్నించేడు జిల్లా నాయకుడు తన ప్రక్కనున్న స్నేహితుణ్ని.

"అలాగే లెండి చూదాం అన్నాట. వాళ్ళేఁవైఁనా అడిగితే తప్పుడు ఫోగట్టాలిచ్చేస్తానన్నాడు నాతో. పాపం, నాతో అంతా ఫ్రాంక్‌గా చెప్పే

సేడు సుకుమా(రావు మనవాణ్ణి టాకిల్ చేసేట్ట. కాని, మనవాడా లొంగు తాడు?!" అని ధైర్యంగా నవ్వేడు నాయకుడి స్నేహితుడు.

నాయకుడు మాత్రం నవ్వలేదు. స్నేహితుడితో అతడు చాలా సీరియస్‌గా మాట్లాడేడు. "స్నేహితుడా! కష్టించి బతికేవాడు కష్టించిబతికే వాణ్నే నమ్మాలి కాని మరొకర్ని నమ్మకూడదని తెలుసుకో! కుందేలుకి కుందేలే సాయం చేస్తుంది కాని తోడేలు చెయ్యదు. మధ్య తరగతి మనిషిని మనం నమ్మి ఆశలు పెట్టుకుంటే అవి అడియాసలవుతాయి. ఎండమావులే అవుతాయి. అది మనసు మార్చుకున్న మంచి తోడేలే అయినప్పటికి మళ్ళీ మార్చుకోదనే నమ్మకం మనకి ఏముంటుంది? నువ్వే చెప్పు. జాతికాని జాతి కోసం త్యాగాలు చేసేవాడికి ఎప్పుడో ఒకప్పుడు అలా త్యాగాలు చేయడం కష్టమనిపిస్తుంది. కష్టం తోచగానే జాతికాని జాతిమీద విసుగు పుట్టుకొస్తుంది. విసుగుపుట్టుకొచ్చిందంటే అది విషంగా మారుతుంది. మంచి తోడేళ్ళు ఉండబోవనికాదు నేననేది, కాని అంత మంచిదైనాకూడా దానికీ పూర్వా(శమంలోకి పోదామనే తలంపు ఎప్పుడో ఒకప్పుడు కలగొచ్చు. మనం, మరో జాతిని నమ్మి మోసపోయే (ప్రమాదంలోకి దిగడం కంటె, మన కుందేటి జాతినే మనం నమ్ముకొని కుంటుకొంటూ నడిచినా అలా నడవడమే మెరుగు,"

అంటూ ఆ రాత్రి ఆ జిల్లా నాయకుడు తన స్నేహితుడితో ఏమేమో చెప్పేడు.

అయితే—

చిట్టిబాబు గురించి ఆ నాయకుడికి కలిగిన అనుమానాలు ఆ నాయ కుడి స్నేహితుడికి మాత్రమే తెలిసేయి కాని మరొకరికి తెలియడానికి అవకాశం లేకపోయింది. వారిద్దరూ గదిలో కూర్చొని ఉండగానే ఎవరో తలుపు తట్టేరు. గదిలో దీపం లేదు. చాలా చీకటిగా ఉంది. నాయకుడు వెళ్ళి తలుపు సందులోంచి చూసి, వెనక్కి జరుగుతూ జరుగుతూ పెరటి తలుపు తీసి, స్నేహితుడు చెయ్యిపట్టుకొని పారిపోబోయేడు. కాని, అటు నించి కూడా పోలీసులు విరగబడి వచ్చేరు.

ఆ తరువాత, ఆ నాయకుడూ అతని స్నేహితుడూ - ఇద్దరూకూడా- ఏమయిపోయేరో ఎవ్వరికీ తెలియదు.

ఆ తరవాత, ఆ విధంగా ఆ సంజ కెంజాయ పార్టీ చాలా దెబ్బలు తింది. పార్టీలోకి చిట్టిబాబులు ఎక్కువగా దిగుబడవుతున్నారని ఆ పేద పార్టీ పెద్దలూ ముఖ్యులూ తెలుసుకొనే లోపున వారిలో ఎక్కువమంది హతులే అయిపోయేరు. మిగతా నాయకుల్లో చాలామంది చిట్టిబాబులయి పోయేరు. మిగతా కొద్దిమందీకూడా నిసత్తువుగా నిలబడి పోయేరు.

దాన్తో, సంజ కెంజాయ పార్టీ రంగు మార్చకుండా దిక్కు మాత్రం మార్చింది. సంధ్యా రాగం సంధ్యా రాగంలాగే ఉంది కాని అది సాయం సంధ్య కింద మారింది. నిక్కచ్చిగా ఉన్నప్పటికి నిస్సత్తువగా ఉండిపోయిన నాయకులు మూలలకి పోయేరు. చిట్టిబాబులే నాయకత్వం వహించి సారథ్యం చేయ మొదలెట్టేరు. రంగు రంగులాగే ఉండడంచేత అడుగున ఉన్న అజ్ఞానపు జనం మాత్రం అది పాత పార్టీవేనని అది వెళ్ళ వలసిన దిక్కుకే వెళ్తూందనీ నమ్ముతూ కూర్చుండి పోయేరు.

చిట్టిబాబు పోలీసు గీతలువిని భక్తిమార్గం చేపట్టిన తరవాతనే అతనికి జ్ఞానోదయంకూడా అయింది. "మనం హైక్లాసా, లోక్లాసా?" అని ప్రశ్నించు కున్నాడతను. హైక్లాసేనని సమాధానంకూడా చెప్పు కున్నాడు. "హైక్లాస్‌లో ఉండవలసిన వాణ్ని లోక్లాస్‌తో చేరి బాధలు పడ్డం అనవసరం" అని అతను నిర్ణయించు కున్నాడు కూడాను.

ఆ తరవాత చిట్టిబాబుకి పెళ్ళయింది: ఓ కంట్రాక్టర్‌గారి అమ్మాయిని కట్నం పుచ్చుకొని చేసుకున్నాడు. బియ్యే పాసయ్యేడు. వెంటనే 'లా' చది వేడు. 'లా' పాసయేక అతను ప్రాక్టీసు పెట్టేడు కాని అది సరిగా సాగలేదు. తన కులం వాడి దగ్గర కాకుండా అతను మరోకులం వాడి దగ్గర జూనియర్‌గా చేరవలసి వచ్చింది. ఆ వేరొక కులం లాయరు కొంతకాలంవరకూ చిట్టిబాబుని సరిగానే ప్రోత్సహించేడు కాని కొంత కాలానికి తన కులం వాడే జూనియర్‌గా రావడంతో చిట్టిబాబుమీద శీత కన్ను వేయసాగేడు. దాన్తో చిట్టిబాబు చిరాకుపడిపోయేడు కాని అంతలో

అతన్ని ముకుందుడు ఆదరించి దగ్గరకి తీసుకున్నాడు. వాళ్ళిద్దరిదీ ఒకటే కులం ఒకటే శాఖ. బాగానే వుంది. కాని, అంతలో ముకుందుడి మేనల్లుడు బియ్యేల్ పాసయి ముకుందుడి దగ్గిర జూనియర్‌గా కుదురుకున్నాడు. దానితో చిట్టిబాబు మీద మరోసారి శీతకన్ను పడింది. జిల్లా మునసబుగిరీ సంపాదిద్దామని చిట్టిబాబు తాపత్రయ పడ్డాడు. కాని అతనికి ఆ వయసుదాటి పోయింది. తను పుట్టిన తేదీ స్కూల్ సర్టిఫికేట్లో తప్పుగా పడిందనీ, తను తనకంటె నిజంగా చిన్న వాణ్ణనీ, తన పుట్టిన తేదీ ఫలానా అని చెప్పి సర్టిఫికేట్లో సవరణ చేయవలసిందనీ చిట్టిబాబు యూనివర్శిటీ వారి మీద దావా చేసేడు. ఆ విధంగా ముకుందుడి జూనియరు చేసిన దావానీ ముకుందుడంటే ఇష్టంలేని మునసబుగారొకరు మీసం దువ్వి డిస్మిస్ చేసేడు. అప్పీలుకు వెళ్ళినా ఆ తీర్పే ఖాయం అవుతుందని చిట్టిబాబుకి ఆ జడ్జిమెంటు చదవగానే తెలిసిపోయింది. అందుచేత చిట్టిబాబు తన వయసువాడుగానే ఉండిపోవలసి వచ్చింది కాని తనకంటే చిన్నవాడుగా మారడానికి మార్గం లేకపోయింది. మునసబుగిరీ సంపాదించడానికి అతనికి అవకాశం లేకపోయింది. ఇప్పుడు తను ముకుందుడి జూనియర్‌గానే ఉంటున్నాడు.

మరైతే, చిట్టిబాబు ఆ కాకినాడకి చెందిన బంగారపు బాలవితంతువుని పెళ్ళాడలేదా?

లేదు.

చిట్టిబాబు అలనాడు ఆవిడ చెప్పిన "వచ్చే సోమవారంనాడు" సాయంకాలం ఆరుగంటలకి, (ఆమెచెప్పినటువంటి) ఫలానా సినీమా హాల్ దగ్గరకి వెళ్ళి చాలా సేపు నిలబడ్డాడు. ఆ నాడు కాకినాడ వెళ్ళడానికి అతను చాలా శ్రమ పడవలసి వచ్చింది. ఓ స్నేహితుడి దగ్గర పాతిక రూపాయిలు బదులు పుట్టడానికి చిట్టిబాబు ఆ స్నేహితుడితో తన కథంతా చెప్పుకోవలసి వచ్చింది. వాడు కథంతా విని తనుకూడా కాకినాడ వస్తానని కూర్చున్నాడు. "నీ ఖర్చులన్నీ నేనే భరిస్తాను కాని నేనూ ఒస్తాను. నాకూ ఒక ఛాన్సు కావాలి" అని పట్టు పట్టేడు. "నన్ను మాత్రం

ప్రేమించే మనిషిని నీకూడా ఇమ్మనడం న్యాయమా?" అన్నాడు చిట్టి బాబు. ప్రేమేవిట్రా ఫూల్! అదెవర్తో పక్కా రేక్ అయుండాలి" అన్నాడు, ఆ పాతిక రూపాయిల బదులుకి షరతులు పెట్టిన స్నేహితుడు. అందుచేత, చిట్టిబాబు మరో స్నేహితుడి దగ్గర పదిహేను తీసుకొని కాకినాడవెళ్ళి అక్కడ చుట్టాలింట్లో దిగి, ముస్తాబయి ఆ ఫలానా సినీమా హాలు దగ్గరకి వెళ్ళేడు. ఆమె మాత్రం రాలేదు. ఆమె పేరూ ఇంటి పేరూకూడా తెలుసు కాబట్టి ఆమె గురించి చిట్టిబాబు ఆ రాత్రే భోగట్టా చేస్తే అతనికి సంగతులన్నీ తెలిసేయి. ఆవిడ బంగారు చిలకేనట, బాల వితంతువేనట. కాని ఆవిడకి మదపిచ్చి ఉండేదట. ఆ పిచ్చివల్ల ఆవిడ తనవారికందరికి ఘోరమైన తలవంపులు తెచ్చిపెడుతోందేదట. ఆఖరికి ఆ అవమానాల భారాన్ని భరించలేక ఆమె తమ్ముడే "విషంపెట్టి ఆమెని" మొన్నమొన్ననే చంపేసేడుట. తమ్ముడే చంపేసినప్పటికి ఇంట్లో వాళ్ళందర్నీ పోలీసులు అరెస్టు చేసేరట. ఎవరిమీద కేసు పెడతారో ఏం వేస్తారో ఇంకా తేల్లేదట.

ఆ సంగతులన్నీ విని చిట్టిబాబు చాలా చిరాకు పడిపోయేడు. ఆ బాల వితంతువు భగ్న జీవితం గురించి అతను దమ్మిడీ ఎత్తయినా విచారించలేదు. ఆవిడ తనని మోసగించినట్లుగా తనని ఫూల్ చేసినట్టుగా అతను భావించుకొని ఆమెని నానాతిట్లు తిట్టుకున్నాడు. "అనవసరంగా మనకి పదిహేన్రూపాయల దెబ్బ!" అనుకున్నాడతను. పాలనుకొని విషం తాగిన ఆ ఆడ మనిషిమీద అతనికి కసి కలిగింది. కోపం వచ్చింది. వెంటనే తన ఊరు వెళ్ళిపోదాం అనుకున్నాడు. కాని ఆ చుట్టాలింట్లో ఓ తెలివితక్కువ ఆడపిల్ల ఉంది. రసగుల్లా తిందామని ఊరంత ఆశతో వెళ్ళిన వాడికి నిలవ పకోడీ చేతిలో పెడితే అసహ్యించుకున్నట్టు చిట్టి బాబు తెలివి తక్కువ ఆడపిల్లను చూసి అసహ్యించుకున్నాడు. కాని, నీలుగు నీల్గితే నిలవ పకోడీకూడా దక్కకపోవచ్చునని అతను అంతలోనే భయపడి, ఆ చుట్టపు పిల్లని చిట్ట చీకట్లో వారి పెరట్లోనే పాడుచేసి ఆ తరవాత తన ఊరు వచ్చేడు. "పదిహేన్రూపాయలకి, పోనీ, కొంతైనా ఖర్చు కిట్టింది!" అని అతనికి కొంత సంతృప్తి కలిగింది.

ఆ రోజులన్నీ వెళ్ళిపోయాయి. చిట్టిబాబు పెద్దవాడయేడు. కాల చక్రం అతనికి గిర్రుమనే కాకుండా గలగల మని తిరిగింది. అతని మామ గారు పెద్ద కాంట్రాక్టరయేడు. అతని పెద్ద బావమరది అమెరికన్ డబ్బుతో కంపెనీ పెట్టబోతున్నాడు. అతని చిన్న బావమరది రష్యావారికో ఎవరికోగాని రమణీయమైన వాసన్మూనెలు సప్లయ్ చేస్తున్నాడు. ఆ ఇద్ద రన్న దమ్ములకీకూడా తమకి ఉన్న ఒక్క చెల్లెలూ అంటే ఎంతో ముద్దు. ఆవిడకి తనకి ఉన్న ఒక్క భర్తా అంటే ఎంతో ప్రేమ, మరందుచేత చిట్టిబాబుగారి రొట్టెముక్క అవునెయ్యిలోపడి హాయిగా ఉంది తినడానికి: పుట్టినప్పుడతను నరంలా పుట్టేడు. కొంచెం ఎదిగాక కర్రలా మారేడు. ఆ తరవాత చాలాకాలం బద్దలా తిరిగేడు. ఇప్పుడతను నున్నగాగుండ్రంగా మగ వేషం వేసిన ఆడమనిషిలా అందంగా (నే) ఉంటాడు.

అందుచేత——

మేజిస్ట్రేటుగారు పన్నెండుకే ఒచ్చినా, ఒంటిగంటకైనా సరే రాక పోయినా, చిట్టిబాబుకి మించిపోయిందేమీలేదు.

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. హాల్లోకి మరికొంతమంది ప్లీడర్లు వచ్చేరు. ఓ కిటికీ అవతల ఆరుగురు ఆడవాళ్ళు నిల్చున్నారు. దానికి ఎదురు కిటికీదగ్గిర పదిమంది మగవారు నిల్చొని ఆడవార్ని చూ_న్నారు. ఆ ఆడవారు ప్లీడర్లని 'జూ'లో జంతువుల్లా ఆశ్చర్యంగా చూస్తున్నారు. ప్లీడర్లు మేజిస్ట్రేటుగారి రాక కోసం ఎదురు చూస్తున్నారు.

అంతలో, మేజిస్ట్రేటుగారి ఛాంబర్స్‌లోంచి ప్యూన్‌వచ్చి బల్ల మీద కలమూ సిరా అన్నీ అమిర్చేడు. గుమాస్తా వచ్చి కాయితాలు సర్దు కొంటూ తన బల్లదగ్గర నిల్చున్నాడు. మరో నిమిషానికి, "సై....లెన్స్" అనే కేక వినపడింది. ఆ కేక వెనకనే మేజిస్ట్రేటుగారి రూపం కనపడింది.

మేజిస్ట్రేటుగారు టిప్‌టాప్‌గావచ్చి డయస్ ఎక్కి, అందరి నమస్కారాలూ ఒక చిన్న చేతి విసురుతో అందుకొని, కుషను వేసిన కుర్చీలో సుఖంగానే కూర్చున్నారు కాని ముఖం మాత్రం బాధగా చిరాగ్గా పెట్టేరు. వారికి రూపం తక్కువేగాని స్టయిలెక్కువ. వారు వస్తూనే బల్ల

మీద బెల్లుని గణగణమనిపించేరు. "అర్జీదార్లూ!" అని కేకవేసిన బంట్రోతు బెల్లుమోతకి గడగడలాడుతూ లోనికివచ్చి "సార్?" అన్నాడు. ఆ బంట్రోతుకు గడగడలాడ్డంలో మంచి నేర్పుంది. అధికార్ల ముందు ఎంత గడగడలాడినట్టుంటే అంత మంచిదనే ట్రిక్కు అతను చాలా కాలం కిందచే నేర్చుకున్నాడు.

"సార్?" అన్నాడు బంట్రోతు.

"వరండాలో ఏఁవిఁటాగోల?" అని ప్రశ్నించేరు మేజిస్ట్రేటుగారు.

"సర్!" అన్నాడు బంట్రోతు. అని, వరండాలోకి వెళ్లి అక్కడున్న వారందరికీ వరసవరసగా సైలెన్స్ చెప్పేడు. ఆఖర్న "సైలెన్స్ లేకపోతే జాగ్రత్త!" అని అందర్నీ హెచ్చరించేడు. ఆ బంట్రోతుకు నలభయ్యేళ్ళుంటాయి. నల్లగా కాటికలా ఉంటాడు. బలంగా భీముళ్ళా ఉంటాడు. "శవంలోంచికూడా డబ్బులాగ్గలిగిన నేర్పు నువ్వెక్కడ్రా నేర్చుకున్నా"వంటే అతను "ఆఫీసర్ల దగ్గరే నేర్చుకున్నాను" అంటాడు.

తన అధికారపు శక్తిని, దానికి గడగడలాడే వ్యక్తుల్నిబట్టి కొల్చుకొంటూ ఉంటారు మేజిస్ట్రేటుగారు" భీముణ్ణి గడగడలాడించి, అతని ద్వారా ఆ వరండాలో అందర్నీ గడగడలాడించినందుకు వారు సంతృప్తిగా నవ్వుకున్నారు. అధికారపుశక్తి అద్భుతంగా ఉన్నందుకు కెంపరరీగా వారికీ కొంత సంతోషం కలిగిందన్నమాట.

ఒక తోడేలు మరొక తోడేల్ని పరిశీలనగా చూసినట్టుగా చిట్టిబాబు ఆ మేజిస్ట్రేట్‌గార్ని చూస్తూండగా ఒక పోలీసు లోనికివచ్చి బెంచికి సలాం కొట్టి గుమాస్తాకి కాయితం ఇచ్చేడు. ఆ కాయితం బెంచి మీదకి వెళ్ళింది! మేజిస్ట్రేటుగారి పరిశీలనలో పడింది.

మేజిస్ట్రేటుగారు చిరునవ్వునవ్వేరు. ఆ చిరునవ్వు చూసి, వారు మంచి మూడ్‌లో ఉన్నారను కున్నాడు చిట్టిబాబు. అక్కడే అతను పప్పులో కాలు వేసేడు. పులి తన పిల్లల్నిచూసి దయగా నవ్వొచ్చు; తన చేతికి చిక్కబోయే మేకని తల్చుకొని క్రూరంగానూ నవ్వొచ్చు.

"బ్రింగ్ ది ఫెలో!" అని ఆర్డరు జారీ చేసేరు మేజిస్ట్రేటుగారు.

గంగరాజుని ఓ జవానులోనికి తీసుకు వచ్చేడు.

బోను మధ్య నిల్చున్నాడు గంగరాజు. ఆ సమయంలో అతడు మురికిగా ఉన్నప్పటికీ కడగని కంచు విగ్రహంలా గంభీరంగా ఉన్నాడు.

చిట్టిబాబులేచి నిలబడి జామీను పిటీషను కోర్టు వారికి ఇవ్వబోయేడు. కోర్టువారు కర్టుగా "వెయిట్" అన్నారు.

కోర్టువారు గంగరాజుని - తలెత్తకుండా, కళ్ళుమాత్రం ఎత్తిచూసి, చిరునవ్వునవ్వి, పదిహేను రోజులపాటు గంగరాజు జెయిల్లో ఉండవలసినదిగా రిమాండు ఆర్డరు పరపర రాసి పారేసేరు. రాసి పారేసి, తలెత్తి చూసి.

"నీ పేరేఁమిటి?" అని ప్రశ్నించేరు.

గంగరాజు దగ్గేడు. దగ్గి, మౌనంగా నిలబడ్డాడు.

"మాటల్రావా?" అని కోర్టువారు ప్రశ్నించేరు.

గంగరాజుకి ఏమీ బోధపడలేదు. కోర్టువారు ప్లీడర్ని ఏదో అడుగుతున్నారను కున్నాడతను,

"చెవుఁడా?" అని ప్రశ్నించేరు మేజిస్ట్రేటుగారి గుమాస్తాగారు.

"చేవుఁడా లేక తలబిరుసా?" అని క్యూరియస్‌గా అడిగేరు. మేజిస్ట్రేటుగారు.

తన ప్లీడరు చచ్చు ప్లీడరు కాబోలనుకున్నాడు గంగరాజు. లేకపోతే ఆ బాబుని ఆ మేజిస్ట్రేటుబాబు అలా ఇనసాల్టు చేస్తున్నాడేం?" అనుకున్నాడు.

చిట్టిబాబు చిరాకు పడ్డాడు. బండి సాఫుగా నడవక తప్పుగేరు మీద నడుస్తున్నదని పించిందతనికి. "నీ పేరు ఏఁవిఁటని మేజిస్ట్రేటుగారు అడుగుతున్నారు. బోధపడ్డుకున్నావా?" అని బోధపరుస్తూ గంగరాజుని ప్రశ్నించేడతను.

మేజిస్ట్రేటుగారు స్వయంగా తననే ప్రశ్నిస్తున్నారనే సరికి గంగ

రాజు, వెంటనే, అతి బీదగా ముఖం పెట్టి, తన పేరులో ఎంతో అమాయకత్వమూ, ఎంతో దీనత్వమూ ఉన్నట్టు "నా పేరు గంగరాజండీ బాబూ!" అని కోర్టువారికి తెలియజేసేడు.

మేజిస్ట్రేటుగారు ఊరుకోరు. మళ్ళీ అడుగుతారు.

"నీకేంపని?" అని మళ్ళీ అడిగేరు?

"పాలమ్మికు బతుకుతున్నాను బాబూ!" అని అతి దీనంగా జవాబు చెప్పేడు గంగరాజు.

"మరైతే, ఇంక చెప్పేదేఁ ఉంది?!" అన్నారు మేజిస్ట్రేటుగారు, సగం నవ్వు నవ్వుతూను. (అంత పెద్ద నోరుతో పూర్తినవ్వు నవ్వితే బావుండదని ఆయన లౌక్యంగా సగం నవ్వే నవ్వుతారు.)

మేజిస్ట్రేటుగారి రిమార్కుకి ఏం జవాబు చెప్పాలో తెలియక గంగరాజు 'ఖిన్నుడై మిన్నకుండెను.'

మేజిస్ట్రేటుగారి పరిహాసానికి మాత్రం అవధులుండవు.

"పాల వ్యాపారంకదా నీది! ఎన్ని పాలకి ఎన్ని నీళ్ళు కలుపుతావో చెప్పు!" అని అడిగేరు మేజిస్ట్రేటుగారు. వారి పరిహాసానికి, చిట్టిబాబు మినహాయించి మిగతా ప్లీడర్లంతా విరగబడి నవ్వేరు.

ఈ పరిహాసపు ప్రశ్నకి నవ్వే సమాధానం అనుకొని గంగరాజు కూడా కొంచెం కొంచెంగా నవ్వేడు.

దాన్తో మేజిస్ట్రేటుగారికి కోపం వచ్చింది. ఆయన చిన్నప్పుడు ఎక్కడో ఎవర్నో చూసేరు, కోపం వచ్చినప్పుడు అడుగు పెదవిని పై పంటితో నొక్కడం, ఆనాటి ఆ ఎవరినోగాని ఆవిధంగా పెదవి నొక్కడం అందంగా ఉండి ఉండవచ్చు, అందంగా ఉన్నదని మేజిస్ట్రేట్ గారికీ తన చిన్నతనంలో తోచి ఉండవచ్చు. అలా చెయ్యడం తనకు కూడా అందంగా ఉంటుందని ఆయన అనుకొంటూ ఉంటారు. అందుచేత, ఆయన తన అడుగు పెదవిని పై పంటితో నొక్కి, చిట్టిబాబువైపుచూసి

"వాడు మీ క్లయింటా?" అని ప్రశ్నించేరు.

చిట్టిబాబు కోపంవస్తే పెదవి నొక్కడు. చిరునవ్వు నవ్వుతాడు. ఆ విధంగా అతను మనోహరంగా నవ్వి.

"ఎస్, యువరానర్ !" అన్నాడు.

"అయితే, చూడండి" అన్నారు మేజిస్ట్రేటు (గారు)

ఆ ప్రకారం చూసేడు చిట్టిబాబు.

"మీవాణ్ని...." అని ఆగేరు మేజిస్ట్రేటు.

"ఎస్" అన్నాడు చిట్టిబాబు.

"దయచేసి........"

"ఎస్"

"నవ్వొద్దని చెప్పండి. నవ్వినందుకు వెయ్యొచ్చు మీవాడికి నాలుగు నెల్లు జెయిలు !" అని చమత్కారంగా ముగించి మిగతా లాయర్ల వైపు గోముగా చూసేరు మేజిస్ట్రేటు (గారు)

క్యూ అందుకొని గొల్లుమని నవ్వేరు ప్లీడర్లంతాను. నవ్వువల్ల తగుమాత్రపు సంతుష్టి కలిగింది మేజిస్ట్రేటుగార్కి. ఆయన రిమాండు రిపోర్టుమీద "పదిహేను దినముల రిమాండు ఆర్డరు" పరపరలాడించి కాగితం గుమాస్తాచేతికిచ్చి. గంగరాజుని తీసుకుపొమ్మని పోలీసువారికి హుకుం జారీచేసేరు. "టేక్ హిమ్ ఎవే !" అన్నారాయన. ఎబ్రాసివాణ్ని చూసి ముఖం పక్కకు తిప్పుకున్నట్టు ఆయన పక్క ముఖం పెట్టు కున్నారు. ఎవరో జమీన్దారుగారు ఎవర్నోచూసి అసహ్యించుకున్నప్పుడు అలా ముఖం పెట్టడం మేజిస్ట్రేటుగారు తన చిన్నతనంలో చూసేరు. అది వారికి ఒరవడి అయింది.

కోర్టుహాల్లోంచి ముద్దాయిని తీసుకువెళ్ళి కేసు దర్యాప్తు పోలీసు వారు ముగించేందుకు వీలుగా అతణ్ని పదిహేను రోజులపాటు జెయిల్లో ఉంచేందుకు ఆఫీసులో వారంటు రాయించుకు రమ్మని కోర్టుగుమస్తా పోలీసు జవాన్లకు చెప్పినమీదట వారు గంగరాజుని కోర్టుహాల్లోంచి కోర్టు వారి ఆఫీసుకు దీసుకువెళ్ళేరు. ఆ తరవాత,

చిట్టిబాబు దగ్గేడు.

అతనెందుకు దగ్గేడూ అంటే, మేజిస్ట్రేటుగారు తనవైపు చూడ్డం కోసం దగ్గేడు.

అతనెందుకు దగ్గేడు మేజిస్ట్రేటుగారికి తెలుసు. తెలుసు కాబట్టే వారు అతనివైపు చూడలేదు.

చిట్టిబాబు మరోసారి దగ్గి : జామీను పిటీషను పట్టుకొని మూడు అడుగులు ముందుకి వేసి మేజిస్ట్రేటుగారికి దగ్గరగావెళ్ళి అక్కడఉండే కట్రజాలుమీద ఓ చెయ్యి వేసేడు.

మేజిస్ట్రేట్లకు అనేకానేక కారణాలవల్ల కోపా లొస్తుంటాయి. నాయుడు ప్లీడర్లని చూస్తే కొంతమందికి కోపం వస్తుంది. మరికొంత మందికి పంతులు ప్లీడర్లంటే పరమకోపం ఉంటుంది. కమ్మవారంటే గిట్టదు కొంతమందికి. ఎవరినైనా సహించగలరు కాని రెడ్లని మాత్రం సహించలేరు మరికొంతమంది. మురికిబట్టలు వేసుకున్నవారైనా సరే వార్ని చూసి మండిపడతారు కొంతమంది. ఆవలమనిషి ఏమాత్రం షోగ్గా ఉన్నా వాడికి ఉరిశిక్ష వేసేయగలరు కొంత కొంతమంది. కోర్టుహాల్లో ఎవరైనా తుమ్మితేచాలు కొంతమంది మేజిస్ట్రేట్లు పళ్ళు పటపట కొరుకు తారు. కొంతమంది మేజిస్ట్రేట్లకీ పోలీసులంటే పరమకోపం ఉంటుంది కాని పరమభయం ఉంటుంది కాని కొంచెం చిరుకోపం మాత్రం మిగిలి పోతుంది. కొంతమందికి పోలీసులే పరమ ఆప్తులు వారికి ప్లీడర్లే సహజ శత్రువులు. ఇలాగ మేజిస్ట్రేట్ల కోపాలకు రకరకాల కారణాలుంటాయి.

ఈ మేజిస్ట్రేటుగారికి రకరకాల కారణాలవల్ల రకరకాల కోపం కలుగుతూంటుంది. తను తప్ప మరెవరైనా షోగ్గా ఉండడం ఆయన కోపాని కొక కారణం. చిట్టిబాబు షోగ్గా ఉంటాడు. నవ్వే మనుష్యు లంటే మేజిస్ట్రేటుగారికి కోపం వస్తుంది. చిట్టిబాబు నవ్వేడు. ధుమ ధుమ లాడే మనుష్యుల్ని చూస్తే మేజిస్ట్రేటుగారికి కోప వస్తుంది. చిట్టి బాబు నవ్వు నవ్వేక ఒక్క క్షణం ధుమధుమలాడ్డంకూడా ఆడేడు. కట్ర

జాలుమీద చెయ్యివేసినవార్ని చూస్తే మేజిస్ట్రేటుగారికి ఉగ్రకోపం వస్తుంది. ఆ కర్రజాలుమీద చెయ్యివేసి నిల్చున్నాడు చిట్టిబాబు.

గురిపెట్టిన తుపాకీ పేలేముందు పావుక్షణం ఆగి చూసినట్టు ఆ చిట్టిబాబు చెయ్యిమీద పావుక్షణం చూపు నిలిపేరు మేజిస్ట్రేటుగారు. ఆ తరువాత పేలేరు.

పేలడంలోనూ ఇలాగా అలాగాకాకాదు. "ఆయన సైజుకి పిస్తోలంతే ఉంటారుకాని పేలడంమాత్రం ఫిరంగిలా పేలేరు. ఆయన అరిచిన కసురుకి చిట్టిబాబు (మానసింగా) ముక్కముక్కలై పోయేడు. మనిషన్నవాణ్ని మనిషైన వాడెవడైనాసరే అంత నీచంగా అవమానించగలడని అతను అనుకోలేదు. ఒక్కొక్కప్పుడు అటువంటి సమయాలలో అతనికి తన పాత భావాలు జ్ఞప్తికివచ్చి క్షణికంగా "అభ్యుదయవాది"గా మారుతూ ఉంటాడు. "ఛీ! మనం సహించకూడదు. ఇటువంటి అన్యాయాన్ని మనం సహించకూడదు" అని క్షణకాలం అతను అనుకొంటాడు. అలా అనుకోడంతో తను ఎంతో మంచివాణ్నయేనని అతను తలచుకొని అరక్షణపు రివల్యూషనరీగా నిలబడి ఎంతో ఉద్రేకం చెందిపోయి ఎంతగానో ఆనందించేస్తాడు. ఆ అరక్షణంలో అతను తన పోలీసు స్నేహాన్నీ తన దుర్మార్గాన్ని, తన దొంగ బుద్ధినీ అన్నింటినీ మర్చిపోయి తను అలనాటి విప్లవ వాదిననే ఊహించుకుంటాడు, ఆ అరక్షణపు భావనలతో అతని బాధ్యత తీరిపోతుంది. దానితో తన పాపాలకు పరిహారం అయిందని కూడా అతను అనుకుంటాడు.

ఈసారిమాత్రం చిట్టిబాబుకు తన పాత భావాలు జ్ఞప్తికి తెచ్చుకొని అరక్షణపు విప్లవ వాదిగా నిలబడ్డానికికూడా అవకాశం లేకపోయింది. శ్రాద్ధభోజనాల దగ్గర్నించి కుక్కనితగిలేసినట్టుగా మేజిస్ట్రేటుగారు అతన్ని కోర్టు హాలులోంచి తగిలేసారు.

మరొక పదినిమిషాలకి చిట్టిబాబు బార్‌రూంలో ముకుందబాబు ముందు నిలబడ్డాడు. వానలో తడిసిపోయిన కుక్కపిల్ల వరండా గట్టు

ఎక్కి నిలబడ్డట్టు నిలబడ్డాడతను. అంతటి పెనువాన ఎన్నడూ ఎరగదు, పాపం, ఆ కుక్క.

ముకుందుడి ప్రశ్న : "ఏం జరిగింది?"

చిట్టిబాబుది జవాబు : "బెయిలివ్వలేదు"

"పిటీషను కొట్టేసేడా?"

"లేదు."

"మరేం చేసేడు?"

"మనం జామీను పిటీషను పెట్టినట్టుగా పోలీసువారికి నోటీసు ఇమ్మన్నాడు"

"ఎప్పట్లో ఇమ్మన్నాడు?"

"సోఁవ్వాఁరం నాటికి"

"ఇవాళ ఏం వారం?"

"లక్ష్మీ వారం"

"అంటే, మధ్య మూడ్రోజులన్నమాట"

"ఆవును"

"అంత అలస్యంగా ఎందుకు వేసేడు వాయిదా?"

"బుర్రతిరుగుడు! అంచేత"

"బెయిలు పిటీషను నేను పెట్టినట్టుగానే చెప్పేవా?"

"మీరు పెట్టిన పిటీషనే నేను దాఖలు చేస్తున్నట్టుగా స్పష్టంగా చెప్పేను"

"అంటే ఏఁవన్నాడు?"

"ముకుందరావు దాఖల్చేసినా మూలనున్న ముసలమ్మ దాఖల్చేసినా తనకి ఒకటే నన్నాడు."

"అబ్బా?"

"అవున్సార్! కావలిస్తే ఎవర్నయినా అడగండి," అన్నాడు చిట్టిబాబు.

అడక్కుండానే అందరూ చెప్పేరు ముకుందుడికి. చిట్టిబాబుని మేజిస్ట్రేటుగారు కుక్కని తరిమినట్టుగా ఎలా తరిమేరో కూడా అక్షిదర్లంతా ముకుందుడికి విశదీకరించేరు. వాళ్ళంతా మేజిస్ట్రేటు గురించి "వాడు చాలా నాస్టీఫెలో!'' అన్నారే కాని చిట్టిబాబుని అలా వెంట తగలడం వాళ్ళకి సరదాగా హాస్యంగా తోచినట్టనిపించింది ముకుందుడికి. వాళ్ళు తనని కొంచెం వెటకారం చేస్తున్నట్టుగా కూడా అతనికి అనిపించింది.

ఓ ముసలి ప్లీడరు, (ముకుందుడితోబాటు ప్రాక్టీసు ప్రారంభించినప్పటికీ చింకి కోటుతో బెంచికోర్టులోనే ఉంటున్నవాడు) ముందుకొచ్చి.

"ఓయ్ ముకుందూ! ఇందాట్లా నీ జూనియర్ని మేజిస్ట్రేటు ఎలా పరిగెట్టించాడో తెలుసా? భోగట్టా విన్నావా?'' అని నెమ్మదిగా జాలిగా ప్రశ్నించేడు.

ఆ ప్లీడరుగారి జాలితో ముకుందుడికి కోపం రాజుకొంది. తన ప్రతిష్టకి దెబ్బతగిలినట్టుగా అతను భావించుకున్నాడు. తన జూనియర్‌ని అవమానిస్తే తనని అవమానించినట్టేకదా. తనని అవమానించినప్పుడు తను ఊరుకొంటే తన గౌరవానికి దెబ్బేకదా. తను దెబ్బతినేక్కూడా ఊరుకుంటే అది తనకి లొసుగేకదా. అటువంటి లొసుగుతో ఉండిపోతే తను కూడా ఓ బేడాపరక ప్లీడర్ కిందే లెక్కకదా. అలా ఎవరైనా తనని లెక్కవేస్తే అది ముందు ముందుకి తన ప్రాక్టీసుకి దెబ్బేకదా.

ప్రాక్టీసూ అంటే అది రూపాయణా పైసలేకదా,

అందుచేత ముకుందుబాబు బార్ రూమ్‌లో నిలబడి, తాగినవాళ్ళా, తెయ్యిమని గెంతేడు. గెంతి, మేజిస్ట్రేటు కోర్టుకి పయన మయేడు.

సిల్కు చీరకి మూడువందలు ఖర్చవగా, చింకి చీరకి ఆరువందలు ఖర్చయిన వైనం - పాగా పెడితే దేవేంద్రుళ్ళాగా, పాగాతీస్తే దేవగురువు లాగా ఉండేటి ముకుందుల వారిని మహా కోప మావహించినపుడు వారేమగుదురు ? - న్యాయాధి కారుల పిలకలు న్యాయవాదులు తెంపగలరా ? - మర్రిచెట్టు కదిలితే ఊడలుకూడా కదలవా ! - చిట్టిబాబు సంగతి సూర్య చంద్రుడికి తెలియదా?!- పెద్దల మనుగడకే ముప్పొచ్చినప్పుడు వారి వారి జాతి భేదంబులు వారి ఐక్యతను అడ్డునా ? ! -

# 18

విన్న వారంతా నివ్వెరపోయేరు. లేదా, నివ్వెర పోయినట్టు నటించేరు.

'మేస్త్రీటు కోర్టుకి' ముకుందరావుగారంతటి మనిషి పాగా పెట్టుకుని పయనమయి వెళ్తే....

"అః ఎళ్తే? ఏటయింది?"

"పోపోస్ పొమ్మన్నాట్ట మేస్త్రీటు!"

"అఁ!!"

"అవును, పొమ్మన్నాట్ట!"

"ఎవడా మేస్త్రీటు."

"దాకనోరు మేస్త్రీటు."

"అంటే, ఎర్ర తేల్లా ఉంటాడు, ఆడేనా?"

"ఆడే"

"ఆడు సెద్దదురుమార్గుడు. మా యప్ప ఓ చుట్టు సారాకేసుకి—పెద్దకేసుగాదు: నెలమామూలు కేసు. - ఆ కేసుకి సచ్చగా సిలుకోక కట్టుకెల్లిందన్జెప్పి ఎగాదిగా చూసి నీ పేరేటి? అని అడిగి; 'కనకమ్మా! నీకు జెయిల్లో తెల్లకోక యిస్తారు. అది కట్టుకుందువుగాని, ఎల్లు!' అన్జెప్పి దానికి ఆరు వోరాలు గుచ్చీసేడు!"

"అఁ! !"

"తల్లి తోడు!"

"అయితే మీ యప్ప...."

"జిల్లా జడిజీకి అప్పీలు కాయితం పెట్టింది."

"ఎడితే ఏటయింది?"

"ఎడితే ఏటంయిదా? మూడొందలు కర్చయింది!"

"ఏం జెయిలు తిరగలేదా?"

"తిరగలేదే! సిలుకోక కట్టుకెళ్తే ఆరోరాలు పడ్డదన్జెప్పి, జడిజీ కోర్టుకి తోలీసినప్పుడు ఏటిజేసేవూఁ అంటే...."

"ఏం జేసేరు?"

"సింకికోక కట్టించి తోలేసేం."

"తోలేస్తే ఏటయింది?"

"ఆడుకూడా ఎగాదిగా సూసేడు."

"సూసి?"

"పాస్ పీస్ అన్నాడు."

"అంటే?"

"ఆరోరాలే కాయం అన్నాడు."

"అడి కదేం పోయీకాలం?"

"ఏం బీద్దానా అవుపించడానికా ఏసం ఏసేవు?! జెయిల్లో ఇంకో ఏసం ఏద్దువుగాన్లె, ఎల్లు: అన్నాట్ట ఆ జడిజీ! మా పీదరు జెప్పేడు।"

"అయితే, మీ యప్ప ఇంకా కొట్లోనే ఉందా!"

"లేదే। ఐదిరాబాదుకి అపీలు కాయితంపెట్టిబెయిలు మీద ఇడిపించుకున్నాం."

"అబ్బో! దానికైతే శానా కర్సవుద్దే!"

"శానా కర్సని మెల్లిగంటావా?। ఇప్పటికి ఆరొందలూడింది।"

"అరొందలే।"

"తల్లి తోడు।"

"అయితే, శిలుక్కోక్కి మూడొందలూడింది! సింకికోక్కి ఆరొందలూడింది। అంతేనా?

"ఇప్పటికదీ దెబ్బ! ముందుకి ఇంకెంత తగులుద్దో?"

"అయితే, దాకనోటి మేస్త్రీటు ఘనుడన్నమాటే।"

"గనుడే। పోలీసోణ్ని మించుతాడు."

"ఎంతటి ఘనుడో చూద్దాం లేరా బ్రదరూ ! ఒచ్చేడివాడు ఫల్గును డన్నట్టు తగులుకొనీ వాడెవడో తెలుసా ! - మా ముకుందుడు ! ఆ బాబు తగులుకున్నాడంటే ఇలాగ్గా అలాగ్గా కాదు. పులికి ఎనెక్కాళ్ళి తోక తెగ్గొట్టించీగల్డు ! ముందుకొచ్చి కోరలు పీకించీగల్డు; బుర్ర గీయించి బోడిముండన్జేయిస్సి పమ్మించీగల్డు ! తల్చుకుంటే ఏపనైనా చేయించీ గల్డు ! తక్కువోడ్వి డనుకొంటన్నావా ? కాడు ! మెత్తగుంటాడేకాని మొఖ్మల్‌పులి ! పాగా ఎట్టి కోర్టుకెళ్ళేడంటే దేవేంద్రుడు ! పాగా తీసి సలా చెప్పేడంటే దేవగురువు ! మరింక, తీరుపు తీసేడా - అది ఒజ్జిరాయుధ(మే ! !"

అంటూ చుట్టకొన కొరికి ఉమ్మివేసి, ముందుకి నడిచి, తోడు తెచ్చినవాణ్ని బిల్లు చెల్లించమనిచెప్పి, కోర్టు కాంటీన్‌లోంచి కోర్టుబిల్డింగు లోనే ఉన్న న్యాయవాదుల సఘంవారి హాలువైపు నడిచేడు మందుల భీముడు.

మధ్యాహ్నం రెండుగంట లయింది. జడ్జీలూ, మునసబులూ, మేజిస్ట్రేట్లూ అంతా కూడా 'లంచ్'కి దిగినట్టున్నారు - ప్లీడర్లు చాలా మంది కాంటీన్‌వైపు - ఏమేమో తొందర తొందరగా మాట్లాడుకొంటూ వస్తున్నారు. మరి కొంతమంది కోర్టుహాల్సునుంచి ప్లీడర్ల సంఘం హాల్ వైపు వెళ్తున్నారు.

న్యాయవాదుల సంఘంవారి హాల్‌ని 'బా(రూం' (బార్‌రూం) అంటారు. అది కోర్టు బిల్డింగ్‌కి దూరంగా కోర్టు ఆవరణలోని ఓ వారకి ఓ చింతచెట్టుకింద - చతికిలబడి కూర్చున్నట్టుగా - ఉంది. మధ్య పెద్ద హాల్ ఉంది. చుట్టూ వరండా ఉంది, వెనకపక్క వరండాలో మాత్రం ఆ కొసనీ ఈ కొసనీ రెండు గదులు ఏర్పాటు చేసేరు. అదికట్టి చాలా కాలం అయింది. గోడలు పాతవైనా వాటికి వెల్ల వేసేరు. పైన పెంకులు వర్షాలకి తడిసి —— చింతనీడనే ఉండిపోయి— ఎండకి ఎండకపోవడంచేత, నాచుతో నిండిపోయి ఉన్నాయి. హాల్లోకివెళ్తే ఎండాకాలంలోకూడాకొంచెం చిరుచలి వేస్తుంది. అక్కడ బల్లలూ, బీరువాలూ, పుస్తకాలూ, కుర్చీలూ, నల్లకోట్లూ, గడుసుముఖాలూ చూస్తే కొత్తవాళ్ళకి ఆ చిరుచలి హెచ్చు తుందే కాని తగ్గదు. భూత వైద్యుల భవనంలోకి వెళ్తే భయం కలిగినట్టు చలితోపాటు వారికి భయంకూడా వేస్తుంది. ఆ పుస్తకాలవైపు చూస్తే ఇంకా భయం వేస్తుంది. ఏ తీర్పు ఎప్పుడు పామై కరుచునో ఎవరు చెప్పగలరు!

మందుల భీముడికి మాత్రం 'బా(రూం' భయాలులేవు. అతను చాలా ఈజీగా స్వంత ఇంటికి వెళ్తున్న వాళ్ళా బా(రూంలోకి వెళ్ళేడు. కుడిచేతి వేళ్ళ సందులో చుట్ట ఇరికించి పట్టుకొని ఆ చేత్తోనే తెలిసిన లాయర్లందరికీ పలకరింపు సలాములు పారేసేడు. కొంతమంది లాయర్లకిమాత్రం

అతను అటువంటి సలాములు కొట్టలేదు. వాళ్ళే అతనికి అటువంటి సలాములు పెట్టవలసి ఉంది.

సూర్యచంద్రరావుని 'చంద్రరావ్' అని అంటారు. అది ఈజీగా ఉంటుంది. అతణ్ని 'చుక్కబాబు' అనికూడా అంటారు. అతను చుక్క వేసుకుంటాడు. "బ్రాతెల్ హౌసెస్" వారందరికి అతణ్ని బాగా తెలుసు. వాటినే "కంపెనీలు" అని కూడా అంటారు. ఆ కంపెనీలకి ప్రొప్రయిటర్లుంటారు. ఆ ప్రొప్రయిటర్ల చేతికింద చెడిపోయిన (చెడగొట్టబడిన) ఆడవాళ్ళుంటారు. నామకాగా అప్పుడప్పుడు వాళ్ళమీద కేసులు పెట్టాలి కాబట్టి వారిని పోలీసులు అప్పుడప్పుడు "తోలుకుపోయి" కేసులు పెడుతూంటారు. ఆవుల్ని మానవులు పిండినట్టే ఆ ఆడవాళ్ళ జీవాన్ని అంతా పిండుతారు కాబట్టి వాళ్ళనికూడా చాలామంది "ఆవులు" అని రిఫర్ చేస్తూంటారు. వాళ్ళ కేసులు సూర్యచంద్రరావుగారు తరుచు పడుతూంటారు కాబట్టి వారికి ఆవుల ప్లీడరనే బిరుదుకూడా వచ్చింది. అతను మగవారి కేసుల్లోకూడా తరుచు కనిపిస్తూంటాడు కాబట్టి "ఎగస్పార్టీ" మనుష్యులు అతణ్ని "ముండబత్తేలబాబు" అని తిట్టుకొంటూ ఉంటారు. అతను యూనివర్సిటీలో ఉన్నప్పుడు ఓసారి ఏదో వూరికి అంతా కలిసి ఎక్స్కర్షన్‌కి వెళ్ళినప్పుడు, అక్కడ ఆడ స్టూడెంట్ల చీరలన్నీ అతను దాచేసి వారిని చాలా అల్లరిపెట్టేడుట. అందు గురించి అతణ్ని కొంతమంది కుర్ర ప్లీడర్లూ, కొంతమంది ముసలి ప్లీడర్లూకూడా మెచ్చుకొంటూంటారు. చిగురుబోడుల చీరలు అతను అపహరించినందువల్ల అతనికి నందగోపాలుడనే నామాంతరంకూడా ఉంది. అతను నల్లగా పొడవుగా ఉంటాడు. కత్తెరమార్కు సిగరెట్టే కాలుస్తాడు. అవతలవాడి దగ్గరనించి గోల్డుఫ్లేక్ అయితేనే తీసుకుంటాడు. కల్లూ సారా తప్పించి ఏదయినా తాగుతాడు. ఆడదయి, తల్లి పిల్ల చెల్లి వరస కాకపోతే, ఎవర్నయినా వాంఛిస్తాడు. మనిషన్నవాడికి కరెన్సీనోటుతప్ప కావలసిన బంధువు లెవరూ లోకంలో లేరంటాడు. "డబ్బు సంపాదించాలంటే మనిషికి ఉండవలసిన లక్షణాలు ఏవి ?" అని ప్రశ్నిస్తే, "ఉండవలసిన లక్షణాలు ఏవీ అని అడక్కండి ! ఉండకూడని లక్షణాలు మాత్రం—సిగ్గూ లజ్జా !" అని అతను సమాధానం

చెబుతాడు. అతనికి జాతిమత కులభేదాలంటే కిట్టవు. "అయిదు రూపాయల్నోటు మొగుళ్ళనిదిచ్చినా, ముగ్గురు మొగళ్ళదిచ్చినా, ముస్లింవర్జిన్ ఇచ్చినా, క్రిస్టియన్ మిస్ ఇచ్చినా, బ్రాహ్మిన్ బ్యూటీ ఇచ్చినా, దొంగిచ్చినా, దొరే ఇచ్చినా ఎవరిచ్చినా ఒకటే! దాని విలువ ఎక్కదు తగ్గదు" అంటాడతను. అతనికి పెళ్ళికాలేదు. అతను "ఎవర్నో ఉంచుకున్నాడని" గుసగుసలాడే వార్ని అతను మందలిస్తాడు. "నన్నే అది ఉంచుకొంది", అని సగర్వంగా చెప్పి, "మీకూ నాకూ తేడా ఏమిటో తెలుసా?" అని గుసగుస మనుష్యుల్ని గుచ్చినట్టుగా అడుగుతా డతను. వారు తెల్లబోతారు. "కేసొస్తె పిల్లలకే కాని తల్లికి నేను భరణం ఇవ్వను! మీరయితే తల్లికీ పిల్లలకీ కూడా ఇచ్చుకోవాల్రా బడుద్దాయిలూ" అంటాడతను. వాళ్ళు నవ్వుతారు. వాళ్ళ నతను కాంటీన్‌కి ఈడ్చుకుపోయి వాళ్ళచేత కాఫీ ఇప్పించుకుంటాడు. అతను ఒకప్పుడు బ్యూటిఫుల్‌గా డ్రెస్‌అయి వస్తాడు. మరొకప్పుడు గడ్డం గీసుకోకుండా కోర్టుడ్రెస్‌తో మూడు రోజుల్నించీ పడుకున్నవాణ్లా నలిగిన దుస్తుల్తో కంపు కొడుతూ వస్తాడు. ఏ వేషంలో వచ్చినా అతను డబ్బులు పిండడం మాత్రం మానడు. అతనొక రూలు ప్రకారం, వట్టిచేతుల్తో ఖాళీ జేబుల్తో కోర్టుకి వస్తాడు. కోర్టుకి వచ్చే ప్లీడర్లు శ్మశానానికి వెళ్ళే మనుష్యుల్లా ఉండా లంటాడతను. "ఏం పట్టికెళ్ళకూడదు!" కోర్టునించి దాదాపు ప్రతిరోజు కూడా అతను ఎంతో కొంత ఫీజు దండి పట్టుకు వెళ్ళకుండా ఉండడు. ఎప్పుడైనా ఏ రోజైనా కనగనప్పుడు కూడా అతను ఒట్టి చేతుల్తో ఇంటికి వెళ్ళడు. అటువంటప్పుడు అతను ఎవరిదగ్గరైనాసరే ఎంతో కొంత సొమ్ము అప్పుగా తీసుకొనివెళ్ళి ఆ అప్పు మరింక చస్తే తీర్చడు. ఓరోజున అతనికి కొత్తకేసులేవీ తగల్లేదు. పాత పార్టీలెవరూ ఆరోజున మాత్రం పిండబడలేదు. అప్పిచ్చే ప్లీడర్లెవరూ అతనికి చిక్కలేదు. చేజిక్కిన ఒకరిద్దరు ప్లీడరుగుమాస్తాలు అతణ్ని తప్పించుకొని పారిపోయేరు. కోర్టుగుమాస్తాలు అతనికి అప్పివ్వలేదు. సాయంకాలం అయిదయిపోయింది, జడ్జీలూ, మునసబులూ, మేజిస్ట్రేట్లూ అంతా కూడా తమ తమ బెంచీలు దిగిపోయేరు. అప్పుడతను ఒక్కక్షణం ఆలోచించి

టక్కుమని చిటికెవేసి, మునసబుగారి చాంబర్స్‌లోంచి పైకీ లోనికీ పైకీ తిరుగుతూన్న ముప్ఫయ్యేళ్ళ బంట్రోతుని "ఒరే సుబ్బా! ఇలారా!" అని పిల్చి యోగక్షేమాలడిగి, ఓ సిగరెట్టిచ్చి ఓ అయిదు రూపాయీలు అతని జేబులోంచి తీసుకొని వెళ్ళిపోయేడు. అందుకు ఆ సుబ్బడు చాలా పొంగిపోయి సూర్యచంద్రరావుని "నువ్వు" లోకిదించి, అతనికి స్నేహితుడయిపోయేడు. కోర్టు బంట్రోతుగా తన పలుకుబడి ఉపయోగించి అతనతనికి ఆ తరవాత చాలా కేసులుకూడా ఇప్పించేడు. సుబ్బడికి సూర్యచంద్రుడు తన పార్టీలచేత కన్నీలు ఎక్కువ ఇప్పించేడు కాని అయిదు రూపాయీలుమాత్రం తిరిగి ఇవ్వలేదు. సూర్యచంద్రుడు తను ఇతరుల కంటె ఎక్కువ్వాణ్నని ఎన్నడూ అనుకోడు. తను దొంగనని అతనికి పూర్తిగా తెలుసు. అవతలవార్ని అతను "వీడు మంచివాడా, చెడ్డవాడా? ఎక్కువ్వాడా, తక్కువ్వాడా?" అని ఎన్నడూ అంచనా కట్టడానికి ప్రయత్నించడు. అవతలవారంతాకూడా దొంగలే అనే ఖచ్చితమైన నమ్మకం అతనికుంది. అందుచేత గవర్నర్ గఫర్‌ఖాన్‌తో అయినాసరే, ముఖ్యమంత్రి మాధవదేవుడితో అయినాసరే నిబ్బరంగా "నేనుకూడా మీతో సమానమైన దొంగనే" అని సగర్వంగా మాట్లాడగలడు. అదేవిధంగా కోర్టుబంట్రోతునికూడా తనతో సమానుడిగా చూసుకోగలడు. అతనికి పోలీసు జవాన్లంతా మిత్రులు. కోర్టు ప్యూన్లంతా భక్తులు. ఏ ఆఫీసర్‌కి ఏ లొసుగులున్నాయో ఉంటాయో ఉండగలవో అతను మూణ్నిమషాల్లో తెలుసుకోగలడు, ఊహించగలడు. అతనికి నలభయ్యేళ్ళుంటాయి. నల్లని ముఖంపైన తెల్లని జుట్టుంటుంది. మనిషి ఏ డ్రెస్‌లో ఉన్నా చాలా అట్టహాసంగా ఉంటాడు. అట్టహాసం చేస్తాడు. అతను జూనియర్ స్టేజి దాటేడు; సీనియర్‌గా ముదురుతున్నాడు.

మందుల భీముడు బాత్రూంలోకి వెళ్ళినప్పుడు సూర్యచంద్రుడు ఓ బీర్వాకి చిట్టిబాబుని నొక్కిపెట్టి ఏమేమో మాట్లాడుతున్నాడు.

"పోనీ, మీ సీనియరేం చేస్తాడో చెప్పకపోతే పోనీ; కాని, నువ్వేం చేస్తావు? మీ సీనియర్‌గాడికోసం నువ్వుకూడా జుడీషల్ ఆఫీసరుతో తగువు తెచ్చుకుంటావా?"

అని చిట్టిబాబుని అడుగుతున్నాడు సూర్యచంద్రుడు.

ఆ ప్రశ్నకి జవాబు చెప్పడం చిట్టిబాబుకి ఇష్టంలేకుండా ఉంది. మందుల భీముణ్ని చూస్తే అతనికి ఇష్టంలేదు. కాని ఆ సమయంలో అతనక్కడికి రావడంతో అతనికి సుళువు దొరికింది.

"ఏఁవండోయ్, కౌన్సిలర్‌గారూ, ఏఁవిఁలా ఒచ్చేరు?" అంటూ మందుల భీముణ్ని పలకరించే మిషతో సూర్యచంద్రుణ్ని తప్పించుకున్నాడు చిట్టిబాబు.

మందుల భీముడు ఆగి, చుట్టపొగ ఒదిలి, చిట్టిబాబునిచూసి, "శిసువా! ఇక్కడే ఉన్నావా? మరైతే మనోడెక్కడ?" అని అడిగేడు.

చిట్టిబాబు జవాబు చెప్పేలోపున సూర్యచంద్రుడు, పెద్దలకి చిన్నలు వంగి నమస్కరించినట్టు నమస్కరించి వెటకారంగా,

"దండాలండో భీఁవుఁడు బాబ్గోరు!" అని అలా పదిసెకండ్లపాటు వంగే నిల్చున్నాడు.

"అదికాదుగాని, ఆవుల ప్లీడ్రూ! నీ శేత ఒంగి దండంపెట్టించుకుందికి నువ్వుంచుకన్న ముండననుకున్నావటయ్యా?!" అని మందుల భీముడు సూరచంద్రుడిమీద ఛలోక్తి విసిరేడు.

"అయితే, మనవాడు వాళ్ళదగ్గిర దండంపెట్టి నిల్చోవలసిందేనన్న మాట?" అని చిట్టిబాబు సూర్యచంద్రుడి మీద ఓ విసురు విసిరేడు.

సూర్యచంద్రుడు ఊరుకోలేదు, దండంపెట్టిన రెండుచేతులూ దోసిలిగా మార్చి "పడేవయ్యో చుట్ట! ఊరోళ్ళసొమ్మేకదూ!" అని మందుల భీముణ్ని కసిరి ఓ చుట్ట పుచ్చుకొని, అంటిస్తూ, "ఏఁవి అట్టా అంటావు చిట్టిబాబూ? ముందు దండంపెడతానా! నీ క్లయంట్లు నీకూ, నువ్వు ముకుందుడికీ, వాడు జడ్జికి దండాలు పెడతారు చూసేవా?! బజారు భాఁవఁకి దండం పెట్టడం అంతకంటె నయవేఁలేరా! అదైతే రోగఁవిచ్చి పంపిస్తే పంపిస్తుంది తప్ప ఇంకేం చెయ్యదు." అన్నాడు.

"మరైతే, మనోళ్ళేంటిస్తారు?" అని సరదాగా అడిగేడు మందుల భీముడు.

ఎడమ అరచేతిలో కుడిచేతి చూపుడు వేలు అటూ ఇటూ రాస్తూ, "తిరుక్షవరం చేయిస్సి, చిప్ప చేతికిస్తారు?" అని సూర్యచంద్రుడు మందుల భీముడికి - చిట్టిబాబూ ముకుందుడూ వగైరాలు తనకి నమస్కారించిన వాళ్ళకి ఏమివ్వగలడో తెలియ జేసేడు.

మందుల భీముడు బారుగానవ్వి, సూర్యచంద్రుడి వీపుతట్టి, "నువ్వు గట్టోడివి గురూ! నే నొప్పుకొన్నాను. ఈ చిట్టిబాబు కొస్చెన్లో నువ్వన్న మాట రైటే!" అని గట్టిగా చెప్పి, సడన్‌గా గొంతుక తగ్గించి, కాని, మా ముకుందుబాబు గురించి కూడా అలా గట్టిగా ఇసిరెయ్యకయ్యా బాబూ! మన పెద్దల మరియాదా మనమే తీసేస్తే మన మరియాదా మనకంటే శిన్నోడు తీసేడా? నువ్వుమాత్తరం వేం జేస్తున్నావు? అతడికంటే గనుడు ఆసంట మల్లన్నా అన్నట్టు నువ్వు మాత్తరం తక్కువోడివా?! జాంతోట సిట్టెమ్మని టూటౌనోళ్ళు మూయిస్సినప్పుడు నువ్వేం జేసేవో నాకు తెలీదనుకున్నావా?!!

అని ఇహ్హిహ్హి అంటూ ఎంతో సరదాగా నవ్వేడు మందుల భీముడు.

సూర్యచంద్రుడు ఆ చిట్టెమ్మ విషయంలో ఏ దొంగపని చేసేడో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది చిట్టిబాబుకి.

"చెప్పండి కౌన్సిలర్‌గారూ! చిట్టెమ్మ? విషయంలో మనవాడు ఏం చేసేడూ చెబ్దురూ!" అని ఫక ఫక నవ్వుతూ అడిగేడు చిట్టిబాబు.

''కొత్తవలస జూటుమిల్లు రయిటింగ్ కేసులో నువ్వేం చేసేవో చిట్టెమ్మ కేసులో నేనూ అదే చేసేన్రా నా చిట్టితండ్రీ!'' అని చిట్టిబాబు గడ్డం నిమిరి చెప్పేడు సూర్యచంద్రుడు.

'అటువంటి విషయాలు అలా మాట్లాడుకో కూడదని హెచ్చరించినట్టుగా' మందులభీముడు చూపుడు వేలిని నోటిమీద పెట్టుకొని, "ఇష్! ఇష్!" అని ఇషించేడు.

"సరేలెండి కౌన్సిలర్‌గారూ, మీరు చెప్పినట్టే నడుచుకుంటాంలెండి, కాని, మీరెందుకిలా ఒచ్చేరు?" అని టాఫిక్ మారుస్తూ అడిగేడు చిట్టిబాబు.

"ఆ మాటమీద, గంగరాజుగాడికి బెయిల్లేకండా కేసు నువ్వెలా తగలెట్టేవో తెలుసుకొంది కొచ్చుంటాడు మనవాడు ఏం భీమా? అంతేనా?'' అన్నాడు సూర్యచంద్రుడు.

చిట్టిబాబుకి తెగ కోపం వచ్చింది కాని అలవాటు ప్రకారం నోరు బాగా విప్పి కళ్లబాగా తెరచి అతనా కోపాన్ని ఓ నవ్వుతో కప్పేసు కున్నాడు.

"మరింక మీరు మాట్లాడుకోండి నే వెళ్ళొస్తాను," అన్నాడు సూర్య చంద్రుడు, తన మాట దెబ్బకి 'చిట్టిబాబుగాడు గిజగిజలాడే' దన్న సంగతి గ్రహించి సరదాగా నవ్వుతూ.

"బెయిలేం టయిందేం టయితే?'' అని కొంచెం సీరియస్‌గా అడి గేడు మందుల భీముడు.

"చెప్తాన్రండి, చాలా గ్రంథం ఉంది." అని అతని చేతి సందులో చెయ్యిదూర్చి లాగేడు చిట్టిబాబు.

"ముకుందుబాబేడి? అతగాడి గోసుట్టు అవుపడి ఒస్తానుండు," అని చిట్టిబాబుతో చెప్పి, వెళిపోతున్న సూర్యచంద్రరావుని కేకవేసి ఆపి, "ఓయ్, సెందర్రావ్, ఇయాళో రేపో నాకోసుట్టు అవుపించుమీ! శిన్ని షియిం మాటాడాలి నీతో," అన్నాడు మందుల భీముడు.

పదడుగుల దూరంలోనే నిలబడి.

"ఎదైనా బేరవాఁ?'' అని అడిగేడు సూర్యచంద్రుడు.

"బేరవేఁ" అని బదులు చెప్పేడు భీముడు.

"ఏఁవైనా పెగుల్తుందా!" అని మళ్ళీ అడిగేడు ప్లీడరు.

"సిల్లు ఎట్టేవంటే ఏ సెంబయినా కారుద్ది! మనం ఎట్టగలగాలి అంతే!"

అని సూర్యచంద్రుడు ప్రశ్నకి "చెంబూ చిల్లూ న్యాయం'' జవాబుగా తెలియజేసేడు మందుల భీముడు.

"ఖాళీ చెంబయితే కారేదేఁ ఉంది!" అని సిసకల్‌గా అన్నాడు సూర్యచంద్రుడు.

"దానికేఁ ఉంది? అప్పుడు చెంబే అమ్మేవొచ్చు" అని తన అభి ప్రాయంగా చెప్పేడు చిట్టిబాబు.

"చూసేవా సెంద్రరావు? ఈ పొట్టిబాబు పెద్దోడవుతాడంటాన్నేను. ఒప్పుకుంటావా?" అని నవ్వుతూ అడిగేడు మందులభీముడు.

"వాడు ఆఖరికి ముకుందుడికే పెద్ద చిల్లు పెట్టకపోతే నేను సూర్యచంద్రరావునికాను," అని చెప్పి వెళ్లేడు సూర్యచంద్రుడు,

"సూరెసెంద్రరావ్వీకావు, శెట్టెమ్మకి సిప్ప సేతికిచ్చినోడివీకావు!" అని కొంచెం నవ్వుతూ మెల్లిగా అని, "ఏంటి మరి పొట్టిగురూ! మన గంగరాజుగాడి బెయిలు గురించి ఏంటయిందయితే?" అని చిట్టిబాబుని అడిగేడు మందుల భీముడు.

మందుల భీముణ్ని వెనక వరండాలోకి తీసుకువెళ్ళి అక్కడ పెరట్లో చెట్టుకింద మరి నలుగురు సీనియర్ లాయర్లతో మాట్లాడు తూన్న ముకుందుణ్ని భీముడికీ చూపించేడు చిట్టిబాబు. సీరియస్‌గా మాట్లాడుతూన్న ముకుందుడు ఓ క్షణంసేపు భీముడువైపు చూసి భీముడు చేసిన సలాం అందుకొని, "అక్కడే ఉండు" అన్నట్టుగా సంజ్ఞ చేసేడు.

"ఇప్పుడు ఆ విషయవేఁ తర్జన భర్జన్లో ఉంది," అన్నాడు భీముడితో చిట్టిబాబు.

"అయితే, మళ్ళీ ఒద్దాం! అందాకా కాఫీ ఇప్పిద్దుగాని రా" అని చిట్టిబాబు చేతిసందులో చెయ్యిదూర్చి "కాపీ తాగి మళ్ళీ ఒస్తాను" అన్నట్లుగా ముకుందుడికి సంజ్ఞచేసి కాంటీన్‌కి దారితీసేడు మందుల భీముడు.

ముకుందుడు తర్జనభర్జన సాగిస్తూనే ఉన్నాడు.

ఆయన్తో మాట్లాడుతూన్న వారు నలుగురు సీనియర్ లాయర్లు అందులో ఒకాయన న్యాయవాదుల సంఘానికి చాలాకాలంనుంచీ ప్రెసిడెంటు.

ప్రెసిడెంట్‌గారికి డెబ్బయ్యేళ్ళుంటాయి. పల్చగా పొడవుగా కొంచెం గూనిగా ఉంటాడాయన. అతని చాయ చాలా స్వచ్ఛంగా ఉంటుంది. చిన్నప్పటి నించీ పళ్ళుతినీ, పాయసం తాగీ, దేవతార్చనచేసీ, తండ్రిమాట వినీ, భార్యనే నమ్మి, బంధువుల్ని అభిమానించీ, స్నేహితుల్ని గౌరవించీ, నౌకర్లని నవ్వించి, కారులో తిరిగీ, పెద్దల పరిచయం కలిగీ పెరిగినవాళ్లా ఉంటాడాయన. ఆయనకి పూర్వం ఎప్పుడో పెద్ద ప్రాక్టీసు ఉండేదట, ఇప్పుడు ఆయనకి ప్రాక్టీసు లేదు. ఆయన శాఖవాళ్ళు బార్లో చాలామందున్నారు. స్వకులాభిమానం ఉన్నప్పటికీ ఇతర శాఖలన్నా కులాలన్నా అతనికి ద్వేషంలేదు. వాళ్ళ శాఖవాళ్ళు రాష్ట్రంలో పెద్ద పెద్ద హోదాల్లో ఉన్నారు. వాళ్ళందరితోనూ అతనికి బంధుత్వమో లేదా స్నేహమో ఉంది. న్యాయవాదుల సంఘానికి ఆయన అధ్యక్షుడిగా ఉండడం చాలామందికి ఇష్టమే, కొద్దిమందికి ఇష్టంలేదు, ఎందుచేతనంటే, వారిలో ఎవరిమట్టుకి వారికే అధ్యక్షపీఠం అలంకరించాలని ఉంది. న్యాయవాదుల సంఘానికి అధ్యక్షుడిగా ఉండే న్యాయవాదికి చాలా సదుపాయాలు (కోర్టుల్లో) జరుగుతాయి. ఆ సదుపాయాలు పొందవలసినవసరం అతనికి లేదు, పొందవలసిన అవసరం ఉండీ అధ్యక్షుడిగా ఉండడానికి తాహతుకలిగీ కొద్దిమందున్నారు. వాళ్ళకి ఆయనంటే ఇష్టంలేదు, ప్రెసిడెంటుగారికి తనంటే ఇష్టంలేనివాళ్ళుంటారనే సంగతి గుర్తు ఉండదు. తగువులంటే ఆయన నవ్వుతుంటాడు, నెరిసిన జుట్టు నతడు నున్నగా దువ్వుకుంటాడు. 'టై'తో సహా ఫ్లాలెస్‌గా సూటు వేసుకొని వస్తాడాయన. బాల్ రూంలోనే ఆయనకి కోర్టుడ్రెస్ ఉంటుంది. ఎప్పుడైనా ధరిస్తాడాయన ఆ బట్టలు. (ఆయన టిప్ టాప్‌గా ఫ్లాలెస్‌గా డ్రెస్‌చేసుకోడం ఆయన న్యాయవాదుల సంఘానికి ఎన్నిక కాగలగడానికి అనే కారణాల్లో ఒకటేమో ? !)"

ముకుందుడికి మేజిస్ట్రేటుతో తగువు రావడం ప్రెసిడెంట్‌గారికి నచ్చలేదు.

"ఎందుకు మిస్టర్ ముకుంద్ ? ! మేజిస్ట్రేట్ అంటే ఏపాటివాడు? ఆఫ్టరాల్ హియూజ్‌ఎహపెనీ టసెనీఫెలో! అటువంటివాళ్ళతో నీవంటివాడు

తగువులాడకూడదు. అది మన గౌరవానికే నష్టం!" అన్నారు ప్రెసిడెంట్‌గారు.

"అవునవును", అన్నాడు మరొక సీనియరు. ఆయనకి పంచె, పాగా, బొట్లూ ఉన్నాయి. ఆయన పేరు రంగస్వామి. కాని పేచీలపెదబాబంటేనే చాలామందికి ఆయన్ని తెలుస్తుంది, చదువూ సంధ్యాలేని కుటుంబంలోగుండా వచ్చి పెద్దవాడయినందుకు ఆయనకీ ఆయన కులంవారికికూడా గర్వం ఉంది. చాలామంది లాయర్లు సొరచేపల్లాంటివారయితే "నేను మొసల్లాంటివాణ్ని" అంటూంటా డాయన. సొరచేపయితే నీటిలోనే ఏదైనా భక్షించగలవు. మొసలైతే నీటిలోనూ నేలమీదా కూడా మెసిలి భక్షించగలదు. కోర్టుకి ఎవరైనా వచ్చేక ఆ కేసు పట్టేక చాలామంది లాయర్లు పేచీలు వెయ్యగలరు. కాని, కేసుకి రాకముందే పేచీలువేసి తగువు తెప్పించి, దాన్ని కోర్టుకి రప్పించి పెంచి ఫీజులు గుంజగలడు రంగస్వామి. ఆయనకి అరవయ్యేళ్ళుంటాయి. ఆ ఊళ్ళోవాళ్ళ కులంవారి ప్రత్యేక సంఘానికి ఆయన ప్రెసిడెంటు, న్యాయవాదుల సంఘానికి కూడా ఆయనకి అధ్యక్షణ్నవాలనే కోరిక ఉంది కాని ఫలానాకులంవాళ్ళు "కాటికాడ నక్కల్లా కాసుకునుండగా మనకి ఛాన్సెక్కడిదయ్యా?" అంటూంటారాయన. ఫ్రీగా అయినా కేసు చేసిపెడతారు కాని తన కులంవాణ్ని అన్యకులం ప్లీడరు దగ్గిరికి వెళ్ళనివ్వరాయన, పొట్టిగా దుబ్బుగా ఉంటాడాయన, కొన్నాళ్ళపాటు మీసానికి ఆయన రంగు రాసేవాడే కాని ఈమధ్య రాయడం మానీసేడు, అదిప్పుడు నల్లగా తెల్లగా ఎర్రగా ఉంటుంది. ఆయనకి చాలా సంతానం ఉంది. కాని స్త్రీ వాంఛ ఇంకా పోలేదు. తన కులంకంటె హెచ్చుకులం మనిషి నొకర్తెని అతను చాలాకాలంనించీ ఉంచుకొనున్నాడు, అందుగురించికూడా ఆయనకీ ఆయన కులంవారికీ చాలా గర్వం ఉంది, అతని ముఖం చాలా పెద్దది. అతని బుగ్గలు బూరెబుగ్గలు, వయసువల్ల ఇప్పుడవి కిందకి జారేయి. అందుచేత అవి నాసిబుగ్గల్లా కనిపించడంతో అతని ముఖం ఉడుకుబోతు ముఖంలా కనిపిస్తుంది. అతనికి కోపమూ గడుసుతనమూ కూడా ఉన్నాయి. అతను ఎర్రగా ఉంటాడు. అతని వంటినిండా జుట్టుంది. అది ఆయనకి చాలా గర్వకారణం, "కిత

కిత లేసేసి ఆడవాళ్ళు కిరకిర లాడిపోతారయ్యా! కుర్రసన్నాసులు మీకేం తెలుసు!" అని ఆయన గర్వంగా చెప్పుకుంటాడు, ముకుందుణ్ని మేజీస్ట్రేటు అవమానించినందుకు ముకుందుడికి కోపం వచ్చింది కాని రంగస్వామికి రాలేదు. మేజిస్ట్రేటుగారి చర్యని గర్హిస్తూ న్యాయవాదుల సంఘంవాళ్ళు తీర్మానిస్తే రంగస్వామికి నష్టవేంలేదు. మేజిస్ట్రేటు పై కులంవాడు, బుర్ర తిరుగుడుగాడుకూడానట. వాణ్ని ఇక్కణ్నించి ఎత్తించేస్తే మనకేం నష్టంలేదు. కాని, వాణ్ని ఎత్తించేడం మనక్కూడా ఇష్టవేనంటే, కులద్వేషంవల్ల, "కాస్ట్‌ఫీలింగ్‌వల్ల" అలా పలికేనని వీళ్ళే మనల్ని మళ్లా తిడతారు. అదీకాక, ముకుందుడు తల్చుకున్నాడంటే మేజిస్ట్రేట్లనీ జడ్జీల్నీకూడా గడగడలాడించీగల్డు!" అనే ప్రచారం లేచిందంటే ప్రాక్టీసులో ముకుందుడుగాడు యెదిగిపోతాడు. అది రంగస్వామికి ఇష్టంలేదు. దానా దీనా అయిన ప్రెసిడెంటుగారు చెప్పింది రైటే అన్నారు.

"తుచ్ఛుల్తో మనం తగువులాడకూడదు. ప్రెసిడెంటుగారుచెప్పింది రైటే! ఇప్పుడు కుక్కే ఉంది! అది మనల్ని కరిచింది. అది కరిచింది కదా అన్చెప్పి దానినోట్లో నోరెట్టి దాన్ని మళ్లా మనం కరుస్తావా!, కరవంకద!" అన్నారు రంగస్వామిగారు.

తిరుగులేని సామెతవంటిది చెప్పేననుకున్నారు రంగస్వామిగారు. కాని, ముకుందుడు ఊరుకోలేదు.

"కరిచే కుక్కని కరవమనడంలేదు నేను" అన్నాడాయన.

"మరైతే ఏం చెయ్యమంటావు?" అని అడిగేరు రంగస్వామిగారు.

"చెప్పుతో కొట్టమంటున్నాను. అంతే!" అన్నాడు ముకుందుడు.

రంగస్వామికి ముకుందుడి జవాబు విని కొంచెం చిరాకు వేసింది.

"ఇది మరీబావుంది. అవతల కేసులే చూసుకుంటావా, అవతల చెప్పులుచ్చుకొని కుక్కలెనకాల పరుగులే తీస్తావా?! కుక్కల్ని కొట్టడానికటయ్యా మనం కోర్టుకొచ్చేది!" అని చేతులూపుతూ అడిగేడతను.

అంతలో మూడో ప్లీడరు ఓమాటనేసేడు.

"ఒరే రంగస్వామీ! కనకపు సింహాసనంమీద శునకం కూర్చుంటే ఏం చేస్తావురా?" అని అడిగేడతను.

ఈ సపోర్టుకి ముకుందుడు సంతోషంగా అతని వైపు చూసేడు.

మూడో ప్లీడరు కొన్నాళ్ళు పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఉండేవాడు. అతనూ రంగస్వామీ చిన్నప్పుడు క్లాసుమిట్సు. అతను బాగాతెలివైనవాడని రంగస్వామికి చిన్నప్పుడే ఓ అభిప్రాయం కలిగిపోయింది. వాళ్ళిద్దరూ ఒకే సీనియర్ దగ్గిర జూనియర్స్‌గా ఉండి ఇద్దరూ కలిసి సీనియర్‌గారి ప్రాక్టీసులో ముప్పావువంతు సంగ్రహించుకొని బైటకొచ్చి బాగుపడ్డారు. మూడో ప్లీడరు రాజరాజేశ్వరీదేవిని బాలగా పూజిస్తాడు; రంగస్వామి ఆ దేవిని ప్రౌఢగా పూజిస్తాడు. ఇద్దరూ ఫ్రెండ్సే; అంటే ఒక్కొక్కసారి ఇద్దరికీ సరిపడుతూ ఉంటుంది. ఒక్కొక్కసారి సరిపడకుండా ఉంటుంది.

మూడో సీనియర్ ప్లీడరుగారి పేరు రాజభాస్కరరావు. రాజాగారని అందరూ ఆయన్ని రిఫర్ చేస్తుంటారు. ఆయన బలంగా తెల్లగా పొడవుగా తెల్లగొరిల్లాగా ఉంటారు. ఫాస్ట్‌గుడ్స్‌బండీలా ఆయన ఇంగ్లీషులో ధణధణమంటూ మాట్లాడగలడు. ఆయనకి బద్ధకం ఎంత ఎక్కువో జ్ఞాపకశక్తి కూడా అంత ఎక్కువా ఉంది. అదే ఆయన్ని రక్షించింది. ఆయనకి తెలిసిన తీర్పులన్నీకూడా జూనియర్స్‌చేత చదివించుకు విన్నవే కాని వేరులేవు. ఆయన మంచి నటుడు, ఏనుగు సైజు గొరిల్లా ఇంగ్లీషులో మాట్లాడుతూ హడావిడిగా రంగస్థలంమీద నటిస్తుంటే అందరూ రెప్పవెయ్యకుండా చూస్తారు మరి! తన సైజుకీ అందవికారానికీ తన నటనా చాతుర్యాన్నీ మాటధాటీనీ జ్ఞాపకశక్తినీ జోడ్చించి పెద్దవాడయేడతను. జడ్జీలకి చాలామందికి అతణ్ని చూస్తే ఇష్టంలేదుకాని ఏనుగంత గొరిల్లాని ఈగని తీసిపారేసినట్టు వాళ్ళు ఎలా తీసిపారెయ్యగలరు? అయితే, వాళ్ళ ఇష్టాయిష్టాల్ని అతను లక్ష్యపెట్టడు కూడాను. జడ్జీని ముందుగా జేబులో వేసుకోగలిగితే చాలు. వెయ్యికేసులు ముందుపోయినా ఆ జడ్జీని చివరికి నెగ్గేవా, మనకి మరింక తిరుగుండదు!" అని అనుభవశాలురు అంటుంటారు. కాని రాజభాస్కరుడు అలా అనడు. "ముందు

మనకి క్లయింటంటూ ఒహడుండి వాణ్ని మనం జేబులో వేసుకోగలగడం అది మనకి ప్రధానం!" అంటాడాయన. అతను పార్టీని వశం చేసుకోందికి ఎంత హడావిడైనా చెయ్యగలడు. ఓ పెంకె జడ్జీ ఓసారి ఓ ఖూనీకేసులో ఆయన్ని అల్లరి పెడుతుంటే ఆయనకి చాలా చిరాకువేసి కోపం వచ్చి, ధన్నుమని తన నల్లకోటు వెనక్కి సగంమేరకి విరిచి తీసి, "మాటిమాటికి తమరలా అడ్డుతగలడవేఁకాదు, ఇష్టం లేకపోతే తమరు మందుగుండు తెప్పించి నన్ను కాల్చేయండి! ఐ డోన్టు మైన్డు! కాని, చెప్తున్నాను యువరానర్!! నేను చచ్చినప్పటికీ, అమాయకుడైన నా క్లయింటుని నెగ్గించడానికి నా స్థానంలో నా శవం ఇక్కడ నిలబడి దెబ్బలాడి మరీ వెళ్తుందే కాని అప్పటిదాకా వెళ్ళదు కాలడానికి కాటికి!!"అని గంభీరంగా చెప్పేట్ట. ఆ దెబ్బకి ఆ జడ్జీ డౌన్ అయిపోయి మరింక నోరెత్తకుండా ముద్దాయిని అక్విట్‌చేసి పారేసేట్ట. ఆ కేసు అయేక, ఊళ్ళో చాలా మంది జనం ఆయన్ని చూడ్డానికి ప్రత్యేకంగా కోర్టుకి వచ్చి చూసి మరీ వెళ్ళేరుట. అతను పాలిటిక్స్‌లోకి దిగితే "గద్దె ఎక్కడమేకాని మరింక దిగడు" అని చాలామంది అనుకొంటూ ఉంటారు. అతను శృంగార పురుషుడు, చక్కని బట్టలు వేసుకుంటాడు, చిక్కటి సెంటు వాడతాడు, 'రా విస్కీ' తాగుతాడు. అతనూ ఓ దుర్మార్గపు పోలీసుసూపరెంటు ఒకే దొరసాన్ని ప్రేమించి ఇద్దరూ ఒకేసారి ఆవిడ ఇంట్లోకి జొరబడి పోయి నప్పుడు ఆ దొరసాని ఆ పోలీసాఫీసర్ని పొమ్మందిట. ఈ ప్రాసిక్యూటర్ గార్ని మాత్ర ఉండమందిట. ఆ సంగతి ఊళ్ళో అందరికి తెలియడంతో రాజభాస్కరుడికి ఊళ్ళో గౌరవం ఇంకా బాగా పెరిగింది. రాజభాస్కరుడు జడ్జీలని లక్ష్యపెట్టడు. కాని, పాతరోజులు వెళ్ళిపోయేయి, ప్రాసిక్యూటర్ గిరీ అయిపోయింది, ఇంట్లో ఖర్చులు పెరిగిపోయేయి, విస్కీ బాటిల్ కొనాలంటే తాగిన మైకంలో కొనాలేకాని మామూలుగా ఉండగా కొనడానికి భయం వేస్తోంది. ధర అంతగా పెరిగిపోయింది. బార్‌లో పోటీల్లా వయిపోయేయి. అణాఅణా ప్లీడర్లు పట్టాలు పుచ్చేసుకొని ఖూనీ కేసులు కూడా దమ్మిడీ దమ్మిడీకి చేసేస్తున్నారు. రోజులు ఇలా ఉండగా కొత్త జిల్లా జడ్జి అకారణంగా రాజభాస్కరుణ్ని వెంట తగలడమే పనిగా

పెట్టుకున్నాడు. ముసలి బఫూన్‌గాణ్ని పెంకె కుర్రకుంకలు అల్లరి పెట్టి నట్టు అతను రాజభాస్కరుణ్ని అల్లరి చేస్తున్నాడు. "వీడి పని ఎలాగైనా పట్టించా"లని రాజభాస్కరుడికి చాలా "ఇది"గా ఉంది. మేజిస్ట్రేటువిష యంలో తను ముకుందుడికి సహాయం చేస్తే జడ్జీ విషయంలో తనకి ముకుందుడు సాయం చెయ్యకపోతాడా అని అతని మనసులో ఉంది. అందులోనూ, ఈ మేజిస్ట్రేటు ఈ జడ్జిగారి గుడ్ బుక్స్‌లో ఉన్నాట్ట. మేజిస్ట్రేటుకి స్నేహితుడు ముకుందుడికి విరోధి కాగలడు. ఆ విరోధి తనకికూడా విరోధి!

అందుచేత—

కనకపు సింహాసనాల మీది శునకాన్ని వెంట తరిమి కొట్టాలనే సిద్ధాంతానికి వచ్చేడు రాజభాస్కరుడు.

అతనిమాట తో సేయడానికి వీల్లేక పోయింది రంగస్వామికి.

అక్కడ ముకుందుడు కాక నిల్చున్న నలుగుర్లోనూ మరో అయన పేరు సుందర శివరావు.

సుందర శివరావుగారు మాసిపోయినబట్టలు వేసుకున్నాడు. మాసిన గడ్డం ఉంచుకున్నాడు. ఆయనకి కూడాతలపాగాలేదు. రాజభాస్కరుళ్ళాగే అతను పొడవుగా ఊబగా ఉన్నాడు. అతనికి యాభయ్యేయిదేళ్ళుండవచ్చు. ఆయన బట్టలనిండా పొడుం జల్లులున్నాయి; తలమీద చెదురు మదురుగా మాత్రం తలవెంట్రుకలున్నాయి. ఆయనకి మంచి శ్రద్ధా? మంచి తెలివి తేటలూ! మంచి చదువూ మంచితనమూ ఉన్నాయట. అతను మంచితనం మీద దొంగ దెబ్బలు తీసేస్తాడని అతనంటే కిట్టనివాళ్ళు చెప్తారు. సివిల్ సైడు అతినికి మంచి ప్రాక్టీసుంది. అతనంటే క్లయింట్లందరికీ గౌరవం ఉంది. కొంతమంది జూనియర్లకి కూడా ఉంది అతనంటే గౌరవం, ఆ సంగతి ముకుందుడికి బాగా తెలుసు.

"ఏఁవంటావు శివం!" అని అడిగేడుముకుందుడు.

"నేనేఁవంటాను?" అన్నాడు సుందరశివుడు.

"ఏఁవంటావనే అడుగుతున్నాను," అని చిరాగ్గా అన్నాడు ముకుందుడు.

ముకుందుడి చిరాకుని సుందరశివుడు పట్టించుకోలేదు. అతను మూడు నిమిషాలకి అరనిమిషం తక్కువసేపే ఆలోచించేడు కాని అర గంటసేపు ఆలోచించినట్టనిపించింది మిగతావార్కి.

"నాకు క్రిమినల్ సైడు వర్కులేదు" అన్నాడు సుందరశివుడు రెండున్నర నిమిషాల అనంతరం నెమ్మదిగా తలయెత్తి.

"నీ భార్యా కనబడకపోతే నా భార్యా నిమ్మంటావటయ్యా?" అని రైలుపాటలో వాడెవడో అడిగినట్టు, నీకు క్రిమినల్ వర్కు లేకపోతే మమ్మల్నివ్వమంటావా?" అని చిరాగ్గా అడిగేడు రాజభాస్కరుడు.

"మరి నాకు ఆ మేజస్ట్రేటు మంచివాడో చెడ్డవాడో ఎలా తెలుస్తుంది?" అని అడిగేడు సుందరశివుడు ఎంతో జాలిగాను.

"ఎలా తెలుస్తుందా? తెలిస్తే స్వయంగా తెలుస్తుంది, లేకపోతే ఎవరైనా చెపితే తెలుస్తుంది. రెండే పద్ధతులు, నీకు తెలియనప్పుడు, ఇదిగో మేం చెప్తున్నాం, తెలుసుకో" అన్నాడు రాజభాస్కరుడు.

"మన వేదాలుకూడా పెద్దలకెవరో చెప్పగా తెలుసుకున్నవేఁ గాని మనం అంతా స్వయంగా తెలుసుకున్నవికావు!" అని సుందరశివుడి చెవిదగ్గిర నోరుపెట్టి చెప్పేడు రంగస్వామి, శివుడికి చెముడుందని రంగడి కెందుకో కాని అనుమానం ఉంది.

"సరేలేండి, మీకెలాతోస్తే అలా చెయ్యండి వాడిగురించి!" అని దీనంగా అన్నాడు సుందరశివుడు.

"రక్షించేవు" అన్నాడు రాజభాస్కరుడు.

ప్రెసిడెంటుగారు మాత్రం మౌనం వహించేరు.

ముకుందుడు ప్రెసిడెంట్ గారి మౌనాన్ని మేజిస్ట్రేటుగారి గురించి జ్ఞాపకాన్నీ సహించలేక పోయేడు. ఆయన ప్రెసిడెంట్‌గారితో ఈ విధంగా చాలా కోపంగా అన్నారు:

"అదికాదు, రాజశేఖరంగారూ! కంచెవేసి నడిపించి నడ వ్వలసినవాడే కంచెదాటి నడుస్తూంటే ఎలా ఊరుకో మంటారండీ?! అందులోనూ అది అకారణమైన ఇన్‌సల్ట్ కాదా?! ఇవాళ నేనయేను. రేపు మరో జూనియర్ అవుతాడు. నాకే చురకలు పెట్టాలని చూసినవాడు నా కంటె చిన్నవాణ్ని కాల్చుకుతినడా?! ఒట్టి రాజశేఖరంగా మీరాలోచించ కండి, బార్ అసోసియేషన్ ప్రెసిడెంట్‌గా ఆలోచించండి! ఇవాళ ఈ మేజిస్ట్రేటయేడు. రేపు మరో జడ్జీ అవుతాడు. ఇదివరకు ఆచారి మునసబు హద్దుమీరి గెంతులు వేసినప్పుడు మీరే వాడిమీద మన అసోసి యేషన్లో తీర్మానం పాస్ చెయించేరు జ్ఞాపకం ఉంది కద! పిలక నిగి డించిన వాడికి మీరప్పుడు పిలక కత్తిరించిసేరు. వీడిప్పుడు తోకాడిస్తు న్నాడు. మరి మనం వీడికిప్పుడు తోక తీసెయ్యాలా ఒద్దా? మీకు మీఅవస రానికి ఓ న్యాయం, మా అవసరానికి మరో న్యాయం ఉంటుందంటారా? ఏం సెలవు?" అని చాలా తీవ్రంగానే అడిగేడు ముకుందుడు.

అందుకు జవాబుగా ప్రెసిడెంటుగారు నిట్టూర్చేరు.

మంత్రసానైనాసరే, మహాత్ముడైనాసరే, మదనగోపాలకృష్ణుడైనాసరే ఎవరైనాసరే,మానవులంతా సమానులేనని మందుల భీముడు తనకు తాను ఎటుల నిరూపించుకొనెనో మీరు తెలుసుకొనగలరు.

# 19

ప్రెసిడెంటుగారు నిట్టూర్చేరేకాని సమ్మతించలేదు. ముకుందుడిది మంచికత్తేకాని మేజిస్ట్రేటుమీదికి ఎత్తికట్టి బయల్దేరడానికి అదొక్కటే చాలదు. మరికొన్ని పెద్దకత్తులు కలిసిరావాలి.

ప్రెశిడెంటు రాజశేఖరంగార్ని రంగంలోకి దించగలిగితే మిగతా పెద్దలుకూడా దిగుతారని ముకుందుడికి ఆ మధ్యాహ్నం ఓ నమ్మకం కలిగింది. ప్రెసిడెంటుగారి మెడలు వంచడానికి వీలుగా మందుల భీముడు ఓ సంగతి, ముఖ్యమైన సంగతి, ముకుందుడి చెవిని ఆ మధ్యాహ్నం పడవేసేడు.

ఆ సంగతి ఆరాత్రి రాజశేఖరంగారితో చెప్పి వారి మెడలు వంచేడు ముకుందుడు. "నే చెప్పింది నిజమో కాదో మన కౌన్సిలర్‌గార్ని అడగండి" అని దాఖలాకి మందుల భీముణ్ని తీసుకుపోయి అతణ్ని రాజశేఖరం ముందు ముకుందుడు నిలబెట్టేడు కూడాను.

రాజశేఖరంగారి డ్రాయింగ్‌రూంలో మెర్క్యూరీ దీపపు వెలుగులో మందుల భీముడు నిలబడిలేడు. కూర్చొనే ఉండి అసలుసంగతి చెప్పేడు. చెప్పేముందు ప్రెసిడెంటుగార్ని కొంచెం పొగిడేడు.

"సుక్కలన్నింటికీ శెంద్రుణ్ణి తెలుస్థికాని శెంద్రుడికి ఈ టన్నింటినీ తెలవనవసరం లేదే! లెక్కకొద్ది మూడు తొమ్మిదు లిరవై యేడు సుక్కల్నే శేరదీస్తాడు. అలాగ్గ మన సేకరం బాబుకి, లెక్కమీద పెద్దోళ్ళనందర్నీ తెలుస్తుందికాని శిన్నోళ్ళని తెలవనవసరం లేదే. సేకరం బాబుకి అంచేత నన్ను తెలకపోవచ్చు. కాని, సేకరంబాబుని నాకు తెలకుండా పోదే - దొరక్లబ్బులో జానీవోకరు బుడ్డికి బుడ్డి ఎత్తేస్తాడు దొర. ఆయెనక మళ్ళీ మరోబుడ్డి ఎత్తుతాడు ఆడికి ఆ టయాంలో బేరరెవడో కలెక్రెవడో బుడ్డేదో గలాసేదో గ్యానఁ వుండదు. అలాటప్పుడు ఆణ్నడగండి. మరింక జీతాల్రోజున నూకరాజు సారాకొట్టుకాడ ఆరు దరువు లేసుకున్న మున్సిపాల్టీ స్వీపరోడి దగ్గిరకెళ్ళి ఆణ్ని అడగండి ఆడికి ఆ టయాంలో శేర్మేనెవడో సేంట్రీ ఇనస్పెక్రెవడో తన పెళ్ళాంఎవరో శేర్మేనొది నెవరో తెల్దు, సెప్పలేడు. అలాట్టయంలో ఆళ్ళిద్దర్నీ అడిగి సూడండి, ఎవ్రా మనూరికి ప్లీడర్లూ అని అంత మైకంలోకూడా ఆళ్ళు సెప్పేస్తారు - ఒకటి, సేకరంబాబు, రొండు, ముకుందుబాబు - అని తడుంకోకుండ సెప్పేస్తాడు. సెప్పకపోతే నేను రొండు సెవులూ కోయించుకొని ప్లేట్లో ఎట్టి మీ పాదాల్దగ్గిర పడేస్తాను. అసలెందుకు, అలాట్టయంలో ఆళ్ళ సెవులుకాడ సేకరంబాబు ముకుందుబాబు అని రొండు పేర్లూ సెవిలో నోరెట్టి నెమ్మదిగా ఊది సూడండి! పావుఁల్నర్సయ్యపేరుకి తాచుపాం ఇషం దిగిపోయినట్టు, తఁవఁ రొండుపేర్లకీ తాగుడు మైకం పటాపంచలై పోద్ది! దొర కాదు. ఆడి లండన్ బాబైనాసరే పేర్లినే సరికి లెంప లోయించుకు దండం పెట్టవలసిందే!"

అని శేఖరంగారిని పొగుడుతూ, మధ్యలో ముకుందుణ్ణి మర్చిపోకుండా అతణ్ణికూడా కలిపి పొగిడేడు మందుల భీముడు.

రాజశేఖరంగారూ ముకుందరావుగారూ ఓ సోఫాలో కూర్చొనున్నారు. పక్కని సోఫాలో మందుల భీముడు కూర్చున్నాడు. శేఖరం

గారికి మందుల భీముడితోకాని, అటువంటి వారితోకాని అదివరకు పరిచయంలేదు. అటువంటివారిగురించి అతను విన్నాడేకాని అటువంటి వాణ్ని ఎదురుగా కూర్చోబెట్టి చూడ్డం అతనికి అదే మొదటిసారి. ఆయన చిన్నతనంలో కొందరు కొందరు చెడిపోయిన చోటా జమీన్దార్లదగ్గిర ఇటువంటివాళ్ళు మసుగుడుగాళ్ళుగా విదూషకులుగా ఉండడం అతనికి లీలగా గుర్తుంది. మందుల భీముణ్నిచూసి అతనుచెడ్డ వాడనుకోలేదు; చెడిపోయిన అమాయకపు మంచివా డనుకున్నాడు. భీముణ్నిచూసి అతని మాటలు విని చిన్న చిరునవ్వు నవ్వేడతను. చిన్నతనపు ఫ్యూడల్ రోజులు గుర్తుకి తెచ్చుకోడం అతనికి ఇష్టం అయింది కూడాను.

ప్రెసిడెంటుగారి నవ్వులోని భావాన్ని మందుల భీముడు గ్రహించక పోలేదు. "పొగడాలేకాని లొంగనో డెవడున్నాడు ? అనుకున్నాడతను. గాంధీగార్ని పొగిడి ఎంతమంది గొప్పోళ్ళయి పోలేదు? ! నేరూని పొగిడి ఎంతమంది ఆడితోపాటు ఇమానాలెక్కి ఊరేగలేదు ? ! అందుకే అన్నాడు కపీశ్వరుడు, 'పొగడరా నీ తల్లి బూమి భారతిని' అన్నాడు. మందని చేరదీసి మనిషికో కత్తిచ్చి లూటీలో వోటాలిచ్చి కూలినాలి జనాన్ని నరికి పారేసి ఆడాళ్ళని అదరగొట్టేసి సంటిపిల్లల్ని అడలగొట్టేసి కొందరు రాజ్యాలు సంపాయించి రాజులవుతే అలాటి డాకూగాళ్ళందరూ ఇష్ణుమూర్తి కొడుకులే మనవలే అంటూ పొగిడి మళ్ళూ మాన్యాలూ సంపాయించేరు మరికొందరు. ఏదాలు పుట్టినకాణ్నించి దేవుణ్ని పొగిడే బతికేస్తున్నారు ఇంకొందరు. 'నీకేట్రా పనీ' అంటే దేవుణ్ని పొగడ్డం—అదీ ఆడిపని!! మరింక మనకేటి పని ? గంగరాజన్నా నువ్వు పోతురాజు తమ్ముడివి, రాజమ్మొదినా నువ్వు నూకల్తల్లి సెల్లివి అంటూ పొగిడి ఆళ్ళ కులంవోళ్ల ఓట్లు సంపాయించి కౌన్సిల్‌గిరీ ఎలిగించడం మనపని ! సెబాస్‌రా రాజా సేబాస్ బలేగుంది లోకం ! ఎపుడికీ ఎవుడికీ తేడాలేదు. అందరొక్కటే! ఆనాడు కర్రిరాధ కొళ్ళన్లో ఏటయింది ? కర్రిగున్నావుకాని రాధా నువ్వెంత కిర్రుగున్నావే అని పొగిడేసరికి జావజావయిపోయిందా లేదా ? మరింక సావు సచ్చిందేకాని మన్నొగ్గిందికాదే ! అంతే ! అంతా అంతే ! మంత్రసానైనా అంతే, మాత్మడైనా అంతే, మదనగోపాల కిష్టుడైనా అంతే—" అనుకున్నాడు మందుల భీముడు.

"ఎదరవారి బుర్రలు మార్చుటకు మనకి బుర్ర ఉండవలెనా?" అనే ప్రశ్నకి ఈ అధ్యాయంలో ఒక జవాబు — "ఆడదానికి ఏమి కావలెను? అనే ప్రశ్నకి ఇదే అధ్యాయంలో ఒక పిడుగువంటి జవాబు — "యుద్ధరంగములోనికి పెద్ద లెందుకు దిగుదురు?" అనే మరొక ప్రశ్నకి కూడా ఇందు లోనే జవాబు.

# 20

మందులభీముడు అనుకున్నట్లుగా న్యాయవాదుల సంఘం అధ్యక్షుల వారైన రాజశేఖరంగారు భీముడి పొగడ్తకే లొంగేరో, భీముడుతెచ్చిన భీమవార్త వినే లొంగేరో, ముకుందుడిమాట తీసేయలేక లొంగేరో, ఒకానొక పెట్టీ ఆఫీసర్ని లొంగదియ్యడానికి కూడా పెద్దలు కలియకపోతే మరింక మరో విషయంలో "ఏందులోనైనా కలియగలమా?" అనే ఉద్దేశంతో లొంగేరో, ముకుందుడిమాట అందరూ ఎలానూ వింటారు, అటువంటప్పుడు తనుమాత్రం వంటిపిల్లి రాకాసిలాగా ఎందుకుండిపోడం అనుకునే లొంగేరో చెప్పడం కష్టం. కాని లొంగడం మాత్రం లొంగేరు. ఆయన అలా లొంగడానికి భీముడు తెచ్చిన భోగట్టా కొంతవరకూ పని చేస్తే చేసి వుండవచ్చు, చేసిందనిమాత్రం మందుల భీముడు వాదిస్తాడు.

భీముడు తెచ్చిన భోగట్టా ఏంటంటే ; శేర్మేనున్నాడు కదా. ఆ దెవడనుకున్నారు ? మీకందరికీ స్నేయితు డవొచ్చు ! ఊరోళ్ళందరికీ శేర్మేనవొచ్చు. కాని, మనకి మాత్రం ఎద్దుమొద్దు ఎర్రిమాలోకపు బామ్మరిదేగాని, మరోడు కాడు. రాజుగారి పెళ్ళం ఊరందరికీ రాణేగాని. రాజుకిమాత్రం పెళ్ళ(వే( కదా! అలాగ్గా మనశేర్మేను ఇంద్రుడు, శెంద్రుడే కాని, మనకిమాత్రం బామ్మరిదే ! అయిందా ? అయితే ఏంటంటే, ప్రెసిడెంటుగారు ఆలోశిస్తున్నారు. శేర్మేను ఊరోళ్ళకి గొప్ప కావచ్చుగాని, బారు ప్రెసిడెంటుని నాకు ఆడు ఏం గొప్పా ? : అని ప్రెసిడెంటుగారు ఆలోశిస్తున్నారు. రైట్ ! ఒప్పుకున్నాను. శేటపెయ్యా పెయ్యే అయినట్టు శేర్మేనూ మనిషే ! ఆడికి మూడు కొమ్ముల్లేవు. ఆరు తోక, ల్లేవు. ఏడుసేతులూ కాళ్ళూ లేవు. ఆడు త(వ(రికంటె గొప్పోడుకాడు. నాకు బామ్మరిదేగాని, మరోడుకాడు. పొద్దున్న లేశాడంటే ఆడూ మన్లాగే పళ్ళు తో(వా(ల. ముకం కడగాల, స్తానం జెయ్యాల. అలా చెయ్యకపోతే అడూ అందర్లాగే కంపు కొడతాడు. సచ్చిన మూడోగంటకి మోసుకుపోయి అణ్ని కాల్చకపోతే, అందరి శవాల్లాగే ఆడి శవంకూడా కుళ్ళద్దేగాని, మంచిగంధపు శెక్కల్లాగ గుమగుమలాడదు. ఏంటంటారు? రైటేనా? ఆడు త(వరికంటె ఏడాకులు తక్కువే సదివేడు కాని, ఎక్కువ సదవలేదు. ఆ మాటకొస్తే ఆడికి అటా పాటా, అంటింగూ తెలుసుగాని, మరో మంచి సదువు తెలీదు. ఓట్లు కొండానికి, ఆడిబుర్ర ఈడికి ఈడి బుర్ర ఆడికి మార్చడానికి ఆడు గురువే అనుకోండి గాని అలాంటి ఇద్యలకి ఎమ్మే బియ్యే సదువక్కర్లేదు. అలాబాద్ ఐకోర్టు తీర్పు తీసి, మెడ్రాస్ ఐకోర్టు తీర్పు తీసి రెంటికీ తేడాల్చెప్పడం తెలియక్కర్లేదు. ఏంటంటారు? రైటేనా? అసలు బుర్రలు మార్చే ఇద్యకైనా మనకి డబ్బుండాలిగాని బుర్రుండక్కరలేదు. మనకి డబ్బుంటే, మనం ఎళ్ళి ఆడి బుర్ర మార్చక్కర్లేదు. డబ్బు జూపిస్తే ఆడి బుర్ర ఆడే మార్చేసుకుంటాడు. ఏంటంటావు ముకుందుబాబూ? రైటంటావా గాదంటావా? కిందటి సుట్టు మీ ఈది కౌన్సిలరేంటిజేసేడు? పదేసి పదేసి పులిబుర్రలిరవై మన శోర్మెన్ శేతిలోంచి ఆడి జోబీలోకి మారేసరికి ఆడి బుర్ర ఆడు

మార్చేసుకోలేదా? రెండువేల డబ్బు కంట జ్యాయిన్సరికి అటుంచి ఇటు నైటుకి నైట్లో, ఒక్కనైట్లో ఉల్టాపల్టా అయిపోయి మనోడికి ఓటేసీలేదా? శేర్మేన్ సెలక్షనయిపోగానే పక్కా తిరపతెళ్ళి గుండు కొట్టించేసుకొనొచ్చేసేడు కూడాను, దాన్తో ఆడి బుర్ర పూర్తిగా నిజంగా మారిపోయిందనే చెప్పాల్లె. గుండుకి ముందు దొంగ భైరాగోళ్ళా వుండే వోడు. గుండు సేయించుకున్నాక దొంగ సన్నాసిగాళ్ళా తయారయేడు. ఇప్పు డెలాగున్నాడో తెలుసా? పాల్లబ్బులమీద శేంట్రీ ఇన్స్పెట్టర్లు పెరిగి పోయినట్టు పెరిగిపోయేడు. అదీ సంగతి: అయతే ఏంటంటే, మనకంటె శేర్మెను గోపోడు కాడు: గొప్పోడు కాడు. కానైతే ఆడు మనకంటె ఏరేవోడా? ఆడెలాపోతే మనకేంటి అని మనం అనుకోని ఇడిసిపెట్టి వలసినోడా? ఆడికి దెబ్బతగిల్తె మనకూ్కడా ఎప్పడో అప్పుడు దెబ్బ తగల్దా? ఆడు పైవోడా? మనకంటె ఎక్కువ మెట్టుమీద ఉన్నాడని మనం అనగలవాఁ? అడివిలో ఏటగాడు తిరుగుతున్నాడూ అన్నప్పుడు, ఓ పుల్ని ఆడికి మనం చేజేతలా అప్పజెప్పేస్తే మిగతా పులులం మన మాటేటవుద్ది? మనం ఆ సంగతి ఆలోశించొద్దా: అంచేత ఏంటంటే ప్రెసిడెంటుబాబూ: మనం మరోణ్ని ఎగస్పార్టివోడికి ఏనుగుబలం అప్ప జెప్పేస్తే అది ఎగస్పార్టోడికి ఏనుగుబలం అవుద్దీ, మనకి సావుదెబ్బకింద మారుద్ది, కర్ణుడు కూలిపూతే దురియోధనుడు మిగుల్తాడా? మిగల్లేదుకద: అంచేత అణ్నీడూ. ఈణ్నాడూ మనం ఒకళ్ళనొకళ్ళు కాపాడుకోవాల. అదీ సంగతి. మా బామర్ది కిప్పుడు—సక్కటి సుక్కా, సన్నజాజి మొగ్గా అని - అలాంటి ఒకటోరకం అందాల భరిణె కూతురుంది. ఎళితే రంగసాని యింటికే ఎళ్ళాల, తీస్తే రాజుగారి సిన్నభార్యనే తియ్యాలని సామెత జెప్పినట్టుగా. ఈ కమ్మలింటి రాజుగాడేం జేసేడంటే, మాస్సాని శేర్మెన్ కూతురికే ఏసేడు పాశిక, మరి ఈ రోజుల్లో కుర్రనాకొడక లంద రికీ పాశికలెయ్యడం తప్ప మరో పాటంటూ లేదుకదా: ఈ కమ్మలింటి రాజుగాడుకూడా ఆ లైన్లోకే దిగేడు. దిగడామరి ! ! అన్ని ఇద్యల్లోకి ఏ యిద్యరా ఎక్కువ విద్య అంటే, ఎదటోడి నెత్తిమీద శెయ్యేసి బతక డంరా ఎర్రి నా కొడక: అన్నాట్ట ఎనకటి కెవడోను. అలాగ్గ, అటు

వంటి ఎక్కువ విద్యల్లోకి ఎక్కువిద్యేమిటంటే, డబ్బున్న పిశికన్నూసి, డుబికీ కొట్టించి బతకడమే, ఎక్కువాతి ఎక్కువిద్య. అంచేత మరి శేర్మేన్ కూతురికి గేలం ఏసేడు కమ్మలింటి రాజుగాడు. పోనీ, కుర్ర లంజ దీని కుందొద్దా బుద్ధి? అంటే ఉండదంతే. సదువుకున్నది. ఎక్కువింటిది కదా, బుద్ధుండొద్దూ? - అంటే మళ్ళీ ఆ మాటే అంటాను. బుద్ధుండదంతే అసలు ఆడదానికేంటి కావాల? కడుపునిండా తిండి కావాల, కట్టుకుందికి కోగ్గావాల, పంటతల్లి కాడానికి పిడుగులాంటి మొగుడు కావాల! అయీ దానిక్కావాల, అంచేత ఏంటంటే, ఈడిది ఎక్కువిల్లా, తక్కువిల్లా అని సూడ దాడది. ఈడు నాకు మంచి సక్కటి పిల్లలనిస్తాడా, యివ్వడా అని చూస్తి! మంగలి పనికి మంగలోడే వుండాలిగాని సాకలోడక్కర్లేదని తెలుసు దానికి! అదీ రైటే! కామశాస్త్రరం తెలియడానికి ఏదశాస్త్రరా లెందుకూ సదవడం? ఆ యిద్య రాజుగారికీ తెలుసు. ఆయన పెద్ద భార్యకు చిన్న భార్యకు తెలుసు, అయన వుంచుకున్న మూడొందల మందిరి ముండ లందరికీ తెలుసు. ఆడి కోట్లో ఏడొందల గుర్రాలకీ గాడిదలకీ తెలుసు. కుక్కకి, నక్కకి నల్లికి తెలుసు. నీకూ నాకూ, అందరికి తెలుసు. అంచేత ఏంటంటే; కామశాస్త్రరం కాడి కొచ్చేసరికి ఆడదానికి మిగతా సదివిన సదువంతా సాఫీసీదా ఎగిరిపోద్ది! అదీ సంగతి, మనమాట - మొగోడికి అంతే అనుకోండి - కాని మనం గట్టిగ అలా ఎక్కడా సెప్పకూడదు. ఏమంటారు? ఎక్స్యేజ్ ప్రెసిడెంట్‌బాబు! నేనేం టంటే; ఏదాలు సదవలేదు. ఎమ్మేలూ సదవలేదు. ఆడదాన్ని మాత్రం కొంత కొంత సదివేను. ఎమ్మేలూ ఏదాలూ సదవాలంటె ఊపిరున్నోడూ సదవొచ్చు, ఊపిర్లేన్నోడూ సదవొచ్చు. అందులం గొప్పేం లేదు. ఆడ దాన్ని సదవాలంటే మాత్రం రంగంలోకి పిడుగులాంటి మొగోడు దిగాల గాని మరోడుదిగడానికిల్లేదు. మరంచేత మనకి ఏ యిద్యా అబ్బకపోయినా ఈ యిద్య మాత్రం అబ్బింది. అది మన పెనల్ సబ్జెక్టు! అరిదాసుని అరి కథ జెప్పరా అంటే పద్నెన్రోజుల్జెప్తాడు. ఆదాడి పెనల్ సబ్జెక్టు! అలాబాద్ హైకోర్టు తీర్పుమీద దంచు ముకుందుబాబూ అంటే, ముప్పైమూడ్రోజులు దంచగలడు. మన ముకుందుబాబు. అదా బాబు పెనల్ సబ్జెక్టు. మాత్మా

గాంధీని అయింస గురించి మాటాడమంటే, ఆ బాబు మాటాడీవోడు కాడా! అలాగ్గా, ఆడదాని గురించి మంచి స్పీచి దంచరా మందులభీమా - అలా పిలుస్తార్లెండి, నన్ను అంటే మట్టుకు మాత్రం మనకి అడ్డూ ఆపూ వుండదు. పంపెపుగుర్రం రేసుకోర్సు సుట్టూ తిరగందే ఆగనట్టు, మనం సారాంశం అంతా సెప్పేదాకా ఆగం: అంచేత ఎక్స్క్యూజ్! ఇంతకీ అసలు సంగతేమిటంటే; కూతురికి గేలం ఏస్తే ఏ తండ్రయినా ఊరు కుంటాడా జెప్పండి అందులోనూ మన్లాటోళ్ళం ఊరుకోగలంవా?! ఊరు కోలేంవుంకద? మా బామర్ది శేర్మెన్‌కూడా ఊరుకోలేదు. గంగరాజు గాడితో ఈ కమ్మలింటి రాజుగాడు కసాలా తెచ్చుకోగానే మా వోడు అదును కనిపెట్టి, కమ్మలింటి రాజుగాడికి పని జరిపించీరా గంగరాజా, నా రాజ్జా" అన్నాడు. దాన్తో ఆడుపని జరిపించీసేడు. బంట్రోతుగాణ్ణి మనం రంగంలోకి దించనే దించకూడదు. దించిన తరాత ఆణ్ణి జారొగ్గీ కూడదు. జారిడిసేస్తే మళ్ళీమనకి మరో బంట్రోతు నౌకిరీకొస్తాడా? రాడు కద! సీనావోడి మీదికి మనం రంగంలోకి దిగినపుడు అమెరికావోడు మన్ని పూర్తిగా జారొగ్గేస్తే మనం అడి సుట్టూ యిప్పుడింకా తిరుగు తున్నట్టు తిరుగుతూండే వాళ్ళవా? తిరగడం మానీద్దుం కద! అంచేత గంగరాజుని శేర్మెను జారొగ్గేస్తే అది ఆ బాబుకి మరియాదా? కాదుగద! అంచేత శేర్మెను ఆణ్ణి జారొగ్గడు. జారొగ్గడు కాబట్టే నన్ను పమ్మిం చేడు. ఆణ్ణి - మన గంగరాజుగాడ్ని — మనం ఎలాగైనా జామీను మీద బైటికి తియ్యాల. బైటికి తియ్యడానికి ఎవడడ్డొస్తే ఆణ్ణి మనం అత మార్చాల. మేస్ట్రీటు కదా ఇప్పుడు మనకి అడ్డు?! అంచేత మనం ఆడికి పని జరిపించెయ్యాల. ఇది నా మాటకాదు, శేర్మెన్ మాట!"

అని ముగించేడు మందులభీముడు.

ఆ విధంగా, న్యాయవాదుల సంఘపు అధ్యక్షులవారుకూడా మేజిస్ట్రీటు మీదికి యుద్ధంలోకి దిగడం జరిగింది.

పరమ రాజభక్త కుమారుడైన శ్రీధరరావుగారి ప్రవేశము— ఆయన దేశ భక్తుడుగా ఎటుల మారెను ? — ఆయన ధ్యేయమేమి ?— స్వార్థం కోసం మానవులు భగవంతుణ్ని ప్రార్థించవచ్చునా? — ఈ ప్రశ్నలకి ఇందులో సమాధానాలు దొరికితే దొరకవచ్చు — శ్రీధరరావుగారు చిలకని విడచిపెట్టి గెద్దనే ఎందుకు చేపట్ట నిశ్చయించుకున్నారు ?" అనే ప్రశ్నకి మాత్రం ఇందులో సమాధానం ఉంటుంది.

# 21

శ్రీధరరావుగారి తండ్రిగారు ఎంత మంచి (బ్రిటిషు) రాజభక్తులో శ్రీధరరావుగారి మేనమామగారు అంత మంచి దేశభక్తులు, అదంతా భారతదేశం స్వతంత్రం కాకముందు మాట. స్వాతంత్ర్యానంతరం శ్రీధరరావుగారి తండ్రిగారుకూడా మన రాజుల భక్తుడిగానూ మంచి దేశభక్తుడిగానూ మారిపోయేరు. బ్రిటిషు పరిపాలనలో ఆయన సబ్ ఇన్‌స్పెక్టరుగా ఉంటూ ఖద్దరుకట్టే "రాజద్రోహుల్ని" కాకినాడలో చాలా చక్కగా హతమార్చినందుకు అప్పటి ప్రభువులు ఆయన్ని మెచ్చుకొని

అతనికి సర్కిల్ ఇన్‌స్పెక్టరు ప్రమోషన్ ఇచ్చేరు. స్వతంత్ర్య పరిపాలనలో ఆయన ఎర్రజెండా "రాజద్రోహుల్ని" వేటాడి వెంటాడి చంపగలిగి నందుకు, బ్రిటిషువారికి బదులుగా వచ్చిన ప్రభువులు ఆయన్ని చక్కగా మెచ్చుకొని ఆయన్ని డిప్యూటీ సూపరెంటుగా మరోమెట్టు పైకి ఎక్కించేరు. దీనినిబట్టి జీవితంలో పెద్దలకి ప్రమోషన్లు రావాలంటే దేశభక్తి ఉన్నా లేకపోయినా రాజభక్తి మాత్రం ఉండితీరాలని పాఠకులు తెలుసుకో గలరు. పరరాజుల కాలంలో ఆ తండ్రి ఎంత రాజభక్తుడో ఈ రాజుల కాలంలో అదే తండ్రి ఎంతో రాజభక్తుడు. ఆ కాలంలో అతనికి దేశభక్తి లేకపోయినా ఫరవాలేకపోయింది. ఆ కాలంలో ఈ కాలంలోకూడా రాజభక్తే అతణ్ని రక్షించింది.

స్వాతంత్ర్యం రాకముందు శ్రీధరరావుగారు బియ్యే పాసయి ఆర్మీలో ఆఫీసర్ సెలక్షన్‌కి వెళ్ళేరు. ఖద్దరువాళ్ళని చితగ్గొట్టినందుకు అతని తండ్రికి అప్పటి కప్పుడే సర్కిల్‌గా ప్రమోషన్‌రావడం గవర్నర్స్ మెడలుకూడా రావడం జరిగింది. తిరుగులేని రాజభక్తుడి కొడుకునుకాబట్టి తనకి తెల్లరాజులు ఆఫీసర్ ఉద్యోగం ఇచ్చి తీరుతారనే నమ్మకంతో అతను ఆ సెలక్షన్‌కి వెళ్ళేడు. కాని, బెంగుళూరు ఆఫీసర్స్ కాంప్ ట్రెయినింగు ధాటీకి అతను తట్టుకోలేక పోయేడని ఆ విషయం గురించి తెలిసినవాళ్ళు చెప్తారు. ఏమైతేనేం, ఆయన తిరిగి ఇంటికి లెఫ్టినెంట్ శ్రీధరరావుగా కాకుండా మామూలు శ్రీధరరావుగానే ఇంటికివచ్చేసేరు.

అంతట, పరమ రాజభక్తుడైన శ్రీధరరావుగారి పోలీసు తండ్రిగారు. శ్రీధరరావుగార్ని తీసుకువెళ్ళి జిల్లా పోలీసూపరెంటుగారి కాళ్ళ మీద పడేస్తే, ఆయన శ్రీధరరావుగార్ని జిల్లాకలెక్టరుగారి కాళ్ళమీద పడేస్తే ఆయన శ్రీధరరావుగార్ని ప్రొక్యూర్‌మెంటు డిపార్ట్‌మెంటులో ఓ ఉద్యోగంలో పడేసేరు.

ప్రొక్యూర్‌మెంటు డిపార్టుమెంటులో శ్రీధరరావుగారు ఓ ఏణ్ణర్ధం పనిచేసేసరికి రెండవ ప్రపంచయుద్ధం పూర్తయిపోయింది. దాన్తో శ్రీధరరావుగారికి ఊస్టింగొచ్చింది. అంతలోనే, అంతవరకూ జెయిళ్ళలో ఉంచ

బడ్డ ఖద్దరువాళ్ళకి విడుదలొచ్చింది. అందరితోపాటు శ్రీధరరావుగారి మేనమామగారుకూడా విడుదల చేయబడ్డారు.

శ్రీధరరావుగారి మేనమామగారు విడుదల చేయబడేనాటికి శ్రీధర రావుగారు చెన్నపట్నంలో 'లా' చదువుతున్నారు. రెండేళ్ళ చదువుకి సరిపడేపాటి డబ్బు ఆయన ఏణ్ణర్ధం ఉద్యోగంచేసి సంపాదించుకున్నాక ఎందుకైనా మంచిదని అయన లా కాలేజీలో చేరేరు.

శ్రీధరరావుగారి మేనమామగారు స్వాతంత్ర్య పోరాటంలో జెయిలుకి వెళ్ళినప్పటికీ ఆయనతాలూకు ఏభై యెకరాల పల్లపు భూమిమాత్రం జెయిలుకి వెళ్ళలేదు. అది ఆయన తమ్ముడుగారి మేనేజిమెంట్లో ఉండిపోయింది అందుచేత శ్రీధరరావుగారి ఖద్దరు మేనమామగారి కుటుంబానికి ఇబ్బందేమీ లేకపోయింది.

శ్రీధరరావుగారికి చిన్నమేనమామగారి కుమార్తెతో వివాహం ఏనాడో నిశ్చయం అయిపోయింది. పెదమామగారు జెయిలునుంచి వచ్చేదాకా చిన్నమామగారు ఆ పెళ్ళి ఆపుచేసి ఉంచేరు. శ్రీధరరావుగారి చిన్నమేనమామగారి కుమార్తె చాలా అందంగా ఉండేది. చాలా ఆరోగ్యంగా కూడా ఉండేది. ఆమెని శ్రీధరరావుగారు చాలాసార్లు షికార్లకి సినిమాలకి తీసుకెళ్ళడమే కాకుండా కొన్నిసార్లు సరదా కాలక్షేపాలుకూడా ఆమెతో చేసేరు. కాబోయే భర్తేకదా అని ఆమెకూడా అందుకు అడ్డు పెట్టకుండా అతనికి కలిసివచ్చింది.

అయితే, పెద్ద మేనమామగారు జెయిలునుంచి విడుదలవుతున్నారనగానే శ్రీధరరావుగారికి కొత్త ఆలోచనలు పుట్టుకు రాసాగాయి. పెద్ద మేనమామగారికి కొత్త హయాంలో పదవీ పలుకుబడి అన్నీ ఉంటాయని శ్రీదరరావుగారు గ్రహించేరు, బ్రిటిషువారు తొలగిపోక తప్పదనికూడా అతను గ్రహించేడు. వాళ్ళు తొలగిపోతే అప్పటి రాజభక్తులకంటె దేశభక్తులే దొరలు కాగలరని అతను తెలుసుకున్నాడు. అందుచేత చిన్న మేనమామ కూతుర్ని పెళ్ళి చేసుకోడంకంటే పెద్ద మేనమామకూతుర్ని పెళ్ళి చేసుకుంటేనే తనకి మంచిదేమోనని ఆయనకి అనిపించ నారంభించింది.

ఈ ఆలోచనలతోనే శ్రీధరరావుగారు ఖద్దరు ధరించే పెద్ద మేనమామగారి విడుదలకి రాజమండ్రి వెళ్ళేరు. ఆ రోజున రాజమండ్రి సెంట్రలు జెయిలు దగ్గిర చాలా హడావిడిగా ఉంది. జనం పూలమాలలు పట్టుకొని జయజయధ్వానాలు చేస్తూ దేశభక్తులకోసం వేచి చూస్తున్నారు. అందరితోపాటు శ్రీధరరావుగారు కూడా ఓ పూలమాల పట్టుకు నిల్చున్నారు. ఈ దినం అతని పెద్ద మేనమామగారి భార్యా ఇద్దరుకూతుళ్ళూ ఇద్దరు కొడుకులూ కూడా అక్కడికి వచ్చేరు. వాళ్ళంతాకూడా శ్రీధరరావు కూడా అక్కడకి వచ్చినందుకు చాలా సంబర పడిపోయేరు. బ్రిటిషు భక్తుడి కొడుకయినప్పటికీ కూడా అతను దేశభక్తుణ్ని చూడ్డానికి వచ్చినందుకు వాళ్ళు చాలా సంతోషించేరు. అందుకు వాళ్ళు చాలా ఆశ్చర్య పడ్డారు కూడాను.

ఆ సమయంలో శ్రీధరరావుగారు తన పెద్దమేనమామ కూతుర్ని బాగా పరీక్షగా చూసేరు. తన చిన్నమామ కూమార్తె చిలకలా ఉంటే పెద్ద మామకుమార్తె గెద్దలా ఉన్నట్టనిపించిందతనకి. రూపం అలా ఉన్నప్పటికి ఆమె మనసుమాత్రం చిలకమనసేనని అతను తెలుసుకోగలిగేడు. ఆమె చాలాబలంగా చాలా సేక్సీగా ఉన్నట్టుకూడా అతనికి తోచింది. తనని పెళ్ళాడ్డానికి ఆమెకి ఏ అభ్యంతరం ఉండదని అతను గ్రహించగలిగేడు, ఆ విషయం గురించి అతను ఆలోచిస్తూ ఉండగా అంతలో దేశభక్తులంతా బైటకివచ్చేరు. పూలమాలలు పరిగెట్టి కెళ్ళేయి.

శ్రీధరరావుగారి ఖద్దరు మేనమామ తన పోలీసుబావ కొడుకుని మొదట పోల్చలేక పోయేడు. పోల్చేక మాత్రం అతను చాలా మురిసి పోయేడు. మేనల్లుడు 'లా' చదువుతూన్నందుకు అతను సంతోషించేడు. చెన్నపట్నంనించి స్పెషల్‌గా తనని చూడ్డానికి మేనల్లుడు వచ్చినందుకు అతను చాలా సంబర పడ్డాడు.

తను నిశ్చయించుకున్నట్లయితే పెద్దమేనమామ తనని అల్లుడిగా చేసుకొందికి అభ్యంతరం పెట్టడని శ్రీధరరావుగారు తెలుసుకున్నారు. ఆ రోజంతా ఆయన తన పెద్ద మేనమామగారితో రాబోయే రాజకీయ పరిణామాల గురించి చాలా దీర్ఘంగా చర్చించేడు. తన పెద్ద మేనమామ

గారు పార్లమెంటుకి మెంబరో ఏక రాష్ట్ర మంత్రో అయితీరుతాడని అతనికి నమ్మకం కుదిరిపోయింది. పెద్ద మామ కూతుర్నే పెళ్ళాడి తీరాలని అతను సంకల్పించుకున్నాడు.

పోతే, చిన్న మేనమామ కుమార్తెతో నిశ్చయమైన సంబంధాన్ని ఎలా వదులుకోడమో శ్రీధరరావుగారికి తెలియులేదు. అతను చాలా చిక్కులో పడ్డాడు. చిన్న మామకూతుర్ని తల్చుకొని ఎంతగా జాలిపడ్డాడో అంతగా చిరాకుకూడా పడ్డాడు. తన మంచితనంతో ఆవిడ తనకి అడ్డుగా నిల్చున్నట్టు అతను భావించుకున్నాడు. మంచిమనిషికి మోటుగా దెబ్బ తియ్యడం అతనికి ఇష్టంలేక పోయింది. "ఏం చేయ్యడంరా భగవంతుడా ఈ పరిస్థితుల్లో ?" అని ఓసారి అతను రాత్రి పన్నెండు గంటలకి అనుకున్నాడు. ఏం చెయ్యాలోతోచక అతను భగవంతుని సహాయంకోసం చాలా తీవ్రంగా ప్రార్థించేడు.

ఒప్పుకున్న సంబంధాన్ని తప్పించమని దైవాన్ని ప్రార్థించడం శ్రీధరరావుగారు తప్పుగా భావించలేదు. దేముణ్ణి ఎవరైనా సరే స్వార్థం కోసం తప్పమరోకందుకు ప్రార్థించరని ఆయన సిద్ధాంతీకరిస్తారు. అందుగురించి ఏ పురాణంలోనైనా సరే ఇట్టే ఆయన ఉదాహరణ లిస్తారు. అందుచేత ఆయన తనమంచి కోసం దేముణ్ని తెగ ప్రార్థించేడు. ఆయన 'లా' చదువుకొనేరోజుల్లో తిరుపతి వెంకటేశ్వరస్వామి కాలేజి విద్యార్థుల్లో అంతగా పాప్యులర్‌గా ఉండేవాడుకాదు. కాని శ్రీధరరావుగారికి మాత్రం ఆ దేముడి మహిమయందు మంచి నమ్మకము ఉండేది. ఆ దేముణ్ని ప్రార్థించడంలో శ్రీధరరావుగారు చిన్న గడుసుతనం చేసారు. 'లా' చదువుతూన్నందుకు చిన్న లాయరు పేచీవేసేరు. చిన్న మేనమామ కూతురితో పెళ్ళితప్పిపోవాలని డైరెక్టుగా దేముణ్ని అడక్కుండా, తనకి పెద్దమేనమామగారి కుమార్తెతో పెళ్ళికావాలి భగవంతుడా అని భగవంతుణ్నికోరి వేడుకో నారంభించేడు.

భగవంతుడు ఉన్నాడో లేడో చెప్పడము కష్టం. ఉంటే, ఉన్నాడని చెప్పడము కష్టం. లేకపోతే; లేడనడానికి కారణాలు చెప్పడం కష్టం. ఉంటే, ఎందుకున్నాడో చెప్పడంకష్టం. లేకపోతే, ఎందుకు లేడో

చెప్పడం కష్టం. నిజంగా ఉన్నట్లయితే పూర్వకాలంలో ఎవర్నెందుకు రక్షించినా, శిక్షించినా ఈ కాలంలో ఎవరినెందుకు పోషిస్తాడో ఎవరి నెందుకు నాశనంచేస్తాడో చెప్పడం చాలాకష్టం. దేముడు లేనట్లయితే ఎన్నో విషయాలకి కారణాలు చెప్పడం ఎంత కష్టమో, దేముడు ఉన్నట్లయితే ఎన్నో జరిగే విషయాలకి కారణాలు చెప్పడంకూడా అంతేకష్టం.

శ్రీధరరావుగారి చిన్న మేనమామగారి కుమార్తె శ్రీధరరావుగారికి చికిత్సలేమీ లేకుండా రాకుండా సెరిబ్రల్ మలేరియావల్ల చనిపోయింది. ఆవిడ చనిపోయిందని టెలిగ్రాం వచ్చేసరికి శ్రీధరరావు అది నిజమేనని నమ్మడానికి చాలాసేపు పట్టింది. ఆ టెలిగ్రాం చదివి అతను దుఃఖించ లేదు చాలా ఎక్సయిట్ అయేడు. అతనికి తన సమస్య ఆ విధంగా టూకీగా పరిష్కారం అవడం ఆశ్చర్యం కలిగించింది. తన కోరిక నెర వేరినందుకు అతను భగవంతుడికి నమస్కరించేదేకాని చాలా సిగ్గుపడి నమస్కరించాడు.

ఓ పెద్ద లాయరుగారి దగ్గర జూనియర్‌గా ఉంటూ శ్రీధరరావు గారు తన పెద్దమేనమామ కుమార్తెని వివాహం చేసుకున్నాడు. అప్పటి కాయన మామగారు ఆయన అనుకున్నట్లుగానే చాలా ఉన్నత స్థాయిలోకి వెళ్ళేరు. శ్రీధరరావుగారి పెళ్ళికి చీఫ్ జస్టిస్‌గారే కాకుండా ముఖ్యమంత్రి కాకుండా "కవిపెద్దలూ, గాయకపెద్దలూ"కూడా వచ్చేరు. వారిలో ఒకా యన కవీకాకుండా గాయకుడుకూడాను. అతను శ్రీధరరావుమీదా 'పెండ్లి కొమరిత' మీదా పద్యరత్నాలు రాసుకొచ్చి, బాజాలు వాళ్ళని బాజాలు ఆప మని చెప్పి, షామియానా క్రింద నిలబడి తేనెలొలికేట్టుగా మధురంగా చదివేడు. ఆ శుభసమయంలోనే ఆ కవిగాయకుడు శ్రీధరరావుగారి పెద్ద మేనమామగారికి తను రాసినగ్రంథం ఒకటి అంకితం ఇచ్చేడు.

పెద్ద లాయరుగారి దగ్గర జూనియరుగా వుంటున్న శ్రీధరరావు గారికి జీవితంలో తనకేమి కావాలో తెలుసు. మునసబు గిరికీ మేజిస్ట్రేటు గిరీకీ ఆయన దరఖాస్తులు పెట్టడం మానేశాడు. పెద్దమేనమామగారికి అల్లుడవగలిగినందుకు తను హైకోర్టు జడ్జి అయినా అవాలని అతను సంకల్పించుకున్నాడు. కాని, తన తెలివితేటల పరిధులేవో ఆయనకి బాగా

తెలుసు. డైరెక్టుగా హైకోర్టు జడ్జి అవడానికి తనకి లాయరుగా శక్తి సామర్థ్యాలు లేవని ఆయనకి తెలుసు. అందుచేత ఆయన తన మామగారి పలుకుబడినంతా ఉపయోగించుకొని చాలా చిన్నవయసులోనే జిల్లా జడ్జిగా ఉద్యోగం సంపాదించేడు.

జిల్లా జడ్జి శ్రీధరరావుగారు తన నొకసారి కలియమని ముకుందుడికి కబురు పెట్టేరు.

పెద్ద పెద్ద యుద్ధాలుగా ఎదగవలసిన తగువులు నీళ్లుకారిపోయి రాజీలుగా ఎలా దిగజారిపోతాయో ఈ అధ్యాయంలో మీరు చూడగలరు — అధికార్లు ఎలా ఉన్నప్పటికీ వారి దగ్గర అదుపులో ఉండకపోతే మీకు ఎటువంటి ప్రమాదమైనా ఉండవచ్చునని ముకుందరావుస్థానే మరొకరు రావడంతో మీరు బోధపర్చుకోగలరు.

# 22

కొన్ని కొన్ని తగువులు చూసి ఇవి తప్పకుండా పెద్ద పెద్ద యుద్ధాలుగా మారిపోతాయని మనం అనుకుంటాం కాని, ఆ తగువులు అలా మారవు. చప్పున చల్లారిపోతాయి, గమ్మున ఆగిపోతాయి. కుక్కా నక్కా కుమ్ములాడుకుంటూంటే అటో పులొచ్చి కుక్కకీ, ఇటో పులొచ్చి నక్కకి, మొట్టికాయలు పెడతాయి. (లేకపోతే, ఒక్క పులేవచ్చి రెండింటికీ రెండు మొట్టికాయలు పెట్టవచ్చు.) దాన్తో, తగువు ఆగిపోతుంది, ఎండా వానా కుక్కల నక్కల పెళ్ళవుతుంది, వాటిమధ్య బలవంతపు సామరస్యం పెరుగుతుంది.

"కన్యాశుల్కం" లో రామప్పంతులు గురించి గిరీశం "వాడు జిత్తులకి జాకాల్ తెలివితేటలకి బిగ్‌యాస్" అంటాడు. అయితే, జిత్తులు

తెలిసిన గుంటనక్క బుద్ధిలేని లద్దగాడిద ఎలాఅవగలదు అని అనిపిస్తుంది! కాని, గిరీశం ఉద్దేశం ఏవిటంటే, రామప్పంతులు చిన్నచిన్న టక్కుటమారాలు తెలిసినవాడేకాని, దూరదృష్టి ఉన్నవాడు కాడూ అని.

రామప్పంతులు గురించి గిరీశం చెప్పినమాట తనకూ్కడా వర్తిస్తుందని మేజిస్ట్రేటుగారికి తెలీదు. జూనియర్ లాయరు చిట్టిబాబునీ సీనియర్ ప్లీడరు ముకుందరావునీ ముచ్చటగా అదరగొట్ట గలిగినందుకు అతను పొంగిపోయేడేకాని ముందున్నది ముసుళ్ళ పండుగ అని అతను తెలుసుకోలేకపోయేడు. అయితే, పండుగ ఎలా ఉంటుందో ఆయన తెలుసుకోనవసరం లేకుండానే—

జిల్లా జడ్జీ శ్రీధరుడు ప్లీడరు ముకుందుడికి కబురుపెట్టగా ముకుందుడు ముకుళిత హస్తుడై జడ్జీగారి ఛాంబర్సులోకి వెళ్ళేడు. జడ్జీగారి ఛాంబర్సు, మధ్యాహ్నం రెండుగంటల ఎండని ఏదిక్కునుంచీకూడా రానీయకుండా చల్లగా, ఆకుపచ్చటిగుడ్డ పరిచిన బల్లతో మెత్తగా సుఖంగా ఉంది. ముకుందుడికి శ్రీధరుడు ఓకుర్చీ చూపించేడు. ముకుందుడు సుఖాసీను డయేడు. జడ్జీగారు తననెందుకు పిలిపించేరో ముకుందుడు గ్రహించలేకపోలేదు.

తన కుర్చీలో సుఖంగా కూర్చున్న జడ్జిగారు సర్దుకొని ఇంకా సుఖంగా కూర్చొని,

"ఏఁవండీ ముకుందరావుగారూ, ఏఁమిటి అసలు తగువు? నాతో చెప్పండి !" అన్నారు.

జరిగినదంతా చెప్పకుండా ఉండలేకపోయేరు ముకుందరావుగారు. ఆపనిగురించే పెద్దలు పిల్చినప్పుడు ఆపనిచెయ్యకుండా ఎలా ఉండగలరాయన ?! ఆయన చెప్పినదంతా విన్నాక, కొంతసేపు ఆలోచించి,

"అయితే మేజిస్ట్రేటుమీద మీ అసోసియేషన్లో నిరసన తీర్మానం పెడతారన్నమాట !"

అన్నారు జడ్జీగారు.

"పెట్టకపోతే లాభంలేదని ప్రెసిడెంటు గారంటున్నారు" అన్నాడు ముకుందుడు, అందులో తన ప్రమేయం ఏమీ లేదన్నట్టు.

"నిరసన తీర్మానం మీరేపెట్టినా ప్రెసిడెంట్‌గారే పెట్టినా, బాగా ఆలోచించే చేస్తున్నారా ఆపని ?" అని చిరునవ్వు నవ్వకుండా అడిగేరు జడ్జీగారు. జడ్జీలు నవ్వడంలో ఓ అర్థం ఉంటుంది. నవ్వకపోవడంలో ఓభావం ఉంటుంది.

జడ్జీగారు ఆ ప్రశ్న నవ్వకుండా వెయ్యడంలోని భావం గ్రహించక పోలేదు ముకుందుడు.

ఆలోచించినా ఆలోచిచంకపోయినా నిరసన తెలియజెయ్యడం తప్ప మేం మరేం చెయ్యగలం ?" అన్నాడు ముకుందుడు జడ్జీగారి ప్రశ్నకి సమాధానంగా.

జడ్జిగారు ముకుందుణ్ని ఈసారి చిరునవ్వు నవ్వుతూ చూసేరు. అయన ముఖకవళికల్ని పరిశీలిస్తూ అయన మాటలు శ్రద్ధగా విన్నాడు ముకుందుడు.

"ముకుందరావుగారూ, మీరు తలనెరిసినవారు, నేనింకా బాగా నెరియనివాణ్ని నేను మీకుచెప్పవలసినవాణ్ని కాను" అంటూ మొదలుపెట్టి ముకుందుడికి చాలా చెప్పేరు జడ్జిగారు.

జడ్జీలు దేవుళ్ళు కారుకదా ! ఉద్యోగరీత్యా ఏవోకొన్ని నియమాలూ కట్టుబాట్లూ వాళ్ళకి ఉండాలనుకోండి. కాని, ఎవరైనాసరే, ముందు మనిషి ఆ తరవాత జడ్జీను, జడ్జీ అయినంతమాత్రాన ఆకలేస్తే అన్నం తినడా ?! రాత్రయితే నిద్దరపోడా ?! కోపంవస్తే పళ్లు కొరకడా ?! అదేంలేదు, జడ్జిలుకూడా అవన్నీ చేస్తారు. పెద్దపెద్ద హైకోర్టు జడ్జీలే చాలాసార్లు చాలా ఓపెన్‌గా మీమీద మామీదాకూడా విసుక్కుంటారు. అయతే ఏం చేస్తాం ? చీటికి మాటికి నిరసన తీర్మానాలగురించి పరిగెట్టంలేం కద ! మీరు నిరసనతీర్మానం పాస్‌చేసినంతమాత్రాన మేజిస్ట్రేటు మారిపోడు కద ! మహాఅయితే, అతణ్ని మరోచోటికి బదిలీచేస్తారు. మరోకొత్త

వాడొస్తాడు. పాతవాణ్ని అల్లరిపెట్టి మీరు బదిలీచేయించ గలిగినందుకు కొత్తవాడు మిమ్మల్ని కౌగలించుకోడు కద ! దొరికిపోయిన పులికి మీరు దెబ్బతీస్తే, దొరకని పులి అది గుర్తుంచుకొని మీకు దెబ్బతీస్తుంది. జడ్జీలతో చెలగాటం పాముతోనూ నిప్పుతోనూ చెలగాటం లాంటిదని పెద్దలు మీకు నేను వేరే చెప్పక్కర్లేదు. అనుభవంలో మీకు ఈపాటికి ఆవిషయం తెలిసే ఉంటుంది. మేజిస్ట్రేటు ఒక్కడే ఈవూళ్ళో న్యాయాధికారి కాడు. ఇంకా చాలామందిమి ఉన్నాం. అసలు ఈ బెయిలు మేటర్ తప్ప ఆ కోర్టులో వేరే వర్కు ఉన్నట్టులేదు. ఉన్న వర్కంతా మా కోర్టులోనే ఉంది.

అని చెప్పి చాలా అర్ధయుక్తంగా నవ్వేరు జిల్లా జడ్జిగారు.

"అంటే, నిరసన తీర్మానం విరమించుకోకపోతే, మేజిస్ట్రేటు ఏం చెయ్యలేకపోయినా, వీడు మనకి తోక తెగ్గొడతాడన్నమాట" అనుకున్నాడు ముకుందుడు.

"తమరు చెప్పిన విషయాలన్నీ బాగానే ఉన్నాయి. కాదనగలగడానికి నేనేపాటివాణ్ననుకోండి" అని ప్రకాశంగా అన్నాడు ముకుందుడు.

"అలా అనీకండి" అన్నాడు జడ్జిగారు.

"అంతేలెండి. ఎంత తలనెరిసినవాళ్ళం అయినా అధికార్ల ముందు మేం అదుపులో ఉండాలికద !" అన్నాడు ముకుందుడు.

జడ్జిగారు చిరునవ్వు నవ్వేరు. నవ్వి,

"ముకుందరావుగార్లూ ! అదేఁవఁన్నమాట. మీరూ అదుపులో ఉండాలి. అధికార్లూ అదుపులో ఉండాలి. అదుపులో ఉండనప్పుడు అధికారైనాసరే తప్పొప్పుకోవాలి. నేను మేజిస్ట్రేటుతో అంతా మాట్లాడేను. జరిగిన విషయానికి అతనెంత విచారిస్తున్నాడో మీకేం తెలుసు ? ! మీ జూనియరు వెకిలినవ్వు నవ్వి జాలుమీద దర్జాగా చెయ్యివేసి మేనమాఁవఁ మేనల్లుడితో మాట్లాడినట్టు కోర్టులో రిప్రెజెంటేషన్ చేస్తే ఏజడ్జీకైనా కోపంరాదా ! ఆ కోపం ఫూలిష్‌గా మీ మీదకూడా చూపించి

నట్టున్నాడు. మీరు అలా కూర్చోండి" అని బెల్ కొట్టి బంట్రోతుని పిల్చి, "మేజిస్ట్రేట్ని అర్జంటుగా పిల్చుకురా" అన్నారు జడ్జిగారు.

"వీడు రాజీ చేసేసాడు" అనుకున్నాడు ముకుందుడు.

మేజిస్ట్రేటుగారు నల్లకోటు కాకుండా తెల్లటి అఫీషియల్‌కోటు తొడుక్కొని మెల్లిగా పిల్లిలా వచ్చి, జడ్జిగారికి తొందరగా నమస్కరించి, తన పెద్దనోటితో చిన్న నవ్వు నవ్వుతూ ముకుందుణ్ని పలకరించి, జడ్జిగారివైపు ఓసారి ప్రశ్నార్థకంగాచూసి, జడ్జిగారి కనుసైగ గ్రహించి. ముకుందుడివైపు కుడిచెయ్యి జాచేరు. ముకుందుడు కుర్చీలోంచి కొద్దిగా లేచి మేజిస్ట్రేటుగారితో కరసంచలనం చేసేడు.

"క్షమించండి ముకుందరావుగారూ, మీరు నన్ను పొరపాటుగా అర్థం చేసుకుంటున్నారు, మిమ్మల్ని అవమానించాలనే ఉద్దేశం నా కెంత మాత్రం లేదు. మాటలో ఏదైనా పొరపాటుంటే క్షమించండి" అన్నారు మేజిస్ట్రేటుగారు.

"ఇదంతా ఈ జడ్జిగాడి నాటకం" అని ముకుందుడు అనుకొని, పైకిమాత్రం, "అయ్యో మేజిస్ట్రేటుగారూ, అయిపోయిందేదో అయిపోయింది. జడ్జిగారుకూడా మీ గురించి వివరంగా అంతా చెప్పేరు. అయిపోయిందేదో అయిపోయింది. కాని, చూసేరా, చిక్కెక్కడ వస్తుందంటే: మా ప్లీడర్లున్నారు, చూసేరుకదా? వాళ్లు ఎలాంటి వాళ్ళంటే! ఎలాంటివాళ్ళో మీకు తెలుసు. నేను వేరే చెప్పక్కర్లేదు. నీ మీదికి తగువొచ్చినప్పుడు నువ్వే ఊరుకుంటే మామీదకి తగు వొచ్చినప్పుడు మేమేంచెయ్ పోతాం? అంచేత మాలాంటి సీనియర్స్‌కి ఇష్టం ఉన్నా లేకపోయినా మమ్మల్ని ఇటువంటి తీర్మానాల గురించి ముందుకి తోస్తూంటారు. ఆ పరిస్థితుల్లో మేం కాదన్లేం, అవుననలేం. ఏం చేస్తాం చెప్పండి!" అన్నాడు.

నిరసన తీర్మానంతో తనకి అసలు ఏమీ సంబంధం లేనట్టూ, ప్లీడరు జనవాక్యం కాదనలేక తను అందుకోసం వప్పుకోవలసి వచ్చి

నట్టూ నటించేడు ముకుందుడు. అది నమ్మినట్టే నటించేరు జడ్జిగారూ మేజిస్ట్రేటుగారూను.

ఆ తరవాత జడ్జిగారు తెప్పించిన మీదట, ముగ్గురూ మూడు కాఫీ తాగేరు. ముప్పావుగంటసేపు ముచ్చట్లాడుకున్నారు. ముగ్గురూకూడా మూడు పెద్దవంశాల వాళ్ళమేనని తెలుసుకున్నారు, సంతోషించుకున్నారు. ఆ తరవాత, ముకుందరావుగారూ మేజిస్ట్రేటుగారూ జడ్జీగారిదగ్గర సెలవు పుచ్చుకున్నారు. బైటికి వచ్చేముందు మేజిస్ట్రేటుగారూ ముకుందరావుగారూ కరసంచలనం కావించుకున్నారు. అంతా హాపీగా జరిగిపోయింది.

అయితే, ఉల్టా సీదా అయిపోవడం ముకుందుడికీ కొంచెం కష్టం అయిపోయింది. నిరసన తీర్మానం పట్టుపట్టి పెట్టించిన పెద్దమనిషే ప్లేటు ఫిరాయించి పల్టీ కొట్టేసరికి నిజంగా అనవసరంగానే మిగతా ప్లీడర్లు కొంచెం అల్లరి చేసేరు. ప్రెసిడెంటు రాజశేఖరంగారు రాజీగురించి మెచ్చుకున్నప్పటికీ, రంగస్వామిగారు ముకుందుణ్ని రహస్యంగా తిట్టి పైకిమాత్రం మెచ్చుకున్నప్పటికీ, సూర్యచంద్రరావులాంటి ప్లీడర్లుమాత్రం కొంచెం చిల్లర అల్లరి చేసేరు. పెద్దవాళ్ళు ఇలాజడ్జిల గదుల్లో దుర్మార్గపు మేజిస్ట్రేట్లతో రాజీ అయిపోడం ఏమైనా బాగుందా అని ప్రశ్నించేరు. ఏదేమైనప్పటికీ నిరసన తీర్మానం పాస్ చెయ్యవలసిందే అన్నారు.

అయితే, అటువంటి తీర్మానం పాస్ అవలేదు. అవదని అందరికీ తెలుసు.

మేజిస్ట్రేటుగారికి ఎంత కోపం ఉందో అంత భయంకూడా ఉంది. బార్ అసోసియేషన్‌వారు తనమీద నిరసన తీర్మానం జరుపుతున్నారని తెలిసి అతను చాలా తత్తరపాటు చెందేడు. తన (శాఖవాడే అయినట్టి) బెంచి గుమాస్తాని పిల్చి ముకుందుడి ఫిర్యాదు గురించి మిగతా ప్లీడర్లంతా ఏమనుకుంటున్నారో కనుక్కోమని ఆ గుమస్తాని చంప నారంభించేడు. అతను చాలా గాభరా అయిపోయేడు. అతనికి భోజనం సహించడం మానేసింది. అయితే, ఆకలిమాత్రం వెయ్యకుండాపోలేదు. ఆకలిమీద అతనికి కోపం ఎక్కువయింది. కోపం ఎక్కువ అవడంతో అతనికి

అందర్నీ తిట్టాలనీ, కొట్టాలనీ అనిపించ సాగింది. కాని, తిడితే, కొడితే ఏ నిరసన తీర్మానాల ప్రమాదం ఉంటుందో అనే భయంచేత ఆ తిట్టుడు కొట్టుడు కోపాన్ని అతను అణుచుకో వలసిన అవసరం వచ్చింది. ఆ ఒకటిరెండు రోజులూకూడా మేజిస్ట్రేటు చాలా బాధ పడ్డాడనీ యమబాధ పడ్డాడనీ (కూడా) చెప్పాలి.

జడ్జిగారి ఛాంబర్స్‌లో రాజీ అయీ అవగానే మేజిస్ట్రేటుగారికి చాలా మనశ్శాంతి లభించింది. తన సగం బట్టతలమీంచి మూడు కొండల బరువు దిగిపోయినట్లనిపించింది. పది రోజులు స్నానంలేక వదకొండో రోజున వేణ్ణీళ్ళ స్నానం చేసినట్టు అతను చాలా తేలిక పడ్డాడు, హాయి పడ్డాడు.

"హమ్మయ్యా ! ఇప్పుడు పట్టించాలి వీడి పని !" అనుకున్నారు మేజిస్ట్రేటుగారు ముకుందుడి గురించి.

ఆ రాత్రి రాజమ్మ దగ్గరకి ఓ "పంతులు కుర్రాడు" వచ్చేడు. రాజమ్మ అప్పటికీ ఓ ప్రైవేటు క్లినిక్‌లో అడ్మిట్ అయివుంది. పంతులు కుర్రాడు ప్లీడర్ని మార్చేయమని రాజమ్మకి సలహా ఇచ్చేడు. "ప్లీడర్ని మార్చేసి నువ్వుకూడా కోర్టుకి హాజరయిపో ! ఈ రాత్రే ఎస్సయ్ దగ్గిరికి వెళ్ళు ! వాడికి పారీసీది వాడికి పారీ ! ప్లీడరుకిచ్చిన డబ్బులో పాతికో వంతు పోలీసువాడికి పారేస్తే ఈపాటికి పన్లన్నీ అయేపోను. ఇంతకీ ముకుందుడికి ఎంత తగలెట్టేవు?" అని అడిగేడు పంతులు కుర్రాడు.

ఎంత తగలెట్టిందో చెప్పింది రాజమ్మ.

"ఎవడుకుదిర్చేడు నీకా ప్లీడర్ని ?"

"మందుల భీఁవుఁడు"

"సర్రా !"

"ఏఁవఁలాగన్నావు !"

"నీచేత ఫీజిప్పించి వాడి సివిల్ కేసులన్నీ ఉల్ఫాగా చేయించు కుంటాడు. అందుకూ నిన్ను ముకుందుడి దగ్గిరికి తీసుకెళ్లేడు."

"నూ సేవా ? జెష్టముండకొడుకు !"

"జెష్టముండకొడు క్కాకపోతే మందుల భీముడు మంచిముండా కొడుకని ఎలా అనుకున్నావు ?"

"తొల్నించీ తెలిసినెదవకదా అనుకుంటే ఎలాటి గోతిలో దిన్చేసి నాడొ నూడు."

"తెలియని వెధవల్ని మనకి తెలియనే తెలీదు. తెలిసిన వెధవే ద్రోహం చేస్తాడు."

"ఆడికి రేపో మాపో ఈ తగూ తెల్లారితే నట్లు ఇప్పించేస్తాన్లే కాని, ఇప్పుడేం చెయ్యమంటావు :"

"సూర్యచంద్రరావుని పెట్టుకో !"

"అ బాబెవరు ?"

"తెలకలి మాలక్ష్మి ఉంచుకుందీ, ఆ బాబు"

"ఆ బాబు మళ్ళీ డబ్బడుగుతాడు కావాల"

"అడిగితే ఇస్తావా"

"మరైతే ఎన్నయ్య కేపాటివ్వాల ?"

"అడిగిచూడు. వాడు అడిగినదానికి కొంత తగ్గించి ఇయ్యి" అని సలహా చెప్పి వెళ్లేడు పంతులు కుర్రాడు.

మర్నాడు, బెంచీ గుమాస్తా అయిన పంతులు కుర్రాడు రాజమ్మా గంగరాజుల కేసు పిల్చేసరికి ముకుందరావుగారు లేరు, సూర్యచంద్రరావు గారు హాజరయేరు. రాజమ్మని హాజరుపర్చేరు. భార్యా భర్త లిరువురికి జమీను దరఖాస్తు పెట్టేరు విడుదల ఆర్డరు పొందేరు.

రాజమ్మనీ గంగరాజునీ విడుదల చేయింపించుకు వచ్చేక, వారిరువురితోనూ సూర్యచంద్రుడు,

"ఇంతటితో అయిపోలేదు, ఆడవలసిన నాటకం ఇంకా చాలా ఉంది" అన్నాడు.

—0—

'రాజు - మహిషి' పూర్వభాగం ముగిస్తూ శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు ఒక ప్లీడరుపాత్ర చేత :

'ఇంతటితో అయిపోలేదు, ఆడవలసిన నాటకం ఇంకా చాలా వుంది' అని చెప్పించారు.

అందుచేత ఉత్తర భాగంలో,

- గేదెల రాజమ్మ మందుల భీముడిమీద దెబ్బ తీస్తుందా?
- మందుల భీముడి కొడుకు రంగారావు, ఛేర్మన్ భీమసేన రావు కూతుర్ని గాలంవేసి లాగ్గలడా తనవైపు?
- అన్నట్లు మిస్ ప్రేమ భవానీ శంకర్ ప్రసాద్‌ను ప్రేమించి పెండ్లి యాడునా?
- పీనుగ్గువాస్తా ఇంట్లో అద్దెకుంటున్న వర్ధనమ్మగారి కూతురు గిరిజ ప్రేమవృత్తాంత మేమగును?
- ఛేర్మన్ భీమసేనరావుగారికి ఆసుపత్రినుంచి ఎప్పుడు విడుదల?
- ఛేర్మన్ మరదల్ని మందుల భీముడు ఆకర్షింపగలడా?

- పాపం 'హెడియా' బతుకు ఏమగును ?

- నల్లనయ్య చివర కేమవుతుంది ?

- గేదెల రాజమ్మ గంగరాజులపై భవానీశంకర ప్రసాద్‌ను కొట్టినందుకు వచ్చిన కేసు పర్యవసానం ఎలా వుంటుంది?

ఈ ప్రశ్నలకు జవాబులు 'రాజు'

ఉత్తరభాగంలో మీకు లభిస్తాయి.